కళాప్రపూర్ణ

# నిడుదవోలు వేంకటరావుగారి రచనలు - పరిశీలన





డాక్టర్ నిష్ఠల వెంకటరావు

కళాప్రపూర్ణ

# నిడుదవోలు వేంకటరావుగారి రచనలు - పరిశీలన






డాక్టర్ నిష్టల వెంకటరావు



హైదరాబాదు విశ్వవిద్యాలయం వారి పిహెచ్.డి., డిగ్రీ పొందిన
సిద్ధాంత వ్యాసం

రావు పబ్లికేషన్స్
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.

# KALA PRAPOORNA NIDUDAVOLU VENKATA RAO GARI RACHANALU - PARISEELANA

## నిడుదవోలు వేంకటరావుగారి రచనలు - పరిశీలన

A Thesis in Telugu by Dr. Nistala Venkata Rao M.A., Ph.D.



*First Edition* : April,1998

*Copies* : 1000

*Price* : **Rs.100/-**

*Cover Design* : **Gopi**

*Copies available with* :

**VISALANDHRA PUBLISHING HOUSE**

Sultan Bazar, Hyderabad.

**NAVODAYA BOOK SELLERS**

Kothi, Hyderabad.

**NEEL KAMAL PUBLISHERS**

Kothi, Hyderabad.

*Published by* :

**RAO PUBLICATIONS**

D-1, Kanaka Lakshmi Apartments,

Road No. 6, Himayatnagar, Hyd - 029.

“పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో”

*Printed at* :

**Sri Dattasai Graphics**

1-8-702/5, Nallakunta, Hyderabad - 044.

Ph : 7633275, 3020719

భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారి
దివ్య చరణారవిందాలకు
భక్తితో
సమర్పితం

# విషయసూచిక

# ఆమోదం

ఒక పరిశోధకుని రచనలను "పరిశోధన"కు విషయంగా గ్రహించి వాటిని పరిశీలనాత్మక విశ్లేషణకు గురి చేయడం ఆవశ్యకమే అయినా - సాహసం అనక తప్పదు! అందులో ఆ పరిశోధకుడు - పరిశోధన పరమేశ్వరులు, కళాప్రపూర్ణ, విద్యారత్న శివశ్రీనిడుదవోలు వేంకటరావుగారయినపుడు -ఇంక చెప్పవలసింది ఏముంది? అయితే, ఈ సాహసానికి ఒడిగట్టిన యువపరిశోధకుడు - నిష్ఠ, శ్రద్ధ, ధృతి అనే మూడూ పుష్కలంగా ఉన్న డా॥ నిష్టల వెంకటరావు గనుక, మనం-సహృదయ పాఠకులం - మంచి విషయాలు వెలవడుతాయి అని ఔత్సుక్యంతో నిరీక్షించవచ్చును. ఇతఃపూర్వమే ఈయన "నిడుదవోలు వారి జీవితం-వాఙ్మయసూచిక" అనే అంశంమీద పరిశోధన సాగించి, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్., డిగ్రీని పొంది ఉండి; కళాప్రపూర్ణ వేంకటరావుగారి రచనల సమగ్ర పరిశీలనకు నేపథ్యం కల్పించుకొని సర్వసన్నద్ధులై, సర్వసమర్థులై ఉన్నారు. ఈ పరిశోధన గ్రంథంలో - ఆ సన్నద్ధత, ఆ సమర్థత అడుగడుగున కనబడుతూ, మన నిరీక్షణకు ఫలంగా సలక్షణమైన సర్వాంగసుందరమైన సంపూర్ణమైన ఆ కళాప్రపూర్ణుని సాహితీమూర్తి దర్శనం ఇస్తుంది. డా॥ నిష్టల వేంకటరావు గారు విద్యారత్న వేంకటరావుగారికి సన్నిహిత బంధువులు కూడా కావడం వల్ల, ఆయన విశిష్టతలనన్నింటిని విద్వాంసులైన నిడుదవోలు వారి పుత్రుల నుండి సేకరించి, యథోచితంగా స్వీకరించివాటిని తమ సిద్ధాంత గ్రంథపరిపూర్ణతకు వినియోగించుకొన్నారు. ఇందువల్ల - ఈ సిద్ధాంత గ్రంథంలో నిడుదవోలు వారు పండిత పరిశోధకులుగా మాత్రమే కాక, సమున్నత మానవతావాదులుగా కూడా దర్శనమిస్తారు. ఇది ఈ "గ్రంథం" ప్రత్యేకత!

డా॥ నిష్టలవారి పరిశోధనకు విషయం - పుంభావసరస్వతులైన నిడుదవోలు వేంకటరావుగారి రచనలు. అవి వివిధశాఖలకు, వివిధ ప్రక్రియలకు, వివిధ భాషలకు సంబంధించినవై వైవిధ్యశోభితాలై అతి విస్తృత పరిధిలో వ్యాపించి ఉన్నాయి. ఇంక తత్రచయితలయిన నిడుదవోలు వారా-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి విశిష్ట సభ్యత్వ ప్రధాన సమావేశం (18-1-1976) లో ఆచార్య దివాకర్ల వేంకటావధాని మహోదయులచేత మహాపండితులు, సహృదయవరేణ్యులు సభాసదులుగా ఉన్నసభలో - "చుళుకిత సకలాంధ్ర సారస్వత సముద్ర రసాంబువులైన నవకుంభసంభవులు; అవలోడిత సకల శైవాగమ సంప్రదాయ విజ్ఞానమండితులైన అపర మల్లికార్జున పండితులు; మథితాఖిల

పూర్వమహాకవి విరచిత లిఖిత గ్రంథ క్షీరసాగరులైన మానవరూపమంథాన గిరులు; ప్రకాశితనైకా ముద్రిత గ్రంథపద్మాకరులైన భూచర భాస్కరులు" అని ప్రశంసించబడినవారు. ఇలాంటి మహా విద్వాంసుని మీద లోగడ పాక్షికమైన రచనలు కొన్ని రాకపోలేదు. కాని, అవన్నీ పైపై చూపుల మెరుపులు. ఇంక డా॥ నిష్టలవారి సిద్ధాంత గ్రంథంలోని విషయాలా? అమూల్యరత్నరాశులు. విద్యారత్నాకరుల గాంభీర్యాన్ని గ్రహించి ఆయన రచనలలో లోతులను శోధించి చూచి, తూచి పైకి తెచ్చిన రత్నరాశుల ధగధగలు!

మహాకవి మురారి అంటాడు: "అబ్ధిర్లంఘిత ఏవవానరభటైః కింత్వస్యగంభీరతాం । ఆపాతాళ నిమగ్న పీవరతనుర్జానాతి మంథాచలః॥" - అని. కోతిమూకలు సముద్రాన్ని దాటిన మాట నిజమే ! కాని, సముద్రుని గంభీరత వాటికి ఏమి తెలుసును? పాతాళలోకం దాకా మునిగి ఉన్న మంథాచలం - మందరపర్వత్వం - మాత్రమే ఆ గంభీరతను ఎరుగును. నిజమేమరి ! పరశోధన పరమేశ్వరులు, జంగమ విజ్ఞాన సర్వస్వం అయిన నిడుదవోలు వారి పాండితీగంభీరతను ఆకళింపునకు తెచ్చుకొని ఆ క్షీర సాగరాన్ని మధించి అమృతోప మానమైన సిద్ధాంత గ్రంథాన్ని వెలువరించిన మందరగిరి సదృశుడు మామిత్రుడు డా॥ నిష్టలవెంకటరావు, నిడుదవోలు వారిమీద - అదీ ఏ ఏకదేశాంశం మీదనో ఒకటో రెండో వ్యాసాలు వ్రాసి ఆ సముద్రుణ్ణి లంఘించాము అనుకొనే చంచలులకు ఈ సిద్ధాంత గ్రంథం కనువిప్పు.

ఈ గ్రంధ రచన వ్యక్తి గతంగా నాకు చాలా ఆనందాన్ని తృప్తిని ఇచ్చింది. మహావిద్వాంసులైన నిడుదవోలు వారిని నేను నాలుగు దశాబ్దుల కాలం కంటె ఎక్కువగానే ఎరుగుదును. ఆయన కార్యస్థానాలైన - విజయనగరం, కాకినాడ, మద్రాసు, హైదరాబాదు నగరాలతో నాకూ సంబంధం ఉండడంవల్ల ; నేను వారిని వారి పాండిత్య విజృంభణాన్ని దగ్గిర నుండి తెలుసుకొనే అవకాశం కలిగింది. నేను 1942 నాటికే తెలుగులో ఎం.ఏ. చేసి విజయనగరం మహారాజా కాలేజిలో ఉద్యోగంలో చేరడం వల్ల నిడుదవోలు వారి గురువులైన శ్రీ కోరాడ రామకృష్ణయ్యా గారు, శ్రీ అడిదం రామారావుగారు మొదలైన పెద్దలనుకలుసుకొని మాట్లాడే అవకాశం, ఆ పెద్దలు వీరిని గూర్చి ఏమి అనుకుంటున్నారో తెలుసుకొనే సదవకాశం లభించాయి. నా కంటె వారు వయస్సులో రెండు దశాబ్దులు పెద్దవారైనా, నేనూ ఈ భాషా సాహిత్యరంగాలలో ఇంచుమించుగా అర్థశతాబ్దినుండి తిరుగుతూ ఉండడంవల్ల నాకు వారితోను, వారి రచనలతోను, వారిని ప్రభావితం చేసిన వారితోను, వారి సమకాలికులతోను సన్నిహిత పరిచయమే, ఉండేదని చెప్పాలి.

మొదటినుండీ, నా యందు వారికి ఆదరాభిమానాలు, వారియందు నాకు గౌరవాదరాలు ఉండేవి. ఇందువల్ల మా ఏకాంత సంభాషణ చాలా చనువుగా ఛలోక్తులతో నడిచేది. నాకు విజయనగరంలో ఉన్న సంబంధం మా స్నేహానికి పునాది. ఆయన కొడుకులలో ఇద్దరు నా దగ్గిర విజయనగరం కళాశాలలో చదువుకోడం కూడా ఒక కారణం అని చెప్పవచ్చును. నేనెప్పుడే నా ప్రసంగవశాత్ - "మీరు పెద్దలు, మహావిద్వాంసులు" అంటే, ఆయన నవ్వుతూ "అదేమిటండీ! నేను మీకంటె ఒక్క సంవత్సరమేగా పెద్ద!" అనేవారు. దీని వెనుక ఉన్న విషయం ఇది. నిడుదవోలు వారు, 1925లోనే బి.ఏ. ప్యాసు అయి, ఉద్యోగంలో చేరినా; కారణాంతరాల వల్ల అయన 1941 వరకు ఎం.ఏ., (మద్రాసు) కాలేదు! నేనూ "కారణాంతరాలవల్ల" 1942లో ఎం.ఏ., (ఆంధ్ర) అయ్యాను. ఈ ఛలోక్తికి మేమిద్దరం నవ్వుకొనేవాళ్లం. నిడుదవోలు వారికి జరిగిన బృహత్సన్మాన సభలన్నింటిలోను నేను పాల్గొన్నానని చెప్పవచ్చును. కొన్నింటిలో ముఖ్యంగా హైదరాబాదులో జరిగిన వాటిలో - నేను మాట్లాడాను కూడా!

ఈ నేపథ్యంలో - నిడుదవోలు వారి రచనల విశ్లేషణాత్మకమైన ఈ సిద్ధాంతగ్రంథం నాకెంతో తృప్తినిచ్చి ఆనందం కలిగించింది. నిడుదవోలు వారి రచనలను క్షుణ్ణంగా చదివి అర్థం చేసుకొంటేనే గాని తెలుగులో పాండిత్యం పూర్తి కాదని నావిశ్వాసం. ఆయన పరిశోధనలు, రచనలు మొదలైనవి - భాషాసాహిత్యాలలోని అన్నిరంగాలను ఆక్రమించి భాషా సాహిత్యాలను అధ్యయనం చేసే వారికందరికి వెలుగుచూపాయి. ఆయన స్పృశించి అలంకరించని భాషా సాహిత్యరంగంలేదు. ఆయన స్పర్శ పరసువేది. లోహకాఠిన్యమున్న విషయమైనా ఆయన చేయి తగిలిన వెంటనే అది సువర్ణమయం కావలసిందే!

ఈ సిద్ధాంత గ్రంథంలో మొత్తం పది అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలో శ్రీ వేంకటరావుగారి జీవిత విశేషాలు విపులంగా వివరించడం జరిగింది. ఆయన విశిష్ట వ్యక్తిత్వానికి ఇది అద్దం పట్టి మనం ఆయన్ని ఆయన రచనలను సక్రమంగా అర్థం చేసుకోవడానికి ఇది చాలా ఉపయోగిస్తుంది. పదో అధ్యాయం వాఙ్మయసూచిక. ఈ రెండింటి మధ్య - నిడుదవోలు వారికి అభీష్టమైన పరమశివుని అష్టమూర్తులను పోలిన - ఎనిమిది అధ్యాయాలు. ఈ అష్టమూర్తులు - నిడుదవోలు వారి సాహిత్య విరాణ్మూర్తిని మనముందు ఉంచుతాయి. ఆయన మిత్రులయిన గంటి సూర్యానారాయణ శాస్త్రిగారు చమత్కారంగా అన్నట్లు నిడుదవోలు వేంకటరావుగారి కాపురం పీఠికాపురమే! పాండిత్యస్ఫోరకాలయిన పీఠికలు వ్రాసిన వారిలో నిడుదవోలు వారు అగ్రగణ్యులు

అనడంలో ఆశ్చర్యంలేదు. వారి కొన్ని పీఠికలవల్ల మూల రచనలకు పేరు వచ్చింది ! వాటిని "వడ్డించిన విస్తళ్ళు" అని డా॥ నిష్టల వెంకటరావు అనడం, ఆధునిక కవి శ్రీశ్రీ ప్రయోగాన్ని సార్థకంగా ప్రయోగించి ఉపయోగించుకోవడం అయింది. నిడుదవోలు వారి జీవితం "వడ్డించిన విస్తరి" కాకపోయినా, ఆయన పీఠికలకే కాదు, ఆయన అన్ని రచనలకు నేను దీన్ని ఉపమోగిస్తాను ఉపమానంగా. అవన్నీ "వడ్డించిన విస్తళ్ళు" అయి, పండితభోజ్యాలు అయ్యాయి, సహృదయ ఆస్వాదయోగ్యాలు అయ్యాయి.

"వీరశైవవాఙ్మయం" అన్న వెంటనే సహృదయ విమర్శకులకు నిడుదవోలు వారి పేరు జ్ఞాపకం వస్తుంది. కళాప్రపూర్ణులు "చితనిత్యస్థితశివులు". ఆయన కృషివల్లనే వీరశైవ గ్రంథాలను విశ్వవిద్యాలయాలలో పఠన పాఠనాదులలో చేర్చడం జరిగింది అంటే అతిశయోక్తికాదు. ఈ అధ్యాయంలో డా॥ నిష్టల వెంకటరావు వీర శైవ సాహిత్య విషయమై నిడుదవోలు  వారికున్న సిద్ధాంతాలను ఒకచోట ప్రదర్శించి జిజ్ఞాసువులకు చాల తోడ్పడ్డారు. రచనలోచక్కని క్రమాన్ని పాటించి పాఠకులకు అన్వయ క్లేశం లేకుండా చేశారు. ఈ సిద్ధాంత క్రోడీకరణవల్ల మార్గదేశి విభాగాల ప్రత్యేకతలను సులభంగా అర్థంచేసుకోవచ్చును. విషయం మీద పూర్ణమైన అధికారం ఉంటేనే గాని ఈ పని చేయడం అసాధ్యం. అసాధ్య విషయాన్నిసాధ్యం చేసి చూపించారు డా॥ నిష్టలవారు. "భాష-వ్యాకరణం -ఛందస్సు" అనే అధ్యాయంలో నిడుదవోలు వారు, " భాషాశాస్త్రగ్రంధాలు వ్రాయకపోయినా " ఏవిధంగా ఈ మూడింటికి మౌలికమైన సేవచేశారో విపులీకరించారు. విషయ వివరణ నాతిదీర్ఘం, నాతి సంగ్రహంగా నడిచి నిడుదవోలువారి పాండిత్యాన్ని ప్రదర్శిస్తూనే, దాన్ని వివరించిన సిద్ధాంత గ్రంథకర్త ప్రతిభాదికాన్ని స్వయం వ్యక్తం చేసింది. ఈ సందర్భంలో, నిడుదవోలు వారి "పరిశ్రమ"ను వారి పేరు చెప్పక వాడు కొన్న వారిని మందలించిన తీరు సంస్కారయుతంగా ఉంది. "తెలుగు కవుల చరిత్ర' ' అనే అధ్యాయంలో, ప్రఖ్యాతి కెక్కిన కవుల చరిత్రలు వ్రాసిన విఖ్యాతి విమర్శకులు స్పృశింపని-వారికి తెలియని అనడం ఉచితం - కవులను పైకి తీసి, నన్నయకు పూర్వమున్న కవులను మనకు నిడుదవోలు వారు ఎలా పరిచయంచేశారో సిద్ధాంత గ్రంథకర్త వివరించారు. మర్యాదాతి క్రమణం లేకుండా పెద్దలను, వారి పనితీరును సిద్ధాంత గ్రంథకర్త విమర్శించిన పద్ధతి మనోహరంగా ఉంది. నిడుదవోలు వారి "తెలుగుకవుల చరిత్ర" గ్రంథ వైశిష్ట్యాన్ని చూపిన అధ్యాయం ఇది.

నిడుదవోలు వారి "ఆంధ్రవచనా వాఙ్మయం" అనే గ్రంధాన్ని గూర్చి వ్రాసిన అధ్యాయం, మూల గ్రంథంలాగే మౌలికంగా ఉంది. ఈ గ్రంథ విశేషాలను చెప్పేటప్పుడు, డా॥ నిష్టల వెంకటరావు ఆయా విషయాలను చెప్పిన ఇతరుల గ్రంథాలతో దీన్ని పోల్చి చూపి, నిడుదవోలు వారి గ్రంథం ఎంత విశిష్టమైనదో ఎన్ని నవ్యవిషయాలను బహిర్గతం చేసిందో సోదాహరణంగా నిరూపించారు. ఈ అధ్యాయం డా॥ నిష్టలవారి ప్రతిభ, ఎంత విషయ వ్యక్తీకరణ దక్షమో మనకు తెలుపజాలి ఉన్నది.

"వాఙ్మయ చరిత్ర" అనే అధ్యాయంలో - పరిశోధన పరమేశ్వరులైన నిడుదవోలు వేంకటరావుగారు ఆంధ్రసాహిత్య రంగాన్ని తమ "ఉదాహరణవాఙ్మయము", "దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము" అనే రెండు ఉద్గ్రంథాలతో ఏ విధంగా సుసంపన్నం చేశారో విపులంగా వివరించారు. ఈ రెండు గ్రంథాలు వచ్చిన తరువాతనే - చాలా మంది పండితులే మరిచిపోయిన - ఆంధ్రసాహిత్య శాఖలు వెలుగులోనికి వచ్చాయి. వీటిలో "ఉదాహరణవాఙ్మయము" అనే గ్రంథరచన నిడుదవోలు వారికి కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి చేత "పరిశోధన పరమేశ్వర" అనే బిరుదం ఇప్పించింది! ఈ గ్రంథం ప్రత్యేకతను విపులంగా వివరించి డా॥ నిష్టలవారు మూలగ్రంథం చూడని వాళ్లకు దాన్ని చదవాలి అనేకుతూహలం, చదివిన వాళ్ళకు ఆయా విషయాన్ని లఘువుగానైనా - విషయభంజకం కాని రీతిలో - ప్రదర్శించారు. ఇది కష్టసాధ్యమైన పని! సిద్ధాంతగ్రంథకర్తను మన కృతజ్ఞతలకు పాలు చేసిన పని! పొరపాటయిన అభిప్రాయాలను వెలి బుచ్చిన వారిని నిడుదవోలు వారు ఎలా ఖండించారో చెప్పే సందర్భంలో, డా॥ నిష్టలవారు చాలా సుకుమార పద్ధతిని అవలంబించి, నిడుదవోలు వారి వాడిని కూడా కొంత తగ్గించి సహృదయులకు ఆమోదం కలిగించారు!

ఇంక "దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము" అనే గ్రంథం నిడుదవోలు వారి కృషి విశేషానికి పరమోదాహరణం, దక్షిణాది తెలుగు సాహిత్యసర్వస్వం అనదగిన ఈ బృహద్గ్రంథాన్ని వ్రాసి నిడుదవోలు వారు తమ పాండిత్య విస్తృతిని, భాషాపాటవాన్ని, విమర్శ శక్తిని వెల్లడించారు. ఈ బృహద్గ్రంథ వైశిష్ట్యాన్ని సిద్ధాంత గ్రంథరచయిత మూల గ్రంథ విశిష్టతకు లోటు రాని విధంగా క్రోడీకరించి లఘువుగా మనముందుంచారు. దీనితోబాటు ఈ గ్రంథరచనోద్దేశాన్ని, దాని వల్ల తెలుగు సాహిత్యానికి వచ్చిన నిండుదనాన్ని - నిర్ద్వంద్వంగా, నిర్దుష్టంగా ప్రకటించారు. ఈ రెండు గ్రంథాలు చదవని వారిని, ఈ క్రోడీకరణ వాటిని చదివిస్తాయి! చదివిన వారికి విషయ వివరణ జ్ఞాపికలుగా పనికి వస్తాయి. రెండు విధాలుగా - ఈ సిద్ధాంత గ్రంథానికి ధన్యత లభించింది.

విద్యారత్న నిడుదవోలు వేంకటరావుగారికి విశేష ఖ్యాతిని తెచ్చినది ఆయన పరిష్కరించిన గ్రంథాల వల్ల. ఈ సందర్భంలో సి.పి. బ్రౌను దొరను ఈయనకు పోలికతెచ్చారు. ఇది సముచితంగానే ఉంది అంటాను. కాని, సి.పి. బ్రౌను చాలామంది పండితుల సాహాయ్యంతో చేసినపని, తాము పరిష్కరించిన గ్రంథాలను నిడుదవోలు వారు ఒక్కరే చేశారనే విషయం మరచిపోకూడదు! ఇది వీరి విశిష్టత ! ఈ అధ్యాయంలో వివిధ గ్రంథాల పరిష్కరణ విషయంలో విద్యారత్న నిడుదవోలు వారు చూపిన - పాండిత్యాన్ని పరిశోధన పాటవాన్ని, సమయస్ఫూర్తిని డా॥ నిష్టల వెంకటరావు చాలా ఉదాహరణలతో చక్కగా నిరూపించారు. ఇతర రచయితలు, పరిష్కర్తులుచేసిన దోషాలను ప్రదర్శించేటప్పుడు సిద్ధాంత గ్రంథకర్త - ఔచిత్యాన్ని పాటించి, సంయమనాన్ని అనుసరించి స్వాభిమత సమర్థనను, స్థాపనను చేసి సహృదయులకు ఆమోదాన్ని చేకూర్చారు. ద్వేషదోషదుష్టమైన ఈ కాలంలో ఇది కష్టసాధ్యం గనుక మనం మెచ్చుకోవలసినది.

'నిఘంటురచన' అనే అధ్యాయంలో-నిఘంటు నిర్మాణానికి ముఖ్యంగా పాండిత్యంతో బాటు ధారణాశక్తి కూడా ఆవశ్యకమని, అది పుష్కలంగా ఉండడంవల్లనే నిడుదవోలు వారు మొదటి సూర్యరాయంధ్ర నిఘంటుకార్యాలయంలో చేరడం మొదలుకొని ఆయన శబ్దరత్నాకరానికి వేలకొలది మాటలు చేర్చి ప్రకటింపచేయడం వరకు రాణిస్తూవచ్చారని జరిగిన విషయాన్ని సంగ్రహంగా వివరించి సిద్ధాంత గ్రంధరచయిత నిడుదవోలు వారి కృషిని తెలిపారు. ప్రథమంలో ప్రాస్తావికంగా పాశ్చాత్యులు తెలుగు నిఘంటు నిర్మాణాదికంలో చేసిన కృషిని, సంస్కృత నిఘంటవుల విషయాన్ని తెలిపి డా॥ నిష్టల వారు ఈ అధ్యాయానికి చక్కని పూర్వాపర సంబంధం కల్పించారు. శబ్దరత్నాకరానికి అనుబంధ పీఠికగా నిడుదవోలు వారు ఇచ్చిన దాన్ని విశ్లేషించి చూపి - ఆయన విధానాన్ని తెలుపడం ద్వారా నిఘంటునిర్మాణంలో ఉన్న మెలకువలను మనకు తెలియజేశారు. కొన్నికొన్ని మాటలు పూర్వ నిఘంటువులలో తప్పుగా ఉన్న తీరు, వాటిని తీర్చిదిద్ది నిడుదవోలు వారు ఎట్లు సవరించారో మనకు తెలిపి సిద్ధాంత గ్రంథరచయిత జిజ్ఞాసువులకు సాయపడ్డారు. విద్యారత్న నిడుదవోలు వారి అసాధారణమైన పరిశ్రమను గుర్తించి, దాన్ని గూర్చి సోపపత్తికంగా, సోదాహరణంగా వ్రాసి డా॥ నిష్టల వారు మనకు పరిశోధన పరమేశ్వరుల పాండితీ గరిమను వివరించడం వల్ల ఆయా రంగాలలో కృషి చేయదలచిన వారు, చేస్తున్నవారు అనుసరించడానికి తగిన మార్గాలను కూడా సూచించినట్లయింది!

ఈ బృహద్గ్రంథంలోని వాఙ్మయ సూచిక చాలా ముఖ్యమైనది. ఆ సూచిక ఆమూలాగ్రం పరిశీలిస్తే - తెలుగు భాషా సాహిత్యాలలో, కొంత ఇతర భాషా సాహిత్యాలలో కృషి ఎలా జరిగిందో "కేవలం శీర్షికల పఠనం వల్ల" తెలుస్తుంది అంటే అతిశయోక్తికాదు. ఉత్తమ పరిశోధకుల "ఉపయుక్త రచనలపట్టిక" కూడా "శిష్యశిక్షణ" గా పనికి వస్తుంది అనడంలో సంశయం ఉండనక్కరలేదు! దీని "పఠనం" వల్ల విద్యారత్న, పరిశోధన పరమేశ్వర, కళాప్రపూర్ణ శివశ్రీ నిడుదవోలు వేంకటరావుగారు" దశదిశాభరణాంకులు' ' అనడం విషయంలో సంశయం ఉండవలసినది లేదు. శీర్షికల పఠనం వల్లనే ఆ విద్యారణ్యుల ఉదాత్తత, గంభీరత వ్యక్తం అవుతూ ఉంటే ఆయన గ్రంథాలనన్నింటిని చదివిన వారి విషయం ఇంక చెప్పేదేముంది!

ఈ పరిశోధన గ్రంథంలో - ముగింపు, అనుబంధములు కూడా చాలా ముఖ్యమైనవి. అవి ఎన్నో విషయాలను తెలియజేస్తాయి. లక్ష్యలక్షణ సమన్వయంతో, శాస్త్రీయ దృష్టితో, పరిశోధకుని నిరంతర కృషి ఫలితంగా, బహుముఖ ప్రజ్ఞా పాటవాలకు నిదర్శనంగా వెలువడిన ఈ బృహద్గ్రంథం గ్రంథాలయాలకు అలంకారంకాగలదు. నిడుదవోలు వారి సమస్త రచనలు సంపాదించి ఒకచోట ఉంచడం కష్టసాధ్యమైనపని, కాని, ఈ పరిశోధన గ్రంథాన్ని గ్రంధాలయంలో పెట్టుకొంటె, నిడుదవోలు వారి కొన్ని గ్రంథాలు వెంటనే లభించకపోయినా పరిశోధకులు నిరుత్సాహపడనక్కరలేదు. నిడుదవోలు వారి రచనలు మాత్రమే చదువుతే చాలదని ఆయన హృదయావిష్కరణకు ఈగ్రంథపఠనంకూడా ఆవశ్యకమని నేను విశ్వసిస్తున్నాను. నిడుదవోలు వారిని సన్నిహితంగా ఎరుగున్న నా మాటలవి! ఇంతటి ఉత్తమ పరిశోధనకు పర్యవేక్షకులైన విద్వన్మిత్రులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారిని అభినందిస్తున్నాను. ముగింపులో - "....బుద్ధిబాహువి, క్రమమున దుర్గమార్థ జల గౌరవ వేంకటసాహితీసముద్రము దటియంగ నీదిన పరాక్రమినిష్టల వేంకటార్యుఁడే" అంటాను.

కలియుగావతారులైన భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబా వారికి దీనిని అంకితం చేయడం వల్ల వారి పాదపద్మ సుగంధం, ఈ సువర్ణఘటిత గ్రంథానికి అంటి,- "సువర్ణానికి సుగంధం" లాభంచేకూరింది. పరిశోధకుడు ధన్యుడు !

- ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం
రిటైర్డ్ ప్రొఫెసర్, మాజీ డీన్
హైదరాబాదు విశ్వవిద్యాలయం

ఫోను: 7633275
'శ్రీవాణి' 1-8-702/105,
నల్లకుంట, హైదరాబాదు

# పరిశోధనోదాహరణం

'ప్రబంధ పరమేశ్వరు' డనగానే ఎఱ్ఱాప్రెగడ, 'పరిశోధన పరమేశ్వరు' డనగానే నిడుదవోలు వేంకటరావుగారూ తెలుగువారికి హృదయ మంటపాల్లో ప్రత్యక్ష మౌతారు. ఇద్దరూ ఇద్దరే. విశిష్ట వ్యక్తిత్వం వారి సొత్తు.

తెలుగులోని తొలినాటి పరిశోధకులలో కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు అగస్త్యుని లాంటి వారు. సంస్కృతాంధ్ర ద్రవిడ భాషా సాహిత్య సముద్రాలను ఆపోశన పట్టిన ధిషణ వారిది. చదివిన, విన్న ప్రతి అక్షరాన్నీ ధారణలో నిలుపుకొన్న ధీమంతులు. 'ధీ ర్ధారణావతీ మేధా' అన్న నిర్వచనానికి నిలువెత్తు జీవితంగా నిలిచిన మేధానిధి నిడుదవోలు వేంకటరావుగారు. భారతీయ పండితులను గురించి పాశ్చాత్యులు 'జంగమగ్రంథాలయాలనీ' 'నడయాడుతున్న విజ్ఞాన సర్వస్వా'లనీ చేసిన ప్రశంసల కన్నింటికీ తెలుగులో వెలుగు ఉదాహరణంగా నిలిచిన ప్రజ్ఞామూర్తి నిడుదవోలువారు. పదకోశాలలో జీవించగోరుతున్న ప్రయోగాలకు వారి ధారణ ఒక కల్పవృక్షం. అడిగిన వారికి ఆకరాలను వరాలుగా అందించ గలిగింది వారి జ్ఞాపకశక్తి. వారి నాల్క ప్రచీన పద్యనిధి. ఆశువులనుండి శాసన పద్యాల వచనాలదాకా అన్నీ వారికి స్మరణమాత్రంచేత నాల్కమీది నిలిచి లాస్యం చేసేవి. ఆధునిక సాహిత్య జగత్తులో వాస్తవంగా నిలిచిన అద్భుత ధారణాశక్తి! ఈ శతాబ్దం తెలుగు పరిశోధన చరిత్రలో దాదాపు ఒక అర్ధ శతాబ్ది తన చైతన్యాన్నీ, ప్రభావాన్నీ సృష్టించుకోగలిగిన ప్రతిభామూర్తి నిడుదవోలు వేంకటరావుగారు. అటు భాషా పరిశోధనలో ఇటు సాహిత్య పరిశోధనలో తన అస్తిత్వాన్ని నిలువబెట్టుకొన్న సవ్యసాచి ఆయన!

తెలుగులో సాహిత్య పరిశోధన వికాసాన్ని నాలుగు విభాగాలుగా విభజించవచ్చు. అవి: 1. బ్రౌణ్యయుగం (క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్ధం) 2. వీరేశలింగ యుగం (19వ శతాబ్ది ఉత్తరార్ధం) 3. రాయప్రోలు యుగం (20వ శతాబ్ది పూర్వార్ధం) 4. విశ్వవిద్యాలయ యుగం (20వ శతాబ్ది ఉత్తరార్ధం). ఈ యుగాలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రవృత్తి

కొట్టవచ్చినట్లు కనపడుతుంది. బ్రౌణ్యయుగ పండితులు సామగ్రి సేకరణకూ, గ్రంథ పరిష్కార ప్రక్రియకూ విశేషంగా దోహదం కలిగించారు.

ఈ ప్రవృత్తి వీరేశలింగ యుగంలో కూడా కొనసాగినా అంతకంటె విశిష్టంగా కవుల జీవిత చరిత్రలు నిర్మించటానికీ, శబ్దకోశాలు సిద్ధంచేయటానికీ, వివిధ భాషా సాహిత్యాంశాలమీద పరిశోధనాత్మక వివేచనం విస్తరింప చేయటానికీ, తదనుబంధంగా వాఙ్మయ చరిత్రలను, విజ్ఞాన సర్వస్వాలనూ రూపొందించటానికి విశేషమైన కృషి సాగింది. రాయప్రోలు యుగంలో మొదట సాహిత్య విమర్శలో ప్రయోగాలు మొదలై, అనుశీలన ప్రవృత్తి విస్తరిల్లింది. ఆ తరువాత స్వతంత్ర సాహిత్య సిద్ధాంత దర్శనం, ప్రతిపాదనం జరిగింది. విశ్వవిద్యాలయ యుగంలో ప్రక్రియా పరమైన పరిశోధన, సాహిత్య యుగానుశీలనం, కావ్య పరిశోధనం, వివిధ సాహిత్యాంశాలపై విశేష పరిశీలనం, తులనాత్మక అధ్యయనం మొదలైన అంశాలు ప్రాధాన్యాన్ని వహించాయి.

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు కవిగా దాదాపు క్రీ.శ. 1919 నుండి కవితలు వ్రాసినా, పరిశోధకునిగా దాదాపు 1925 నుండి వ్యాసాలూ, గ్రంథాలూ వెలువరిస్తూ వచ్చారు. నిరంతరాయంగా 1982 వరకూ (దివంగతులయ్యేంత వరకు) కలం క్రిందపెట్టకుండా పరిశోధన తపస్సు చేస్తూనే ఉండేవారు. వీరు చారిత్రికంగా పరిశోధన వికాసదశలో రాయప్రోలు యుగంలో తమ పరిశ్రమ ప్రారంభించినా తమకు ముందున్న బ్రౌణ్య, వీరేశలింగ యుగాలలోని పరిశోధన ప్రవృత్తికీ నూత్న చైతన్యాన్నీ విస్తృతినీ సాధించారు. అంతేకాదు ఆతరువాతి విశ్వవిద్యాలయ పరిశోధనయుగంలో కూడా ఒక ప్రామాణిక పాత్ర నిర్వహించారు. ఈ వాస్తవాన్ని గమనిస్తే తెలుగులోని పరిశోధన వికాశదశల కన్నింటినీ తమలో కలుపుకున్న పరిశోధన పారావారులని చెప్పదగినవారు నిడుదవోలు వేంకటరావుగారు.

నిడుదవోలువారి పరిశోధన పరమేశ్వరమూర్తికి ఉదాహరణ వాఙ్మయం ఊపిరి; గ్రంథ పరిష్కారం గతి వైఖరి; సాహిత్య చరిత్ర వాగ్వైభవం, సమీక్ష దృగ్వీక్షణం; శబ్దకోశ నిర్మాణం శ్వాసకోశం; ధారణ జీవితం; విశ్లేషణ వివేకం; పీఠికారచన ప్రజ్ఞాపాటవం; శైవ వాఙ్మయార్చనం దీక్షావ్రతం. ఆయన అవిశ్రాంత సాహిత్యోపాసకుడు! అవిరళ పరిశోధకుడు!

పరిశోధన పరమేశ్వరుణ్ణి గురించి పరిశోధన చేసిన సిద్ధాంతవ్యాస మిది. అదృష్ట మేమంటే వేంకటరావుగారిమీద పరిశోధన చేస్తున్నది కూడా వేంకటరావుగారే. నామసామ్యం ఇందులో కుదిరిన సామంజస్యం.

పరిశోధకులు నిష్టల వేంకట్రావుగారు పది అధ్యాయాలలో నిర్వహించిన ఈ రచన ఒక పరిశోధకుణ్ణి గురించి పరిశోధన చేసే విశ్లేషణాత్మకమైన వివేచనానికి చక్కని ఉదాహరణంగా సాగింది. నిడుదవోలుగారు పరిశోధన సాగించిన శాఖలు ముఖ్యంగా ఎనిమిది. అవి (1) వీరశైవ వాఙ్మయం, (2) తెలుగు కవుల చరిత్ర, (3) వచన వాఙ్మయం, (4) వాఙ్మయ చరిత్ర-నిర్మాణం, (5) నిఘంటు నిర్మాణం, (6) గ్రంథ సంస్కరణలు, (7) పీఠికలు-వ్యాసాలు-సమీక్షలు, (8) భాషా, వ్యాకరణ, ఛందో విశేషాలు. ఆయా రంగాలలో ఆయన సాధించిన విజయాలను విశ్లేషించి వివేచించటమే ఈ గ్రంథ రచనా ప్రణాళిక. వీటికి తోడుగా నిడుదవోలువారి జీవిత విశేషాలు, వాఙ్మయసూచి చేర్చబడ్డాయి. వాటితో ఈ గ్రంథానికి ఒక నిండుదనం ఏర్పడింది. నిడుదవోలువారి కృషిని స్వయంగా విశ్లేషిస్తూ ప్రసిద్ధ కవి విమర్శకుల, పరిశోధకుల భావాలను పేర్కొనటం, వాటిని సమీక్షించటం కూడా జరిగింది.

ఈ గ్రంథాన్ని చదువుతున్నప్పుడు సూర్యుని వలన లభ్యమైన జలాలను సూర్యునికే తిరిగి అర్ఘ్యమిస్తున్నట్లు అనిపిస్తుంది. ఈ గ్రంథం నిండా వెలుగునింపే జ్ఞానభాస్కరుడు నిడుదవోలువారు. ఆ జ్ఞాన భాస్కరునికి అర్ఘ్యమిస్తున్నవారు నిష్టలవారు. నిష్టల వేంకటరావుగారి పరిశోధన నిష్ఠకు ఇది పరమోదాహరణం.

నిష్టల వేంకటరావుగారు నాకు చిరకాల మిత్రులు. వారికి డాక్టరేట్ పట్టాన్ని అందించిన ఈ చక్కని చిక్కని పరిశోధన గ్రంథం ప్రచురింపబడటం నా కెంతో సంతోషాన్ని కలిగిస్తున్నది. వారింకా ఇటువంటి సాహిత్య వ్యవసాయాన్ని ఇకముందు కూడా సాగించాలని ఆకాంక్షిస్తూ, ఈ కృతిని అభినందిస్తున్నాను.

హైదరాబాదు **- డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం**

15-3-1998

# ముందుమాట

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు (1903-82) గారి "జీవితం-వాఙ్మయ సూచిక" అనే అంశంపై పరిశోధన జరిపి సిద్ధాంత గ్రంథాన్ని తయారుచేసి హైదరాబాదు విశ్వవిద్యాలయం వారికి సమర్పించి, 1985లో ఎం.ఫిల్ పట్టాన్ని పొందాను.

తదుపరి "కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారి రచనలు-పరిశోధన" అనే అంశాన్ని ఎన్నుకొని ఈ సిద్ధాంతగ్రంథం వ్రాసి పిహెచ్.డి. లో పట్టాన్ని పొందాను.

ఈ శతాబ్ది సాహిత్య పరిశోధకులలో కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు ప్రాతస్స్మరణీయులు. వారి సాహిత్య సేవపై కృషి చేయటానికి పూజ్యులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు ఎంతో ప్రోత్సహించారు. ఆయన ఉద్యోగ విరమణ తరవాత డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు నా సిద్ధాంతగ్రంథ పర్యవేక్షకులుగా ఉండి ఎంతో ఆదరించారు.

నా పరిశోధన రచనా పథకాన్ని నిర్ణయించుకోవటంలో ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు పర్యవేక్షకులుగా చేయూత నిచ్చిన పిమ్మట నా సిద్ధాంతగ్రంథ రచనను పది భాగాలుగా విభజించటం జరిగింది.

*1. నిడుదవోలు వేంకటరావుగారి జీవిత విశేషాలు*

వేంకటరావుగారు 1903లో జన్మించి, 80 ఏండ్లు జీవించి హైదరాబాదులోని న్యూనల్లకుంటలో తమ స్వగృహంలో 15-10-82 నాడు దివంగతులయ్యారు.

విశాఖ పట్టణంలో హైస్కూలు, ఎఫ్.ఎ., చదువు పూర్తి చేసికొని తండ్రిగారితో విజయనగరం వచ్చి మహరాజా వారి ఆంగ్ల కళాశాలలో బి.ఎ. పట్టాన్ని పొందారు. విశాఖపట్టణంలో చదువుకొంటున్నప్పుడే కవిత లల్లడం ప్రారంభించారు. మహారాజావారి కళాశాలలో చదువుతున్నప్పుడే తమ కళాశాల పత్రికలో నన్నెచోడుని కాలనిర్ణయం, సౌగంధికా ప్రసవాపహరణంపై పరిశోధక వ్యాసాలు వ్రాశారు. వారి తండ్రిగారు సుందరం పంతులుగారు సొంత పుస్తక భాండాగారాన్ని స్థాపించారు. అది వేంకటరావుగారి విజ్ఞాన వలయాన్ని విస్తరింపజేసింది. సుందరం పంతులుగారు శైవమతాభిమానులు. పండితారాధ్య చరిత్ర తొలి పరిష్కర్తలలో ఒకరు. వారింట బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలు నిత్య పారాయణ గ్రంథాలు.

వేంకటరావుగారు విజయనగరం ఇంపీరియల్ బాంకులో గుమాస్తాగా కుదిరారు. స్థానిక సభల్లో సభా ప్రారంభ పద్యాలు చదివి మెప్పుపొందేవారు. తాతా సుబ్బరాయశాస్త్రి షష్టిపూర్తి సన్మాన పత్రాన్ని ఆంధ్రాంగ్ల సంస్కృత భాషల్లో రచించి ఆనాటి సభలో చదవగా ప్రేక్షకులు స్తంభీభూతులయ్యారు. విజయనగరం నుండి కాకినాడ వచ్చి పిఠాపురం మహారాజాకు కృపాపాత్రులయ్యారు. అక్కడినుండి మద్రాసుకు పోయి మద్రాసు విశ్వవిద్యాలయంలో శాఖాధిపతి అయి పేరు ప్రఖ్యాతులు గడించారు.

*2. పీఠికలు*

విజయనగరంలో వేంకటరావుగారు ఆంధ్రవిజ్ఞాన సమితి సభ్యులై శృంగార రాధామాధవానికి, వాల్మీకి చరిత్రకు, పుష్పబాణ విలాసానికి, కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్ పక్షాన లక్షణసారసంగ్రహం, సీతారామ చరిత్ర, విప్రనారాయణ చరిత్రకు; మద్రాసులో ఆంధ్రగ్రంథాలయాలవారి బసవపురాణానికి, వావిళ్లవారి శతాధిక ప్రచురణలకు, పీఠికలు వ్రాశారు. మరికొందరి గ్రంథాలకు ఉపోద్ఘాతాలు రచించారు. వారి పీఠికలు సమగ్రాలు, ప్రామాణికాలు.

*3. వీరశైవ వాఙ్మయం- వేంకటరావుగారి సేవ.*

చిన్నతనం నుండి వేంకటరావుగారికి శైవగ్రంథాలంటే చాలా ప్రీతి. బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, కుమారసంభవం, యధావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం క్షుణ్ణంగా చదివారు. శైవకవుల పలుకుబడిని వారు ప్రామాణికంగా తీసుకొని నిఘంటువుల కెక్కించారు. సభలలో పాల్కురికి కృతులకు ఎక్కువ ప్రచారం చేశారు. మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారాన్ని తిరగి పరిష్కరించారు. సనాతనులు ముట్టని వీరశైవ గ్రంథాలను వెలికితీసి వారి విలక్షణమైన భాషా సాహిత్యాలపై సిద్ధాంతపూర్వకమైన వ్యాసాలు వ్రాసి విశ్వవిద్యాలయాల్లో తెలుగు సాహిత్య చరిత్ర చదివేవారు. శివకవుల గ్రంథాలను విధిగా చదివేటట్టు ప్రభాకరశాస్త్రిగారితో పాటు, వేంకటరావుగారు ప్రశంసనీయమైన కృషిచేశారు.

*4. భాష - వ్యాకరణం - ఛందస్సు.*

శివకవుల భాషను గూర్చేకాక, ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయకృతం కాదని చూపడానికి వీరు విశేష ప్రయత్నం చేశారు. తాళపత్రగ్రంథాలలోని సరియైన పాఠాలను గుర్తించి ఛందో వ్యాకరణాలలో అపూర్వ విషయాలు బయటికి తీసి కొత్త యతులు,

ప్రాసలు కనిపెట్టారు. ఉదాహరణ కావ్యాలలోని కళికోత్కళికలను గూర్చి నిగూఢమైన పరిశ్రమ చేశారు. సోమన సృష్టించిన ద్విపద తాళ లయానుకూలంగా పాడవచ్చునని నిర్ధారించారు.

*5. తెలుగు కవుల చరిత్ర*

కవుల చరిత్రలు వీరేశలింగం పంతులు, శ్రీరామమూర్తి పంతులు, చాగంటి శేషయ్య రచించారు. వాటిలో కావ్య విమర్శ తక్కువ. తెలుగు సాహిత్యాభివృద్ధిని తెలియజేయడానికి వేంకటరావుగారు నన్నయ కాలానికి పూర్వం, పరం ఉన్న శాసన కృతులను చేర్చి తెలుగు కవుల చరిత్ర రచించారు. అనేక మంది కొత్త కవుల చరిత్రలు వ్రాశారు.

*6. ఆంధ్ర వచన వాఙ్మయము*

కవులచరిత్రలాగే తెలుగు వచనం గూర్చి వేంకటరావుగారికి ముందే వ్రాసిన వారున్నా వారివారి గ్రంథాలలో లేని అపూర్వ విషయాలను తెల్పడమే కాకుండా నన్నయ పూర్వపు వచనాన్ని శాసనాల్లోంచి ఎత్తి చూపారు. గద్య వచన శబ్దాలను గూర్చి చర్చించి తెలుగు కావ్యాలలోని పద్యవచన ప్రయోగ సరళినేకాక ఆశ్వాసాంత గద్యాలానే గద్య శబ్దాన్ని కూడా తమ పరిధిలోనికి తీసుకొని లయతో కూడిన గద్యరచనలను ఉదాహరించారు. కృష్ణమాచార్యుని వచనకర్తగా వేంకటరావుగారు గుర్తించి వచన వాఙ్మయ ప్రథమాచార్యుడని ప్రశంసించారు. ఆధునిక యుగంలో వచన ప్రాముఖ్యాన్ని వారు విస్తరించి చెప్పారు.

*7. వాఙ్మయ చరిత్ర*

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, 2. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము.

దేవతాపరమగు స్తోత్రరూపమైన లఘుకృతి ఉదాహరణము. ఇందులో వృత్తములు, కళికోత్కళిక రగడలు, సార్వవిభక్తిక పద్యము, అంకితాంక పద్యం ప్రయుక్తం. వృత్తం ఏ విభక్తి ప్రత్యయాన్ని ఆదరిస్తుందో ఆ ప్రత్యయాన్నే కళికోత్కళికలుకూడా గ్రహిస్తాయి. ఇటువంటి చిత్రమైన కృతికి జీవంపోసిన వారు వేంకటరావుగారు. సమగ్రమైన ఉదాహరణ చరిత్ర సమకూర్చారు. ఆయన సమకాలీనులు ఉత్సాహంతో ఉదాహరణ కావ్యాలు రచించారు. ఈనాడూ ఉదాహరణ కావ్యాలు రచించేవారు లేకపోలేదు.

దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం విలక్షణమైన వాఙ్మయచరిత్ర. తమిళ, కర్ణాటక రాష్ట్రాలలో వర్ధిల్లిన తెలుగు వాఙ్మయాన్ని సేకరించి సమగ్ర బృహత్‌గ్రంథాన్ని వేంకటరావుగారు రచించారు. దక్షిణాది తెలుగు సాహిత్యానికి ఇది సర్వస్వమని చెప్పవచ్చు.

*8. గ్రంథ పరిష్కరణలు*

కట్టా వరదరాజు రామాయణం (4 సంపుటాలు), రాజుగోపాల విలాసం, ఖడ్గలక్షణ శిరోమణి, శివతత్త్వసారం వీరు పరిష్కరించిన గ్రంథాలు. తాళపత్రగ్రంథాలతో బాగా పరిచయం ఉన్న వేంకటరావుగారికి ఈ విద్య నల్లేరిపై బండి నడక.

*9. నిఘంటు రచన*

సూర్యరాయాంధ్ర నిఘంటువు చతుర్థ సంపుటానికి అమూల్యమైన ప్రయోగాలు అందించారు. శబ్దరత్నాకరంలో లేని పదాలను, ఉన్న పదాలకు ప్రాచీన ప్రయోగాలను, వ్యాకరణ శాస్త్రానికి లొంగని ప్రయోగాలను వేంకటరావుగారు సమకూర్చి శబ్దరత్నాకరానికి అనుబంధంగా చేర్చారు. ధారణశక్తివల్ల వేంకటరావుగారు పుస్తకాపేక్ష లేకుండా కవిప్రయోగాలను తు.చా. తప్పక, అడిగినదే తడవుగా చెప్పగల సమర్థులు. ఈ శక్తిని విశ్వనాథవారు గుర్తించి ప్రశంసించారు.

*10.అనుబంధం - వాఙ్మయ సూచిక*

వేంకటరావుగారి రచనల నన్నింటికి విషయానుకూలంగానే కాకుండా కాలానుగుణంగా చేర్చడం అయింది. దీనినిబట్టి వేంకటరావుగారి బహుముఖ సేవను గుర్తించవచ్చు.

ఈ సిద్ధాంతవ్యాసాన్ని భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారి దివ్య పాదపద్మాలకు అంకితం చేస్తున్నాను. దయతో కృతినంగీకరించిన భగవాన్‌కు కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలి.

ఈ సిద్ధాంతవ్యాసం కోసం వేంకటరావుగారి రచనలను లోతుగా పరిశీలించడం జరిగింది. గ్రంథ సామగ్రి సేకరణలో వేంకటరావుగారి పెద్దకుమారులు సుందరేశ్వరరావుగారు, నాల్గవ కుమారులు శ్రీ సర్వేశ్వరరావుగారు. విషయవిశ్లేషణలో శ్రీ తిరుమల రామచంద్రరావుగారు చాలా సహాయం అందజేశారు. వారందరికి నా కృతజ్ఞత. వేంకటరావుగారి కుటుంబ సభ్యులుకూడా ఎంతో సహకరించారు. జీవితభాగస్వామినిగానే కాకుండా, ఈ సిద్ధాంత రచనా సమయంలో నాకెంతో సహాయపడిన నా భార్య - చిరంజీవి సౌభాగ్యవతి లీలానీ, శ్రీ నిడుదవోలు సర్వేశ్వరరావుగారి కుమార్తెకి నా శుభాశీస్సులు. ఆమె వేంకటరావుగారి మనవరాలే.

ఈ సిద్ధాంతగ్రంథ సమర్పణకు అనుమతించిన భాషాశాస్త్ర పారంగతులు, హైదరాబాదు విశ్వవిద్యాలయం అప్పటి ఉపాధ్యక్షులు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారికి నా నమస్సులు.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి పర్యవేక్షణలో ఈ సిద్ధాంత గ్రంథ రచన కొనసాగింది. వా రందించిన అనన్యమైన ఆదరాభిమానాలకు, ప్రోత్సాహానికి భక్తిపూర్వక నమస్సులు.

నా కృషిని అన్నివిధాల ఆశీర్వదించిన విశ్వవిద్యాలయ తెలుగుశాఖ అధ్యాపవర్గం ఆచార్య కె.కె. రంగనాథాచార్యులుగారు, ఆచార్య రవ్వా శ్రీహరిగారు, డాక్టర్ ఆనందారామం ప్రభృతులకు నా కృతజ్ఞతలు.

నా విద్యాభ్యాసానికి ఆదరాభిమానాలతో తోడ్పడిన మాతల్లిదండ్రులకు సర్వదా కృతజ్ఞతలు తెల్పుకొంటున్నాను. ప్రత్యేకంగా మా మాతృమూర్తి స్వర్గీయ సత్యవతి అదృశ్యంగా ఉండి నన్ను ఆశీర్వదిస్తూ ముందుకు నడిపిస్తున్నందుకు ఆమెకు నా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను.

సిద్ధాంతగ్రంథం వ్రాతప్రతిని సిద్ధం చేయటంలో సహకరించిన శ్రీ అక్కిరాజు జనార్దనరావుగారికి, శ్రీ వద్దిరాజు జనార్దనరావుగారికి, శ్రీ వాసుదేవ్ గారికి, శ్రీమతి నీరజ గారికి నా ధన్యవాదాలు.

ఈ ప్రచురణకు ముందుమాటలు వ్రాసి నన్నాశీర్వదించిన పెద్దలు, విద్వన్మణులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారలకు కృతజ్ఞతాభివందనాలు.

ఈ సిద్ధాంతగ్రంథ ప్రచురణ కోసం ఆర్థిక సహాయం అందజేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి, ముఖ్యంగా ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి కృతజ్ఞతలు. ఈ ప్రచురణలో నన్నెంతగానో ప్రోత్సహించి సహాయసహకారా లందించిన శ్రీ రమణయ్య రాజా వారికి ధన్యవాదాలు.

ఈ గ్రంథానికి అక్షరశిల్పాన్ని సమకూర్చిన శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్‌వారికి ధన్యవాదాలు.

**- నిష్టల వేంకటరావు**

# నిడుదవోలు వేంకటరావుగారి జీవిత విశేషాలు

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 1903 జనవరి 7వ తేదీన విజయనగరంలో జన్మించారు. వారి తండ్రిగారి పేరు సుందరం పంతులుగారు. తల్లిగారిపేరు జోగమ్మగారు. వీరు ఆరువేలనియోగులు. నిడుదవోలువారి వంశంలో వేంకటరావుగారికి ముందు ఏడుతరాలుగా కవిపండితులు ఉన్నారు. వీరి కాణాచి పశ్చిమ గోదావరిజిల్లా నిడుదవోలు సమీపంలోని నరేంద్రపురం. వేంకటరావుగారి ముత్తాత విజయనగరానికి 10 మైళ్లలోని కమతాంరావివలస అనే గ్రామానికి వలసవచ్చి కరణీకం సంపాదించారు. తండ్రిగారయిన సుందరం పంతులుగారు కవిపండితులు. పార్థివలింగపూజా పరాయణులు. పౌరాణికులు. ఆయనకు బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు కంఠోపాఠాలు. ఆయన ప్రాచీన సాహిత్యంపైన ఆదరం కలవారు కనుక వేంకటరావుగారి జననానికి ముందే దాదాపు ఆరువేల ముద్రితాముద్రిత గ్రంథాలు సేకరించారు.

"మా నాయనగారు నిడుదవోలు సుందరం పంతులుగారు క్రిందటి శతాబ్దంలోనే తెలుగుదేశంలో మొట్టమొదటిసారిగా గ్రంథాలయం నిర్వహించారు. అనేక తాళపత్రగ్రంథాలు సేకరించారు. ఆకాలంలో కవులూ పండితులూ తమ ముద్రిత గ్రంథాలను ఆయనకు గౌరవాభిమాన పురస్సరంగా పంపుతూ ఉండేవారు. 1914లో మా తండ్రిగారు పండితారాధ్య చరిత్రను అచ్చు వేయించారు. అంతకుముం దెవ్వరూ ఈ మహోద్గ్రంథాన్ని అచ్చు ఒత్తలేదు. మాయిల్లే గ్రంథాలయం కాబట్టి నాకు ఎటుచూచినా సాహిత్యవాతావరణమే. నాకు 13, 14 ఏళ్లప్పుడు మా యింటికి మానవల్లి రామకృష్ణకవిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాళపత్ర గ్రంథాలు

సేకరించడానికి విచ్చేశారు. అప్పుడే పరిశోధనాభిలాష నాలో ప్రవేశించింది" అని ఒక సందర్భంలో అన్నారు.[1]

సుందరం పంతులుగారు సంస్కృతాంధ్ర హిందీభాషలలో గడి తేరినవారు. మహాత్మాగాంధీ విశాఖపట్నం వచ్చినప్పుడు సుందరం పంతులుగారు 15 నిమిషాల పాటు హిందీలో ప్రసంగించడమేకాక గాంధీజీ ప్రసంగాన్ని తెలుగులోకి అనువదించారని వేంకటరావుగారు అముద్రిత స్వీయచరిత్రలో చెప్పుకున్నారు.

"మనజేసె తెలుగునాటను
పనుపడి ప్రథమాంధ్రపుస్తభాండారము నా
జనకు డగు సుందరమ్మును
ననవరతము సంస్మరింతు నధికప్రేమన్"

అని వేంకటరావుగారు తమ తండ్రిగారిని స్మరించారు.[2]

వేంకటరావుగారి చిన్ననాటి చదువు విజయనగరంలోను, ఉన్నత పాఠశాల చదువు విశాఖపట్నం సి.బి.ఎం. హైస్కూలులోను, ఎఫ్.ఎ. (ఇంటర్మీడియేట్) విశాఖపట్నం మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాలలోను బి.ఎ., విజయనగరం మహారాజా కళాశాలలోను జరిగింది. విజయనగరం, విశాఖపట్నం పండిత ప్రకాండుల పుట్టినిండ్లే గనుక. ఇల్లుకూడా సరస్వతీ మందిరమే గనుక వేంకటరావుగారికి చిన్ననాటినుంచే సాహిత్యాభిరుచి కలిగింది. పద్యాలు కంఠస్థం చేయడం, అర్థప్రతిపత్తి కలిగేటట్లు చదవడం, ఆయనకు పట్టుబడ్డాయి.

ఆయన ధారణ కూడ గొప్పది. ఒక్కసారి చదివితే చాలు మెదడులో ముద్రితమైనట్లు అంకితమై పోయేది. ఈ గుణం ఆయనను ఒకసారి చిక్కుల్లో

1. మూడు వాఙ్మయ శిఖరాలు - తిరుమల రామచంద్ర. పుట 106.
2. నిడుదవోలు సుందరం పంతులుగారి ముద్రితగ్రంథసంచయం తిరుమల తిరుపతి పరిశోధన సంస్థ గ్రంథాలయావిర్భావానికి మూలసంపద. తాళపత్రగ్రంథాలను ఆయన మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయానికి ఇచ్చివేశారు.

పెట్టింది. విశాఖపట్నంలో ఆయన గురువు సెట్టి లక్ష్మీనరసింహంగారు రచించిన చిత్రహరిశ్చంద్రీయం నాటకం వేస్తున్నారు. లోహితాస్యుని పాత్రధారి రాలేదు. వచ్చేజాడలు కనిపించలేదు. వేంకటరావుగారిని ఆవేషం వేయమన్నారు. ఆయన అంగీకరించారు. నాటకం బాగానే రక్తికట్టింది. ఇంటికి వచ్చిన పిదప తల్లి జోగమ్మగారు 'నీకు మతుందా' చచ్చిపోయే వేషం కడతారా ఎవరైనా? అని నానాచీవాట్లూ పెట్టారు. కాని వేంకటరావుగారు తండ్రిగారి అనుమతితోనే ఈ పాత్ర ధరించారు.

వేంకటరావుగారికి ఇంటర్‌లో తెలుగు ఉపాధ్యాయులు కేతవరపు వేంకటశాస్త్రిగారు. బి.ఎ.లో కోరాడ రామకృష్ణయ్యగారు, మేడేపల్లి వేంకట రమణాచార్యులు, అడిదం రామారావు గారలు. వేంకటరావుగారిని తమ గురువులు ఎంతగానో ప్రోత్సహించారు.

పట్టభద్రులయిన వేంకటరావుగారిది ఉద్యోగం లేనిదే గడవని జీవితం. సొంతయిల్లు, తల్లిదండ్రులూ ఉన్నా పోషించవలసినవారు ఎక్కువగా ఉండడంవల్ల ఉద్యోగం విధిగా చేయవలసి వచ్చింది. విజయనగరంలో ఇంపీరియల్ బాంకు (స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా)లో గుమాస్తాగా చేరారు. ఉద్యోగం పన్నెండున్నర సంవత్సరాలు చేశారు. విజయనగరంలో వేంకటరావుగారి దినచర్య ఈవిధంగా ఉండే దని వారిపెద్దకుమారుడు శ్రీశివసుందరేశ్వరరావుగారు తెలిపారు.

"ఉదయం 8 గంటలకు ఆఫీసుకి వెళ్లి, రాత్రి ఆ సమయానికే ఇంటికి తిరిగి వచ్చేవారు. ఆయన ఆలస్యంగా వస్తారని తెలిస్తే మా తాతగారు సుందరం పంతులుగారు లాంతరు, పెద్దబాణాకర్ర పట్టుకొని బాంకు ముందర కూర్చునేవారు. మా అమ్మ మానాన్నగారు ఇంటికి వచ్చేవరకు అన్నం తినేదికాదు. లంకంతకొంప - వచ్చేవారు - పోయేవారితో నిండిపోయేది. చదువుకోడానికి విజయనగరం వచ్చి మాయింట్లోనే కొంతమంది బంధువర్గం, విద్యార్థులు బసచేసేవారు. అందువల్ల మా అమ్మ వంటింటికి అంకితమై పోయేది. కాని, కొడుక్కి బాంకువేళకు ఆలస్యం కాకుండా మా మామ్మగారు తెల్లవారు ఝామునే లేచి ఉదయం ఏడుగంటలకే

అన్నం వండిపెట్టేది. ఆ తరువాత మర్నాడు ఉదయం వరకు ఆచాయలకు వచ్చేదికాదు. మానాన్నగారు బాంకులో ఆలస్యం కాకుండా ఉంటే సాయంకాలం బాంకు దగ్గరగా ఉండే 'కల్యాణి' పత్రికా కార్యాలయానికి వెళ్ళేవారు. అక్కడ గంటి సూర్యనారాయణశాస్త్రిగారితో ముచ్చట్లయిన పిదప దీపాలు పెట్టేవేళకు ఇల్లుచేరుకొనేవారు. అప్పట్లో విజయనగర సంస్థానానికి ఇంజనీరుగా వేపకొమ్మ వెంకటసుబ్బయ్యగారు ఉండేవారు. గంటి సూర్యనారాయణశాస్త్రిగారి ప్రోత్సాహంతో వెంకటసుబ్బయ్యగారు 'ఆంధ్రవిజ్ఞాన సమితి' నెలకొల్పారు. ఈ సమితి ప్రకటించిన వెలిదండ్ల వెంకటపతి శృంగార రాధామాధవానికి, రఘునాథభూపాలుని వాల్మీకి చరిత్రకు మానాన్నగారు పీఠికలు వ్రాశారు. మానాన్నగారు ఇంటికి రాగానే కోటూ తలపాగా తీసి, కాళ్ళూచేతులూ కడుక్కొని బట్టలు మార్చుకొని అయ్యకోనేరు గట్టుపై ఉండే ఆంజనేయస్వామి దేవాలయానికి వెళ్లి, అక్కడ పూజారితో సమానంగా అర్చనల్లో పాల్గొనేవారు. తిరిగి ఎనిమిది గంటలయ్యేసరికి ఇంటికివచ్చి బరంపురం వంగపండు రంగు పట్టుబట్ట కట్టుకొని భోజనం చేసేవారు. మానాయనగారి బంగారు మేనిచాయతో ఆపట్టుబట్టవన్నె కలిసిపోయేది. భోజనానంతరం చావిడిలోని ఉయ్యాల్లో కూర్చుని తమలపాకులు నములుతూ నన్ను నిద్రపుచ్చడానికి ఉగుతూ ఉండేవారు. ఊగుతున్నంతసేపూ ఆయన తనలో తాను పద్యాలు చదువుతూ వేళ్లు తిప్పుతూ ఉండేవారు. మా అమ్మ అన్ని పనులు ముగించుకొని రాత్రి 10 గంటలకు నాన్నగారి గదికి వచ్చేది. ఆదివారం ఉదయం సంతకు వెళ్లి నెయ్యి తెస్తూ ఉండేవారు. సోమవారం ఉదయం కోటపక్కన ఉన్న నందూరి వెంకమ్మ కోవెలకు వెళ్లి కొబ్బరికాయకొట్టి శివుని దర్శనం విధిగా చేసేవారు. ఊళ్లో ఏ సాహిత్య సభలకైనా ఎవరైనా పిలిస్తే సభాప్రారంభంలో చేసే ప్రార్థనలో సంస్కృత శ్లోకం మొదట చదివి ఆ వెంట తెనుగు పద్యం స్పష్టోచ్చారణతో చదివేవారు.

1935 ఏప్రిల్ 20,21వ తేదీల్లో విజయనగరంలో మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి షష్టిపూర్తి సన్మాన సభ జరిగింది. సభాధ్యక్షులు మహామహోపాధ్యాయ, విద్యావాచస్పతి ఎస్. కుప్పుస్వామిశాస్త్రి, సభాప్రాంగణం అంతా దేశం నలుమూలలనుండీ వచ్చిన విద్వజ్జన సమూహంతో నిండిపోయింది.

రాయడుశాస్త్రిగారి సన్మానం ఉదయం 8.30 గంటలకు మొదలయింది. గంటి సూర్యనారాయణశాస్త్రిగారు, వేంకటరావుగారు కలిసి సంస్కృతాంధ్ర ఆంగ్లేయభాషలలో సన్మానపత్రం రచించారు. గురుపూజానంతరం సన్మాన పత్ర సమర్పణ కార్యక్రమం జరిగింది. 23-4-35 నాటి ఆంధ్రపత్రిక సన్మానమహోత్సవ వార్తను బ్రహ్మాండంగా ప్రచురించింది.

"కల్యాణి' పత్రికాధిపతులు శ్రీగంటి సూర్యనారాయణ శాస్త్రులు, నిడుదవోలు వేంకటరావు బి.ఎ., గారును సభ నలంకరించారు. సాయంకాలం 4 గంటలకు మంగళతూర్యనాదములు మిన్నుముట్టుచుండ శిష్యప్రశిష్య పురప్రముఖ పండిత వైదిక విద్వద్బృందముతో సంస్కృత కళాశాలకు శాస్త్రులవారును, నధ్యక్షులు కుప్పుస్వామి శాస్త్రులుగారును విచ్చేసిరి. అఖిలాంధ్రదేశ పండితపారావార మనిపించు నా సభాంగణమున ఘనపాఠీల వేదోక్తాశీస్సులు మిన్నుముట్ట మహామహోపాధ్యాయ బిరుద లాంఛనముతో, వేల్సు యువరాజదత్త స్వర్ణకటకాలంకారభూషితు లైరి... కల్యాణి పత్రిక తరఫున తమ సంస్కృతాంధ్రాంగ్ల భాషాత్రయాభినందన పత్రమును శ్రీయుత నిడుదవోలు వేంకటరావు బి.ఎ., గారు గంభీరముగ జదివి సభ్యులను స్తంభీభూతుల గావించిరి. ఈనాడు శాస్త్రుల వారికి సమర్పించిన యభినందన పత్రములన్నిటియం దిది మిన్నగ నున్న దని సభ్యుల శిరఃకంపన కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. శ్రీ నిడుదవోలు వేంకటరావు ఆంధ్రగీర్వాణ హూణ భాషావైదుష్యము అధ్యక్షులయొక్కయు, సభ్యులయొక్కయు బ్రశంసకు బాత్రమైనది."[3]

సమకాలీకులు, సాహిత్యకోవిదు లయిన హరికథాపితామహ ఆదిభట్ల నారాయణదాసు, వఝుల చిన సీతారామశాస్త్రి, భోగరాజు నారాయణమూర్తి, పూడిపెద్ది వెంకటరమణయ్య, దేవగుప్తాపు వెంకటరమణకవి, పిలకా గణపతిశాస్త్రి, యామిజాల పద్మనాభస్వామి, శ్రీరంగం నారాయణ బాబు, చొప్పల్లి సూర్యనారాయణ భాగవతార్, జోస్యుల శ్రీరామమూర్తి (దొడ్డమ్మ), ద్వారం వెంకటస్వామి నాయుడు, వి. ఆర్. చిత్రా, కోడి రామ్మూర్తి నాయుడు గార్లతో వీరికి స్నేహ ముండెడిది.

3. ఆంధ్రపత్రిక 23-4-35

1936లో ఇంపీరియల్ బాంక్ విజయనగరం బ్రాంచినుండి వేంకటరావుగారు కాకినాడ బ్రాంచికి బదిలీ అయిరి. ఇది వారి జీవితములో మొదటి మలుపు. కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్ మహాసభలు జరిగినపుడు జయపురాధీశ్వరులు విక్రమదేవ మహారాజుగారు సభాధ్యక్షులుగా నున్న రోజున వేంకటరావుగారు సరస్వతీ ప్రార్థనతో పాటుగా, సూర్యభగవానుని నుద్దేశిస్తూ మయూరుని సూర్యశతక స్రగ్ధరావృత్తాలను పఠించినపుడు విక్రమదేవవర్మగారు మంత్రముగ్ధులై, పిఠాపురం మహారాజువారికి, వారు ఉభయులు కలుసుకొన్నప్పుడు వేంకటరావుగారిని గూర్చి చెప్పారు.

ఒక శుభముహూర్తాన పిఠాపురం రాజారావు వేంకటకుమార సూర్యారావు బహద్దర్ కాకినాడలోని తమ బంగళాకు వేంకటరావుగారిని ఆహ్వానించిరి. వేంకటరావుగారు బాంకునుండి 10 నిముషాలు అనుమతిపొంది శ్రీవారి విడిదికి వెళ్లి వారిని దర్శించిరి. అపర శ్రీకృష్ణరాయలని పేరొందిన శ్రీవారిని వేంకటరావుగారు ఆముక్తమాల్యదలోని 'ఖనట పయోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య, పిండీకృతాంగ భీతాండజములు' అనే పద్యం ఎత్తుకొని చదివి ఆశీర్వదించగా విద్వత్ప్రభువులు కాబట్టి "మీరు చదివిన పద్యమున చటులఝంపా అని యున్నదే దాని కర్థ మేమి' ' అని అడిగారు. "ఇంగ్లీషులోని 'జంప్' అనే మాటే దాని కర్థము మహారాజా" అని చెప్పగానే వారు సంతోషించారు. ఇంతలో పిఠాపురం ఆస్థాన పండితులు ప్రవేశించి "'డబ్బాటు' పదమునకు ప్రయోగము చూపించెదరా?" అని ప్రశ్నించగా తడవుకోకుండా శాస్త్రులవారి రచననుండియే పద్యమును చదివి ప్రయోగం చూపారు. వారి ఆస్థానపండితులు ఎవరోకాదు వేంకటరామకృష్ణకవులలో ఒకరైన ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.[4]

ఆనాటి సమయం ఎంత శుభప్రదమైనదో కాని వేంకటరావుగారి భవిష్యత్ జీవితానికి రాచబాట వైచినది. బాంకుగుమాస్తాగిరినుండి వేంకటరావుగారికి కళాశాలలో

4. రెండోవారు వేదుల రామకృష్ణ శాస్త్రి. వీరు మేనత్త మేనమామ బిడ్డలు. తిరుపతి వేంకటకవుల ప్రతిద్వంద్వులు.

పండిత పదవి లభించింది. కళాశాలనుండి మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర భాషాశాఖలో పరిశోధక ఉపన్యాసక[5] పదవికి కెక్కించినది సూర్యారాట్ప్రభువుల చేతిచలవే. విశ్వవిద్యాలయంలో వేంకటరావుగారు దినదినాభివృద్ధి చెంది తుదకు 'కళాప్రపూర్ణ' లయినారు.

కాకినాడ రాజావారి కళాశాలలో ఉన్నప్పుడు శ్రీయుతులు బోయి భీమన్న, కరటూరి సత్యనారాయణ, మహ్మద్ ఇస్మాయిల్ రాంషా, సరోజిని రేగాని, ఎల్. మాలకొండయ్య, సి.ఎస్.రావు (చలనచిత్రనటుడు), వక్కలంక లక్ష్మీపతిరావు శిష్యులయినారు.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, వారిసోదరులు సుబ్బయ్యశాస్త్రి, వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, చిలుకూరి పాపయ్య శాస్త్రి, కొత్తపల్లి సూర్యారావు, దాసరి లక్ష్మణకవి, ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులు కాకినాడలో వేంకటరావుగారి సాహిత్యబంధువులు.

తమిళ, కర్ణాటక, మళయాళ, ఆంధ్రప్రాంతాలకు నిన్నమొన్నటివరకు మద్రాసు నగరం ఉమ్మడి రాజధానే కాకుండా ఉమ్మడి సాంస్కృతిక కేంద్రంగా కూడా ఉండేది. తెలుగుదేశానికి విజ్ఞాన కాంతులు వెదజల్లిన ఆంధ్రపత్రిక, వావిళ్ల సంస్థలతో వేంకటరావుగారికి సన్నిహితత్వం ఏర్పడింది. ఆ సంస్థల అధినేతలయిన శివలెంక శంభూప్రసాద్, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గార్లతోనేకాక తమిళ కర్ణాట మళయాళ విద్వాంసులతో కూడ సత్సాంగత్యం ఏర్పడింది. వేంకటరావుగారి సాహిత్య పరిశోధన పరిధి విస్తరించింది.

వేంకటరావుగారు 9-1-1964న మద్రాసు విశ్వవిద్యాలయంనుండి తెలుగుశాఖాధిపతిగా రిటైరైనారు. 1944లో తెలుగుశాఖలో చేరిన వేంకటరావుగారు అనేక గ్రంథాలు వ్రాశారు. కొన్నిటికి సంపాదకత్వం వహించారు. కొన్ని వందల ప్రసంగాలు మద్రాసు ఆకాశవాణి కేంద్రంనుండి చేశారు. మద్రాసు ఓరియంటల్

5. మద్రాసు యూనివర్సిటీ తెలుగుశాఖలో జూనియర్ లెక్చరర్.

సీరీస్ పథకంకింద ఖడ్గలక్షణ శిరోమణి, కట్టావరదరాజు రామాయణం (4 సంపుటాలు), చెంగళ్వకాళకవి రాజగోపాలవిలాసం గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. విశ్వవిద్యాలయం తరపున ప్రకటించిన నన్నెచోడుని కుమారసంభవం ప్రచురణలో తోడ్పడ్డారు. ద్రావిడభాషాసామ్యాలు, సాటి సామెతలు, శాసన సంపుటం, తెలుగు కవుల చరిత్ర, దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయం ప్రకటించారు. ఆంధ్రగ్రంథమాల వారికి బసవపురాణం పీఠిక వ్రాసి ఇచ్చారు.

వావిళ్లసంస్థను ప్రోత్సహించి అనేక అపూర్వగ్రంథాలు ప్రకటింపజేశారు. చిన్నయసూరికి ముందు వెలసిన వ్యాకరణాలను వెలికితీసి ప్రకటింపజేశారు. చెన్నపట్టణపు దేశ భాషాగ్రంథకరణ సభ ప్రకటించిన శబ్దరత్నాకరానికి అనుబంధంగా 2వేల పదాలు చేర్చారు (1958). ఉదాహరణ వాఙ్మయచరిత్ర, భాషా పరిశోధన ప్రయోగవిశేషాలు, త్రిపురాంతకోదాహరణం, మించుపల్లెకావ్యం సొంతంగా ప్రకటించారు. 'భారతి' మాసపత్రికలో పుంఖానుపుంఖంగా వ్యాసాలు పడ్డాయి. వావిళ్లవారి త్రిలిఙ్గ పత్రికకు ఆంధ్రదేశపు సంస్కృతాంధ్ర పండితుల జీవిత చరిత్రలు వ్రాశారు. విశ్వవిద్యాలయంలో కేవలం పరిశోధనకే కాకుండా ఎం.ఎ., తెలుగు విద్యార్థులకు వారానికి ఒకసారి క్లాసులు తీసుకొని శాసనాలు, భాష, సాహిత్యం బోధించారు. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం తొలిసారిగా 'బులెటిన్' ప్రారంభించగా, తొలిసంపుటం తొలిసంచికలో గణపవరపు వేంకటకవి 'విద్యావతీ దండకం' పరిష్కరించి ప్రకటించారు. గణపవరపు వేంకటకవి కాలాన్ని 1656కి సరిదిద్దారు. ప్రాచ్యమహాసభలకు హాజరై వ్యాసాలు చదివారు. పూనాదక్కన్ కళాశాలలో రెండు మాసా లుండి భాషాపరిశోధన చేశారు.

మద్రాసునుండి హైదరాబాద్ చేరుకొన్న తరవాతకూడా వేంకటరావుగారు సాహిత్యవ్యవసాయం మానలేదు. యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ విశ్రాంత విశ్వవిద్యాలయ ఆచార్యుల వినియోగ పథకం కింద హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో నియమితులయ్యారు. పరిశోధన చేసే విద్యార్థులకు మార్గదర్శకులుగా ఉండేవారు. సంశోధిత మహాభారత ప్రాజెక్టుకు కొన్నాళ్లు ఎగ్జిక్యుటివ్

ఆఫీసరుగా పనిచేశారు. తిరుమల వేంకటేశ్వర స్వామిపై రెండు వేల పైచిలుకు పద్యాలు రచించారు. ఒక్కొక్క పద్యం ఒక్కొక్క తెలుగుకవికి అంకితం. అదేవిధంగా శివసహస్రం వ్రాసి కందపద్యాలలో ఆర్షవిజ్ఞానాన్ని నిక్షిప్తపరిచారు.

29-10-1978వ తేదీన రాష్ట్ర గవర్నర్ ఖండుభాయ్ దేశాయి సమక్షంలో జరిగిన ఆంధ్రవిశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సభలో వేంకటరావుగారిని 'కళాప్రపూర్ణ' బిరుదుతో విశ్వవిద్యాలయం వారు సమ్మానించారు.

వేంకటరావుగారు జీవించిన 80 సంవత్సరాలలో 60 సంవత్సరాలు సాహిత్యసేవకే అంకితమయ్యాయి.

'అన్వేషణజ్యోతి' రచనతో ఆరంభమయిన వేంకటరావుగారి సాహిత్య జీవితం తెలుగు సాహిత్యంలో అన్వేషణ జ్యోతిగా మిగిలిపోయింది. ఆయన భౌతికాయం 15-10-1982 నాడు పంచభూతాల్లో కలిసిపోయింది.

# పీఠిక

నిడుదవోలు వేంకటరావుగారి కాపురం పీఠికాపురమని గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు చమత్కరించారు. వావిళ్ళవారి సగం పుస్తకాలకు వేంకటరావుగారు ప్రత్యక్షంగానో, ఇతరుల పేర్లతోనో పీఠికలు రచించారు. ఒక్కొక్కసారి వారి పీఠికలు మూల గ్రంథాన్ని మింగేసేలా వుంటాయి. సమగ్రంగా ఎక్కువ పుస్తకాలకు పీఠికలు వ్రాసిన వారిలో వేంకటరావుగారే మొదటివారు.

ఆయనకు రచయిత మీదకంటే రచన మీద అభిమానం ఎక్కువ. అందువల్లనే ఎవరడిగినా పీఠిక వ్రాసి ఇచ్చేవారు. ఆ కారణం చేతనే ఆయన పీఠికలు సమగ్ర విషయ సుగంధ సుబంధుర పేటికలు. మలి ముద్రణ గ్రంథాలకైనా 'వడ్డించిన విస్తళ్ళ' లాంటి పీఠికలు వ్రాసేవారు. అడిగిందే తడవుగా సానబెట్టిన మాణిక్యాల్లాంటి పీఠికలు వ్రాసిఇచ్చేవారు. సాహిత్యాన్ని ఆపోశన పట్టిన వారికి పీఠికా రచన నల్లేరుమీద బండి నడకే. ఇక వారి పీఠికలలో మచ్చుకు కొన్నిటిని పరిశీలిద్దాం.

## పరవస్తు చిన్నయసూరి జీవితము : (రచన: వేంకటరావుగారు)

అంతకు మునుపు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 10-20 సంపుటాలలోను, నారాయణవనము వకుళాభరణము గారి 'పరవస్తు చిన్నయసూరి జీవితము' అనే గ్రంథంలోను, 'ఆంధ్ర రచయితలు' గ్రంథంలోను సూరిని గురించిన వివరాలు కొంతవరకు ఉన్నాయి. కాని, వీటిలో చిన్నయసూరి ఆంధ్రవాఙ్మయంలో, నవయుగ నిర్మాతలలో ఒకడై నియంతగా ఉండేవాడనే విషయం ప్రస్ఫుటం కాకపోయినందువల్ల ఈ పీఠిక వ్రాయవలసి వచ్చిందని వారు చెప్పుకున్నారు. ఈ పీఠికలోని విశేషాలు కొక్కొండ వెంకట రత్నము పంతులవారు నన్నయ తిక్కనలతో సమానంగా తమ 'విగ్రహ తంత్రము'లో స్తుతించడం, శివశంకర పాండ్యగారు 'తెలుగు రచనము దాని యుత్పత్తి అభివృద్ధి వికాసములు' అనే ఆంగ్లవ్యాసంలో సూరే తొలుత ప్రశస్త

వచన రచనకు దారి చూపాడనడం.

కులమత భేదాలు లేకుండా పీఠికా రచన చేసిన వారు వేంకటరావుగారు. 'త్ర్యేకోదాహరణము' అనే క్రైస్తవ మత గ్రంథానికి ఆయన వ్రాసిన పీఠికలోని విశేషాలివి. ఉదాహరణ లక్షణాలు తెలపడం, పాల్కురికి సోమనాథుని బసవోదాహరణంతో ఉదాహరణవాఙ్మయం ప్రారంభమయిందని చెప్పడం.

ఇందులోని ఇంకొక విశిష్టగుణం ఏమిటంటే మూడు ఉదాహరణములు ఉండడం. 'కుమారోదాహరణము'లో సార్వవిభక్తికానికి రచయిత కళికోత్కళికలు వ్రాయడం. ఇలా ఇంతకు మునుపెవ్వరూ వ్రాయలేదు. ఇది ఉదాహరణ వాఙ్మయానికే ఒక నూత్నోదాహరణం.

## చారుచర్య : అప్పమంత్రి - తెలుగు

ఇది వైద్యశాస్త్ర గ్రంథం, రోగ లక్షణాలు, నివారణ మార్గాలు కాక రోగాలు రాకుండా మానవుడు ఏవిధంగా తన ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ వుండవచ్చో తెలుపుతుంది. వేంకటరావుగారు దీని పీఠికలో అంతకు మునుపు క్రీ.శ. 1450కి ముందు వెలసిన 23 శాస్త్రీయ గ్రంథాల జాబితా ఇచ్చారు. ఇది పరిశోధన జిజ్ఞాసువులకు ఉపకారి అయిన విషయం.

## ఉపగుప్త : మున్నంగి లక్ష్మీ నరసింహ శర్మ

దీనికి ఏడవ దశకం (1967)లోనే ఆంగ్లానువాదం జరగడం విశేషం. అనువాద కర్త పి. కృష్ణమూర్తిగారు.

## శివ మహిమ్న స్తోత్రము

ఇది సంస్కృత గ్రంథము. దీనికి కూడా ఆంగ్లానువాదం పి. కృష్ణమూర్తి గారు చేశారు. ఈ గ్రంథంలో శిఖరిణి, మాలిని, అనుష్టుప్ ఛందస్సుల వాడకం విశేషం.

## విప్రనారాయణ చరిత్రము

ఇది చదలవాడ మల్లన కవి విరచితం. కవి శైవాచార్యుడైనా వైష్ణవ మత సాంప్రదాయకమైన గ్రంథాన్ని రచించి, ఆవైష్ణవ రచనను తలపింపజేశాడు. వైష్ణవ పారిభాషిక పదాలు రచనలో పొందుపరచడం విశేషం.

## సూర్య శతకము

దాసు శ్రీరాములుగారి అనువాద గ్రంథానికి వ్రాసిన పీఠికలో 'సూర్యశతకము' సంపూర్ణానువాదాలు ఆరున్నా యని ప్రత్యేకంగా చెప్పారు. ఇది మూడవది. పైగా ఇది పూర్తిగా అనువాదం కాక ఆంధ్రీకృతం - తెనుగు గ్రంథమే అయింది. తెనుగుదనం, భావవివృతి, పదప్రయోగనైపుణ్యం, మూలశబ్దానుసరణం, ప్రసన్న రచన, వర్ణనలు అన్నిటికీ హృదయంగమ మైన ఉదాహరణ లిచ్చారు.

దాసు శ్రీరాములుగారు వాడిన విశేషమైన యతులను ఉదాహరణలుగా ఇచ్చారు.

జ్ఞ-క-యతి

'క' ను రుచి వంటి భాస్కరుడు జ్ఞానరు యాదుల మీకు నిచ్చుతన్ (24వ పద్యం)

మ-వ-యతి

దీవుల వెలిగించు దీపము మిమున్ రవి దీప్తి సుఖింప చేయుతన్ (23వ పద్యం)

'మ' హిమ దహించు నర్యముని వార్వపు బంతి శుభంబు మీకిడున్ (47వ పద్యం)

'ద్వారా' శబ్దానికి అచ్చుతో యతి.

ద్వారమునం దడంగ నరుణాఖ్యుఁ డదర్చిన - 48వ పద్యం

అమరిన పెద్ద చుక్కలకు ద్వార నగంబులు - 70వ పద్యం

ఆయన వాడిన విశేషపదాలు కొన్ని - తెలుగులో 'తోరము' అనే పదం వాడుకలో ఉండగా కవిగారు ప్రాకృత పదమైన 'ధోరము'నే వాడారు.

కంకణధోరము గట్టి 47వ పద్యం

అన్యదేశ్యమైన 'జలిది' పదాన్ని వాడారు 'త్వరగా' అనే అర్థంలో

ఛలో ఛలో జలిది 61వ పద్యం

సుధాభుక్కులు - సుధా భుక్తులు అని ప్రాసలో వాడారు. ఉపసర్గ సంవిధానాన్ని ఒక్క శ్రీనాథునిలో మాత్రమే ఉన్నదాన్ని కవిగారు వాడారు,

ప్ర ప్రీతుడు అని.

సంస్కృత శతకంలోని వంద పద్యాలూ స్రగ్ధరావృత్తాలు. తెనుగు శతకంలో శ్లోకాలు కూడా ఉన్నాయి.

'ఇంకను చెప్పవలసిన వనేకము లున్నను గ్రంథ విస్తరణ భీతిని విరమించితిని' అని వేంకటరావుగారు చెప్పడం ఒక్కొక్కసారి నిరాశ కలిగిస్తుంది. ఎందుకంటే మరెన్ని విశేషాలు చెప్పగలిగి వుండేవారో అనిపిస్తుంది.

## అభినవ గద్య ప్రబంధము

ఇదీ దాసు శ్రీరాములుగారి రచనే. గద్య ప్రబంధం అంటే నవల అని అర్థమన్నారు. చిన్నయసూరి ఒరవడిలో వచ్చిన గద్యరచన ఇది. గద్య ప్రబంధం అనడంవల్ల ప్రబంధ ఫక్కినే రచన సాగింది. అవతారికా రచన, నన్నయాది కవులను చిన్నయ సూరి వరకు ఇరవై మంది కవుల పేర్లను ఒక ఉత్పల మాలలో స్తుతించడం (పూర్వకవిస్తుతి), తెలుగు కవుల కావ్యాల ప్రశంస, గ్రంథనామ సార్థకత ఇత్యాది విశేషాలతోపాటు ఏడు రోజుల్లో 4 పుటల గ్రంథం రాయడాన్ని పేర్కొన్నారు.

ఆటవెలదిలో ప్రాస పాటించారు. అవతారికలో -

కల్లకతలు

నొల్లమనుచు
జెల్లియున్నవారు
పెల్లవారి పీట్ల

కొన్ని పదాలకు కొత్త పర్యాయపదాలు కల్పించారు. పొత్తకాండ్రు - గంథకర్తలు, గద్దెపు సుద్ది - వచన సూక్తి, ఱెక్కదారి - పక్షి, అభ్రపుష్పము - గగన కుసుమము.

కావ్యాంతంలోని కొన్ని పదాలకు విశేషార్థాలు వుండడం ప్రత్యేకించి చెప్పారు. అర్థవివరణం ప్రత్యేకానుబంధంగా ఇచ్చారు.

## అక్కమహాదేవి వచనములు

ఇది ద్విపద కావ్యం, అక్కమహాదేవి భక్తి ప్రపత్తులు, వీరయోగిని అనడం, దిగంబర కాదనడం ఇత్యాదులకు ప్రమాణాలు చూపి అనువాదం బాగుందన్నారు.

## సిక్రీశిథిలాలు

జయరాం రచించిన ఈ చిన్న పొత్తం చరిత్రాతత్మకమై పవిత్ర దేశాభిమానాన్ని బోధిస్తుండడం బాగుందన్నారు. సిక్రీ శిథిలాలను చూచినపుడు కలిగిన భావ లహరే ఈ కావ్య రచనకు ప్రేరణ. ఇది నూత్నము, మనోహరము కూడ.

## శకుని రహస్యము

ఇందులో శకుని పాత్రను మహోన్నతంగా చిత్రించారు. ధర్మరాజుకు తన వృత్తాంతాన్ని, మనోవేదనను శకుని ఒక లేఖ ద్వారా తెలపడం గ్రంథేతివృత్తం.

## అడిదము సూరకవి జీవితము

ఇతడు వాఙ్మయశాఖలో కవి జనరంజనము, చంద్రాలోకము, కవి సంశయ విచ్ఛేదము, రామలింగేశ శతకము, ఆంధ్రనామశేషము, శ్రీ రామ దండకము అనే

ప్రబంధ, అలంకార శాస్త్ర, వ్యాకరణచ్ఛందో లక్షణ, శతక నిఘంటుదండకాలను రచించా డనడం విశేషం.

అడిదము సూరకవి వంశవృక్షంలోని వారందరి పేర్లను వ్రాసి వారి విశేషాలు కూడా చెప్పడం మరో విశేషం.

## జగజ్జ్యోతి

ఇది వి. అంకయ్య రచించిన థామస్ అల్వాఎడిసన్ జీవితచరిత్ర. సకల వ్యవస్థలకూ ఆధారధేయమైన విద్యుజ్జ్యోతిని వెలిగించినవాడు ఎడిసన్ గనుక పుస్తకానికి 'జగజ్జ్యోతి' పేరు సముచితమై సార్థకమై ఒప్పుతున్నది. ఇందులో విశేషాలు- భాష సరళంగా, సులభగ్రాహ్యంగా వుండడం, సాంకేతిక పదజాలాన్ని వాడేటప్పుడు అపురూప పదాలను కల్పించక సహజ పదాలను వాడడమేగాక ఇంగ్లీషులో మూలపదాలను కుండలీకరణం చేసి చూపడం, విషయాన్ని ఆహ్లాదకరంగా చెప్పడం.

## పుష్ప బాణ విలాసము

ఇది ఆంధ్రీకరణం. దీనికర్త ఆర్యభట్టు. దీనికంటె ముందు 8 ఆంధ్రానువాదా లున్నా యని, ఇది తొమ్మిదవదని తెలిపారు. ఇందులో విశేషం తక్కినవాటిలో పద్యాలకు తాత్పర్యా లుండగా సంభాషణల రూపంలో రసభావాలను మనోహరంగా ఒక చిన్న నాటికగా ప్రదర్శించారు. పద్యాలన్నీ తెలుగుదనం ఉట్టిపడుతూ వున్నాయి. శృంగార విషయకమైనప్పుడు సాధారణంగా చంపకోత్పలమాలలు వాడతారు. ఇందులో మత్తేభశార్దూల వృత్తాలు వాడినా తెలుగు తీయదనాన్ని జాతీయాన్ని చవి చూపడం వల్ల కాబోలు మెత్తనై చిత్తానికి హత్తుకున్నాయట!

## The Story of Sravana Pitru Bhakti Nataka

ఇందులో అష్టావధాని శ్రీ ఎ. సుబ్బారాయగుప్తగారి ఇతర రచనలను గురించి ప్రశంస వుంది.

## తమిళ వేదము (తిరుక్కుఱళ్)

ఈ విధమైన రచన తెలుగులో ఇదే మొదటిది. సర్వజన సుబోధకంగా ఉంది. దీన్ని మొదట తెలుగు సాహిత్య ప్రపంచానికి పరిచయం చేసినవారు కనుపర్తి వేంకటరామ విద్యానందనాథ. శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారి అనువాదానికి ముందే తొమ్మిది అనువాదా లున్నాయి తిరుక్కుఱళ్కు. దీంట్లో అనుప్రాస ఉంది.

## తిరువాయ్ మొఝి

రచయిత చెన్నమరాజు. కొండనామాత్య దేశపాండ్య భాషా పాండిత్య కవిత్వం ఇతర రచనలు చేశారు. దీనికి ముందే 3 అనువాదా లున్నాయి నమ్మాళ్వార్ తిరువాయ్ మొఝి దివ్య ప్రబంధానికి.

ఈ అనువాదం ప్రత్యేకత స్వతంత్ర మని తోచడం ఎందుకంటే తక్కినవాటిని వీరు చూడక పోవడం, వారికి అవి తోడ్పడక పోవడం. రచయిత స్వయంగా ద్రవిడ భాషలలో కృషిచేసి రచించారు.

రచనలో కొన్ని విశేషా లున్నాయి. భక్తిరస ప్రధానమైన ఈ గ్రంథంలో వృత్తరచనలో విశేషాలు - మునుపటి అనువాదాల్లో చంపకోత్పలాలు ఎక్కువై అక్కడక్కడ మత్తేభ శార్దూలా లుంటే ఇందులో సీసపద్యా లున్నాయి. 2. వృత్తాలలో నాలుగు పాదాల నియమాన్ని పాటించక, పంచపాదులు షట్పాదులు వ్రాశారు. 3. రచయిత అనువాదంలో పాటించిన కొత్త పద్ధతి గీతాల్లో పంచపాదులు రాయడం, సీస పద్యాల్లో 11 పదాలు, తరువాత ఉత్పలమాల, పంచపాది, శార్దూల మత్తేభాలు షట్పాదులు. ఒక్కోచోట ఆటవెలదిలో ఎనిమిది పాదాలు. ఎత్తు గీతి, చంపకమాలలో పంచ, షట్పాదులు. రచన ధారాశుద్ధి కలది గనుక ఈ విలక్షణత్వం మన మనస్సును పట్టదు. మరో విశేషం కందంలో ఆరు పాదాలుండడం. ఇలా ఉండడాన్ని 'కందార్ధాలు' అంటారు. దీన్నే పాటగా పాడుకోవచ్చనే సంప్రదాయాన్ని తెలిసినవారు కావడం చేతనే కందంలో ఆరుపాదాలు వాడారు.

ఉత్పలమాలలో ఒకచోట (పుట: 60)

అచ్యుత
విచ్యుతి
రుచ్యము
నచ్యుతు
మచ్చిక

అచ్చుగ అని చ్య - చ్చ లకు ప్రాస వాడారు. ఇది కేవలం అక్షర సామ్యం వల్ల వచ్చింది.

తురాయి అనే పదాన్ని తుళాయిగా వాడారు. ఇంకా రంఝ, రంఝోలి అనే పదాలున్నాయి.

ఇవి నిఘంటువులో లేవు. 'రింఝులిన్' అంటే మాలమకుటమైన పూగుత్తి అని అర్థం. తిరంఝులిన్ > తిరు+రంఝులి అని రెండుపదాల సమాసం. ఛందో వ్యగ్రత వల్ల తిరంఝులిన్ అని అయింది.

అంహసుడు, పాపముగలవాడు, ప్రాపుడు, ప్రాపైనవాడు అనే నూతన పదాలున్నాయి. సాయించిన, అడియడు అనే ద్రావిడ భాషా పదా లున్నాయి.

ఓగిరంజాలు అనే ప్రయోగం ఉంది. ఓగిరము+అంజాలు > ఓగిరమంజాలు కావాలి. కాని, ఛంధోవ్యగ్రతచేత ఓగిరంజాలు అయింది. ఇది తప్ప వేరే వ్యాకరణ విశేషాలు లేవు.

## దాశరథి శతకం

33 పుటఃల పుస్తకానికి 47 పుటఃలున్న పీఠిక ఇది. అసలును మించినదైంది. ఇందులో శతక వాఙ్మయానికి సమగ్రమూ, సంపూర్ణమైన సమీక్ష వుంది.

తెలుగులో 12 వ శతాబ్ది నుంచి వర్ధిల్లుతున్న శతకాలు స్వతంత్రశాఖగా ఉంటున్నాయి. కన్నడ భాషలో శతకం ముందే పుట్టినా ఆ భాషా సాహిత్యంలో దీనికి

ప్రాధాన్యమే లేదు. ప్రక్రియా వైవిధ్యమూ లేదు. తెలుగులో ముద్రితాముద్రితాలు మొత్తం మూడు వేలకు పైగా ఉన్నాయి. సంస్కృతంలో కూడ ఇన్ని లేవు. శతకం ముఖ్యలక్షణాలు సంఖ్య, మకుట, వృత్త, రస నియమాలను కలిగి ఉండడం.

ప్రారంభంలో ఇవి చంపకోత్పలాలలోను, ఆ తరువాత మత్తేభ శార్దూలాలలోను రచితాలయ్యాయి. ఇలా కాకుండా కందాలు, సీసాలు, గీతాలు, ఆటవెలదులు కూడా శతకాలలో వాడుక పడ్డాయి. కందాల్లో రచించిన శతకాలు తెలుగువారికి సుపరిచితాలు.

సీసాల్ని సాధారణంగా ఏదైనా విషయాన్నికాని, కథా సందర్భాలనుకాని వివరించే పట్లలో ప్రయోగించేవారు. ప్రబంధ వర్ణనలలో ఇవి ఎక్కువ. సీసాలతో శతకాన్ని మొట్టమొదట రచించినవాడు పాల్కురికి సోమనాథుడే. ఇతని 'చతుర్వేదసారము' లేక 'బసవలింగ శతకము' 'బసవలింగ' మకుటంతో నాలుగు వందల సంఖ్యగల పద్యాలతో వుంది. ఇందులోనూ రెండురకా లున్నాయి. సీస పద్యానికి ఆటవెలది అనుసంధానం, తేటగీతి అనుసంధానం. ఈ చతుర్వేద సారము కాకుండా మరి రెండుసీస పద్య శతకాలను సోమనాథుడు రచించా డని 'ప్రబంధ రత్నావళి' నుంచి తెలుస్తుంది. అవి సోమశేఖర శతకము, శరభ లింగ శతకము.

నేడు శతకాలను సారస్వత చారిత్రక దృష్టితోకాక భాషా సాహిత్యదృష్టితో పరిశీలించాలి. వీటిని గురించి పరిశోధన చేసిన, అనేక విశేషాలు బయల్పడుతూనే ఉంటాయి. శతకాలు తెలుగు భాషలో ప్రారంభంలో భక్తి రస ప్రధానాలుగా వెలశాయి. క్రమంగా శతకాలు శృంగార, నీతి ప్రధానా లయ్యాయి. విషయ ప్రాధాన్యాన్నిబట్టి శివ, విష్ణు భక్తి ప్రతి పాదకాలు, శృంగార, నీతి, వేదాంత, హాస్యరస, చారిత్రక, జీవిత చారిత్రక, స్వీయచరిత, వ్యాజ నిందాస్తుతి, కథా, సమస్యా, నిఘంటు, మానవస్తుతి, అనువాద, అచ్చతెలుగు, చాటు శతకా లని వీటిని ఉంచవచ్చు.

ఇవిగాక ద్వ్యర్థి కావ్యాలవలె ద్వ్యర్థి శతకాలు, సమస్యాపూరణ శతకాలు కూడా ఉన్నాయి.

అధునాతన కాలంలో 'పిల్లీ శతకం' కూడా వచ్చింది. పిల్లిని గురించిన వర్ణన లున్నాయేగాని ప్రత్యేకరచనలు లేవు. ఆలోటు నీ శతకం పూరించింది.

రామదాసు రచించిన 'దాశరథి శతకము' సర్వేసర్వత్రా సమధిక ప్రచారాన్ని పొందిన శతకం. ఆధునిక కాలంలో ఇదే పేరుతో దాశరథి కృష్ణమాచార్యులు వ్రాసినటువంటి దొకటి ఉంది. ఇది కవినామ ముద్ర గల శతకం. దాశరథి అన్నకవి పేరు ఇమిడి ఉంది. ఇది ఒక విశేషం.

శతక మకుటాన్ని బట్టి పూర్వశతకం చంపకోత్పలమాలిక లున్న రచన. రెండో దాంట్లోనూ చంపకోత్పలమాలలే కాని శతకవిషయం మాత్రం భిన్నం. ఒకటి భక్తిరసభావానురక్తం. రెండవది వ్యంగ్య భావానురక్తం. అభినవ దాశరథీ శతకం సమకాలీన రాజకీయ, మత, సాంఘిక, వైజ్ఞానిక వ్యవస్థలను, వాటి గుణదోషాలను వర్ణించేది. ఈ శతకమంతటా ఏకయతి నియతి ఉంది. ఈ శతకంలో రాజకీయాది వ్యవస్థలలాగే కవితా కళా గౌరవం ప్రకృష్ట స్థానాన్ని ఆక్రమించింది.

శతక ప్రారంభం భారత జాతిపిత గాంధీ స్మరణతో ఉండడం విశేషం. లోక వ్యవహారంలో సరళమై, అర్థవంతాలైన అన్యదేశ్యభాషా పదాలను కవి ప్రయోగించారు సముచిత రీతిని. భాగోతులు, జాకెటు, రాకెట్టు, స్పుట్నిక్కు ఇందుకు ఉదాహరణలు. 'అందితే కాళ్లు అందక పోతే సిగ' వంటి సామెతలనూ వాడాడు. స్వచ్ఛంద సరళము, ఉదాత్త రసభావనాపూరిత మైన దాశరథీ హృదయ మీ కృతి దర్పణంలో ప్రతిబింబిస్తుంది.

## శ్రీరామాయణము

కట్టా వరదరాజుగారి రచనలో అరణ్య కిష్కింధకాండ లున్న సంపుటి ఇది. రంగనాథ రామాయణంలోని సంవాదాలకు, ఇందులోని సంవాదాలకూ, పోలికలను, మార్పులను చూపారు వేంకటరావుగారు పీఠికలో. భాస్కర రామాయణంతోనూ

పోలిక చూపారు. వరదరాజ రామాయణంలో మూలానుసరణకి చాలా ఉదాహరణ లిచ్చారు. కొన్నిచోట్ల మూలంలోని పదాలనే ఉపయోగిస్తూ భావాన్ని విశదపరచారు. వరదరాజుగారు వర్ణనల సందర్భంలో సంస్కృత సమాసాలతో, అనుప్రాసలతో, ప్రాసనియమంతో రచించారు. ఇవే తక్కిన రామాయణాలకంటె ఈ గ్రంథానికి విశిష్టతను చేకూర్చడంలో సహాయకారు లయ్యాయి.

## వ్యాకరణ విశేషాలు

'చేయుదును' అనడానికి 'చేతు' ప్రయోగం. సరస్సు - సరంబు - మునియున్న యీ సరంబున... మణి శబ్దాన్ని ఈకారాంతంగా మణీయంబైన అని ప్రయోగించడం.

అందుక, చుట్టక ఇత్యాది ప్రయోగాలు. వడకి అటునిటు > వడకటునిటు అని క్త్వార్థక సంధి.

బొక్కసపుటిండ్లు అనడానికి బొక్కసమిండ్లు (పుట: 151). కర్మము అనడానికి కర్మువు అన్న ప్రయోగం: పుట్టువును కాలమును కర్మవును (పుట: 233).

## ఛందో విశేషాలు

'నట్టడవిని జిక్కినాడు నాచేత' హల్లుకు యతి. 'నార చీరలు గట్టినారు' అన్న మరో ప్రయోగం. 'రామచంద్ర' వివేకురాలు మాతార (పుట: 344). ఇక్కడా హల్లుకే యతి. చిన్నయసూరి సూత్రా న్ననుసరించినట్లైతే అచ్చుకే యతి.

'ఒక్కోటి నదులు నవోఢవో యనగ' - నవోఢ శబ్దంలో స్వరయతి (పుట: 396)

'ఉండక దిగువం గూర్చుండి వివేక' దేశ్య ధాతువుల ప్రత్యయాలకు స్వరయతి. వీటికి వ్యంజనయతి నిర్దిష్టం. (పుట: 421).

'క్రూరకర్ముఁడు కృతజ్ఞుడు సత్వపరుడు' (పుట: 439).

ఇక్కడ 'క్రూ-జ్ఞ ల యతి విశేష యతి - అన్నాడు అప్పకవి. కాని, ఇటువంటి యతులు అప్పకవికి ముందే వున్నాయి.

కర్మ యధర్మ మజ్ఞాన మాగడము (పండితారాధ్య చరిత్ర) జ్ఞానికి నుపదేశనిధి ప్రకాశము సేయన్ (తిక్కన భారతము) జ్ఞానమునం గడవ మిగుల గల్మష మొందున్ (ప్రౌఢకవి మల్లన) ఘ్యము.... మెల భవదాజ్ఞాశక్తి (యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకము)

## శబ్ద విశేషాలు

కమల కరము - సముద్రము
'ఇక్కమలకరం బెంత దాటుటకు'

కమలధి అనే పదాన్ని కూడా సముద్రమనే అర్థంలోనే వాడాడు. ఇక్కమలధి దాట నెవ్వ డున్నాడు. 'ఇనుడు' శబ్దాన్ని రాజు అనే అర్థంలో వాడారు. ఒడలు రూపాంతరమైన ఒళ్లు పదప్రయోగం (పుట: 146), గర్వించుట పద రూపాంతరమైన 'గరువించుట' అని వాడారు. (పుట: 195) కర్మచండాలుఁడు పుట్టుకచేగాక పనుల చేత చెండాలుడైనవాడు (పుట: 206). చాడె అనే పదాన్ని జడ లేక కొప్పు అనే అర్థంలో వాడారు. వైఢూర్యము-చూడ అని ప్రాసలో వాడారు. కుప్పసము పద రూపాంతరమైన 'కుపసము' పదాన్ని వాడారు. (పుట: 190).

ఎదిరించు అనే అర్థంలో నిగ్రహించు అనే ప్రయోగం (పుట: 313) ఇటువంటిది శ్రీనాథుని నైషధములోనూ ఉన్నది. వేయి కన్నుల వానితో నిగ్రహించి దీవన రూపాంతరమైన దీవెన పదప్రయోగం. వీఁడెయంగదుఁడు దీవెనలిమ్ము (పుట: 368) పరిగణించు అనే అర్థంలో 'విగణించు' పదం ఉపసర్గ విశేషం (పుట: 378).

పల్లకీమీద పరిచేము తక గుడ్డలు అనే అర్థంలో దిడ్లు పద ప్రయోగం (పుట: 386). వర్షం పదానికి రూపాంతరమైన వరుషము. ఆ వరుషరుతు సమాగమంబునకు (పుట: 386) అగ్ని అనే అర్థంలో ధనంజయుడు - బూది నిండిన ధనంజయుడు

(పుట: 390), సూర్యుడు అనే అర్థంలో ఘర్మకరుఁడు దానాకాశమంది (పుట: 391). అల్లకల్లోలము అనడానికి హల్లోహలము అని ప్రయోగించారు. - హల్లోహలంబుగా నట్టహాసంబు (పుట: 316) అజ్ఞానము కలిగి అనే అర్థంలో అవివేకపడు అని ప్రయోగించారు (పుట: 327). గడచుట అనే అర్థంలో క్రమయించుట (పుట: 327). హనుమ శబ్దానికి హనుమంతుడు అన్న రూపాంతరం వాడారు. నుడివినయట్టి హనుమంతు చేత (పుట: 478).

## జాతీయాలు

ఆహిరిఁబాడిన యనువుగా నేడ్చి (పుట: 358).

చేతగాదని వాని చెవి మెలిపెట్టి ప్రోతుమే. (పుట: 523), సామజోత్తమము దీర్ఘఁగనైన పనికి (పుట: 524), దోమలు పూని పొందునె కార్యసిద్ధి.

దీనికి ఉదాహరణగా అడిదము సూరకవి చాటువు నుంచి - "సామజము చెఱకు మేసిన దోమలు పదివేలు చేరి తోలంగలవా?" అని చూపించారు.

తద్దినములు పెట్టుట (పుట: 37) దైతేయు లిద్దరు తమ పితరులకు తద్దినములు పెట్టుతలంపు.

విడెము లందుక రాక్షసులు వెడలుట. వీర తాంబూలాలు పుచ్చుకొని యుద్ధానికి వెళ్ళడం (పుట: 72) గడి తాణము-తాణెము అంటి సలాము చేయడం. గుజ్జరి కేడము మొదలైన విజయనగరరాజ్యపారిభాషిక పదాలు కూడా వాడారు.

## కవిజనాశ్రయము

దీని పీఠికలో వేంకటరావుగారు అప్పకవిమీద తమ కోపం ప్రకటించారు. అప్పకవి ఆంధ్ర శబ్దచింతామణి నన్నయ దని, కవి జనాశ్రయము భీమకవి దని తమ వాదాన్ని నిలబెట్టుకోవడంకోసం చాలా చమత్కారంగా పనులు చేశాడనీ అన్నారు. అంతకుముం దెక్కడా ఎన్నడూ కనబడని పాఠాల నుదాహరించి నిరంకుశుడై తెలుగు సాహిత్య ప్రపంచంలో పెక్కు సమస్యలు కల్పించి కృతకలాక్షణిక

పద్ధతి నొకదాన్ని నిర్మించా డన్నారు. భావికవులు, లక్షణ కర్తలు తమ గ్రంథమే ప్రామాణికమైనదిగా పరిగణించేలా బహునిపుణంగా కట్టుదిట్టం చేశా డన్నారు. అందువల్ల మొదట తెలుగుభాషలో వున్న ఛందో లక్షణ గ్రంథాల వివరణ తెలుసుకోవడం అత్యంతావశ్యకం. వీటిని ఈ క్రింది విధంగా తెలియజెప్పారు.

కవిజనాశ్రయం (క్రీ.శ.1100), గోకర్ణచ్ఛందస్సు (క్రీ.శ.1130), కవివాగ్బంధనము (క్రీ.శ.1289), అధర్వణచ్ఛందస్సు (క్రీ.శ.1300), శ్రీధరచ్ఛందస్సు (క్రీ.శ.1350), కతిరాక్షసచ్ఛందస్సు (క్రీ.శ.1380), కావ్యాలంకార చూడామణి (క్రీ.శ.14వ శ.), అనంతచ్ఛందస్సు, ఛందోదర్పణము, కవి గజాంకుశము (క్రీ.శ.1440), కవి సర్పగారుడము (క్రీ.శ.1470), ప్రయోగసారము, కవి చింతామణి (క్రీ.శ.1500), ఛందోదర్పణము, లక్షణసార సంగ్రహము (క్రీ.శ.1550), సులక్షణ సారము (క్రీ.శ.1560), బాలబోధచ్ఛందస్సు, కవిసంజీవని (క్రీ.శ.1550), లక్షణ దీపిక (క్రీ.శ.1600), లక్షణ విలాసము (క్రీ.శ.1600), వాదాంగద చూడామణి, కస్తూరి రంగకవి తన గ్రంథంలో ఉత్తమగంచ్ఛందము, అధర్వణచ్ఛందము, హనుమచ్ఛందము, జయదేవచ్ఛందము, శ్రీధర చ్ఛందము, గోకర్ణచ్ఛందము, నీలకంఠచ్ఛందము, భీమనచ్ఛందము అనేవాటిని పేర్కొన్నాడు.

ప్రయోగ రత్నాకరము (76), లక్షణ చూడామణి లేక ఆనందరంగ రాట్ఛందస్సు (క్రీ.శ.1740-50), సర్వలక్షణ సార సంగ్రహము (క్రీ.శ.1740), కవి సంశయ విచ్ఛేదము (క్రీ.శ.1700), శ్రీకృష్ణ భూపాలీయము, లక్షణ విలాసము, వీర భూపాలీయము (క్రీ.శ.1819), సరసాంధ్ర వృత్తరత్నాకరము, నృసింహ మాల్యాది చ్ఛందస్సు కవితా లక్షణసారచ్ఛందస్సు, మణి, గరళ పురీచ్ఛందస్సు, సకల లక్షణ సార సంగ్రహము, సుకవిజన మనోరంజనం.

ఇవన్నీ సమగ్రాసమగ్రాలుగా తాళపత్ర ప్రతులలో ఉన్నాయి. వీటికి ప్రతులు వ్రాయించి సరిచూస్తే మూలగ్రంథ పరిష్కరణకూ, విపుల వ్యాఖ్యానంతో ప్రకటించడానికీ అవకాశమేర్పడుతుంది.

కవిజనాశ్రయము మన కుపలబ్ధాలైన ఛందో లక్షణ గ్రంథాల్లో ప్రాథమికం. అప్పకవి కవిజనాశ్రయకర్తగా భీమనను పేర్కొన్నారు. నన్నెచోడుడు కవి

జనాశ్రయములోని ఒక కందపద్యాన్ని అనుసరించి వుండడంవల్ల దీని రచనా కాలము క్రీ.శ. 1100 అని తేల్చారు.

క్రీ.శ. 900 ప్రాంతంనాటి కన్నడ భాషా లక్షణ గ్రంథకర్త నాగవర్మ ఛందోంబుధికి, కవిజనాశ్రయముకు ఈ క్రింది పోలికలు చెప్పారు.

| కవిజనాశ్రయము | ఛందోంబుధి |
|---|---|
| ప్రథమ-సంజ్ఞాధికారము | ప్రథమ-సంజ్ఞాధికారము |
| ద్వితీయ-సమవృత్తాధికారము<br>వియతిచ్ఛందోధికారము<br>యతిచ్ఛందోధికారము, ఉద్ధర<br>మాలావృత్తములు, దండకము<br>అర్థసమవృత్తములు | ద్వితీయ-సమవృత్తము |
| తృతీయ-జాత్యధికారము<br>కందాది మాత్ర వృత్తములు<br>తెనుగు విషయజాతి వృత్తి<br>ప్రకరణము | తృతీయ-మాలావృత్తము<br>(ఉద్ధర మాలా వృత్తములు)<br>అర్థసమవృత్తము; అనుష్టుప్<br>వృత్తము, విషయాది వృత్తము<br>వైతాళీయము, రఝుటా<br>లక్షణము, దండకము |
| చతుర్థ : షట్ప్రత్యయాధికారము | చతుర్థ : జాతి ప్రకరణము<br>కందాదిమాత్ర వృత్తములు |
| పంచమ : దోషాధికారము<br>కనుక కవిజనాశ్రయము<br>రచించా డన్నారు. | పంచమ: కర్ణాట విషమ<br>జాతివృత్త ప్రకరణము |
| | షష్ఠ : షట్ప్రత్యయ వివరణము<br>ఛందోంబుధి ననుసరించి |

దీనికి ఉదాహరణగా

జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియ రేచన సుకవిజనా
శ్రయుఁ డీ ఛందంబుఁ జెప్పె జనులకు దెలియన్

కవిజనాశ్రయము - గ్రంథాంతము నాగవర్మ ఛందోంబుధి షష్ఠాధికారము మొదలు

క. జయదేవాద్యచ్ఛంధో
న్వయ ప్రయోగతర యాదువంపేరటని
ర్ణయ మానిరలింషట్ప
త్యయముం జెల్వాగె పేర్వ నంబుజవదనే.

ఇంకా జాత్యాధికారములో కంద త్రిపద లక్షణములలో ఛందోంబుధితో పోలిక లున్నాయి. దోషాధికారములో కవి రాజమార్గముతో పోలిక లున్నాయి.

పైవిషయ పరిశీలనంవల్ల 10-12 శతాబ్దుల మధ్య - క్రీ.శ.1100 ప్రాంత రచన ఇది అని నిర్ణయించినారు.

మడికి సింగన తన 'సకల నీతి సమ్మతము'లో కవి జనాశ్రయములోని

క. అమరఁగ వేల్పులచేఁ గ
బ్బము సెప్పియ కాదె వరముఁ బడసిరి మును బా
ణ మయూరాదులు సత్కా
వ్యము సెప్పినఁ బడయరాని వస్తువు గలదే!

అనే పద్యాన్ని ఉదాహరించడం వల్ల ఇతని ప్రాచీనత తెలియవస్తున్నది. సింగన క్రీ.శ. 1400 ప్రాంతంవాడు. ఇందులోని ఛందస్సు గురించి కొన్ని ముఖ్యవిషయాలు చెప్పారు.

1. ఇది తెలుగు ఛందస్సులలో ప్రాచీనమైనది.
2. తెలుగులో జైన సంప్రదాయాలు తెలిపే గ్రంథాల్లో ఇది ఒకటి.
3. దీనికి మూలం అనదగిన గ్రంథం క్రీ.శ. 517 ప్రాంతంవాడైన విష్ణుకుండిన మాధవ వర్మ రచన జనాశ్రయచ్ఛందము.
4. కన్నడ నాగవర్మ ఛందస్సుకు, దీనికి సామ్యా లున్నాయి.
5. దీంట్లో మాత్రాఛందస్సులో రగడ ప్రస్తావన లేదు. అప్పటి కావ్యాలలో ఇది చేరకపోవడం ఇందుకు కారణం కావచ్చు.
6. ఇందులో పూర్ణబిందుప్రాస వుంది.
7. ఇందులో షట్ప్రత్యయ ప్రస్తారం, అక్కరలు మొదలైన ఛందశ్శాస్త్ర విషయాలే కాక అలంకార శాస్త్ర విషయకమైన దోషాధికార వివరణ కూడా వుంది.
8. ఈ గ్రంథంవలెనే నలనామక గణాలు గీదియలు, అక్కరలు మొదలైన ప్రాచీనాంధ్ర ఛందో విశేషాలు చాలా ఎరుకకు వస్తాయి.

క్రీ.శ. 1950లో ప్రచురించిన ఈ ముద్రణలో ఉన్న అనవసర భాగాలు తొలగించారు. కొన్నిటిని ప్రక్షిప్తాలుగా చూపారు. పరిష్కృద్రణంలో చూపిన కర్ణాట ఛందస్సులసామ్యం ఇందులో తొలగించారు. దీనికి కారణం కవిజనాశ్రయ సంపాదకుల పాఠాలు, ఆయా గ్రంథాలలోని ఆనాటి పాఠాలు విశేష వ్యత్యాసంతో ఉండడమే. ఛందోంబుధి, కవిరాజమార్గము మొదలైన గ్రంథాలు సుపరిష్కృతాలై ఆ తరువాత ముద్రితా లవడంచేత అవే ప్రామాణిక గ్రంథాలు. వీటన్నింటినీ ప్రత్యేకంగా 'ఛంద స్సామ్యములు' అనే పేరుతో సంతరించాల్సి ఉంది.

## శ్రీ మత్ప్రతాపగిరి ఖండము

దీని రచయిత శ్రీకపిలవాయి లింగమూర్తికవి. తన గ్రంథ రచనతో రాజులకో మంత్రులకో కోర్కెతీర్చలేదు. తల్లికోరికమీద రచించారు.

తమ పద్యాల్లో సాలంకాయనుల కులస్వామి చిత్రరథస్వామినీ చేర్చారు. చారిత్రక రహస్య శోధనలో అత్యంతానురక్తులైన రచయిత క్రీడాభిరామకావ్యాన్ని కొద్ది మార్పులతో తమ గ్రంథంలో చేర్చారు. ఆ మార్పులన్నీ ఎదురులేని తీర్పులే.

శ్రీ మత్రపుతాపగిరి ఖండము చారిత్రికాంశముల ఎముకలగూడు కాదు. కండ పుష్టి కలిగి సర్వాంగ సౌందర్యోపేతంగా దిద్ది తీర్చిన కావ్య కన్యక. ఇది ఆంధ్ర చారిత్రక మణిహారానికి చేర్చిన మరో మేలి మణి.

ఈ కావ్యంలో వచ్చిన 'గురగర' ప్రసక్తి యుద్ధమల్లుని మధ్యాక్కరలలో ఉందన్నారు.

## విక్రమాంకదేవ చరిత్ర - ఆంధ్రానువాదము

తెలుగు విక్రమాంకదేవ చరిత్ర కాధారం సంస్కృతంలో విక్రమాంకదేవ చరిత్ర. బిల్హణు డాంధ్ర ప్రజానీకాన్ని ఆకట్టుకొన్న కవి. 'బిల్హణీయము' పేరుతో బిల్హణకవి కథ తెలుగులో ప్రబంధ నాటక ప్రక్రియల మూలంగా వాఙ్మయ చరిత్రలో స్థానం గడించింది. ఇది తెలుగు సాహిత్య చరిత్రకు కొత్త విషయం.

శృంగార రసాత్మకమైన ఇతని కథను బిల్హణీయము, శృంగార సుధా సముద్ర పూర్ణ చంద్రోదయము, మదన సాయక విలాసము, యామినీ పూర్ణతిలకా విలాసము, నవయామిని పేర్లతో తెలుగులోకి దిగుమతి అయింది. 'బిల్హణీయము' పేరుతో అయిదుగురు కవులు నాటకాలు వ్రాశారు. అంతేకాక బల్హణీయం యక్షగానాలుగా కూడా రూపుదాల్చింది. మహారాష్ట్రలోనూ వ్యాప్తిచెందింది. బిల్హణీయం తెలుగు మహారాష్ట్రల వాటికి తేడాలు.

| తెలుగు | మహారాష్ట్ర |
|---|---|
| పాంచాల దేశం | ఘూర్జరం |
| మదనాభిరాముడు | నరసింహరాజు |
| యామినీపూర్ణతిలక | శశిరేఖ |

నవ్యాంధ్ర సాహిత్య జగత్తులో ప్రాచీన ప్రబంధ కవి సంప్రదాయాలను పునరుజ్జీవింపజేసింది ఈ విక్రమాంకదేవ చరిత్రానువాదం. మూలంలో 18 సర్గలున్న ఈ కావ్యాన్ని తెలుగులో పది ఆశ్వాసాలల్లో 2000 పద్యాలకు మించి ఒక మహాప్రబంధంగా తీర్చినవారు కీ.శే. శిరోమణి కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు, కీ.శే. మాదిరాజు విశ్వనాథరావుగారు. ఇద్దరూ కలసి రచించటంలో దీని కా విశిష్టత చేకూరింది. కవితా సాహిత్యాలు శాఖాభేదాలకు అతీతాలని నిరూపించిం దీ కావ్యమని చమత్కరించారు నిడుదవోలు వేంకటరావుగారు - (పుట: 67).

## అవతారికా విశేషాలు

మహాకావ్యాలన్నీ శ్రీకారంతో ప్రారంభించే ఆచారం వుంది. మొదటి పద్య ప్రారంభంలో శ్రీకారం వుంటుంది కాని తక్కిన మూడు పాదాల ఆదిలో శ్రీకారం ఉండదు. ఇందులో నాలుగు పాదాల ఆదిలోనూ శ్రీకార ముండడం విశేషం.

ఇది తెలుగువారి ఇలవేల్పులైన శ్రీ పద్మావతీ - వేంకటేశ్వర స్వామి వారికి, శ్రీలక్ష్మీ నరసింహస్వామి వారికి అంకితమైన గ్రంథం. శ్రీ లక్ష్మణ శాస్త్రిగారి ఇష్ట దైవం శ్రీవేంకటేశ్వరస్వామివారు. అంతేకాక వారి తల్లిదండ్రులు పద్మావతీ-శ్రీనివాసులు కావడం కూడ ఒక విశేషం. శ్రీ విశ్వనాథరావుగారి ఇలవేల్పు శ్రీ లక్ష్మీ నరసింహ స్వామివారు. ఈ కారణంచేత ఈ కవులిద్దరూ షష్ఠ్యంతాలలో ఇద్దరు స్వాములనూ శ్లిష్ట సమాసాలలో స్తుతించారు.

గురుస్తుతిలో యతిలోకోత్తరులు మానవల్లి రామకృష్ణ కవి గారి స్తుతి వుండడం విశేషం.

సాధారణంగా ఇష్టదేవతాస్తుతిలో ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క పద్యమే వుంటుంది. ఇందులో ఆవిధంగా కాక రెండు మూడు పద్యా లున్నాయి.

కృత్యవతారిక ఒక చక్కని ఖండకావ్యంలా భాసిస్తుంది.

## అనువాద సరళి

వారు 1934లో యాదృచ్ఛికంగా తిరుపతి వేంకట కవులు రచించిన 'విక్రమాంక దేవ చరిత్ర' చదవడం తటస్థించింది. అది తెలుగులోకి వచ్చిన మొదటి

అనువాదం. అందులో బిల్హణుడు కవులను కావ్యాలను గూర్చి రాసిన భాగాలు చదివి ముగ్ధులై ఆ భాగాలను వేంకటరావుగారు 30 పద్యాల్లో అనువదించారు. వాటిని 'కల్యాణి' పత్రికలో చదివిన శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీర రాఘవచార్యులు గారు చూచి మూలాన్ని చదవమన్నారు. అది చదివాక తిరుపతి వేంకటకవులది సమగ్రమైన అనువాదం కాదని వారికి తోచింది. మూలంలోని చారిత్రకాంశాలు, బిల్హణుని కవితా సామర్థ్యాన్ని వ్యక్తీకరించే రసవద్ఘట్టాలు ప్రదర్శితాలు కాలేదనీ అనుకున్నారు. ఎన్నటికైనా ఆ కావ్యానికి మూలంతో సరితూగగల అనువాదం పుడుతుందా అని ఉవ్విళ్లూరేవారట. ఈ విక్రమాంక దేవ చరితము అటువంటి అనువాద మని సంబర పడ్డారు.

మూల గ్రంథాన్ని వారు పూర్తిగా చదివి ఆనందించినవారు కాబట్టి ఈయనువాదం వారి నెంతగానో ఆకర్షించింది. మూలంలోని ఒక పద్యాన్ని కూడా విడవకుండా ఈ అనువాద రచన జాగరూకతతో సాగింది. ఈ అనువాదంలో ఇదే అతిముఖ్యమైన విషయం. ఎందుకంటే ఈ సంస్కృతకావ్యం చరిత్ర సంబంధమైనది. అందులోను పదాలను వదిలేస్తే చరిత్రకు లోపం కలుగుతుంది. ఇలా చారిత్రక దృష్టితోనే కాక సాహిత్య దృష్టితో చూచినా ఇది ద్వితీయమైనా అద్వితీయంగా ఉంది.

ధారాశుద్ధిలో, రచనారీతిలో, భావవిన్యాసాలలో, పాండితీస్ఫోరక ప్రౌఢ ప్రయోగాలలో ఈ ప్రబంధం పూర్వ ప్రబంధాలను పుణికిపుచ్చుకున్నది. సమాస బంధురమైన ప్రసన్న సంస్కృత భాషా విశేషాలతో, ముచ్చట కూర్చే అచ్చతెలుగు పలుకుల పొంకం మెచ్చుగొలుపుతున్నది. కావ్యకర్త లిరువురూ నిరాఘాటకవన ధారా పారీణులు కావడంచేత ఇది 'సానలఁ దీటిన జాతి రత్నము' వలె ఒప్పుతున్నది.

శ్రీ లక్ష్మణ శాస్త్రిగారు గురుకుల క్లిష్టులై, అనవద్యమైన సంస్కృత సాహిత్యవిద్యను ఆర్జించడమేకాక ఆంధ్ర భాషా సాహిత్య సంప్రదాయ సంభ్రవిష్టులు కావడంచేత ఈ కృతివారి ఉభయ భాషా వైదుష్యానికి ప్రతీకగా ఉంది.

చారిత్రక కావ్యాలు ప్రాయికంగా రస ప్రమేయాలు కావు. అయినా బిల్హణకవి రసబంధురంగా ఈ కావ్యనిర్మాణం చేశాడు. అనువాదంలో ఇది మూలంకన్నా రసస్నిగ్ధమై పఠితలను తన్మయులను కావిస్తుంది.

## ప్రౌఢ పద ప్రయోగాలు

పద్యకావ్యాలు, మహాకావ్యాలు ఎన్నో వెలువడ్డాయి. వాటన్నింటిలోనూ లేని ఒక విశిష్టత దీనిలో వుంది. అది పదప్రయోగ పాండిత్యం. అన్నీ ఇవ్వడానికి వీలు లేదు కనుక రెండు మూడుదాహృతులు : విగూర్వణము (1-107)

సంస్కృతంలో 'గుర్వీ-ఉద్యమనే' అనే ధాతువు నుంచి 'విగూర్వణము' అనే శబ్దం ఏర్పడుతూంది. దీని అర్థం 'అతిశయించుట' లేక 'విజృంభించుట' కానీ తెలుగు భాషలో ఇది 'విగర్వించుట', 'విగుర్వణ' అనే రూపంతో ప్రయుక్తమైంది.

నన్నయ-విగర్వింపుము చూతమనిన
*గోత్రభిదుండున్ (ఆది. 7-274)*
*నన్నెచోడుడు - తలతలమని విగుర్వించి 2-189*
పటుదోర్బల *గర్వవిగర్వణంబునన్ 8-28*

యథావాక్కుల అన్నమయ్య - దైత్యా లిన్విగుర్వించి 16ప.

ఈ విధంగా మహాకవులు 'విగుర్వణము' అని హ్రస్వ ద్వితీయంగా ప్రయోగించడం చేత ఈ పదం వివాదాలకు ఆస్పదమైంది. ఇది తత్సమపద మని, తెలుగు కవుల ప్రయోగాలవలన 'ముష్టాముష్టి' మొదలైన వానివలె సాధువైన దని నిర్ణయించా నన్నారు. (దీనికి Foot Notes గా శబ్దరత్నాకరము - అనుబంధము - సవరణలు - వివరణలు పుట: 858-860 లో ఉంది.)

క్రీ.శ. 13వ శతాబ్ది నుంచి కవులెవ్వరూ వాడని ఈ విగుర్వణ పదం ఈ గ్రంథంలో సరిగ్గా వాడటం ఎంతైనా ప్రశంసనీయం.

నభ ఆభోగ (6-69)
యశయావళి (7-6)

నభశ్శబ్దం, యశశ్శబ్దం సంస్కృతంలో సొంతపదాలు 'నభ-ఆభోగము' అని సంధి చేయకుండా ప్రయోగించడం ప్రౌఢరీతి. నన్నెచోడకవి ఈ విధంగానే, 'జాత

వేద ఆహ్వానంబు' (2-16) అని ప్రనయోగించాడు. యశయావళి-యశశ్శబ్దం సొంతమైనా తెలుగు కవులు దీన్ని అదంతంగానే వాడారు.

ఎఱ్ఱన భారతంలో 'సమ్యగ్యశశాలి' అని అరణ్యపర్వంలో ప్రయోగించారు. (6-92)

యశశ్శబ్దం సొంతం కావడంచేత పదాంత సకారానికి త్వం వచ్చి, దానికి ఆవేశం వికల్పంగా వస్తుంది. కనుక 'యశ ఆవళి' లేక 'యశయావళి' అని రూపాలు సాధువులే కనుక 'యశయావళి' ఇక్కడ విశిష్ట ప్రయోగం.

నిర్గహనము (6-79), నిర్గహనుడు (6-92) అనే పదాలు అపూర్వాలు, 'నిర్గమనము' అంటే 'క్లేశము లేనిది' అని అర్థం. ఇది కేవలం నైఘంటికమైనా ఇందులో ప్రయోగించారు కనుక ప్రచారంలోకి రావచ్చు.

ఇంకా 'హైమన' - హిమ సంబంధమైనది - మొదలైన విశిష్ట ప్రయోగాలు ఇందులో ఉన్నాయి.

శబ్దాన్ని గురించిన విచారణ లేకపోవడంచేత ప్రత్యేకంగా ఇందులో కొంచెం సూచింపవలసి వచ్చిందని చెప్పారు.

వర్ణనలు - ఇందులోని గ్రీష్మ హేమంతర్తు వర్ణనలు చూస్తే కావ్య కర్తల కవితా కౌశలం తేటపడగలదు. వాటన్నింటిని మించింది కాశ్మీర్ వర్ణన. కాశ్మీర దేశ వర్ణన విక్రమాంకదేవ చరిత్రములో చివరి సర్గంలో ఉంది. భూలోకనందన మని పొగడ్తనందిన ఆ దేశవర్ణనం ఇందులో అద్భుతంగా ప్రపంచించారు. ఈ కావ్యం మూలంలోని కాశ్మీర దేశ విశిష్టతను తెలుగు వారికి పరిచితం చేసినందుకు అనువాదకర్త లెంతైనా అభినందనీయులు.

తిరుపతి-వేంకటకవుల్లో తిరుపతి శాస్త్రిగారు వేంకటశాస్త్రిగారికంటె ముందే కీర్తిశేషులైనారు. అయినా, చెళ్లపిళ్లవారు తిరుపతి వేంకట కవులపేరుతోనే తరువాతి రచనలను ప్రచురించినట్లుగానే ఈ కావ్యాన్ని కీ.శే.లైన విశ్వనాథరావుగారి పేరుతో కూడా తన రచనలు ప్రకటించటం ఎంతైనా సంస్తవనీయమై శ్రీ లక్ష్మణశాస్త్రిగారి సహృదయత్వ సౌమనస్యాలను వెల్లడి చేస్తున్నది.

శ్రీనాథుడు శ్రీహర్షుని నైషధీయ చరిత్రను శృంగార నైషధము పేరుతో బంగారు మెరుగులు పెట్టి మూలాతిశాయిగా చేసిన రీతిగా ఈ జంట కవులు కూడా విక్రమాంక దేవ చరిత్రమును ఆంధ్రీకరించి తెలుగులో సువర్ణమయాలంకారముగా చేశారు. అందుకే వారికి 'ఆంధ్రబిల్హణ' అనే బిరుదం సార్థకమైంది. తెలుగు సాహిత్యంలో అభినవ దండి, ఆంధ్ర కాళిదాసు నామాలవలె వీరిలో లక్షణవంతమై వెలయాలని వేంకటరావు గారు ఆశీర్వదించారు.

విశ్వవిద్యాలయాల్లో పాశ్చాత్య విమర్శనా పద్ధతి మూలంగా ప్రబంధ సాహిత్యాధ్యయనం, ప్రబంధ పఠనాభినివేశం ప్రాయికంగా అంతరించి పోతున్నందుకు వారు చింతించారు. ఈ సందర్భంలో ప్రఖ్యాత భాషావేత్త, సాహితీ విమర్శకులు అయిన శ్రీ తిరుమల రామచంద్రగారు ఒక పర్యాయం ఒక సదస్సులో చెప్పిన మాటలను అవశ్యమని ఉదాహరించారు.

తెలుగు-కన్నడ లిపుల సమ్మేళనాన్ని గురించి వారు ప్రసంగిస్తూ ఇలా అన్నారట : "ఈ నాటికే ప్రాచీన కావ్యాధ్యయనం, శబ్దార్థ విచారణ, సాహితీ విమర్శన మొదలైనవి లుప్తాలవుతున్నాయి. మహిత సాహిత్య జీవి మానవల్లి రామకృష్ణకవిగా రన్నట్లు 'ఇంకగొన్నాళ్లకు తెలుగుపద్య మర్థము కాకుండ బోవునేమోనండీ' అన్నది వాస్తవమవుతున్నది" ప్రస్తుతస్థితి ఇదేనని వేంకటరావుగారు బాధ ప్రకటించారు.

వెయ్యేళ్లనుంచి అవిచ్ఛిన్నధారాప్రవాహమై ఆంధ్ర సాహిత్య సౌధానికి మూలస్తంభాయమానమైన ప్రాచీన ప్రబంధ సాహిత్యాధ్యయనాన్ని పునరుజ్జీవింప జేయవలసిన సమయం తటస్థించింది. అటువంటి పునరుజ్జీవనానికి ఈ విక్రమాంకదేవ చరిత్రము ఎంతైనా దోహదం చేయగలదు. ఆంధ్ర విద్వల్లోకం దీనిమీద సమీక్షలను వెలయించి ప్రాచీన ప్రబంధాధ్యయనాన్ని ప్రోత్సహించాలని వారు కోరుకొన్నారు.

# రశైవ జ్మ
# ంక వుగారి సేవ

ఆంధ్రశైవసాహిత్య ప్రచారకులలో ఛార్లెస్ ఫిలిప్‌బ్రౌన్ ప్రాతస్స్మరణీయుడు. పండితాదరణ లేక శైవుల ఇండ్లలో ఆరాధనీయంగా మిగిలిపోయిన తాళపత్ర గ్రంథాలను వ్యయప్రయాసలతో ఎరవుతెచ్చి, వాటిని కాగితాలపై వ్రాయించి, ప్రత్యంతరాలతో పరిశీలింపజేసి శుద్ధ ప్రతులను సిద్ధంచేశాడు. జంగాలు లేదా లింగధారుల సంప్రదాయాలను సాహిత్యాలను గూర్చి ఆంగ్లేయభాషలో బృహద్వ్యాసం రచించాడు. అది 1840లో అచ్చయినది.

అప్పటికి తెలుగువారిలో శైవసాహిత్యంపై శ్రద్ధగలిగినవారు లేరు. ఉన్న ఆరాధ్యులకు, లింగధారులకు వాటిపై శ్రద్ధకన్న భక్తియే మిన్న. సనాతనపండితులకు ఈ సాహిత్యమన్న గిట్టదు. శైవగ్రంథాలు వేదవిరుద్ధా లని వారి తలంపు. బ్రౌన్ 1852లో తన తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు (బ్రౌణ్యం) పీఠికలోని కవుల జాబితాలో పాల్కుర్కి సోమనాథుని చేర్చాడు. బసవ పురాణాన్ని నిఘంటువులో ధారాళంగా ఉపయోగించుకొన్నాడు. 1895లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్రకవుల చరిత్రలో సోమనాథునికి స్థాన మిచ్చారు. పండితత్రయంలో ఒకడైన మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారాన్ని విపులమైన పీఠికతో కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రకటించారు. వారి పరిష్కరణను గిడుగు రామ్మూర్తి పంతులుగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కొనియాడారు.

1926లో పాల్కురికి సోమన బసవపురాణాన్ని వేటూరి ప్రభాకర శాస్త్రుల వారి పరిష్కరణతో ఆంధ్రపత్రికాధిపతులు ఆరాధ్యులు 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావుగారు ప్రకటించారు. ప్రభాకరశాస్త్రులవారికి బ్రౌన్ ప్రతులే ఆధారమైనాయి. వారి పీఠిక ఆంధ్రసాహిత్య చరిత్రలో శివకవియుగానికి ప్రధానాధార గ్రంథమైంది. శాస్త్రిగారి పాండిత్య ప్రకర్షకు ఆంధ్రపండితలోకం ఆశ్చర్య చకితమైంది.

ఆ తరవాత మరో 13 ఏండ్లకు (1939) ఆంధ్రగ్రంథమాలవారే చిలుకూరి నారాయణరావుగారిచే పండితారాధ్య చరిత్రను పరిష్కరింపజేసి ప్రకటించారు.

తెలుగు సాహిత్య యుగవిభజనలో శివకవి యుగం స్థిరపడ్డది. బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు సుపరిష్కృతాలు కావడం కాశీనాథుని వారి చేతిచలవే.

కవిత్రయ కవితావాహిని కంటె భిన్నమైనస్రవంతి శివకవులదని సాహిత్యలోకంలో ముద్రపడింది. శివతత్త్వసార, బసవపురాణ పండితారాధ్య చరిత్రల సుపరిష్కరణ కాలానికి ముందే సోమనాథుని లఘుకృతులతో పాటు బసవపురాణ పండితారాధ్య చరిత్రలు ముద్రితాలయ్యాయి. అయినా ప్రచార భాగ్యం పొందలేదు. నిడదవోలు సుందరం పంతులు , బండారు తమ్మయ్య, నిడుదవోలు వేంకటరావు ప్రభృతులు పాతముద్రణలను చదివే పరిశోధక వ్యాసాలు వ్రాస్తూ వచ్చారు.

## నన్నెచోడుని కుమారసంభవం

మద్రాసు విశ్వవిద్యాలయం ప్రాచ్యపరిశోధనసంస్థవారు నన్నెచోడుని కుమార సంభవాన్ని ప్రకటించడంలో నిరవధిక జాప్యం జరుగుతున్నదని వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు వేంకటరావుగారిచే కుమారసంభవాన్ని పరిష్కరింపజేసి 1953లో ప్రచురించారు. దీనికి వేంకటరావుగారే చిన్నపీఠిక వ్రాశారు. కాని యూనివర్సిటి ఉద్యోగి కావడం వల్ల వావిళ్ళ వేంకటశ్వరశాస్త్రి గారు "ప్రకాశక విజ్ఞప్తి" అనే శీర్షికతో ప్రచురించారు.

నన్నచోడుని కుమార సంభవాన్ని రెండు భాగాలుగా మానవల్లి రామకృష్ణకవి గారు 1908, 1914 సంవత్సరాలలో ప్రకటించిన విషయం విజ్ఞు లెరిగినదే.

## శివతత్త్వసారం

మల్లికార్జున పండితుని కందపద్య కృతి ఇది. పూర్తి గ్రంథం లభించలేదు. లభించినవి 498 పద్యాలు మాత్రమే. ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు తొలుత తమ పరిషత్పత్రికల్లో వరుసగా ప్రచురించి తుదకు 1922లో పూర్తి గ్రంథంగా ప్రకటించారు. కె.వి. లక్ష్మణరావుగారు దీనికి పరిష్కర్తలు - పీఠిక, ఉపోద్ఘాత, లఘుటీకాకర్తలు కూడా వారే.

"ఈ కావ్యము నన్నయభట్టునకు రమారమి నూఱు సంవత్సరములు తరువాతను తిక్కన సోమయాజికి రమారమి నూఱు సంవత్సరములు పూర్వమును రచింపబడినది. కనుక ఆంధ్రవాఙ్మయ చరిత్రమును తెలిసికొనగోరువారి కుపయోగకరమగు మంచిసాధన మని యెంచి, యిది గొప్ప ప్రబంధము కాకపోయినను మతసంబంధ మయిన చిన్నశతక మయినను బ్రకటించితిని. ఇదియుగాక నన్నయకును, దిక్కనకును నడిమి కాలములో బుట్టినదని నిశ్చయముగా రచనాకాలము తెలిసిన గ్రంథ మిది యొక్కటియే"[1] అని లక్ష్మణరావుగారు తమ పీఠికారంభంలో తెలిపారు.

వీరేశలింగం పంతులుగారి కవులచరిత్ర 1917లో వెలువడడంవల్ల మల్లికార్జున పండితుడు కవిగా కవిచరిత్ర కెక్కలేదు.[2] 1920లో అచ్చయిన బసవపురాణం వల్ల కొంత, 1939లో ప్రకటితమైన పండితారాధ్య చరిత్రవల్ల పూర్తిగా మల్లికార్జునపండితుని ఉనికి సాహిత్యలోకానికి సాక్షాత్కరించింది.

1922లో అచ్చయిన శివతత్త్వసారం మరో 46 సంవత్సరాలకు గాని పునర్ముద్రితం కాలేదు. ఇన్నేండ్లు పండితులు పాత ముద్రిత ప్రతినే పట్టుకు పాకులాడారు. తెలుగుదేశంలో ఏన్నోమార్పులు వచ్చాయి. ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడింది. విశ్వవిద్యాలయాలు వెలశాయి. పరిశోధన చేసే విద్యార్థుల సంఖ్య పెరిగింది. ఎం.ఎ., తెలుగు విద్యార్థులు "ఆంధ్రవాఙ్మయ చరిత్ర - శివకవి యుగము" అనే అధ్యాయంలో నన్నెచోడ, మల్లికార్జున పండిత, పాల్కురికి సోమనాథుల కృతులను చదివితేనే కాని కృతార్థులు కాలేరు. కాని, శివతత్త్వసారం వారి కన్నులకు కరువైంది.[3]

1. శివతత్త్వసారము, ఆంధ్రసాహిత్యపరిషత్తు, మద్రాసు 1922.
2. శతక కవుల చరిత్ర రచయిత వంగూరి సుబ్బారావుగారు శివతత్త్వసారం శతకమనే నిశ్చయబుద్ధితో మల్లికార్జున పండితుని కవిగా చేర్చారు.
3. పండితారాధ్య చరిత్ర పరిష్కర్త చిలుకూరి నారాయణరావు గారు వ్రాసిన 343 పుటల పీఠికలో పండితుని శివతత్త్వసారం గురించి చెప్పవలసింది. చాలా ఉన్నా రెండు మూడు వాక్యాలు వ్రాసి ఊరుకోవడం వింతగా ఉంది.

వేంకటరావుగారు తమ సహజ శైవ సాహిత్యాభిమానం, శివతత్త్వ సార కృతి పునర్ముద్రణకు ప్రేరేపించింది.[1] శివతత్త్వసారానికి కన్నడానువాదం కూడా ఆయనకు తోడ్పడింది. ఇది లక్ష్మణరావుగారికి లభించినట్లు లేదు.

వేంకటరావుగారు కన్నడానువాదం దగ్గర పెట్టుకొని కన్నడ విద్వాంసులు, ముఖ్యంగా తిరుమల రామచంద్రగారి సహకారంతో ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని మూలప్రతితో, లక్ష్మణరావుగారి అచ్చుప్రతిని సరిపోల్చి శివతత్త్వసార పరిష్కృత ప్రతిని సిద్ధపరిచారు. కృష్ణాపత్రికాధిపతులు శివశ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు దీనిని 1968లో ప్రకాశమానం కావించారు. వేంకటరావుగారు ఈ గ్రంథానికి 91 పుటల బృహత్పీఠిక సమకూర్చారు. గ్రంథపరిష్కరణ విధానంతో ప్రారంభమైన వీరి పీఠికలో మల్లికార్జున పండితుని సమగ్రదర్శనం గోచరిస్తుంది. గ్రంథాంతంలో "పద్యవివరణ", శీర్షకతో 14 పుటలు, కన్నడానువాదం, చివరకి తప్పుఒప్పులు పట్టిక అనుసంధించారు.

తెలుగు కన్నడ శివతత్త్వసార ప్రతులు రెండును అసమగ్రాలే. కన్నడ గ్రంథంలో 726-740 వరకు ఉన్న 15 పద్యాలకు తెలుగు లేదు. లభించినమేరకు ఆ కన్నడ కందపద్యాలకు వేంకటరావుగారు అనువాద పద్యాలు రచించారు. లక్ష్మణరావుగారి అచ్చుపుస్తకంలో కందం రెండు చరణాలు కాగా వేంకటరావుగారు నాలుగు చరణాలుగా చూపించి పఠన క్లేశాన్ని తొలగించారు.

అయితే ఇక్కడ ఒక మాట చెప్పక తప్పదు.[2]

1. 1922లో ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు శివతత్త్వ సారానికి 500 ప్రతులే అచ్చువేయించారు. కాగితం కూడా అంతమేలిరకం కాదు.
2. ఆంధ్రసాహిత్య పరిషత్తు 1940లో ప్రకటించిన చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహానికి వేంకటరావుగారు చక్కని పీఠిక వ్రాశారు. తెలుగులో మొదట నాటకలక్షణం చెప్పిన గ్రంథమని వారు వెల్లడిచేశారు. అంతటి విలువైన పీఠికను సాహిత్య పరిషత్తు వారు 1961 ఎడిషన్‌లో తొలగించివేశారు. ఇట్టి పనులు మాబోటి పరిశోధక విద్యార్థులకు పెక్కు ఇక్కట్టులను తెచ్చిపెడుతూ ఉంటాయి.

కొమర్రాజు వారి తొలి ముద్రణ పీఠిక వేంకటరావుగా రేల చేర్చలేదో తెలియదు. అదేవిధంగా వేంకటరావుగారు పీఠికతో వెలసిన ఆంధ్రగ్రంథమాల వారి బసవ పురాణంలో ప్రథమ ముద్రణ పీఠిక వదలి వేశారు. కారణా లేమైన కానిండు. ఈ రెండు గ్రంథాలకు ప్రామాణికులు, ప్రసిద్ధ పండితులు అయిన లక్ష్మణరావు, ప్రభాకరశాస్త్రుల వారి పీఠికలు కనుమరుగవడం విచారించ దగ్గ విషయం.

## అనుభవసారం

ఇది పాల్కురికి సోమన తొలి కృతి.[1]

ద్విపదరచనకు పేరొందిన సోమనాథుడు పద్యరచనా విశారదు డని తెలిసినది లఘుకృతివల్లనే. వీరేశలింగం పంతులుగారు ఇందుండి తమ కవులచరిత్రలో మూడు పద్యాలు ఉదాహరించారు.[2] బండారు తమ్మయ్యగారు ప్రత్యేకంగా అనుభవసారం శీర్షికతో వ్యాసం వ్రాశారు.[3] వీరికి ఆధారమైన ముద్రిత ప్రతి తప్పులతడికె. వేంకటరావుగారు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోని వ్రాతప్రతులతో సరిచూసి పాతముద్రణలో 91, 187, 193, 211, 229, 238 సంఖ్యలతో ఉన్న పద్యాలు పాతముద్రణలో లుప్తమైనట్లు కనుగొన్నారు. కొన్నిటికి పద్యపాదాలు లభించాయి. పరిష్కృత ప్రతిని వేంకటరావుగారు వావిళ్లవారి కివ్వగా 1955లో అనుభవసారం చక్కగా వెలువడింది. సోమనత్రిభంగి, క్రౌంచపదం, వనమయూరం, మాలిని, మానిని, తరువోజ విశేష వృత్తాలను వాడాడు. త్రిభంగి వృత్తం లాక్షణికులకు ప్రథమలక్ష్య మని, చిత్రకవిత లయిన ద్విప్రాస, సర్వతః ప్రాససీసాలు, చతుర్విధకందం వంటి గర్భకవిత్వం సోమన సమర్థవంతంగా సాగించాడని నూతన ముద్రణవల్ల తెలిసింది. కావ్యాదిని శ్రీకారం చుట్టి కావ్యాంతంలో మంగళమశ్రీవృత్తం సోమన వాడాడు.

1. గంగపట్టణ సుబ్రహ్మణ్య దేవరవారి విద్యానిలయ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరం, 1916.
2. ఆంధ్రకవుల చరిత్ర, 1917, పుటలు 225-6
3. ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక - 1922 పుట: 165

## బసవ పురాణం

పాల్కురికి సోమన బసవపురాణాన్ని ఏలూరులోని శైవులైన కందుకూరివారు మొదట ప్రచురించారు.[1] ఆ తరువాత 1926లో ఆంధ్రపత్రికాధిపతులు ఆంధ్ర గ్రంథమాల పక్షాన వేటూరివారి సంస్కరణ, పీఠికతో ప్రకటించారు. ఆంధ్ర గ్రంథమాలవారే తిరిగి బసవపురాణాన్ని వేంకటరావుగారి పీఠికతో 1952లో పునర్ముద్రించారు.

> "ప్రస్తుతము చెన్నపురి విశ్వవిద్యాలయ ప్రధానాంధ్రోపన్యాసకులు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఎమ్.ఎ." గారిచే రచింపబడిన విస్తృత పీఠికతో ప్రకటించుచున్నా"మని గ్రంథప్రకాశకులు చెప్పడం వల్ల వేంకటరావుగారు బసవపురాణ పాఠం పరిష్కరించ లేదన్నది స్పష్టం.

వేంకటరావుగారు తమ 44వ పుటలో పీఠికలో వేటూరివారి ముద్రణలో లేని అమూల్యవిషయాలు తెలిపారు. అయితే ఇక్కడ ఒకమాట చెప్పక తప్పదు. వేంకటరావుగారికి లభ్యమైన నూతనాంశాలు ఆనాడు వేటూరివారికి అందుబాటులో లేవు. ప్రభాకరశాస్త్రి పరిష్కరణ చూసి, పీఠిక చదివి వేంకటరావుగారు తమశైవ గ్రంథపాండిత్యానికి మెరుగులు దిద్దుకున్నారు.[2] వేంకటరావు గారు తమ పీఠికను విద్వాంసులతో పాటు, విద్యార్థులకు కూడా ఉపయుక్తంగా ఉండేటట్లు వ్రాశారు.

## ఉదాహరణ వాఙ్మయం

పాల్కురికి సోమనాథుని సంస్కృతాంధ్ర ఉదాహరణ కావ్యాలే తెలుగు సాహిత్యంతో వెలసిన తొలి ఉదాహరణలు. ఈ శాఖ నేటికి అవిచ్ఛిన్నంగా సాగడానికి వేంకటరావుగారు కావించిన కృషే కారణం. తెలుగు బసవోదాహరణం

1. 1896 శ్రీకందుకూరి శ్రీశైల వర ప్రసాదరావు. ఏలూరు.
2. ఈ విషయం తమతండ్రిగారు పదేపదే స్మరించినట్లు సుందరేశ్వరరావు తెలిపారు.

వేటూరివారిచే పరిష్కృతమై 1928 భారతి ఫిబ్రవరి సంచికలో వెలసింది. అసలు ఉదాహరణ కావ్యాన్ని సాహితీలోకానికి పరిచయం చేసినవారు మానవల్లి రామకృష్ణ కవిగారు. సోమనాథునికి వందయేండ్ల తరువాతవా డయిన రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణాన్ని వారు 1912లో వనపర్తి బ్రహ్మవిద్యావిలాసముద్రాక్షర శాలలో ముద్రించి ప్రకటించారు. వారి పీఠికలో సోమనాథుని సంస్కృత బసవ పురాణాన్ని గూర్చి తెలిపారు. ఆధునిక కాలంలో ఉదాహరణ యుగ్మం తెలుగువారికి తెలియవచ్చిన దీఇరువురి పరిశోధక విద్వాంసుల వల్లనే.

వేంకటరావుగారి దృష్టి ఈ వాఙ్మయశాఖపై పడ్డది. త్రిపురాంతకోదాహరణ వ్రాతప్రతిని తంజావూరి సరస్వతీమహల్ గ్రంథాలయం నుండి తెప్పించి, 1948లో సుపరిష్కృత పీఠికా సహిత గ్రంథాన్ని ప్రకటించారు. పండితలోకం హర్షించింది. విశ్వవిద్యాలయం వారు ఉభయ భాషాప్రవీణ పరీక్షకు పఠనీయ గ్రంథంగా ప్రవేశపెట్టారు. దీనితో వేంకటరావుగారి విద్వత్తు సాహిత్య ప్రపంచానికి ప్రకాశమానమయినది.

అయితే త్రిపురాంతకోదాహరణం వీరశైవగ్రంథమా? అంటే వీరశైవ గ్రంథం కాకపోయినా శైవగ్రంథమే.

శ్రీశైలానికి ఉండే నాలుగు ద్వారాల్లో త్రిపురాంతకం తూర్పుద్వారం. త్రిపురాంతక క్షేత్రపాలకుడే త్రిపురాంతకు డైన పరమశివుడు.

వేంకటరావుగారు లబ్ధమైన ఉదాహరణకావ్యాలను సేకరించి, నిర్దుష్టంగా పరిశీలించి కావ్యపాఠాలతో సహా ఉదాహరణ వాఙ్మయ చరిత్రను 1950లో ప్రకటించారు.

లక్షణ గ్రంథకర్తలు క్షుద్రప్రబంధాలని ఈ లఘుకృతులకు పేరు పెట్టినా సోమనాథుని దగ్గర నుండి విశ్వనాథవరకు ఉదాహరణ కావ్యాలు రచించారు. ఉదాహరణ కావ్యరచన అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది.

ఉదాహరణ కావ్యరచనను పునరుజ్జీవింపజేసిన కీర్తి వేంకటరావుగారిదే.

## సంస్కృత బసవోదాహరణం

పాల్కురికి సోమన రచించిన "ఉదాహరణయుగ్మం"లో తెలుగు బసవోదాహరణాన్ని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1928 ఫిబ్రవరి భారతిలో ప్రకటించారు.[1] సంస్కృత బసవోదాహరణాన్ని బండారు తమ్మయ్యగారు, నిడదవోలు వేంకటరావుగారు 1940లో ప్రచురించారు.[2] బెంగుళూరులోని శరణు సాహిత్యమండలి వారు తమ "శరణుసాహిత్య" కన్నడ పత్రికలో 1941లో వేంకటరావుగారు పరిష్కరించిన ప్రతినే ఆధారం చేసుకొని ప్రకటించారు.

## మల్లికార్జునదేవస్తవోదాహరణము[3]

దీనిని 1800లో కాశీనాథుని వీరారాధ్యుల శిష్యుడు కాళీపట్టణపు సిద్ధరామకవి రచించాడు. భాష - సంస్కృతం. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారికి 5వ పురుషుడు, వీరనారాధ్యుడు. కాశీనాథుని వారి వంశోత్కర్ష, శ్రీశైల మల్లికార్జున దేవుని స్తుతి ఇందలి కథావస్తువు.

## చతుర్వేదసారం

సోమనాథుని చతుర్వేదసారం "బసవలింగ" అనేమకుటంతో సీసపద్యాలలో సాగింది. 1914లో గంగపట్టణం సుబ్రహ్మణ్య కవిగారు బందరులోని భైరవ ముద్రాక్షరశాలలో ముద్రించారు. అది సుపరిష్కృతం కాదు. బండారు తమ్మయ్య గారు 1962లో పండితపరిష్కరణ కావించగా కృష్ణాజిల్లా విజయవాడ తాలూకా వల్లూరు పాలెం వాస్తవ్యులు, వీరశైవులు శ్రీచలవాది రాచయ్యగారు సేకరించిన ద్రవ్యసహాయంతో ముద్రించారు. కాని, తమ్మయ్యగారు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోని చతుర్వేదసార వ్రాతప్రతులను పరిశీలించినవారు కారు.

1. పుటలు 299 - 303.
2. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం. 32. సంచికలు 3-4, పు 81.
3. ముద్రితమై, లభ్యంకాని ఈ లఘుకృతిని వేంకటరావుగారు సంపాదించి ఆంధ్రపత్రిక (ఉగాది) 1952 నందన సంచికలో ప్రకటించారు.

తమ్మయ్యగారి చతుర్వేదసార పరిష్కరణ ప్రతిని సమీక్షిస్తూ[1]వేంకటరావుగారు సుమారు 80 పద్యాలు అందులో చేరలేదని ఆ పద్యాలను చూపించారు. చేరని పద్యాలలో

బసవన్న శ్రీపాదపద్మపుష్పంధయ
　　స్థేముండు పాల్కుర్కి సోముఁ డనఁగ
బసవపుర స్థాప్య పర్వతోత్తరముఖ
　　సీముండు పాల్కుర్కి సోముఁ డనఁగ
బసవపురాణ ప్రబంధ సంఘటనాభి
　　రాముండు పాల్కుర్కి సోముఁ డనఁగ
బసవశతక, గద్య, పద్యాది సత్కృతి
　　ధాముండు పాల్కుర్కి సోముఁ డనఁగ

పరగ ప్రస్తుతించి, భావించి, భజియించి
బసవ విభుని కరుణ యెసగఁ బడసి
నిర్వికల్పరతి చతుర్వేదసారము
పద్యముల రచింతు బసవలింగ.

ఇది ఒక అపూర్వ పద్యం. దీనివల్ల పాల్కురికి సోమనాథుడు శ్రీశైలంలోని బసవపురంలో నివసిస్తు ఉండేవాడని, అది పర్వతానికి ఉత్తరముఖంగా ఉందని, బసవపురాణ, బసవశతక (వృషాధిపశతకం), గద్యపద్యాది సత్కృతులు చేశా డని స్పష్టమవుతోంది.

పండితారాధ్య చరిత్రలో బసవపురాణాన్ని గూర్చి వర్ణించడమే కాక అక్కడ వెలసిన చతుర్ముఖ బసవేశ్వరుని కూడా స్తుతించాడు.

ఆవృషభేశ్వరం బలరారె మున్న
వెలయ చతుర్ముఖ వృషభేశుపేర

1. భారతి 1962 సెప్టెంబరు : పుటలు 30 - 40.

నిల చతుర్ముఖ బసవేశ్వరుం డొప్పఁ
బసరింప నావృషభపురంబు పేర
వసుధపై బరగె నా బసవపురంబు[1]

తెలంగాణ జనగామ తాలూకాలోని పాలకుర్తిలో పుట్టి, చిన్ననాటనే ఆ ప్రాంతంలోని కట్టకూరి పోతి దేవరవల్ల శైవదీక్ష పొంది శ్రీశైలం చేరుకొని అక్కడనే చిరనివాసం ఏర్పాటు చేసుకొని బసవపురాణాది కృతులు రచించినట్లు నిర్ధారించవచ్చు. ఇది వేంకటరావుగారి పరిశోధనాఫలితమే.

తమ్మయ్యగారి ప్రతిలో 301 పద్యాలు మాత్రమే ఉన్నాయి.

## పండితారాధ్య చరిత్ర

1939 చిలుకూరి నారాయణరావుగారి పరిష్కరణకంటె 31 సంవత్సరాల ముందుగా ముదిగొండ శంకరారాధ్యుల వారు పరిష్కరించి వరంగల్లు శ్రీశివధర్మవర్ధనీ ముద్రాక్షరశాలలో (1908) ముద్రించారు. ఆ వెనక మరో 6 ఏండ్లకు (1914) శ్రీగిరి గురు దిగంబర మల్లికార్జున స్వాములవారి సేవకుడు చింతకుంట పసుపుల నాగయోగి, నిడుదవోలు సుందరం పంతులు తమవద్ద ఉన్న మూడు వ్రాత ప్రతులలో సరిచూసి విశాఖపట్టణం విజయరామచంద్ర ముద్రాక్షరశాలలో ముద్రించారు. ఈ మూడు ముద్రణలను తులనాత్మక పరీక్షచేసి వేంకటరావుగారు ఒక వ్యాసం వ్రాశారు. ఇందు నారాయణరావుగారి పరిష్కరణలోపాలను ఎత్తిచూపారు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు వారే పండితారాధ్య చరిత్రను ప్రకటించుటకు వ్రాత ప్రతులను సేకరించి, శుద్ధపాఠాన్ని నిర్ణయించి అచ్చుప్రతిని తయారు చేసినట్లు వేంకటరావుగారు తమవ్యాసంలో తెలిపారు.[2]

1. పండితారాధ్య చరిత్ర 1939 చిలుకూరి నారాయణరావుగారి పరిష్కరణ 2వ భాగం 303 పుట.
2. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 1942 అక్టోబరు సం: 30 సంచిక 45-46. పుటలు 175-184.

వేంకటరావుగారే స్వయంగా పండితారాధ్య చరిత్రను పరిష్కరించినట్లు తెలుస్తోంది.[1]

## మనోబోధ

వీరశైవ వాఙ్మయం వ్యాసంలో (1949) వేంకటరావు గారు -

శివయోగసారం రచించిన కొలని గణపతిదేవకవి ఈశైవ వేదాంత గ్రంథాన్ని రచించినట్లు తెలుపుతూ మనోబోధనుండి ఆద్యంతాలు చూపారు. అంతవరకు ఈకృతి ఉనికి తెలియదు. వేమన దీనిని అనుసరించాడు. ఈ మంజరీ రచనను శ్రీ ఎన్.ఎస్. సుందరేశ్వరరావుగారి సంపాదకత్వంలో అచ్చయింది.[2]

## వీరశైవాచార సంగ్రహం[3]

"శివాగమాలను అనుసరించి తెలుగున శివపూజావిధానాదికములను దెల్పు

1. నారాయణరావుగారి ముద్రణలోనే పాఠాంతరాల నెక్కించి ఆంగ్లాంధ్రభాషలలో విపుల పీఠికలు వ్రాసి ముద్రణకై ప్రతి నొకదానిని సిద్ధం చేసినట్లును ఆ ప్రతి ఆంధ్రప్రదేశ్ బి.ఎం.ఎల్‌లో ఉన్నట్లును సుందరేశ్వర రావు తెలిపారు.
2. Bulletin of the Madras Govt. Oriental Manuscripts Library Vol III. No.1 Pages 60-77 (1950).

   41 సంవత్సరాల కింద మనోబోధ అచ్చుపడింది. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం 5వ సంపుటలో 140 వ పుటలో సుందరేశ్వరరావు పరిష్కరణతో అచ్చయినట్లు తెలిపారు. "తెలుగు యోగులు" (1987) అనే గ్రంథంలో మేడపాటి వెంకటరెడ్డిగారు మనోబోధ నుండి పంక్తులు ఎత్తిచూపారు. వారే గణపనారాధ్యుని స్వరశాస్త్ర మంజరిని ప్రకటించారు (1988). అందులో కూడా వేమన మనోబోధలోని వైరాగ్యం అలవరచుకొన్నాడని సోదాహరణంగా చూపారు. అసలు మనోబోధ ఎక్కడిది? వారికి ప్రత్యంతరం లభించిందా! లేదా అచ్చు పడ్డదానిని చూసి పేరు చెప్పడం ఎందుకని వదిలేశారా? అన్నిటికి ఆకరాలు ఇచ్చి దీని కివ్వకపోవటం పరిశోధనాలయం మర్యాదకాదు.
3. వీరశైవాచార సంగ్రహము - కుంటముక్కల తిరుమలనాథకవి. బి.ఎం.ఎల్ మద్రాసు. 1951 పుట 11.

నీకృతి కుంటుముక్కల తిరుమలనాథ రచితము" అని వేంకటరావుగారు 'వీరశైవవాఙ్మయ' వ్యాసంలో తెలిపారు. కవికాలం 1484 అని శాసన ప్రమాణంతో చూపెట్టారు.

ఈ ముద్రిత గ్రంథాన్ని గంటి జోగి సోమయాజిగారు పరిష్కరించారు పీఠికలో ప్రొఫెసర్ జోగిసోమయాజిగారు వేంకటరావుగారి 'వీరశైవవాఙ్మయ' వ్యాసాన్ని పేర్కొన్నారు. కృష్ణరాయల యుగానికి ముందు వెలసిన కృతి.

## సద్గురు రహస్య

కన్నడ ప్రసిద్ధ మతాచార్యుడు గురుబసవన 'సద్గురు రహస్య' అనే గ్రంథం రచించాడు. ఇతని కాలం తెలియక తట్టుమిట్టాడుతున్న పరిష్కర్త ప్రొఫెసర్ మరియప్పభట్[1] గారికి వేంకటరావుగారు తెలుగులోని గురుబసవప్రశంస తెలియ పరచారు.

*చెన్నమల్లేశ శతకకర్త [2] "విఖ్యాతికెక్కిన విభూతిపురమందు,*
*శ్రీగురుబసవన్న శిష్యుడైన, కవివరేణ్యుడు ఘనుండు*
*గంగాధరుడు, వెలయ నీపద్యశతకంబు వినుతి సేయ"*

గంగాధరుడితోపాటు జ్ఞానసింధు అనే గురుశిష్య సంవాదకర్త కరిబసవన కూడ

*"ఇది వీరభద్రేశు హితకృపాలబ్ధ*
*సదమల సత్కావ్య సందర్భకుశల*
*సవిశేష శివభక్త జనసభాయుక్త*
*శివయోగ సామ్రాజ్య సింహాసనస్థుం*
*డరయంగ జిరపుణ్యుడైనట్టి కొట్టూరు*
*గురుబసవార్యుని కోమల చరణ*

1. మద్రాసు విశ్వవిద్యాలయ కన్నడ శాఖాధ్యక్షులు
2. శతకకవుల చరిత్రకర్త వంగూరి సుబ్బారావుగారు గంగాధరకవి క్రీ.శ. 1750 ప్రాంతం వాడని చెప్పారు.

జలజాత గంధపుష్పంధయమాన
కవితమానస వరకవి కరిబసవ
విరచిత జ్ఞాన సింధు . . . . ."

గురు బసవన విజయనగర సామ్రాజ్య మేలిన ప్రౌఢదేవరాయ (క్రీ.శ.1419-1446) సభాస్థలి నున్నట్లు విరూపాక్షకవి చెన్నబసవ పురాణంలో చెప్పాడు. దీనితో గురుబసవేశుని కాలం స్పష్టంగా తెలియటమే కాకుండా కృష్ణారాయల కాలానికి కించిత్ పూర్వమో పరమో గంగాధరుడు, కరిబసవన విలసిల్లినట్లు తేలింది.

వీరశైవ దీక్షాబోధకర్త పిడుపర్తి బసవన ఇదేకాలానికి చెందినవా డని వేంకటరావుగారు ప్రొఫెసర్ భట్‌గారికి తెలుపగా వారు పరమానందభరితు లయ్యారు[1].

## ఏగంటి వారి వచనాలు

వేంకటరావుగారు తమ వీరశైవవాఙ్మయవ్యాసంలో [2]

"శివభక్తి ప్రతిపాదికములగు గేయకృతులలో ఏగంటివారి వచనములు ప్రఖ్యాతము లైనవి. ఈ పాటలు కొన్ని 1908 నాటి బజారు ప్రతులలో ముద్రితము లైనవి గాని సరిగా ముద్రితము కాలేదు. వీటికి తెలుగు సంకీర్తన వాఙ్మయమున నెట్టి విశిష్ట స్థానము గలదో తెలియుట లేదు. ఈనాటి సంగీత శాస్త్ర చారిత్రక పరిశోధకులకు నివి యపరిచితములు".

"పాటలు సద్భక్తిపరులు నుతింప
పాటికెక్కిన గార్లపాటి లక్ష్మణుని
వెలయుగా వినుతించి"

1. "I have to thank my friend Sri N. Venkata Rao M.A., Head of the Telugu Department University of Madras who drew my attention to the reference of Guru Basava in Telugu Literature" - Introduction to Kannada Sadguru Rahasyam. Pages IX. Madras Govt. Oriental Series 1951.

2. భారతి రజతోత్సవ సంచిక.

“వ్రాత ప్రతులలో లక్ష్మయ్యగారి వచనము లనియే కలదు.” అని వేంకటరావు గారు తెలిపారు. తత్త్వాల మధ్య 'కూడి లక్ష్మణయోగి కృప యెటింగి' అని ఉన్నదని చూపారు. దీనికి కర్త అయిన గార్లపాటి లక్ష్మణయోగి తెనాలి రామలింగకవి తండ్రి రామయ్యగారి సోదరుడో వారి వంశీయుడో అయిఉండు నని తెనాలి రామలింగ కవి ఇంటిపేరు గార్లపాటివారే అని అభిప్రాయపడ్డారు. శివశ్రీ మల్లంపల్లి శరభయ్యగారు మద్రాసు బి.ఎం.ఎల్.[1] వారి బులిటెన్‌లో కొన్ని అచ్చువేశారు.

## ఉద్భటారాధ్య చరిత్ర

తెనాలి రామకృష్ణుడు వైష్ణవుడుగా మారటానికి పూర్వం శైవుడే. ఈ విషయాన్ని ఉద్భటారాధ్యచరిత్ర నిర్ధారిస్తుంది. తొలుత పాలగుమ్మి ఏలేశ్వర డితని దీక్షాగురువు. తరువాత భట్టరు చిక్కాచార్యులు వైష్ణవముద్ర వేశారు. రామలింగడు, రామకృష్ణ డయ్యాడు.

కవిజీవితకారులు, కవి చరిత్రకారులు ఇతని హాస్యకథలు ప్రకటించారు. వికటకవిగా ప్రఖ్యాతి పొందినవాడు తెనాలి రాముడు. తెనాలి రామ అంటే చాలు వినోద సంభాషణ చతురు డని తెలుస్తుంది.

వైష్ణవు డయిన తెనాలి రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్య ఘటికాచల మాహాత్మ్యాలను రచించాడు.

శైవు డయిన తెనాలి రామలింగని ఉద్భటారాధ్యచరిత్ర 1925లో ముద్రితమైనది. పరిష్కర్తలు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. తెనాలి రామలింగ రామకృష్ణ లొకరే అని ప్రభాకరులు సిద్ధాంతీకరించారు. ముదిగొండవారికి ఉద్భటుడు తొలిదేశికుడు.

గురజాడ శ్రీరామమూర్తి పంతులు గారికి (కవి జీవితములు), కందుకూరి వీరేశలింగం పంతులు (ఆంధ్రకవులచరిత్ర) ఉద్భటారాధ్య చరిత్ర ఉనికి తెలియదు.

1. మహిష్మతీ ముద్రాక్షరశాల - ముక్త్యాల, కృష్ణాజిల్లా1925 పరిష్కర్త, పీఠికాకర్త వేటూరి ప్రభాకరశాస్త్రి.

తొలి ముద్రణ సూర్యాలోకనం 1925లో, మరో 50 సంవత్సరాల దాక ఉద్భటారాధ్యచరిత్ర ప్రాశస్త్యం సాహిత్యవ్యవసాయకులకు తెలియదు. ముద్రిత ప్రతులు కరువయ్యాయి. ఈ పరిస్థితి గమనించి కృష్ణాపత్రికాధిపతులు ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు తమశాఖకు మూలదేశికుడైన ఉద్భటుని చరిత్రను పునఃప్రకాశం చేయాలనే సంకల్పంతో వేంకటరావుగారిచేత పీఠిక వ్రాయించి ప్రకటించారు.[1]

ద్వితీయ ముద్రణ అచ్చులో 200 పుటలకు రాగా వేంకటరావుగారి పీఠిక మరో 12 పుటలకు మించి ఉంది. అంటే 212 పుటలు.

సహజ-శైవ సాహితీసాగర కుంభసంభవు లైన వేంకటరావుగారు పీఠికలో ప్రథమ ఖండము

1.మీమాంస, 2. వంశోత్కర్ష, 3. అగ్రబ్రాహ్మణశాఖ, 4. శైవమత స్వీకరణ, 5. కృతిపతి ఊరదేచ మంత్రి చరిత్ర, 6. రచనాకాలము, 7. కావ్యకథావస్తు విమర్శన, 8. , 9. పాల్కురికి సోమన చెప్పిన ఉద్భటుని కథ, 10. ఉద్భటారాధ్య చరిత్ర - మూలము, 11. ఉద్భటారాధ్య చరిత్ర కథాసంగ్రహము 12. పాల్కురికి రామలింగకవుల రచనా భేదములు 13. ఆరాధ్య శైవసంప్రదాయములు, 14. ఉద్భటారాధ్యుడు - ముదిగొండవారు, 15. ఇతర కావ్యానుకరణములు, 16. ఉ.పా. చ. అనుసరించిన కవులు, 17. తెనాలి అన్నమయ్య, 18. స్వసంవాదములు ఉ.చ. పాండురంగ మాహాత్మ్యం, 19. కందర్ప కేతువిలాసము, 20.ఘటికాచల మాహాత్మ్యము, 21. కవితాకళ, 22. ఛందస్సు, 23. వేదసూక్తులు, సామెతలు, జాతీయ విలువలు, 24. పదప్రయోగములు

1. ది లోటస్ పబ్లిషర్స్ - మెయిన్‌రోడ్ - తెనాలి - 1974 ఉద్భటారాధ్య చరిత్రకు సమగ్రమైన తాళపత్రప్రతి లభించలేదు. లభించిన రెండు ప్రతులలో శిథిలభాగాలు చాలా ఉన్నాయి. గ్రంథ ప్రకాశకులు సుబ్రహ్మణ్యశర్మగారు శిథిల భాగాలను ముదిగొండ వీరభద్రమూర్తిగారి చేత, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి చేత పూర్తి చేయించారు.

## ద్వితీయఖండము

25. రామకృష్ణుని రచనలు 26. కవికాలము 27. గార్లపాటి రామపండితుడు 28. ఉత్సవ విగ్రహశాసనము 29. రామలింగని కాలము 30. వైష్ణవమత స్వీకారము 31. శైవకవుల కృతులు 32. వైష్ణవ పారిభాషిక పదములు 33. పాండురంగ మాహాత్మ్యము 34. ఘటికాచల మాహాత్మ్యము 35. వ్రాతప్రతుల వివరము.

ఈ బృహత్ పీఠికలో రామలింగ, రామకృష్ణులను గూర్చి తడవని అంశమే లేదు.

## శ్రీపర్వత పురాణము

దీనిని నాగుబాటి శేషనాథారాధ్యకవి రచించాడు. క్రీ.శ. 1600 వరకు వెలసిన తెలుగు కావ్యాలలోని పద్యాలను సంకలం చేసిన పెదపాటి జగన్నాథకవి ఈ గ్రంథంలోని పద్యాన్ని ఉదాహరించాడు. 1938 జనవరి భారతిలో వేంకటరావుగారు ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని తెలిపారు!

*జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్*
*ఘనలలితార్థగౌరవవికాసి తెనుం గభిరమ్య మంతకున్*
*గనుఁగొనఁ జూత బీజమునకంటెను గోమల పత్రపుష్పశో*
*భన నవపల్లవాభినవ బాలరసాలము సొంపునింపదే.* (అవతారిక)

అనే చక్కటి పద్యం ఇందులోనిదే. ఇంతేకాకుండా మల్లికార్జున పండితారాధ్యుని అక్షరాంక గద్యను తన గ్రంథంలో యథాతథంగా కూర్చుకొన్నాడు. (ద్వితీయాశ్వాసం).

శేషనాథుడు అష్టభాషాప్రవీణుడు; రచన ప్రౌఢనిర్భరపాకం.

గుంటూరు జూపిటర్ బుక్ హవుస్ వారు శేషనాథుని "శ్రీపర్వత పురాణాన్ని" 1970లో సర్వాంగసుందరంగా ముద్రించారు.

1. వీరశైవ వాఙ్మయము. పుట: 22 భారతి రజతోత్సవ సంచిక 1949 జనవరి.

## 1. వీరశైవసాహిత్యము : వేంకటరావుగారి సిద్ధాంతాలు

"వీరశైవ మనగా శైవమతములో నవాంతరభేద మగు వీరశైవమతమునకు సంబంధించిన తెనుగు వాఙ్మయము. తెనుగున గీతి సాహితీకవితారీతులలో విస్తరిల్లిన వాఙ్మయమున తక్కిన మతము లన్నింటికన్న నీ వీరశైవ మతప్రాబల్యమే క్రీ.శ 12వ శతాబ్దమునుండి 15వ శతాబ్ది వరకు గోచరించుచున్నది."

## 2. కవిత్రయకవితా ప్రాబల్యము : దేశికవిత పతనం

"క్రీ. శ. 11వ శతాబ్దినాటి కుత్తమ సాహితీ విశిష్టత లేర్పడిన తెనుగున, వైదిక మతప్రాధాన్యము వలన సాహిత్యమంతయు సంస్కృత పండితాధీనమైనది. సంస్కృత భాషాగౌరవము, బ్రాహ్మణ జాతి ప్రత్యేకతయు సర్వత్రవ్యాపించినవి. మత సంబంధమగు నాధ్యాత్మికవిషయ ముత్తమసాహిత్యద్వారమున గాని ప్రజాసామాన్యమున కందుబాటులోనికి రాకపోయినది. కేవల దేశి సాహితీ కవితల యెడ దాదరము సన్నగిల్లినది. దేశీయము గాని మార్గకవిత ప్రకృష్ట స్థాన మాక్రమించినది."

## 3. శివకవులు : జాతిమత సమైక్యత

"ఉత్తమ సాహితీ పథకమున జాతి, మత వివాదము కూడదని నిరూపించినవారు శివకవులు. శైవ వాఙ్మయము వ్యాప్తమైన తరవాతనే వేమనాది మహాకవులు తెలుగు దేశమున విలసిల్లిరి మరియు పెక్కుజాతులలో కవులు వెలసిరి."

## 4. సర్వజన సులభ గ్రాహ్యమైన వేదాంతం

"అల్పాక్షరముల ననల్పార్థరచన గల్పించి యతి గంభీరము లగు వేదాంత విషయములు తెలుగున సర్వజనులకు సులభగ్రాహ్యమగు భాషలో రచించినవారు వీరశైవకవులు."

## 5. కర్మజ్ఞాన మార్గ నిరసన - భక్తిప్రాధాన్యము

"సంఘమున నేకొలదిమందికిగాని సాధ్యముగాని కర్మజ్ఞాన మార్గముల విడచి ప్రజాసామాన్యము యొక్క ఆత్మశక్తులను కేంద్రీకరింప జేసి, భక్తిసూత్రమున సంఘమును బంధించు మతమే వీరశైవము.

## 6. వీరశైవ మతము:

"కన్నడ దేశమున బసవేశ్వరుడు జన్మించి కేవల భక్తిప్రధానమగు శివమతమును బోధించి ప్రచారము చేసి తన్మతప్రవర్తకు డయ్యెను. జాతిమతవివక్ష లేని కారణముచేత నందఱు నామతములో చేరుటకు నధికారులైరి. పుట్టుకచే బ్రాహ్మణుడయ్యు, బసవన వైదిక కర్మలను విసర్జించి, కర్మజ్ఞాన మార్గముల విడనాడి కేవల భక్తిమతమును ప్రబోధించెను. దీనికే వీరశైవ మతమని పేరు."

## 7. ఆరాధ్యులు - జంగములు - లింగాయతులు

"బసవననాటి నుండియు నాంధ్రదేశమున బసవ సంప్రదాయమువా రైన జంగములును, పండిత సంప్రదాయము వారైన యారాధ్యులు నీ మతమును పెంపొందించిరి. బసవసంప్రదాయమునకు చెందినవారిని కన్నడదేశమున లింగాయతులు అని పిలుతురు."

## 8. మహాభారతాంధ్రీకరణ - కాలవిలంబన

క్రీ. శ. 1050-60 ప్రాంతముల మార్గకవితారీతిని నన్నయ అనువదించిన మహాభారతము 13వ శతాబ్ది చివరి పాదము 14వ శతాబ్ది తొలి పాదమున కాని పూర్తి కాలేదు. దీనికి కారణము వీరశైవమతమే. శివకవులైన నన్నిచోడ, మల్లికార్జున పండితారాధ్య, పాల్కురికి సోమనలు దేశికవితారీతులు నుద్ధరించి వైదిక ప్రధాన మహాభారతాంధ్రీకరణమును నరికట్టిరి.

# 11. పాల్కురికి సోమన కాలం

"సోమనాథుని గ్రంథములు జానుతెనుగున రచితములై ప్రజాసామాన్యమును నాకర్షించిన విధానమును గమనించియే తిక్కన భారతమున మూడువంతులు తెలుగు పదములతో కూర్చినాడు. తిక్కన హరిహరాద్వైతభావము పెంపొందుటకు సోమన కేవలవీరశైవ భక్తి ప్రతిపాదికములగు కృతులే కారణము. ఒకవైపున వీరశైవము, ఒకవైపున వైష్ణవము వ్యాపించి సంఘములో విభిన్నత యేర్పడి కలహములకు కారణమగుటచేత నారెండు తత్త్వములను సమన్వయించి సంఘములో నేకీభావమును కలుగజేయు హరిహరాద్వైతమును తిక్కన మొదట ప్రతిపాదించినాడు. వాఙ్మయ పరిణామ దృష్టితో పరిశీలించిన సోమన, తిక్కనకు పూర్వుడు కావలిసినదే కాని, సమకాలమువాడు కాని, అర్వాచీనుడు కాని కాదు. శివకవుల యనుసరణలు తిక్కనయందే కలవు. నన్నయ కవితాస్రవంతియు, శివకవుల దేశిరచనా స్రవంతియు తిక్కన భారత రచనలో నేకమైనవి. కావున సోమనాథుడు క్రీ. శ. 1190 నుండి 1260 వఱకును విలసిల్లియుండె నని నా సిద్ధాంతము."[1]

## శివకవులు

## మార్గ-దేశి సమ్మేళనము

మతము : మార్గ - పండితారాధ్య సంప్రదాయము - వేద ప్రామాణ్యము - కర్మమార్గ ఖండనము - భక్తి వేద సమ్మిళితము.

దేశి - బసవ (జంగము) సంప్రదాయము వర్ణాశ్రమధర్మ విరహితము - కేవలభక్తి మార్గానుసరణము.

1. బసవపురాణ పీఠిక - పుట 34. ఆంధ్రగ్రంథమాల మద్రాసు - 1952

| | |
|---|---|
| సంఘము : | మార్గ - వర్ణాశ్రమధర్మరక్షణ - బ్రాహ్మణప్రాధాన్యము- ఆరాధ్యులు - తదితర బ్రహ్మణశాఖల యైక్యత |
| | దేశి - అష్టాదశవర్ణ రాహిత్యము - జంగమ లేదా లింగాయత ఏకజాతి మాత్రము. |
| భాష : | మార్గ - సంస్కృతభాషాధిక్యము - కవిపండిత శిష్టజన వ్యావహారికము |
| | దేశి - జాను తెనుగు - ప్రజావ్యావహారికము దక్షిణాది భాషల ఆదరణ |
| కవిత్వము : | మార్గ - అక్షరగణ ప్రాధాన్యవృత్త రచన ఆర్షకథా వస్తు స్వీకరణ |
| | దేశి - మాత్రాగణ ప్రధానము - దేశిపలుకుబడి జాతీయ ధ్వని |
| సాహిత్యప్రక్రియలు : | మార్గ - చంపూపద్ధతి (గద్య, పద్య మయరచన) ప్రబంధశైలి |
| | దేశి - ద్విపద, రగడ, శతక, ఉదాహరణ, వచన, గేయరచనలు |
| కథావస్తువు : | మార్గ - ఆర్యమతసంబంధము - పౌరాణికము దివ్యనాయకము - వేదప్రతిపాద్యము |
| | దేశి - చారిత్రికము - నూతనము - మానవ నాయకము- వీరారాధన - భక్తిప్రతిపాదన[1] దేశకాల ప్రతిబింబము. |

1. ఇంతవరకు వెంకటరావుగారు వ్రాసిన వీరశైవ వాఙ్మయ వ్యాసం నుండి వారి సిద్ధాంతాలను (భారతి జనవరి (1949) నుండి క్రోడీకరించడం జరిగింది.

## శివకవి యథావాక్కుల అన్నమయ్య

"ప్రాచీనాంధ్ర వాఙ్మయమున శివకవులలో నన్నెచోడుడు మల్లికార్జున పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు నను కవిత్రయముతో జేర్పదగిన శివకవి - యథావాక్కుల అన్నమయ్య[1]. ఈతని కృతి సర్వేశ్వర శతకము క్రీ. శ. 1742లో రచితమగుటచే నుపలబ్ధమగు ప్రాచీన శివకవుల కృతులలో నిదియు నొకటి యని చెప్పనగును. భాషయందును, భావములయందును కావ్యవస్తువు నందును నీకృతి శివకవికృతి యనియు, నితడు శివకవియే యనియు నిరూపింపనగును."[2]

వేంకటరావుగారు ఈ విషయాన్ని భారతి 1944, 45 డిసెంబరు, మార్చి సంచికలలో సోపపత్తికంగా నిరూపించారు.

వేంకటరావుగారు కేవలం శివకవుల సాహిత్యాన్నే కాక భాషను కూడా మథించారు.[3-10] 1. బసవనామ నిర్వచనం 2. శివకవుల పదములు - శాసన ప్రయోగములు 3. శివకవుల పలుకుబడి 4. కొన్ని ప్రయోగాలు - పరిశీలన. 5. ఆక్షేపము - సమాధానము. 6. శివతత్త్వసార పాఠాలమార్పు తగునా? 7. నన్నెచోడుని పదప్రయోగసూచిక (విమర్శ) 8. నన్నయ్య - నన్నెచోడకవులు (భాషాప్రయోగ సామ్యములు) మొదలయిన వ్యాసాల్లో శివకవుల ప్రత్యేకతను నిరూపించారు.

'సోమన సృష్టించిన ఛందస్సు' అనే వ్యాసంలో ద్విపద, గద్యాదికృతులను ఆమూలచూడంగా సమీక్షించారు. అనుభవసారంలోని త్రిభంగివృత్తం లక్ష్యాన్ని చూపింది వేంకటరావుగారే.

(1) "మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమును, నన్నిచోడుని కుమారసంభవమును, మన సోమనాథుని కృతులును, నిప్పుడు మనకు లబ్దములైన శివకవుల గ్రంథములలో, బ్రాచీనములు" అని వేటూరి వారు తమ బసవపురాణ పీఠిక 82 పుటలో సూచించారు.

(2) భారతి 1944 డిసెంబరు 513 పుట - 45 మార్చి పుట 219.

(3) 25.3 - 23 ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం. (4.) భారతి 1944 అక్టోబరు పుట 321

(5) భారతి 1948 సెప్టెంబరు పుట 257. (6.) భారతి 1959 ఏప్రిల్ పుటలు 54 - 60.

(7) భారతి 1959 జులై. (8.) భారతి 1960 ఏప్రిల్ పుటలు 78 - 81

(9) భారతి 1963 జనవరి పుటలు 70 - 78. (10.) భారతి 1963 మే పుటలు 58 - 64

## . ష - వ్యాకరణం - ఛందస్సు

నిడదవోలు వేంకటరావుగారి భాషా వైదుష్యమంతా కవి ప్రయోగ పరిశీలనపై ఆధారపడి ఉంది. కాల్డ్వెల్, చిలుకూరి నారాయణరావు, టి.ఎం. శేషగిరి శాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య, గిడుగు రామ్మూర్తి పంతులు, గంటి జోగి సోమయాజి భద్రిరాజు కృష్ణమూర్తి మొదలయినవారు భాషాశాస్త్ర రచయితలుగా ప్రసిద్ధి కెక్కారు. మానవల్లి, వేటూరి, నిడదవోలు వారు తాళపత్ర గ్రంథసేకరణ, పరిష్కరణ, కవిప్రయోగ పరిశీలనలో ప్రఖ్యాతి చెందారు. ఇందులో గిడుగు రామ్మూర్తి పంతులు వ్యావహారిక భాషోద్యమానికి భగీరథు లయినా వారి పాండిత్యంలో సగపాలు కవి ప్రయోగసరళిపైననే ప్రదర్శిత మైంది. వఝుల చినసీతారామశాస్త్రిగారు తెలుగు వ్యాకరణాలపై సాధికారంగా గ్రంథాలు వ్రాశారు. కాని, వారు కవి ప్రయోగాలకంటె వ్యాకరణానికే ప్రాముఖ్యం ఇచ్చారు.

కవి ప్రయోగాలలో ముక్కాలు మువ్వీసము లేఖకదోషజనితాలే అని వారి దృఢ విశ్వాసం. అవసరమయితే దిద్దుబాటునకు వెనుదీయరు. వఝుల వారిది వ్యాకరణ దృష్టి. నిడుదవోలు వారిది ప్రయోగదృష్టి.

భాషాశాస్త్ర గ్రంథాలు వ్రాయకపోయినా వేంకటరావుగారు భాషావిషయిక రచనలు చేశారు. సంస్కృత ప్రాకృతాల ప్రభావంతో తత్సమ తద్భవాలు దేశి, అచ్చ తెనుగు ద్రావిడ భాషా సంపర్కంతో భాషలో చేరి నేటి తెలుగుభాష అవతరించిం దని వారి అభిప్రాయం.[1] ఆంధ్ర - తెలుగు - పదాలను గూర్చి వీరు ఆంగ్లేయ భాషలో పరిశోధన వ్యాసం వ్రాశారు.[2] ఇందులో తెలుగు వ్యాకరణాలను వ్రాసిన విదేశీయులు వాడిన Telinga, Gentoo, Teloogoo పదాలను గూర్చి చర్చించారు. కాల్డ్వెల్ కంటె ముందు తెలుగు ద్రావిడభాషాజన్యమని చెప్పిన ఎఫ్.

1. Telugu - A link between North and South. కలకత్తా, ఆంధ్రసాహిత్యపరిషత్ వార్షికోత్సవ సంచిక.
2. History of Telugu Linguistics. JOR. Vol XVII. Pt. II 1961.

డబ్లు. ఇల్లీస్ దొర వ్రాసిన Dissertation of Telugu Language అనే వ్యాసాన్ని సంపాదించి ఈ వ్యాసపరంపరలో ముద్రించారు.

ఇవికాక వేంకటరావుగారు ఇంగ్లీషులో కావలి సోదరులే భారతదేశంలో మొదటిసారిగా ఆంగ్లభాషలో వ్యాసాలు, గ్రంథాలు రచించా రని, ఈవ్యాసం ఈనాడు ఆంగ్లభాషలో రచించే భారతీయులకు కనువిప్పు కలిగిస్తుంది. తెలుగువారే ఆంగ్లభాషలో వ్యాసాలు, గ్రంథాలు తొలిసారిగా రచించిన భారతీయులని వారు నిరూపించారు.[1]

వేంకటరావుగారు తెలుగు సాహిత్యాన్ని నిశితంగా అధ్యయనం చేశారు. తెలుగు - సంస్కృతం[2], తెలుగు ప్రాకృతం[3], అష్టభాషలు[4], తెలుగు, తమిళం[5] అనే శీర్షికలతో నాల్గు వ్యాసాలు వ్రాశారు. ఇవి తెలుగు సాహిత్యాన్ని ఆధారంగా చేసుకొని వ్రాసిన వ్యాసాలు. తెలుగులాక్షణికులు అష్టభాషలలో తెలుగును కూడా చేర్చారు. సంస్కృత లాక్షణికులు దీనిని అంగీకరించలేదు. పాకృతం ద్వారా తద్భవాలు ఏర్పడిన విధానాన్ని, తమిళభాషను గూర్చి తెలుగు కవులు చెప్పిన విశేషాలను వేంకటరావుగారు సవిమర్శనాత్మకంగా తెలిపారు.

## వ్యాకరణము

తెలుగులో 'ఆలు' ప్రత్యయ చరిత్రను నిశితంగా పరామర్శించి, సంస్కృత, తద్భవ, దేశ్యపదాలతో 'ఆలు' పదం సమసించిన సమాసాలు చాలా వాటిని ప్రదర్శించారు. పేదరాలు, ధీరురాలు, మగనాలు, వెలయాలు, ఇల్లాలు ఇత్యాది పదాలలోని ఆగమాదులను సంధులను గురించి విపులంగా చర్చించారు. 'అరాలు' అనే ప్రాథమిక రూపమే తెలుగులో 'రాలు'గా మారిందన్నారు[6] ముద్దరాలు, ఈలువుటాలు, రంకుటాలు, పేరంటాలు, పురిటాలు, ప్రోయాలు, కళ్లాలు, పెద్దాలు,

1. Pioneers of English Writing in India. JOR Madras University Journal.
2. భారతి 1968 మార్చి, 3. 66 ఆగస్టు, 4. 66 జూలై, 5. 67 నవంబరు.
6. వ్యాకరణము - కవి ప్రయోగసరళి పుటలు 22 - 23.

ఏరాలు, గట్టువాలు మొదలయిన రూపాలలోని ద్వితీయావయవం స్వరూప స్వభావాలు చర్చించారు.[1]

వ్యాకరణాల్లో భాషాపరంగా చెప్పిన 'ఆంధ్ర' పదాన్ని వివరించారు.

నన్నయ 'ఆంధ్ర శబ్దచింతామణి' వ్రాయలేదని వీరి అభిప్రాయం. చ, జల దంత్యతాలవ్య ఉచ్చారణలను చర్చించి చింతామణి మొదలయిన వ్యాకరణాలు అర్వాచీనాలని సిద్ధాంతీకరించారు.

తెలుగులో నంది మల్లయ ఘంట సింగయ కవుల ప్రయోగాలను గూర్చి తమ పీఠికలో పేర్కొన్నారు.[2]

ప్రబోధచంద్రోదయంలో -

'ఒడిసి వడిన్నెగయు' (3-77)

ఇది ద్రుతద్విత్వసంధి అనుకున్నా 'ఎగయు'కి హలాదిగా 'నెగయు' రూపాంతరం ఉందని చెప్పారు.

'త్రుళ్లడమున కేళ్లంగి' (5.3)

త్రుళ్లు ధాతువునకు భావార్థంలో త్రుళ్లుట అనేగాని త్రుళ్లడము ఉండదని ఇది విశేషప్రయోగ మని అన్నారు. ఇంతేకాక ఈ గ్రంథంలోని 'అంబులు' (5-15), ప్రౌఢిమ (1-10), బృసి (2-8), వారణసి ప్రయోగ వైచిత్రిని తెలిపారు.

బాల వ్యాకరణ కృదంత పరిచ్ఛేదంలో 22వ సూత్రం కింద 'వడి ప్రభృతు లిట్లెఱుంగునది' అని కలదు. కాని, ఇచ్చట శబ్దము వడికాజాలదు. ఇదీ 'అడి' అనే ఉండాలని కొలువు + అడి, కొలువడి; గెలువు+అడి - గెలువడి; రూపాలు వుకారాంతా లని వారు రుజువు చేశారు[3]. నేడు'పు' అంతమందు కనబడే శబ్దాలు 'వు' అంతంలో ఉండేవని వారు అభిప్రాయపడ్డారు.

1. వ్యాకరణము - కవి ప్రయోగ సరళి. పుటలు 27 - 30.
2. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ - ప్రబోధచంద్రోదయము.
3. శర (శబ్ద రత్నాకరము)- సవరణ - వివరణలు పుట 819

చిన్నయసూరి 'ఇచ్చునకు ఇయాదేశం బగు' అని సూత్రీకరించి నన్నయ 'బలిమి నీయని భూమివలయపతుల' అని చూపాడు. ఇచ్చునకు ఈన్ అనే వ్యతిరేకార్థక క్రియ కూడా ఉండే దని నన్నిచోడుని కుమారసంభవ ప్రయోగాన్ని చూపారు.

'ఓ యామంత్రణంబునం దగు' అని చిన్నయ సూరి ఆంధ్రశబ్ద చింతామణిని బట్టి సూత్రించె కాని నన్నయ భారతమందు ఎక్కడా 'ఓ' ప్రయోగం లేదని వారు అన్నారు'.[1]

బాల వ్యాకరణంలో 'ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు' (క్రియా.30)[2] 'చువర్ణంబుతో దుగ్దకారంబు తకారంబగు' (క్రియా 108) అని చిన్నయ సూరి సూత్రించడం వల్ల 'చూతము' అనే రూపం లాక్షణికమై 'చూతాము' అనే రూపం అసాధువవుతుంది. కాని, కవి ప్రయోగాలలో 'చూతామ'ని కనబడుతోందని 'స్తంభంబులో చూపరా చూతామంచు' అనే ప్రయోగాన్ని అయ్యలరాజు రామభద్రకవి ఒంటిమెట్టరఘువీరా! జానకీ నాయక శతకంలో నుంచే కాకుండా కృష్ణరాయలకాలంలోని రాధామాధవకవి విష్ణుమాయానాటకంలో

"ఆతేజంబును...

చూతామంచు' (1-24) అనే ప్రయోగాన్ని కూడా చూపి ఇవి పండితులు దిద్ది పాడుచేశా రని అన్నారు.

వేంకటరావుగారు శబ్దరత్నాకరానికి చేర్చిన అనుబంధంలో సవరణ - వివరణలు అనే శీర్షికలో అనేక వ్యాకరణ విశేషాలు తెలిపారు. గ్రంథ విస్తరభీతిచే వాటి నన్నింటిని ఇక్కడ పేర్కొలేదు.[3]

1. చూ॥ శర. (శబ్ద రత్నాకరము) సవరణ - వివరణలు. పుట 828
2. అదే పుట 840-41.
3 చూ. శర. (శబ్ద రత్నాకరము) సవరణ - వివరణలు పుటలు 817-68

# ఛందస్సు - యతి ప్రాసలు

## ఋ - రు యతి

ఋకారం దేశభాషల్లో లేదు. సంస్కృతంలో ఉంది. శాసనాల్లో, తాళపత్ర గ్రంథాలలో లేదు. 'శ్రీపతి యగు రుషి, బ్రిహస్పతి, ప్రిథివి, అనే శబ్దాలు సంస్కృతమైనా రకారోచ్చారణతోనే కనబడతాయి. వ్రిక్షము, బ్రింద, మ్రిగాంక అనే విధంగానే శాసనాల్లో చెక్కారు.[1]

దేశభాషల్లో లేని సంస్కృతాక్షరాన్ని సహజోచ్చారణ ప్రకారం 'రి' గానే పలుకుతారు. కవులు కూడా ఆ విధంగానే ఉచ్చరించారు. లాక్షణికులు లక్షణం కల్పించారు. యతి ప్రాసమైత్రికి ఇష్టపడ్డారు.

'ఋత్విజుం డని విచారించి పూజించితే' అనే నన్నయ ప్రయోగంలో 'రిత్విజుండనే ఆకాలం నాటి లిపిలో ఉంటుంది.

ఛందోగ్రంథాలను క్షుణ్ణంగా పరిశీలించిన రావూరి దొరస్వామి శర్మగారు

"ఋ - రి వర్ణములు ఋవళి చేచెల్లును
కాని 'ఋ-రు' లు చెల్లవు.

ఋ-రు వడి యేలాక్షణికుడు చెప్పలేదు"[2] అని స్పష్టం చేశారు.

కాని, వేంకటరావుగారు గాఢపరిశ్రమ చేసి ఈ క్రింది ప్రయోగాలు సేకరించారు.

"రురువర్ణదేహంబు ఋగ్వేదమునకు"
పండితారాధ్యచరిత్ర (పుట: 523)

"పుండరీక నేత్రుని నిజధామవైభవ సమృద్ధికి"
భాగవతము (దశమ ఉ 5317).

1. దక్షిణభారత శాసనావళి. సం.6. సంఖ్య 117.
2. భావప్రకాశిక. (అప్పకవీయ తతీయాశ్వాస వ్యాఖ్యానము.)

తిక్కన శల్యపర్వంలో మంకణ మహాముని వైభవాభివర్ణనఘట్టంలో

అతఁడు సరస్వతి నవగాహనము చేయు
చుండి యాచేరువు నొర్తు తడుపు
గట్టక నీళ్లాడగాఁ జూడ తనదు శు
క్లము నిర్గమించిన ఘటసురక్షి
తము సేయ సప్తభేదము లొంది యది సత్పు
రుషు లైరి వారు మరుద్గణంబు
నకు సుజన కారణం బైరి *(2-160)* అని

ప్రయోగం చేశాడు. వాస్తవానికి తిక్కన అక్కడ

"సప్త ఋషులైరి వారు మరుద్గణంబు" అని ఉన్న దని వేంకటరావు బ్రౌన్ దొరవారి మహాభారత లిఖిత ప్రతులు, సంశోధిత మహాభారతం పరిశీలించి నిర్ధారించారు. దీంతో ఋ-రు యతి నిర్ధారణ మైంది[1]. సంశోధిత ముద్రణంలో ఈ పద్యభాగం వద్ద ఉన్న 'ఫుట్‌నోట్స్'లో 'సప్తఋషులైరి - పెక్కు ప్రతులు అని చూపబడింది.

## రాగమ సంధియతి

"జోగు రావిగూడి తంట రాకుమన్న" అని ప్రబోధ చంద్రోదయం (3-49) ఇక్కడ వ్యంజనయతి. చిన్నయసూరి ప్రకారం 'రాలు'కి స్వరయతే కాని వ్యంజన

1. దీనిని వేంకటరావుగారు 1951లో వావిళ్లవారు ప్రచురించిన అప్పకవీయ పంచమ ముద్రణ పీఠికలో మొదటిసారిగా లోకానికి వెల్లడించారు. 1955లో వాఙ్మయ మహాధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు పేరు చెప్పకనే ఉద్ధరించారు. 'ధ్వని - లిపి - పరిణామం' అనే తమ గ్రంథంలో వేంకటరావుగారు సేకరించిన మరికొన్ని ప్రయోగాలను వాడు కొన్నట్లు ఫుట్‌నోట్‌లో తెలిపారు. ఒకరు సేకరించిన అపూర్వ ప్రయోగాలను వాడుకొని తమే ఈ ఋ-రు యతి ప్రయోగాన్ని తామే కనుగొన్నట్లు లోకాన్ని భ్రమింపజేసినట్లయింది. ఈ గ్రంథంలోని చాలా ప్రయోగాలు పేరు చెప్పినా చెప్పక పోయినా వేంకటరావుగారి సొంతమేనని భావి పరిశోధకులు తెలియవలసి ఉంది.

యతి లేదు. అప్పకవి వ్యంజనయతికోసం రాగమ సంధి వళులని లక్షణం ఏర్పరచాడు. స్వరవ్యంజన యతులు రెండూ ఉండవచ్చు నని వేంకటరావుగారి నిర్ధారణ[1]

## ప్రాసలు

### ప్రాసమైత్రి ప్రాస

ప్రాసమైత్రి ప్రాస అంటే బిందుపూర్వక బకారానికి, మకార ద్విత్వానికి ప్రాస వేయటం. అనేక తాళపత్ర ప్రతులతో పరిశీలించిన సంశోధితాంధ్ర మహాభారతంలో

*ఇంబుగ సర్వలోకజను లెవ్వని యేని ముఖామృతాంశుబిం*
*బంబున నుద్భవం బయిన భారతవాగమృతంబు కర్ణరం*
*ధ్రంబను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం*
*ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్ (1-1-77)*

అప్పకవి చెప్పిన లక్షణానికి ఇది విరుద్ధంగా ముద్రితమైంది.

*"గట్టి బిందువు మీఁది మకారమునకు*
*జమిలి 'మా' ప్రాసమైత్రి నాఁ జరుగుచుండుఁ*
*గమ్మతావులు వెదజల్లు నంబుజములు*
*శంబరారాతి చేతివాలమ్ము లనఁగ" (అప్పకవి 3-343)*

దీనిని బట్టి సంశోధిత భారత పరిష్కర్తలు అప్పకవి మాటను లెక్కబెట్టక ఇచ్చవచ్చినట్లు ముద్రించారని తెలుస్తోంది. ఈ పద్యంలోని ప్రాస సమప్రాస. విశేష మేముంది? అన్నారు వేంకటరావుగారు. అప్పకవి చెప్పిన బింబ, అంబుజ, భూసుత, సుగంధి వృత్తలక్షణ నిర్వచన పద్యాలలో ప్రాసమైత్రి ప్రాస కనబడుతుంది. అప్పకవి ముందువా రైన పిల్లలమర్రి వీరభద్రుడు జైమినీభారతంలో (7-145) అనంతుడు భోజరాజీయంలో (7-23) ఈ ప్రాస వాడారు.

1. రాలు ప్రత్యయ చరిత్ర Annals of Oriental Research Madras University Journal సం. 18 (1963)

"నిత్య సత్యవచను మత్త్యా9మరాధిపాచార్యు" అనే ఉంటుంది. ర్త్యా లో రెండు సంయుక్తాక్షరాలుంటే వ్రాతలో ఒక్కతకారం మాత్రమే ఉంటుంది. అప్పుడు ప్రాస సరిపోతుంది.

తిక్కన విరాట పర్వంలో

"ద్యూతక్రీడకుఁ గొండొక
నేతున్ కపటమున నొప్పని...
చేతిధనమెల్లఁ గొని"

మౌసలపర్వంలో

"కాచికొని వచ్చి తగనా
నేచిన యట్లచట నిచట"

అన్న పద్యాలలో నేతున్, నేచిన శబ్దాలు నేత్తు9, నేచ్చి9న అని లేఖనంలో ఉండబట్టే అప్పకవి రేఫం లోపిస్తుందని చెప్పాడు. అప్పకవి (2.242) పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రలో

"మర్త్యలోకమునకు మఱి వేఱె యొకడు
కర్త యున్నాఁడె లోకత్రయవరద!"

అనే ప్రాసకూడా ఈ వలిపలగిలక ప్రాసవల్ల సురక్షితమవుతుంది.

## అనునాసికప్రాస

సంశోధిత మహాభారతం నన్నయ భాగంలో .....

లయగ్రాహి : "కమ్మని లతాంతమ్ములకు మ్మొనసి వచ్చు" అని అచ్చువేయబడింది. పాఠభేదాలలో "గణపవరపు వేంకటకవి 'కుంమొనసి'తో పాటు మఱొక 6 తాళ పత్ర ప్రతుల్లో ఈ పాఠమే ఉన్న"ట్లు చెప్పారు. గణపవరపు

వేంకటకవికి కొంచెం తరువాత వాడయిన అప్పకవి అనునాసికప్రాసకు లక్షణం చెబుతూ 'ద్విత్వనకార, మకారాలు క్రమంగా పూర్ణబిందు పూర్వకాలైన నకార, మకారాలతో ప్రాసచెల్లుతుం దన్నాడు. లక్ష్యాలకు తన పద్యాలే చూపెట్టాడు. (3.340)

మిన్నేరు పాదమున ధా
తంనాభిని కుసుమశరునెదం..
సాన్నిధ్యము
సన్నుతి ...

"తమ్ములను మల్లికాకుసు
మమ్ముల .... మాలికలను భ
క్తిం మురసంహరు పూజలు
సమ్మదమున" *(341,342)*

పై లక్షణా న్ననుసరించి నన్నయ 'కుంమొనసి' అని వాడి ఉండాలని తోస్తుంది. నన్నయయే ఆరణ్యపర్వంలో

అమ్మనీశు నివాసశక్తి ... మే
ఘమ్ములెల్ల .... ప్రమో
దమ్ముగా .... వృష్టిఁజే
సె మ్మహానదులునే ... *(3-113)*

అని వ్రాశాడు. ఇక్కడ 4వ పాదంలో 'చేసెం మహానదులున్' అనే ఉండాలి.

పాండురంగమాహాత్మ్యంలో "రమ్మ కరమ్మెఁ ద్రోచి మధురప్రియభాషిణి నన్నుగన్నమీఁ దమ్మతియును" (5-13) అని ఉంది. ఈ ప్రయోగంకూడా నన్నయ 'కుంమొనసి' వాడా డని చెప్పడాన్ని బలపరుస్తుంది.

## స్వవర్గజప్రాస

నన్నయలో (1.2.200) స్వవర్గజప్రాస ఉందని అప్పకవి చూపాడు. (3..358).

*కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం*
*బోధనఁజేసి చేసె నృపపుంగవ"*

సంశోధిత మహాభారతంలో ఈ పద్యానికి పాఠబేధాలు వ్రాస్తూ '5 తాళప్రత్ర ప్రతులలోని రెంటిలో' సంబోధన చేసి చేసి నృప సుందర' మిగత మూడింటిలో 'సంబోధన చేసి చేసి యరిసూదన' అనే విధంగా ఉన్నాయని వారు సూచించారు. వేంకటరావుగారు నన్నయలో స్వవర్గజ ప్రాస లేదని చెప్పారు. నన్నయ రచిత భాగంలో నుంచే వారు 'చోదన' అనే శబ్దప్రయోగబాహుళ్యాన్ని ప్రదర్శించారు.

దీనిని బట్టి నన్నయలో స్వవర్గజ ప్రాస లేదని వేంకటరావుగారి సిద్ధాంతం.

## ఉదాహరణలు

సప్తవిభక్తులతో సంబోధనాంతంతో రచించే లఘుకృతికి ఉదాహరణ మని పేరు. ఇందులో కళికోత్కళికలు, తాళలయానుకూలంగా నడుస్తాయి. దీనిలోని పద్యాలు సంస్కృతచ్ఛంద సంజాతాలు. కళికోత్కళికలు మాత్రాప్రధానాలు. అంత్యప్రాసక్రీడ నిత్యం. ఇవి సాధారణంగా గేయ ప్రబంధజాతిలో చేరినవి.

ఉదాహరణలు సంగీత సాహిత్య సంగమములై భగవద్భక్తి స్తోత్రకదంబకములై విలసిల్లినట్లు వేంకటరావుగారు చెప్పారు. ఇందుకు ఉదాహరణగా వారు రగడల లక్షణాలను ఈ కింది విధంగా చూపారు.

*హరిగతి - చతురస్రగతి - 4 మాత్రలు - ఏకతాళం*
*ద్విరదగతి - ఖండగతి - 5 మాత్రలు ఝంపెతాళం*
*తురగవల్గన - త్రిస్రగతి - 3 మాత్రలు రూపకతాళం*
*జయభద్ర - ఖండగతి - 5 మాత్రలు ఝంపెతాళం* [1]

1. సోమనచ్ఛందస్సు - పుట. 66

## ద్విపద

'సోమన సృష్టించినచ్ఛందస్సు'లలో ద్విపద ప్రముఖమైంది. వాస్తవాని సోమన సృష్టించిన కొత్తఛందస్సు అనేది లేదు. దేశసాహితిలో ప్రజలు పాడుకునే గీతాలు చాలావరకు ద్విపదవికారాలే.

జాతులు మాత్రానుసంధాన గణవి
నీతులు గాన 'యనియతి గణై' ర
రనియును 'బ్రాసోవా' యనియు 'యతిర్వా'య
నియుం జెప్పు ఛందో వినిహితోక్తి గాన
ప్రాసమైనను యతిపై వడి యైన
దేసిగా నిలిపి యాదిప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు
నొప్పదు ద్విపదకార్యోక్తి నా వలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి"[1]

పై పంక్తులను బట్టి సోమన ద్విపదను సంస్కరించి నట్లు చెప్పుకొన్నాడు. అందువల్లనే ద్విపదకు

'కావ్య కళాప్రౌఢిఁ గల్పింతు' [2] నన్నాడు

ద్విపదలక్షణాలను గురించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు బసవపురాణ, పండితారాధ్య చరిత్ర పీఠికల్లో విశేషంగా

1. పండితారాధ్య చరిత్ర - దీక్షా ప్రకరణము - పుటలు 17, 18.
2. పండితారాధ్య చరిత్ర - దీక్షా ప్రకరణము - పుటలు 20

వ్రాశారు. వేంకటరావుగారు ద్విపద ప్రాశస్త్యాన్ని సర్వముఖాలుగా పరిశోధించి ద్విపద గానయోగ్య మని నిరూపించారు. [1]

సంస్కృత గ్రంథాలలోని ద్విపదనిర్వచనాలను ప్రదర్శించారు. ప్రాసయతి గేయ లక్షణమని చెబుతూ రామరాజ భూషణుని వసుచరిత్రలోని

"ఒక చాయ ననపాయ పికగేయ'
'లలనాజనాపాంగ వలనా వసదనంగ'

మొదలైన పద్య పాదాలను చూపి తాళ లయాను గతి కొరకే ప్రాసయతిని సోమన వాడారని వేంకటరావుగారు సమర్థించారు. [2] ఈ సందర్భంగా యక్షగానాల్లో ప్రయుక్తమైన ద్విపద ప్రాముఖ్యాన్ని వారు తెలిపారు.

1. సోమన సృష్టించిన ఛందస్సు
2. సోమన సృష్టించిన ఛందస్సు పుట 82.

నిజానికి తెలుగు జాతి కవితాకంఠం రెండు వేల సంవత్సరాలకు ముందే విచ్చుకొంది. "తెలుగువారు గోదావరి కృష్ణాతీరాల సొబగులను గొంతెత్తి ఆలపించారు. సాతవాహన చక్రవర్తి హాలసాతవాహనుడు సేకరించిన గాధాసప్తశతిలోని కొన్ని గాథల కర్తల పేర్లు తెలుగు పేర్లుగా కనిపిస్తాయి. ముద్ద, ఆలయ, సవరసత్తి, సబ్రస్వామి, పొట్టన, దుగ్గసామి పండి, అణ్ణయ, పాలయ వంటివి. వారు గ్రామజీవన విశేషాలను, గృహ జీవన మాధుర్యాన్ని కనులకు కట్టించారు. తమ గాథలలో ముద్దయ్య, వ్యాధ, వధువు సౌభాగ్య గర్వాన్ని ఇలా అతిమనోహర సరస సహజంగా వర్ణించారు.

"సిహిపేహుడా వ అంసా
బహు ఆ వాహస్య గవ్విణీధమఇ,
గఅ మోత్తిఅ రఇఅ పసా
హణాణం మజ్ఝె సవత్తీణమ్ *(2-76)*

[ఒక బోయనాయకునికి పలువురుభార్య లున్నారు. బోయనాయకుడు మహావీరుడు. ఏనుగులను చంపి, వాటి కుంభస్థలాలలోని ముత్యాలను తెచ్చి తన భార్యల కిచ్చాడు. వారు వాటితో సరాలు గుచ్చుకొని మరోవిధంగాను వివిధవిధాలుగా నగలు చేసుకొని అలంకరించుకొన్నారు. వారిలో ఒక యువతి భర్తకు చాలా ప్రియమైనది. అతడు ఆమెకు నెమలి యీకను తెచ్చి బహూకరించాడు. ఆ యువతి దానిని సిగలో (కృష్ణుని లాగ) చెక్కుకొని తన సవతులమధ్యనుంచి, గర్వంతో అడుగులు వేస్తూ వెళ్ళింది.] కాని, అప్పటి రాజభాష, మాతృభాష ప్రాకృతం కావడం వల్ల తెలుగుజాతి కవితా వైభవమంతా ప్రాకృత సాహిత్యంలోనే నిక్షిప్తమయిపోయింది' '. కనుక తెలుగులో కవిత తర్వాత కొన్ని శతాబ్దాలకుగాని రూపు కట్టలేదు. కట్టినా

కావ్యరూపం సంతరించుకోవడానికి మరికొన్ని శతాబ్దాలు పట్టింది. ఆ కావ్యాలు కొన్ని పద్యావశేషాలయి, సమగ్రమైన భారతం అవతరించడానికి మరి ఒకటి రెండు శతాబ్దాలు పట్టింది. ఈ పరిణామం విచిత్రంగా ఉంటుంది.[1]

తెలుగువారు ప్రాకృత కవితనుంచి తమ భాష అయిన తెలుగులో కవిత చెప్పే ఉంటారు, పాటలు పాడే ఉంటారు. లేకపోతే శాసనాలలో కవితలు లిపిబద్ధాలు కానేరవుకదా. అందువల్ల మనకు తొట్టతొలుత లిపి స్వరూపంతో కానవచ్చేకవిత శాసన కవిత. భారతం వంటి పరిపాకం చెందిన కావ్యం అవతరించడం సంస్కృత నాటకాలలో అంకావతరణంలాగ జరగదుగదా! అంకావతరణమంటే ప్రవేశ విష్కంభాలు లేకుండా అంకం ఉన్నదున్నట్టుగానే ప్రారంభం కావడం.[2] ఈ విధంగా నన్నయ భారతం మొదటినుంచి ఉండకూడదుగదా! కనుక ఎందరో జ్ఞాతాజ్ఞాత కవులు వెలసి ఉండక తప్పదు.

ఈ పూర్వరంగాన్ని పూర్వకవి కవిచరిత్రకారు లెవరూ తెరచిచూడలేదు. చూడడానికి సాహసించలేదని కొందరు ఆంధ్రదేశ చరిత్రకారులు ఈ పరిశోధన మూలంగా తెలుసుకొన్నా, శాసనపద్య రచయితలను కవులుగా పరిగణించలేదు. వారికి అంతటి ఔదార్యం లేకపోయింది. ఈ విషయాన్ని నిడుదవోలు వేంకటరావుగారు గుర్తించి శాసనకవులను తెలుగు కవితాపరిణామంలో మూలపురుషు లయ్యా రని సప్రమాణంగా నిరూపించి గొప్ప సాహసం చేశారు. కనుక రావుగారి "తెలుగు కవుల చరిత్రము" విశిష్టమైనది, విలువైన దని రావుగారి పరిశోధన కేవలం "రాళ్ళెత్తిన కూలీల" పని వంటిది కాదని, పూర్వనిర్దేశ సూత్రపాత్రానుగుణంగా, నిర్మితమైన సౌధరాజ మని "తెలుగు కవుల చరిత్ర" సాక్ష్య మిస్తున్నది.[3]

1. తెలుగు వారి కవితానందం - తిరుమల రామచంద్రగారి వ్యాసం - తెలుగు వెలుగు (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పత్రిక) మార్చి-1988.
2. దశ రూపకం.
3. సూత్రపాతం లలిత కళాపదకోశం, తెలుగు విశ్వవిద్యాలయం, సంపాదకులు శ్రీయుతులు చామకుర్తి శేషగిరిరావు, డాక్టర్ రామచంద్రమజ్జ శ్రీనివాస శర్మ

రావుగారు ఈ తెలుగు కవుల చరిత్రమును గ్రంథ రచనా ప్రణాళికలో తెలిపారు.

1) ఈ గ్రంథమున నుపలబ్ధ సారస్వము నుంచి యనగా క్రీ.శ. 800 నుండి క్రీ.శ. 1500 వరకు 146 కవుల చరిత్రము తెలుపబడినది.

2) కవుల చరిత్రలన్నియు కాలక్రమము ననుసరించియే సమకూర్చబడినవి. అయినను సారస్వత చరిత్రమును సాహితీ పరిణామమును తెలిసికొనుటకు, రాజకీయ చరిత్రముతో సమన్వయించుచు ఆరుయుగముల క్రింద విభజింపబడినది.

3) మనకు లభించిన గద్యపద్యమయములైన తెలుగు శాసనములో పద్యమయ శాసనము లీకాలమునకు (క్రీ.శ. 800-1500) సంబంధించిన వన్నియు నిందు కాలక్రమమున కూర్పబడినవి. పద్యమయ శాసన రచయితలు కవులు గావున, అందుండి తెలియదగిన కవులను, పేరులు తెలిసిన వారిని కవుల జేర్పుటయు లేని వానిని "శాసన కవి" యని మాత్రము పేర్కొనుటయు నియతమైనది.

4) కవుల కాలనిర్ణయము సాధ్యమగు నంతవరకు చరిత్ర పరిశోధనల యందు ప్రమాణీకరింపబడి యామోదింపబడిన నిర్ణయముల ననుసరించి చేయబడినది.

5) ఇందులో వ్రాసిన విషయములన్నిటికిని "అథోజ్ఞాపికల"లో నాయాస్థలములలో ప్రమాణములు పుటసంఖ్య, సహితముగా నీయబడినవి.

6) కేవలము కవికాలనిర్ణయమే కాక కవికృత గ్రంథముల స్వరూపము గూర్చియు, వాని ప్రాముఖ్యమును గూర్చియు నందలి గద్యపద్యాది సంఖ్య మున్నగు విషయముల గూర్చియు వివరములు తెలుపబడినవి.

7) గ్రంథముల ముద్రితాముద్రిత వివరణము గూడా నొసగబడినది. మరియు నీ గ్రంథములపై నవీన విమర్శనము లేవి బయలు వెడలినవో అవియు నిందులో నుదాహరింపబడినవి.

8) ఈ గ్రంథరచన, గ్రంథసాధన సామగ్రి ఆయా స్థలములలోనే చూపబడినవి కావున ప్రత్యేక పట్టిక చేర్చలేదు.[1]

రావుగారు ఈ గ్రంథరచనలో ఈ ప్రణాళికను తూచతప్పక పాటించారనడంలో సందేహం లేదు. కాని 432 పుటల గ్రంథంలో నన్నయ పూర్వయుగము, నన్నయయుగము శివకవియుగము, అనే మూడు యుగాల వివరణమాత్రమే ఉంది. ప్రణాళికలోని తిక్కన యుగము, ఎఱ్ఱాప్రెగడ యుగము, శ్రీనాథయుగము అనే తక్కిన మూడు యుగాలు రెండవభాగంగా ప్రచురించదలచారేమో! అది ముద్రితమయినట్లు కనిపించదు.

## నన్నయ పూర్వయుగం

ప్రథమ ఖండమైన నన్నయపూర్వయుగం క్రీస్తుశకం 800లనుంచి 1000 వరకు నిర్ణయించారు. దీనిలో క్రీస్తుశకం 849నాటి గుణగ విజయాదిత్యుని అద్దంకి, కందుకూరు, ధర్మవరం శాసనాలు మూడు చేర్చారు. వీటి ఆజ్ఞప్తి పండరంగు. ఇతడే శాసనకవి. తర్వాత యుద్ధమల్లుని బెజవాడ శాసనం (క్రీ.శ. 898) చేర్చారు. దీనికర్త శ్రీపతి పండితుడు. కావ్యకవులు - పద్మకవి క్రీ.శ. 941, గజాంకుశుడు - క్రీ.శ.945, సర్వదేవుడు - క్రీ.శ. 960, ఆయ్యన భట్టు, క్రీ.శ. 973-990, కామసాని గూడూరు శాసనకవి - (క్రీ.శ. 1000 ప్రాంతం) ఈ యుగంలో చేరారు.

**1. అద్దంకి శాసనం :** తూర్పు చాళుక్యవంశీయుడైన గుణగ విజయాదిత్యుని ప్రథమ సంవత్సరంనాటిది. ఇతడు క్రీ.శ. 848 నుంచి 892 వరకు రాజ్యం పాలించాడు. గనుక ఈ శాసనం క్రీ.శ. 848 నాటిదని రావుగారు నిర్ణయించారు. ఈతని రాజధాని బెజవాడ.

ఈ శాసనంలోని ముఖ్యవిషయం గుణగ విజయాదిత్యుని సేనాధిపతి అయిన పండరంగడు ధర్మవరంలో ఆదిత్య భట్టారకుడనే వ్యక్తి కొంతభూమిని

1. తెలుగు కవుల చరిత్ర. పుట: 1-2.

దానం చేయడం. ప్రసంగవశాత్తు పండరంగడు గుణగ విజయాదిత్యుడు పట్టమెక్కిన సంవత్సరమే సేనాపతి అయి సామంత సైన్యంతో బోయరాజుల కోటలు పన్నెండు పట్టుకొని, త్రిభువనాంకుశ బిరుదదారులయిన వేంగీచాళుక్యుల పతాకం నిలిపాడని, కట్టెపు దుర్గాన్ని పాడుపరచి, కందుకూరును మెచ్చి బెజవాడ అంతటి పట్టణంగా నిర్మించాడని కూడ వర్ణితమైంది.

అద్దంకి శాసనం ఉపలబ్దమైన తెలుగు పద్య మయ శాసనాలలో మొదటిది గనుక తరువోజ వంటి ఛందస్సులో ఉంది గనుక విశేషప్రాధాన్యం వహించింది. తొలి తెలుగు ఛందస్సు గనుక దీనిని ఉదాహరించడం అవసరం.

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేడు
బలగర్వమొప్పగ బైలేచిసేన
పట్టంబు గట్టించి ప్రభు పండరంగు
బంచిన సామంత పరువతో బోయ
కోట్టము ల్వంద్రెండు గొని వేంగినాటి
గొఅల్పియ త్రిభువనాంకుశణ్ణ నిల్పి
కట్టెపు దుర్గంబు కడుబయల్సేసి
కందుకూర్బె జవాడ గావించె మెచ్చి"

తరువోజ ధ్రువపదంనుంచి నిష్పన్నమైందని రావుగారు వివరించారు. ఈ తరువోజ పాదాన్ని రెండుగా విరచి పాల్కురికి సోమన ద్విపదను సృష్టించాడు.[1]

**2. కందుకూరి శాసనం :** ఇదికూడ పండరంగని పరాక్రమం వర్ణించేదే. అద్దంకి శాసనకాలందే ఇది సీస పద్యంలో ఉంది. అసమగ్రం. ఈ శాసనంలోని "గుణ కెల్లత పక్షపాతి" అనే పదం గుణకాంకితుడనే దానికి కన్నడ వ్యవహారమని రావుగారు వివరించారు. ఇది గుణగ విజయాదిత్యుని బిరుదులలో ఒకటి. యాప్పిరంగం కారికై అనే తమిళ ఛందో గ్రంథంలో వడగుఛందం, (రేచన తెలుగు

1. పరిశోధన - సోమనాథ సంచిక వ్యాసం

ఛందస్సు) గుణగాంకయ కన్నడ ఛందస్సు పేర్కొన్నారు గనుక (గుణగ విజయాదిత్యుని ఛందస్సు) గుణగ విజయాదిత్యుడు కవి అయి ఉంటాడని రావుగారు నిర్ణయించారు. ఈ తమిళ ఛందస్సు క్రీ.శ. పదకొండవ శతాబ్దానికి ముందుది.

3. **ధర్మవరం శాసనం** : ఇది కూడ పండరంగని పరాక్రమం వర్ణించేదే. దీనిలో 1. బోయ పట్టణాలు పన్నెండింటిని జయించడం. 2. కట్టెపు దుర్గం పట్టుకొనడం, 3. కందుకూరును బెజవాడ కావించడం, 4. కన్నెర భూపతిని ఓడించడం, 5. సంకిలుని గర్వభంగం కావించడం, 6. చోడని రక్షించడం, 7. కిరణపురం, డహల, నిరుతంబు, తట్టినాడు, అచలపురం మున్నగు పట్టణాలను చూరగొనడం, (కొల్లగొట్టడం) వర్ణితాలు. రావుగారు ఈ శాసనం ప్రాధాన్యాన్ని విపులంగా చెప్పారు.

బోయ పట్టణాలు నెల్లూరి జిల్లా కందుకూరి నుంచి చిత్తూరు జిల్లా నారాయణ వనం వరకు వ్యాపించివుండేవి. వాటిని జయించాడు. బోయలనగా వ్యాధులు. వ్యాధులు సాతవాహనుల కాలంనుంచి కూడ మహాపరాక్రమవంతులు. వ్యాధ శబ్దం-వాహ-వాయ-బొయ-బోయ అని మారింది. కట్టెపు దుర్గం బోయరాజుల ప్రధాన నగరం. కందుకూరు పండరంగని రాజధాని అయింది. కన్నర భూపతి రాష్ట్రకూట చక్రవర్తి ఇమ్మడికృష్ణరాజు. కృష్ణశబ్దం కన్నర అయింది. ఇతడు క్రీ.శ. **878-914**లో వున్నవాడు, నృపతుంగుడనే నామాంతరంగల రాష్ట్రకూట రాజయిన అమోఘవర్షుని కుమారుడు. సంకిలుని దాహల రాజ్యం, నేటి బుందేలుఖండం. కిరణపురం మధ్యప్రదేశ్‌లోనిది. నేటి కిరణ్‌పూర్ అచలపురం బీహార్‌లోని మిచ్‌పూర్.

ఈ మూడు శాసనాలు పండరంగనివి. శాసన కర్తపేరు లేదు గనుక పండరంగడే శాసన కవి కావచ్చు నని రావుగారు ఊహిస్తున్నారు.

**4. యుద్ధమల్లుని బెజవాడ శాసనం** : దీనిని బెజవాడలో శ్రీమల్లేశ్వరస్వామి ఆలయములో భద్రపరచారు. ఇవి ఐదు పద్యాలున్న పెద్ద శాసనం. క్రీ.శ. 898 నాటిది. కర్త శ్రీపతి పండితుడు. ఇది మధ్యాక్కర అనే దేశి ఛందస్సులో ఉంది.

శ్రీరావుగారు ఈ శాసనాన్ని శ్రీపతి పండితుడు రచించి ఉంటాడని సోపపత్తికంగా నిరూపించారు. ఛందస్సును భాషా విషయాలను, లిపి పరిమాణాన్ని విశదంగా చర్చించారు. ఈ శాసనాలు నాల్గింటికి ప్రతిబింబాలు పొందుపరిచారు.

రావుగారు నన్నయ పూర్వయుగంలోని నలుగురు కావ్యకవులను తెలిపారు.

**1) పద్మకవి :** ఇతడు కన్నడ వాఙ్మయంలో ఆదికవి అయిన పంపడే అని రావుగారు నిరూపించారు. ఇతడు వేగిపట్టు వాస్తవ్యుడని, వేములవాడ చాళుక్య రాజయిన అరికేసరికి, తన విక్రమార్జున విజయమనే భారతాన్ని అంకితమిచ్చాడని పరిశోధకులు నిర్ణయించారు. ఇతడు తెలుగు వాడేనని జైనుడు కావడంవల్ల స్వస్థలంలో ఉండలేక వేములవాడకు వలసవచ్చాడని ఆంధ్ర పరిశోధకులు చెప్పగా[1] కన్నడులు నమ్మలేదు. కాని, పంపడు తూర్పు ఆంధ్రనుంచి పడమటి ఆంధ్రప్రాంతానికి వెళ్లాడాని నిర్ద్వంద్వంగా నిరూపించే శాసనం వేములవాడ సమీపంలోని కొండపై చెక్కిన దాన్ని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారు కనుగొనడంతో ఆ ఊహలన్నీ అణగారిపోయాయి. పంపమహాకవి తమ్ముడయిన జినవల్లభుడు తాము వేంగీ బ్రాహ్మణ జైనులమని వేంగినుంచి వేములవాడకు వచ్చామని స్పష్టంగా చెప్పుకొన్నాడు. చివర కన్నడ సంప్రదాయానుసారంగా యతిస్థానంలో అక్షరావృత్తి పాటించక కేవలం విశ్రామాన్నే పాటించే మూడు తెలుగు కందపద్యాలు రచించి, తనకు గల ఆంధ్ర కవితా శక్తిని కూడ నిరూపించుకొన్నాడు. తెలుగు కవుల చరిత్ర వ్రాసేటప్పటికి ఈ శాసనం లభించలేదు. లేకపోతే దానిని కూడ రావుగారు ఉదాహరించి ఉండేవారే! నన్నయ్యకు సరిగ్గా వందసంవత్సరముల ముందున్న పంపని సమకాలీనమైన ఈ శాసనం లభించడంతో కర్ణాటక కవి చరిత్రే పూర్తిగా మారిపోయింది. డాక్టర్ నేలటూరి వారి తక్కిన చరిత్ర రచనంతా ఒక ఎత్తు, ఈ గంగాధర శాసనం కనుగొనడం మరొక ఎత్తు.[2]

పద్మకవి జినేంద్ర పురాణంనుంచి సీసపద్యాన్ని ఉదాహరించి ప్రబంధరత్నావళి

1. భార్గవ పురాణం పీఠిక - డాక్టర్ తిరుమల రామచంద్ర.
2. జినవల్లభుని గంగాధరశాసనం - భారతి - డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారు.

పీఠికలో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఇది ప్రాచీనతర రచన అగునో కాదో యని వెలువరచిన సంశయాన్ని రావుగారు పొగడుతూ, ఉదాహృత పద్యంలోని "విషధరనిలయంబు విషధరనిలయంబు" అనే శ్లేషను చూచి చిత్రకవిత తెలుగులో 16వ శతాబ్దివరకు పుట్టలేదు గనుక శాస్త్రిగారు సంశయించారని, కాని నన్నెచోడుడు ఇట్టి చిత్ర బంధకవిత చెప్పాడని, కనుక దీని ప్రాచీనత్వాన్ని సంశయింప పనిలేదని అన్నారు.

**2) గజాంకుశుడు** : మడికిసింగన సకల నీతిసమ్మతంలో పేర్కొన్న గజాంకుశుడు క్రీ.శ. 945 కాలం వాడని, ఇది బిరుదనామధేయమే గాని, నిజనామము నారాయణుడని ఇతడు రాష్ట్రకూటరాజయిన కృష్ణచక్రవర్తి ఆస్థాని అని, ఇతని శాలోద్గి శాసనాన్ని ఉదాహరించారు. ఈ శాసనంలోని

"నారాయణాభిధానేన నారాయణ ఇవా పరః
విఖ్యాతో భువి విద్యావాన్ యో గజాంకుశసంజయ"

అనే శ్లోకం వల్ల ఈతడు కన్నడ, తెలుగు భాషలలోను విద్వాంసుడని స్పష్టమైంది.

**3) సర్వదేవుడు** : ఇతడు జైనకవి. ప్రబంధరత్నావళిలో ఇతని ఆదిపురాణం నుంచి రెండు పద్యాలు, విరాటపర్వంలోని ఒక పద్యం ఉదాహృతాలు. ఇతడు క్రీ.శ.953 నాటివాడు. రాష్ట్రకూట కృష్ణచక్రవర్తి ఆస్థాని. ఇతడు కన్నడంలో ఆదిపురాణం రచించాడని సర్వదేవనామాంకితు డయిన పొన్నకవి ఆదిపురాణాన్ని తెలుగులో రచించాడని, ఈ రెండు కావ్యాలకు రచనలో సంవాదం కనిపిస్తుందని, పంప పొన్న యిద్దరు వేంగీదేశీయులేనని జినేంద్ర, ఆదిపురాణాల ప్రభావం తర్వాతి తెలుగు కవులలో కనవస్తున్నదని రావుగారు సోదాహరణంగా తెలిపారు.

**4) అయ్యన్నభట్టు** : ఇతడు రెండవయుద్ధమల్లుని కుమారుడైన విజయాదిత్య నామాంతరంగల బాదప మహారాజు కాలంవాడు. బాదప మహారాజు క్రీ.శ. 973-1000 మధ్య పాలించాడు. ఇతని ఆరుంబాక శాసనాన్ని అయ్యనభట్టు రచించాడు.

ఇందులో సంస్కృత శాసనమైనా తెలుగు యతిప్రాసల నియమం గల ఒక కంద పద్యం ఉండడాన్ని బట్టి ఇతడు తెలుగు కవి అని రావుగారు నిర్ణయించారు.

ఆపద్యం ఇది :

కం. *ధవళగుతో ధవళయశో*
*ధవళిత దిఙ్మండలోప - దమితారాతిః*
*భవభక్తో భవకరుణో*
*ధ్రువ భవ భోగాన్వితోపి - భాతి సుకీర్తిః.*

**5) విరియాల కామసాని గూడూరు శాసనము** : ఇది క్రీ.శ. 1000 ప్రాంతపు పద్యశాసనం. దీని విషయం బేతరాజు రాజ్యారంభకాలంలో అతని రాజ్యం ఇతర రాజుల ఆక్రమణకు లోబడగా, విరియాల కామసాని తన కుమారుడయిన సూర్యభూపతి సహాయంతో అతనిని సింహాసనంమీద పునఃప్రతిష్ఠించడం. అక్షర ఛందస్సుగల మొదటి శాసనం ఇదిగనుక దీనిలోని ఒకపద్యం మచ్చుకు :

*అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి అనేకులు రాజనందనుల్*
*సనినఁ బొరంటి వెన్నడను సంభవుడయ్యె నతిప్రసిద్ధుడై*
*వినుత విరోధిమండలిక వెన్నడు వెన్నడు వోలె వానికిన్, ఘను డగు*
*నెఱ్ఱిభూపతి జగద్వితుం డుదయించె గీర్తితోన్.*

ఈ శాసనం చివర "కొమ్మోజు బరహ శ్రీశ్రీశ్రీ అడప గట్టుదేవరకు జేను" అని చెక్కారు. ఈ చెక్కినవాడు కొమ్మోజు బరహ అనే పదం వ్రాత అనే తెలుగు పదానికి కన్నడానువాదం. ఇతడు కన్నడం వాడయి వుండి, చివర కొమ్మోజు వ్రాలు అనడానికి మారు కొమ్మోజు బరహ అని చెక్కిఉంటాడు. దీనిని బట్టి అప్పటి విద్యారంగంలో తెలుగు కన్నడాల ఆదానప్రదానాలు ఎక్కువగా వుండేవని స్పష్టమవుతుంది. ఈ విషయాన్ని రావుగారు చెప్పలేదు.

## నన్నయ యుగం

ద్వితీయఖండమైన నన్నయ యుగంలో రావుగారు చేతన భట్టు, నన్నయ్యభట్టు,

నారాయణభట్టు, భీమన భట్టు వనపతి లేక శ్రీనాథుడు, రావి మెట్టశాసనకవి, మల్లియరేచన అనే ఏడుగురు కవులను గురించి చర్చించారు. ఈ యుగం క్రీ.శ. 1000-1100.

ఈ ఖండం ప్రారంభంలో రావుగారు తెలుగు సాహిత్య పరిణామం గురించి చర్చించారు. తెలుగు కన్నడ సాహిత్యాలు ఔత్తరాహమైన సంస్కృత సంప్రదాయంతోను దాక్షిణాత్యమైన దేశిసంప్రదాయంతోను విశిష్టమైనవి. ఈ రెండు సంప్రదాయాల మేలికలయిక ఈ భాషా సాహిత్యంలో కనిపిస్తున్నదని అన్నారు. దండి కాలానికే దాక్షిణా పథంలో గద్యపద్యమయ కావ్య పద్ధతి ఉండడంవల్ల దానిని అతడు తన కావ్యాదర్శంలో "చంపు" అని విశిష్టలక్షణంతో పేర్కొన్నాడని, కలయిక అనే అర్థం వుండడంవల్ల దండి సంస్కృతేతర పదాన్నే స్వీకరించాడని సిద్ధాంతీకరించారు. ఈ చంపూ సంప్రదాయాన్ని నన్నయ్యభట్టు కన్నడ కవులు జైన కావ్యాలలో అనుసరించినట్టు మహాభారత రచనలో అనుసరించా డన్నారు.

## బేతన భట్టు

ఇతడు రాజరాజనరేంద్రుని కాలంవాడు, రాజరాజు రాజ్యకాలపు తొలిదినాలలో శాసన రచయిత కోరుమిల్లి శాసనం రచించాడు. ఇది రాజరాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడైనప్పటి రచన చంద్రగ్రహణ కాలంలో చోడమార్యుడనే వ్యక్తికి కోరుమిల్లి గ్రామాన్ని అగ్రహారం చేసి, దానమిచ్చినట్టు తెలుపుతుంది. శాసన కాలం క్రీ.శ. 1022. ఈ గ్రామం ప్రస్తుతం తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాలో ఉంది.

ఈ శాసనంలో విశేషం దేశీ ఛందస్సులో సంస్కృత భాషలో అంత్యప్రాసతో ఇరవైనాలుగు పంక్తులు చోడమార్యుని వర్ణనతో ఉండడం.

తస్మైసమస్త జనతా విశేష గుణాయ
రై సుతర్పిత మహీదేవ దేవగణాయ

ఇత్యాదిగా చివర "ఆజ్ఞప్తి కటకేశో రాచయ పెద్దెరి తనూజ, కర్తా బేతనభట్టు: కావ్యానాం లేక్షకోస్య గండాచార్య" అని శాసన రచయిత పేరూ, చెక్కిన గండాచార్యుని పేరూ ఉన్నాయి. రావుగారు ఇదివరకే సోమదేవసూరి "యశస్తిలక చంపు" వులో రగడను వాడడం విద్వల్లోకానికి ఎరుకపరచారు.

## నన్నయ భట్టు

ఈయన మనకు తెలిసిన తొలి సంపూర్ణ కావ్య కర్త. నన్నయ్యకు ముందు, సమకాలంలోను ఎన్నో కావ్యాలు వెలసినా లభ్యం కాలేదు. ఇతని కాలం క్రీ.శ. 1022-1061. నన్నయ్య మహాభారతం ఆది సభాపర్వాలు పూర్తిచేసి అరణ్యపర్వంలో కొంత రచించడమేకాక, శాసనకర్త అయి నందమపూడి మండశాసనాలు లిఖించినాడు.

నిడుదవోలు వేంకటరావుగారు నన్నయ పద్యాన్ని చర్చించి ఇది కన్నడం నుంచి తెలుగుకు వచ్చిందన్నారు. కులబ్రాహ్మణు డనగా కులక్రమానుగతంగా ఆయా రాజ కుటుంబాలను ఆశ్రయించిన బ్రాహ్మణుడని వివరించారు. నన్నయ భారతంలో పద్యాలు 2487, గద్యాలు 1496, వెరసి 3983 అని లెక్కించారు. పద్యాలలో అక్షరఛందస్సులు 589, మాత్రాఛందస్సులు 1898 అని తెలిపారు. నన్నయ తనకు ముందున్న పంపభారతాన్ని అనుకరించిన తీరును వివరించారు. వాగనుశాసన బిరుదం నన్నయకు అప్పకవి అంటగట్టిందే నని నిరూపించారు.

## నారాయణ భట్టు

ఈతడు నన్నయకు సమాకాలికు డనడానికి నందమపూడి శాసనమే ప్రమాణం. ఈ శాసన రచయిత నన్నయ. రాజరాజనరేంద్రుడు తన 32వ రాజ్యవర్షంలో (క్రీ.శ. 1053) లో నందమపూడిని నారాయణ భట్టుకు దానం ఇచ్చినట్లు ఈ శాసనం తెలుపుతున్నది. ఈ శాసనం ప్రకారం నారాయణ భట్టు హరితస గోత్రుడు. అప్పకవి "నారాయణుడట్లు వానసధరామర వంశ విభూషణుండు" అని చెప్పడానికి పొంతన లేనందున ఈ పద్యం అప్పకవికి

పూర్వపు భారతప్రతులలో లేనందున అప్పకవి కల్పితమేమో అని రావుగారు సందేహించారు. నారాయణ భట్టు తెలుగు సంస్కృత కర్ణాటక ప్రాకృత రచనలేవీ మనకు లభ్యంకాలేదు.

## భీమనప్రెగ్గడ సోమల దేవి శాసనము

రాజరాజనరేంద్రుని సవతి సోదరుడైన విజయాదిత్యుని కూతురు సోమలదేవి దాక్షారామంలో వేయించిన ఈ శాసనంలో ఒక శ్లోకం ఒక సీసం, ఒక ఆటవెలది ఉన్నాయి. దీని కాలం క్రీ.శ. 1065 భీమనప్రెగ్గడ విజయాదిత్యుని అమాత్యుడు. ఇతడు నన్నయభట్టు కుమారుడు కావచ్చుననే "కవి తరంగిణి" కారుల ప్రతిపాదనను వేంకటరావుగారు సమర్థించారు. ఈ శాసనంలోని 'సారంగనేత్రి', 'బెజయిత దేవని', 'ప్రధాని', అనే విశేషప్రయోగాలు తెలిపారు.

## బణపతి లేక శ్రీనాథుడు

గంగవంశీయుడైన దేవేంద్రవర్మ రాజరాజు కళింగదేశాన్ని 1069-76లలో పాలించాడు. ఇతనికి దండనాయకుడు, మండలికుడు అయిన బణపతి (వనపతి) విశాఖజిల్లా నర్సన్నపేట తాలూకాలోని దీర్ఘాసి అనేగ్రామంలోని దుర్గమెట్ట అనే చిన్న గుట్టపై ఒకశాసనం చెక్కించాడు. దాని కాలం క్రీస్తు శకం 1075. ఇది దీర్ఘాసి గ్రామంలో ఉండడంవల్ల ఆ గ్రామంపేరుతో ప్రసిద్ధి పొందింది.

ఈ శాసనంలోని మొత్తం 23 పంక్తులలో 16 పంక్తులు సంస్కృతంలోను, తక్కిన ఏడు పంక్తులు తెలుగు సీసంలోను ఉన్నవి. ఈ సీసపద్యం ఎనిమిది పాదాలది చివర ఆటవెలది ఉంది. శాసనం ప్రధాన విషయం దీర్ఘాసిలో ఇతడు దుర్గాదేవాలయానికి నాట్యశాల కట్టించడం, దీపదానం చేయడం. ఇతడు మహాశూరుడు శ్రీనాథుడనే నామాంతరం గలవాడు.

ఈ శాసనంలో సీసం ఎనిమిది పాదాలది ఉండడం వల్ల ద్విపదలు, రగడలవలె సీసాన్ని కూడ మాలికగా వ్రాసే ఆచారం ఉండేదని "శ్రీశకునేడులు

భూపతి పై శైల" అని ప్రాస యతిలో శసలకు మైత్రి పాటించే వారని 'వల్లభి' 'వనజనేత్రి' ఇష్టపూర్తము' అనే సంస్కృత వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు వాడేవారని వేంకటరావుగారు వివరించారు.

## విజయాంకరక్షణుడు - రావి మెట్ట శాసనం

దీని కాలం క్రీ.శ. 1093. ఇది రాజమండ్రి తాలూకా రావిమట్ల గ్రామంలో ఒకరి యింట ఉంది. దీనిని విజయాంక రక్షణుడనే నామాంతరం గల కవి వ్రాశాడు. దీనిలో ఒక శ్లోకం , ఒక సీసం, రెండుకందాలు ఉన్నాయి. చివరి లిఖితం 'రామచాని' అని ఉందిగాని రచయిత పేరు లేదు.

## మల్లియరేచన - కవి జనాశ్రయం

కవిజనాశ్రయం ప్రాచీనత్వంపై చాలా సందేహాలు కలిగాయి. ఇది 14వ శతాబ్దిదని వజ్ఝల చినసీతా రామశాస్త్రిగారు[1], నన్నయకు దగ్గరిదని మరి కొందరు వాదించారు. 12వ శతాబ్దిదయిన తమిళ లక్షణ గ్రంథం యాప్పరుంగళంలో రేచన ఛందస్సును పేర్కొనడంవల్ల ఇది అంతకు ముందుదో సమకాలీనమో అయివుంటుందనడం స్పష్టం.

వేంకటరావుగారు ఈ విషయాలు చర్చించి క్రీ.శ. 990 నాటి కన్నడ ఛందోగ్రంథం ఛందోంబుధితో కవిజనాశ్రయాన్ని పోల్చి చూచి ఇది దానితో పోలిందని చెబుతూ 10, 12 శతాబ్దుల మధ్యది అనగా క్రీ.శ. 1100 ప్రాంతందని నిర్ణయించవచ్చు నన్నారు.

కాని, కవిజనాశ్రయ ఛందస్సు అవతారికలో కనిపించే భీమన - కన్నడ ఆదికవి పంపని తండ్రి అని, అతని సహాయంతో రేచన ఈ గ్రంథం రచించాడని డా॥ పి. పరబ్రహ్మశాస్త్రిగారు తెలుగు గోష్ఠి ప్రసంగాలలో నిర్ణయించారు. భారతిలో ఈ నిర్ణయాన్నే విపులీకరిస్తూ వ్యాసం వ్రాశారు. కనుక రేచన నన్నయ్యకు వందేళ్ళ ముందువాడనడంలో సందేహం లేదు.

1. రాజరాజ నరేంద్రసంచిక - నన్నయకు బూర్వపు ఛందస్సు - వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

## శివ కవి యుగము

శివకవి యుగమనే తృతీయ ఖండాన్ని శ్రీ వేంకటరావుగారు క్రీ.శ. 1100-1150-1250 అని రెండు భాగాలు చేశారు. మొదటి భాగంలో నన్నెచోడుడు, పావులూరి మల్లన, మల్లికార్జున పండితుడు కాక 33 మంది శాసన కవులను తెలిపారు. కులోత్తుంగచోళుని కాలంవా డనదగిన బృహజ్జాతక తెలుగు వ్యాఖ్యాత విష్ణువర్ధన మంత్రిని తెలిపారు.

బృహజ్జాతకానికి తెనుగువ్యాఖ్య రచించిన విష్ణు వర్ధనమంత్రి వ్యాఖ్యానాంత గద్యలో "కౌశికాన్వయులైన ద్రవిడమండల చక్రవర్తి ప్రధానుడైన శ్రీవిష్ణువర్ధన దండ నాయకులు చెప్పిన సరి తెనుంగు భాష్య(ము)లో సంపూర్ణము" అని ఉండడంవల్ల ఇతడు కులోత్తుంగ చోళ చక్రవర్తి కాలంవాడై ఉండునని వేంకటరావుగారు ఊహించారు. ఇదే తెలుగులో తొలి సంపూర్ణ వచనం గనుక మచ్చుకు కొన్ని పంక్తులు " .... దశ మొదలుగా నట్టి మొదటి దశాధిపతియున్న రాశి మొదలుగా .... కేంద్రములనున్న గ్రహబలములలో విభాగములంజేసియె (య్యెండే)ని యొక్కండు యతి బలుండగు నదియరెండగు దశాధిపతి యగునని యెఱింగి మఱియు దానికంటె మధ్య దశాధిబలుండు మూండగు దశాధిపతియని యెఱింగి యీరూపుల కేంద్రముల నున్న గ్రహముల దశాక్రమమెఱుంగునది ఇది కేంద్రముల ప్రధమ దశాధిక మెఱుంగురూపు.... ఇట్లు బహుప్రకారంబులంజేసి దశలుగా నెఱింగికొనునది"

ఈ భాష్య రచన నన్నయభట్టు వచన భాగాలను తలపిస్తుంది.

## నన్నెచోడ మహాకవి

ఈతడు తెలుగు దేశపు రాజకవులలో ప్రథముడు. ఇతడు కుమారసంభవం,

1. భారతి. 1989 మూడు వాఙ్మయ శిఖరాలు - పుట 75.

కళావిలాసం అనే రెండు కావ్యాలు రచించాడు. వీటిలో కుమారసంభవం సమగ్రంగా లభించింది. కళావిలాసంలోని రెండు పద్యాలను ప్రబంధరత్నాకరము ఉదాహరించింది.

నన్నెచోడుడు శైవుడు. తన కావ్యాన్ని శ్రీశైల నివాసి అయిన జంగమ మల్లికార్జునునికిని, మల్లేశ్వర స్వామికి అభేద వ్యవసాయం చేసి వినిపించినట్లు రచించాడు. ఇతడు రాజకవి అయినా, ఈ కావ్యంలో చారిత్రకాంశాలు చెప్పనందువల్ల ఇతనికాలం వివాదాస్పదమైంది. ఇతడు నన్నయకు పూర్వుడు అనగా క్రీ.శ. 940 ప్రాంతంవాడు, నన్నయ సమకాలికుడు - అనగా 1054 ప్రాంతంవాడు, నన్నయ తర్వాత ఒక శతాబ్దం వాడు - అనగా 1130-50 నాటివాడు, తిక్కనకు తరువాతివాడు అనగా 1276-1350నాడు వాడు - అని దీనిని తొలిసారిగా కనుగొని ముద్రించిన శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు మొదటి వాదంవారు. కాని నన్నెచోడుడు 1130-50 ప్రాంతం వాడనే వాదమే నేడంగీకృతమైనదని వేంకటరావుగారి నిర్ధారణ.

వేంకటరావుగారు ఇతని విచిత్రప్రయోగాలు 'పుడమిపుడు', 'కంపు' మొదలయిన పదాలు చర్చించి ఇతనికిని, తక్కిన సోమనాథాది శివకవుల ప్రయోగాలకు గల పోలికలు చూపారు. ఇదే ప్రథమ సంపూర్ణ మహాకావ్యమని అన్నారు.

2. సూర్యవంశోద్భవకులతిలకు డైన కందూరి గొకర్ణదేవచోడ మహారాజు ఏలేశ్వరదేవరభోగానికి బెదకోడూరు గ్రామం 1127 జూన్ 22న ఇచ్చాడు. ఈ గోకర్ణుడే గోకర్ణచ్ఛందస్సు రచించిన రాజకవి అని, వివిధ ఛందో గ్రంధాలలో ఉదాహృతమైన గోకర్ణచ్ఛందస్సు పద్యాలలో "భాస్కరకుల విలసిత వార్ధి చంద్ర గోకర్ణనృపా" అనే సంబోధనను బట్టి వేంకటరావుగారు నిర్ణయించారు.

పావులూరి మల్లనను విషయసూచికలో మల్లికార్జున పండితునికి ముందు చూపినా, ఎందుకో శివకవియుగం ద్వితీయ భాగంలో చేర్చారు.

**3. మల్లికార్జున పండితుడు :** ఇతడు శ్రీపతి పండితుడు మంచనపండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడు అనే పండితత్రయంలో కడపటివాడు. "బసవేశ్వరుడు

కర్నాట దేశంలో స్థాపించిన వీరశైవ మతాన్ని సంస్కరించి తెలుగుదేశంలో ఆరాధ్య సంప్రదాయాంగా నెలకొల్పినవాడు. ఈతని చరిత్రను పాల్కురికి సోమనాథుడు. 'పండితారాధ్య చరిత్రము అనే పేరుతో ఐదు ప్రకారణాల ద్విపద మహాకావ్యంగా' మలచినాడు. దీనిలో మల్లికార్జున పండితుడు భగవదంశ సంభూతుడని, అపారమహిమాన్వితుడని వర్ణించాడు. బసవేశ్వరుడు మల్లికార్జునుని బ్రాహ్మణత్వం వదలి తన మతంలో కలవవలిసిందిగా కోరగా మల్లికార్జునుడు "భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో బొత్తు బాయలేను నేను బసవలింగ" అని సమాధానమిచ్చాడట. ఇతని కాలం 1120-1190 మధ్యప్రాంతం.

ఇతని రచనలు ఏన్నో ఉన్నవి. వాటిలో శివతత్త్వసార మొకటి లభిస్తున్నది. కన్నడ భాషలో ఇతను "గణసహస్రమాల" అనే కావ్యాన్ని రచించినట్టు కన్నడ కవిచరిత్ర చెబుతున్నది. కాని అది లభించలేదు. శివతత్త్వసారంలో సంక్షేపంగా చెప్పిన భక్తుల చరిత్రలనే సోమనాధుడు పండితారాధ్య చరిత్రలో వివరించాడు.

కన్నడంలో మల్లికార్జున పండితుడు రచించినవి గణసహస్రమాల, శివతత్త్వసారం.

శివతత్త్వసారానికి కన్నడ అనువాద మనదగిన ప్రాచీన రచన లభించింది. అది లభించిన తీరును డాక్టర్ తిరుమల రామచంద్రగారు సాహితీ సుగతుని స్వగతంలోని 'శివతత్త్వసారంపారాల పరిష్కరణ' అనే వ్యాసంలో ఇలా తెలిపారు:

1936 సంవత్సరంలో నేను చెన్నపురి ప్రాచ్యపుస్తక భాండాగారంలో శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారికి చాటు పద్యాలు సేకరిస్తుండగా, కొన్ని కన్నడపద్యాల తాటాకులు క్రమసంఖ్యలో కనిపించాయి. శైలి ప్రాచీన ప్రౌఢ రచనలో కనిపించే సహజ గాంభీర్య విలసితం. ఇదేదో అపూర్వగ్రంధమే అయివుంటుదన్న నమ్మకంతో శ్రీ ప్రభాకరశాస్త్రి గారి వద్దకు పరుగెత్తి వెళ్లాను. వారు అంత ఆసక్తితోనూ శివతత్త్వసారంతో పోల్చిచూచి అదేనని నిర్ణయించారు. దీనిని 1950లో ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంవారు బులెటిన్‌లో ప్రచురించారు. తెలుగు కన్నడాలు రెండింటిని పక్కన పక్కన ప్రచురించవలసిన అవసరం చాలా ఉంది.

రామచంద్రగారు సూచించనట్లు రెండూ ప్రకటిస్తే, శివతత్త్వసారం తెలుగులోని పెక్కుపద్యాలను సరిదిద్దుకోవచ్చు.[1]

## శివకవియుగము ద్వితీయ భాగము

ఈ భాగంలో రావుగారు పావులూరి మల్లన, వేములవాడ భీమకవి, అధర్వణుడు, వెన్నెలకంటి అన్నయ్య, పాల్కురికి సోమనాథుడు, యథావాక్కుల అన్నమయ్య మున్నగు వారు, శాసన కవులు మొత్తం 38 మందిని చేర్చారు.

సోమనాధుని దేశకాలాదులను గురించి పెద్దదుమారమే రేగినది. వేంకటరావుగారు "క్రీ.శ.1924లో నప్పటికే గల సాధనా సామగ్రి పరిశీలించి ఈతని కాలము క్రీ.శ. 1190 నుండి 1260-70 ప్రాంతము వరకు నుండునని నిర్ణయించితిని" అని కాలాన్ని ధ్రువీకరించారు. కాని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి "పండితారాధ్య చరిత్ర చివరి ద్విపదలను బట్టి సోమనాథుడు పండితారాధ్యుల సమకాలీనుడనే వాదాన్ని పరిశీలించారు. కారాణాలు దొరికే వరకు వారినిర్ణయమే ఉత్తమమని తిరుమల రామచంద్రగారు అంటున్నారు.[2]

రావుగారి తెలుగుకవుల చరిత్ర గొప్ప మౌలిక పరిశోధన విలసిత గ్రంథం. వేంకటరావుగారు క్రీ.శ. 800నుండి 1250వరకు అది వరకెవరూ తెలుపని కవులతోపాటు 89మంది కవులను పేర్కొని వారి రచనలను సంక్షిప్తంగా సమీక్షించారు. ఎక్కడికక్కడే అధస్సూచికలలో ఆకరాలు తెలిపారు. ముఖ్యంగా శాసన పద్యకర్తలను గుర్తించి వారికి కవులసరసన పీటవేశారు.

---

1. సాహితీసుగతుని స్వగతం :- శివతత్త్వసారం పాఠాల పరిష్కరణ పుట -117
2. వేటూరివారి పీఠికల భూమిక : పీఠికార్చన తిరుమల రామచంద్ర.

# ఆంధ్ర వచన వాఙ్మయం

నిడుదవోలు వేంకటరావుగారి మరొక మౌలిక పరిశోధన గ్రంథం ఆంధ్ర వచనవాఙ్మయం.[1] ఇది మొదట ఆంధ్రపత్రిక ఖర సంవత్సర (1951-52) ఉగాది సంచికలో (41-58పుటలు) బృహద్వ్యాసంగా ప్రచురితమై పిదప పరివర్ధితమై 1954లో పుస్తకరూపంగా వెలువడింది. 1962లో మద్రాసులోని తెలుగు భాషాసమితి వారు ఈ గ్రంథానికి బహుమతి ఇచ్చారు. వచనరచనపై వెలువడిన సాధికార, ప్రామాణిక గ్రంథ మిది. అంతకుముం దిట్టి గ్రంథాన్ని రచించిన వారు లేరు. ఈ గ్రంథ ముద్రణ తరువాత విశ్వవిద్యాలయాల్లో పరిశోధన ప్రారభమయింది. ఒకసిద్ధాంత గ్రంథానికి వేంకటరావుగారు న్యాయనిర్ణేతగా ఉండటం విశేషం.[2] 1977లో వేంకటరావుగారు ఆంధ్ర వచన వాఙ్మయ గ్రంధాన్ని పుష్టిగా, తుష్టిగా పునర్ముద్రించారు.

'వచనమ్' అంటే సంస్కృతభాషలో సాధారణంగా మాట్లాడేమాట.[3] ఉచ్యత-ఇతి వచనం (పలుకబడునది గనుక) పలుకు అని దీని వ్యుత్పత్తి. కాని, కావ్యప్రసక్తి వచ్చినప్పుడు సంస్కృతంలో పద్యకావ్యం, గద్యకావ్యం అంటున్నారు గాని వచనకావ్యం అనడంలేదు. దీనిని బట్టి వచనానికి, గద్యకు కొంత భేదం ఉందనిపించడం సహజం. 'గద్యం' అనే పదానికి వ్యుత్పత్తి 'గద్యతే ఇతి', చెప్పబడున దంతా గద్యమే. 'గద' ధాతువుకు 'వ్యక్తాయాం వాచి' అని అర్థం. స్పష్టంగా పలకడం అంటే ఏదో సహజంగా కాక కొంత ఆలోచనతో పలకడం అని స్పష్టమవుతుంది.

దీనినిబట్టి గద్యానికి, వచనానికి కొంత భేదం కనిపిస్తుంది సంస్కృతంలో. అంటే సామాన్యంగా ప్రజలు నిత్యవ్యవహారంలో ఉపయోగించే మాటలు వచనం.

---

1. ఆంధ్రగ్రంధమాల, మదరాసు.
2. ఆంధ్రవచనవాఙ్మయము - డా.ఎం. కులశేఖరరావు.
3. వచనమ్ (వచ్-స్యుట్) 1. the act of speaking uttering, saying. 2 speech, an utterance - Apte Sanskrit-English Dictionary

నిత్యవ్యవహారంలో కాక కొంత ఉన్నత స్థాయిలో ఆలోచనాస్థాయిలో వాడేమాట గద్యం. అందువల్లనే అమరసింహుడు 'గద్య పద్యే కవేఃకృతౌ' అన్నాడు.

అనగా సాలోచనమై ప్రయత్నపూర్వకమై కవివచనం 'గద్య' అని విస్పష్టమవుతుంది. కాని, ఛందోబద్ధం కానక్కరలేదు ఛందో బద్ధమైన వాక్యం పద్యం. ఛందోబద్ధం కాని వాక్యం గద్యం. ఈ గద్యం మనకు వేదసంహితలోనే దర్శనమిస్తుంది. పాదబద్ధం అయినది ఋక్కు. పాదబద్ధం కానిది యజుస్సు. గద్య మిశ్రితం కావడంవల్లనే యజుర్వేదానికి కృష్ణత్వసంకేతం అని లాక్షణికులు అంటారు. అత్యంత ప్రాచీనమైన గద్యం తైత్తరీయ సంహితలోనిది. యజుర్వేదాంతర్గతమైన కారకమైత్రాయనీ సంవాదంలో గద్యం ప్రచురమే. అధర్వవేదంలో షష్ఠభాగం గద్యాత్మకం. ఇక బ్రాహ్మణాలన్నీ గద్యాలే. ఆరణ్యకాలలో గద్యం హెచ్చు. ఉపనిషత్తులలో ప్రాచీనమైనది గద్యే.[1]

ఇక లౌకిక సంస్కృతగద్య స్మృతులతో దర్శనాలతో వాటి భాష్యవ్యాఖ్యా టీకాదులతో మొదలయింది. ఇలాటి వాటిలోని ప్రత్యేకత సంభాషణ విధానం. కధోపకధన రీతివారు (వ్యాఖ్యాతలు, భాష్యకారులు) మన ఎదుటే కూర్చొని మనకు తమ సిద్ధాంతం వివరిస్తున్నారా అన్నంత సరళత దానిది. ఈరీతి గద్యానికి మహాభాష్యకారు లయిన పతంజలి మొదలయిన వారి రచనలు ఉదాహృతాలు. అప్పటికే ఎన్నో ఆఖ్యానాఖ్యాయికలు యక్షక్రీడ, ప్రియంవదయాయాత్యాఖ్యానాలు, వాసవదత్తా సుమనోత్తరాఖ్యాయికలు ఉన్నట్లు పతంజలి పేర్కొన్నారు. అవి మనకు మృగ్యమైనవి కనుక తథాగతుని తొలి (మహాయాన సంప్రదాయ) చరిత్రమైన లలిత విస్తరమే అత్యంత ప్రాచీన గద్యాఖ్యిక అని నా నమ్మకం.

ఇది కధాకధన కౌశలాన్ని బట్టి, సరళప్రౌఢ, నితాంత ప్రౌఢ శైలులలో అతి సుందరంగా సాగుతుంది.

---

1. సాహితీ సుగతుని స్వగతం పుట-219.

"ఇతిహ భిక్షవో దశదారక సహస్రాణి బోధిసత్త్వేన సార్థం
లిపి శిక్ష్యంతేస్మ తత్రబోధిసత్త్వాధిష్ఠానేన తేషాం
దారకాణాం మాతృకావాచయతాం, యదా అకారం
పరికీర్తయంతి స్మ, తదా అనిత్యః సర్వసంస్కార ఇతి శబ్దో నిశ్చరతిస్మ"[1]

బుద్ధుని బడిలో వేశారు. ఆబడిలో అతనితో పాటు పదివేలమంది బాలులు చదివేవారట. బోధిసత్త్వునితోపాటు తక్కిన పిల్లలకు మాతకలు (ఆరౌరాదులు) చెప్పేటప్పుడు 'అ' అనడానికి అనిత్యః సర్వసర్వసంస్కారః అనే శబ్దం చెప్పేవారట. ఇప్పుడు 'అ' అటక అని చెప్పినట్టు.

తర్వాత లౌకిక సంస్కృత గద్య అపారంగా పెరిగింది. ప్రాధాన్యమూ పెరిగింది. అందువలన ఆలంకారికులు దానికి లక్షణం చెప్పవలసి వచ్చింది. కవులు పద్యగద్యమయ మయిన కావ్యాలు రచించేవారు. దండి -

"గద్యపద్యమయీ కాచిచ్చంపూ రిత్యభిధీయతే"[2]

గద్యపద్యాత్మకమైన కావ్యము చంపువు అని లక్షణం చెప్పాడు.

సంస్కృతంలో కవులు గద్యంలోను కొత్తపద్ధతులు అనుసరించడం వల్ల వామనుడు గద్య మూడు విధా లన్నాడు.

"గద్య వృత్తగంధి-చూర్ణం ఉత్కళికా ప్రాయంచ, పద్యభాగవద్
వృత్తం గంధి, అనావిద్ధ లలితపద చూర్ణం, విపరీత ముత్కలికాప్రాయం"[3]

గద్యం వివిధాలు. వృత్తగంధి, చూర్ణం, ఉత్కలికాప్రాయం అని. వృత్తగంధి అంటే పద్య మనిపించే నడక గలది. చూర్ణం సమాసాలు లేని లలిత పదరచన, ఉత్కలిక చూర్ణానికి విరుద్ధంగా దీర్ఘసమాసాలతో నిబద్ధమైన రచన. తొమ్మిదవ

1. సాహితీసుగతుని స్వగతం పుట-202.
2. కావ్యాదర్శం 1.31.
3. వామనుని కావ్యాలంకారః 1.3, 23, 24, 25.

శతాబ్దివాడైన జయకీర్తి తన ఛందోనుశాసనంలో

'గద్యం హృద్య మపాదోక్తి సమాసపద సంచితమ్
తతోన్య చూర్ణి రిత్యుక్తా వచనం వాక్యబంధురమ్" [1]

పాదనియమము లేనిది, సమాసపద సంయుతమైనది, హృద్యమయినది గద్యం. తద్విపతీత మైనది చూర్ణం వచనం. వాక్యాలతో ఉన్నది వచనం. దీనిని బట్టి మనోహరంగా ఉంటే గద్యం, లేకపోతే వచనం అని నిర్ణయించుకోవచ్చు. 11వ శతాబ్దివాడయిన భోజుడు.

కచి ద్గద్యేన పద్యేన కశ్చి న్మిశ్రేణ శక్యతే
కవితం కశ్చన ద్వాభ్యాం కావ్యైర్దో కశ్చన త్రిభిః[2]

కవి కేవలం పద్యంలో కవిత చెప్పవచ్చు. గద్యంలో చెప్పవచ్చు. రెండూ కలిపి చెప్పవచ్చు - అన్నాడు.

ఆలంకారికుల నిర్వచనాన్నిబట్టి సంస్కృతంలో గద్య పాదరహితమై హృద్యత గలిగి సాధారణ వచనం కంటె వేరయిన దని, గద్యవచన పదాలు భిన్నార్థకాలని తేటతెల్లం. కనుకనే వామనుడు 'గద్యం కవీనాం నికషం వదంతి'[3] గద్యం కవుల రచనా శక్తికి గీటురాయి అన్నాడు.

తెలుగులో గద్యం, వచనం దాదాపు సమానార్థకాలు. తెలుగు సాహిత్యం గద్య పద్యమిశ్రిత మైన చంపూ పద్ధతిలో నన్నయ భారతావతరణతో ప్రారంభమయింది. అంతకు పూర్వమే శాసనాల్లో వచనం కనిపిస్తున్నది.

ఈ తెలుగు వచన రచనా పరిణామ చరిత్రే నిడుదవోలు వేంకటరావుగారి గ్రంథం. దీనిలో రావుగారు అవతారిక మొదలు అనుబంధం వరకు 27 శీర్షికలలో తెలుగువచన పరిణామాన్ని వివరించారు.

---

1. ఛందోనుశాసనం 1.26.
2. సరస్వతీ కంఠాభరణ 2-19.
3. కావ్యాలంకార: 1-3-21.

నిడుదవోలు వేంకటరావుగారు అవతారికలో సంస్కృతంలో గద్య వచనాలకు భేదం ఉందని, వచనం సామాన్య వ్యవహారపు మాటలయితే గద్యం ఛందోబద్ధం కాని హృద్యమైన పదసముదాయ మని తెలిపారు. తెలుగులో గద్యం, వచనం సమానార్థకాలని స్పష్టం చేశారు. దండి చంపూ నిర్వచనం ప్రకారం గద్యం అని ఉండవలసినా నన్నయ తన భారతభాగంలో గద్య అనటానికి బదులు వచనమనే పేర్కొన్నాడు. నన్నయకు ముందుగా కన్నడకవి పంపడు కూడా తన విక్రమార్జున విజయంలో వచనమనే పేర్కొన్నాడని వేంకటరావుగారు అన్నారు. ప్రాచీనకాలంలో ఏవిధంగా గద్యవచనపదాలు సమానార్థకాలో ఆధునిక కాలంలో కూడా వీరేశలింగంపంతులుగారు సమానార్థకాలుగానే వాడా రని "రమారమి నలుబది సంవత్సరములక్రిందట తెలుగులో గద్యకావ్యాలు లేకుండెను. అప్పుడు చిన్నయసూరి తనవ్యాకరణము రచించి అందులకు లక్ష్యముగా నీతిచంద్రికను వచనమున వ్రాసెను. దీని శైలి మిక్కిలి కఠినము. మొట్టమొదట నేనును చిన్నయసూరిగారి త్రోవనే త్రొక్కి కొన్ని గద్యకావ్యముల రచించితిని"[1] అని చెప్పడం వల్ల ఇవి సమానార్థకములే. అయితే తెలుగులో గద్యం కేవలం భావప్రకటనకై కూర్చిన వాక్యసముదాయం కాక ఛందోనుగుణంగా చదవ దగ్గ రచనకే చెల్లుతుందని వేంకటరావుగారి అభిప్రాయము. ఈ గద్య రచన మాత్రాఛందస్సు ననుసరించి పాటగా పాడటానికి అనువుగా ఉండటంవల్ల ఛందశ్శాస్త్రంలోనే కాక, సంగీతశాస్త్రం లోను దీనికి లక్ష్యం చెప్పబడిందని ఆయన సూచించారు.

వృత్తగంధి గద్యలకు నన్నయనుండి గిడుగు రామ్మూర్తి పంతులు ఉదాహరణ లిచ్చారు.

కాని, తెలుగు సాహిత్యంలో గద్య, వచన శబ్దాలు పర్యాయా లయినా, తెలుగు కవులు వచనాన్ని 'వ' అనే స్ఫుటాక్షరంతో పేర్కొనినా ఆశ్వాసాంతాలలో మాత్రం. ఫలానావాడిని నేను, నేను రచించిన ఈ కావ్యంలో ఫలానా ఆశ్వాసం ముగిసింది-అనే చెప్పే వచనాన్ని మాత్రం వచన మనకుండా గద్య అనే అన్నారు.

1. గ్రామ్యాదేశ నిరసన సభ. అధ్యక్షోపన్యాసం

ఇది సంప్రదాయంగా ఏర్పడింది. ఆ గద్యను లాక్షణికులు ఐదు విధాలని చెప్పారు. గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనం, విన్నపం. వీటికి పోత్తపి వేంకట రమణ కవి లక్షణం చెప్పాడు.

గద్య - అనుకరణశబ్దయుక్తమై యొప్పు.

బిరుదుగద్య - సంబోధనాంతపదబంధురమై వర్తిల్లు.

చూర్ణిక - ద్వివచన, బహువచన సందర్భములగు విభక్త్యను శాసన సమాసాంచిత కల్పనానల్పజల్పితంబై వెలయు.

వచనము - బహుప్రకార రచనా నియమ ప్రాచుర్యంబై సంచరించు.

విన్నపంబులు - విన్నవై ఋజుమార్గంబుల ననుగమించు"

వీటిలో బిరుదు గద్యనే తెలుగు కవులు ఆశ్వాసాంతాలలో వాడారని వేంకటరావుగారు సూచించారు. ఈ సంప్రదాయం కన్నడ కవుల నుండి వచ్చినదే అని వారి అభిప్రాయం.

అన్నమాచార్యుడు తాళగంధి అని సంకీర్తనలక్షణంలో పేర్కొన్నాడు. వేంకటరావుగారు ఈ విషయాన్ని సుదీర్ఘంగా చర్చించి సంస్కృతంలో చూర్ణికా, వృత్తగంధులకు భగవద్రామానుజుల శరణాగత గద్య, శ్రీరంగగద్యలను లక్ష్యంగా చూపెట్టారు.

తెలుగు సాహిత్యంలోనుంచే కాకుండా వేంకటరావుగారు రేనాటి చోళుల తొలి శాసనాలలోని వచనాన్ని ఉటంకించారు. నన్నయ యుగంలోని వచన రచనలోని విశిష్టతను, నన్నెచోడ తిక్కన రచనలలోని వచనాన్ని తులనాత్మకంగా పరిశీలించారు.

వచన వాఙ్మయ ప్రథమాచార్యునిగా కృష్ణమాచార్యుని గుర్తించిన వారు వేంకటరావుగారే. ఇతడు సింహగిరి నరహరి వచనాలను రచించాడు. ఆ తర్వాత వెలసిన తాళ్లపాక పెదతిరుమలయ్య వేంకటేశ్వర వచనాలను, భవానీ శంకర వచనాలను పేర్కొన్నారు. భవానీ శంకరవచనాల కర్త శంకరకవి అని నిరూపించారు.

తొలి వచనగ్రంథం దత్తాత్రేయ యోగి రచించిన వేదాంత సార సంగ్రహమని, ఇతని కాలం క్రీ.శ. 1550 ప్రాంతమని నిశ్చయించారు. ఈ యుగంలోనే ఎల్లకర నరసింహకవి భారతసావిత్రి, 1550నాటి సభాపతి వచనం, రాయవాచకం, దాసగోసాయి పరమానందబోధ, సిద్ధరామకవి ప్రభుదేవరవాక్యం, కాశీచెన్నబసవేశ్వరుని వివేకసింధువు టీక మొదలయిన వచనగ్రంథాలు వెలసినట్లు వారు సెలవిచ్చారు.

దక్షిణదేశంలో మధురనాయకుల కాలం నుంచి వచన రచన అవిచ్ఛిన్నంగా కొనసాగిందని, స్థానిక వ్యవహార భాష తమిళం అయినా పాలకులు తెలుగు వారు కాబట్టి తెలుగు సాహిత్యాన్ని పోషించారు. గ్రాంథికవచన రచనకు ప్రాధాన్యం వచ్చింది. ఈ విధంగా మొదట వెలువడిన వచన గ్రంథం లింగనమకి శ్రీకామేశ్వరకవి రచించిన ధేనుమాహాత్మ్యం అని, కవి తంజావూరును 1674లో జయించిన ముద్దళగిరి ఆస్థానకవి అని వేంకటరావుగారు తెలిపారు. మధుర ఏలిక అయిన విజయరంగ చొక్కనాథుని (1704-31) కాలంలో వచన రచనలు బాగా వెలిశాయి. విజయరంగ చొక్కనాధుడే స్వయంగా శ్రీరంగమాహాత్మ్యము, మాఘమాహాత్మ్యము అనే రెండు వచన గ్రంధాలు రచించాడు. శ్యామరాయకవి వచన రామాయణం, శ్రీపతి రామభద్రకవి హాలాస్య మాహాత్మ్యం, వెలగపూడి వెంగనామాత్యుని వేదాంతసార సంగ్రహం, ఉత్తర గోపురకథపట్టు, గొడుగు వచనం చొక్కనాధుని కాలంలో వెలసిన గ్రంధాలు. గొడుగు వచనమంటే రావణుడు లంకా పట్టణం ఉత్తర గోపురం ఎక్కి సువేలాచలంపై విడిసిన శ్రీరాముని వానరసైన్యం చూసి అనుతాపం చెందే ఘట్టం. రావణుని అనుచరులు ఛత్రాలు పట్టారు. గణిత సారసంగ్రహంలో పావులూరి మల్లన్న ఈ గొడుగులెక్కని పేర్కొన్నాడు.

మధురనాయకుల తరవాత తెలుగు వచనరచనను ప్రోత్సహించినవారు మైసూరు పాలకులు, సైన్యాధీశులు. కళువె వీరరాజు మహాభారతాన్ని వచనంగా రాశాడు. ఇతడు 1730లో మైసూరు నేలిన చిక్కదేవరాయల సైన్యాధీశుడు. వీరరాజు కుమారుడు నంజరాజు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషా కవితా విశారదుడు. ఇతడు హాలాస్యమాహాత్మ్యం, శివభక్తి విలాసం వచన కావ్యాలుగా రచించాడు. ఇందులో శివభక్తవిలాసం తమిళ శైవభక్తు లయిన అరువత్తిమూవురభక్తుల కధను తెల్పుతుంది.

చంద్రగిరి రాజయిన తుపాకుల కృష్ణ భూపాలుడు విష్ణుపురాణం, భగవద్గీత, సుందరకాండం వచనంలో వ్రాశాడు.

క్రీ.శ. 18వ శతాబ్దం రెండో పాదం నుంచి దేశంలోని పరిస్థితి మారింది. వ్యాపారం కోసం వచ్చిన ఈస్టిండియా కంపెని క్రమంగా రాజ్యం సంపాదించి బ్రిటిష్ పరిపాలన దేశం అంతటా విస్తరించటానికి దోహదం చేసింది. దీనివల్ల మనకు పాశ్చాత్యులతో సంబంధం ఏర్పడింది. వారి భాషాసాహిత్య సంస్కృతుల ప్రభావం మనపై పడింది. పాలకులు స్థానిక భాష నేర్చుకొని తమ పరిపాలన కవసరమైన నిఘంటువులు, వ్యాకరణాలు, వాచకాలు మున్నగునవి సిద్ధపరచుకున్నారు. ముద్రణ కళ భారతదేశానికి తెలుగు దేశానికి వచ్చింది. మతప్రచారంకోసం విదేశీయులు బైబిలువంటి గ్రంథాలను తెలుగులోని అనువదించి ముద్రించారు. భావప్రకటనలకు వచనానికి మరింత ప్రాముఖ్యం వచ్చింది.

వేంకటరావుగారు ఈ యుగంలో విదేశ సంబంధాలను, విదేశీయులు ముద్రణకళతో తమకు చేసుకొన్న ప్రయోజనంతో ఆనుషంగికంగా మనకు కలిగిన ప్రయోజనాలను విశదంగా చర్చించారు. నవయుగంలో ప్రథమమైంది, ప్రధానమైంది ముద్రణ. జర్మనీలోని హాలేనగరవాసి బెంజిమిన్ షూర్జ్ 1746లో తెలుగు గ్రంథ ముద్రణ ప్రారంభించినట్లు రావుగారు తెలిపారు. 1) సత్యమైన వేదంలో ఉండే జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం. 2) మోక్షానికి కొంచుబోయే దోవ. 3) బుద్ధికలిగిన నూరు జ్ఞాన వచనాల యొక్క చిన్నపుస్తకం. 4) ఒకే గురువు ఐదు బ్రాహ్మణుల యొక్క పెద్ద స్వామి మీద ప్రసంగించిన తర్కము అనే గ్రంథాలు షూల్జ్ స్వయంగా అనువదించి ప్రచురించాడు.

అటు తరవాత కలకత్తా శ్రీరాంపూర్ క్రైస్తవ సంఘంవారు 1)దేవుని యొక్క సువార్తలు, 2) యేసుక్రీస్తు నూతన నిర్ణయం అనే గ్రంథాలు ముద్రించారు.

శ్రీరాంపూరం తరవాత తెలుగునాట బళ్లారి, విశాఖపట్టణాలలో క్రైస్తవ మిషనరీలు కరపత్రాలు చిన్నచిన్న పుస్తకాలు ప్రచురించారు. ఇవన్నీ వచన గ్రంథాలే.

తెలుగు ముద్రణ మద్రాసుకి రావడంతో సంస్కృతాంధ్ర పండితులు పురాణం వేంకటకృష్ణశాస్త్రి, పురాణం హయగ్రీవశాస్త్రి ఆత్మబోధ ప్రకరణం, భారత భాగవతాలు ముద్రించారు.

ఇవి ఇలా ఉండగా కల్నల్ కాలిన్ మెకంజీ స్థానిక చరిత్రలను సేకరించడానికి కావలి సోదరుల నియమించి అనేక స్థానిక చరిత్రలను వచన రూపంలో వ్రాయించాడు. ఈ చరిత్రలలోని భాష ఆనాటి జన వ్యవహారంలో ఉండే తెలుగు. తరవాత సి.పి.బ్రౌన్‌పై స్థానిక చరిత్రలలో జీర్ణస్థితికి వచ్చిన కొన్నింటిని కాగితాలపై వ్రాయించి పునరుద్ధరించాడు. కేవలం వచన గ్రంధాలనే కాకుండా అనేక వందల గ్రంథాలను సేకరించి పండితులచే ప్రౌఢ ప్రబంధాలకు చక్కటి వ్యవహారిక భాషలో వ్యాఖ్యానాలను వ్రాయించాడు. మరొక సంస్థ ది మద్రాస్ స్కూల్ బుక్ సొసైటీ వివిధ విషయాలపై బడిపిల్లల కోసం తెలుగు వాచకాలు వ్రాయించి ప్రకటించింది.

బ్రిటిష్ ఉద్యోగులకు తెలుగు నేర్పేటందుకు పోర్ట్‌సెంట్ జార్జికోటలో కళాశాల స్థాపితమైంది. ఈ కళాశాలలో తెలుగుపండితుడుగా నియమితుడైన రావిపాటి గురుమూర్తిశాస్త్రి విక్రమార్కకథలు. పంచతంత్ర కథలు అనే రెండు పుస్తకాలు తేలికపాటి వచనంలో రచించాడు. తరువాత తరువాత కథాసాహిత్యం విస్తరించింది. శుకసప్తతి హంస వింశతి, దిలారాం, బత్తీస్‌పుత్తి, బేతాళ పంచవింశతి తాతాచార్యుల కథలు బాగా ప్రచారం చెందాయి.

తరువాత వేంకటరావుగారు ఆంగ్లపాలనయుగ మనే ప్రకరణంలో చిన్నయసూరి, కొక్కొండ వేంకటరత్నం, కందుకూరి వీరేశలింగం పంతులు వచన రచనకు చేసిన సేవను విపులంగా చర్చించారు.

నవలల్లో కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి మహాశ్వేత నవల ప్రధమ మని తెలుపుతూ ఆధునికకాలంలో విశ్వనాధ సత్యనారాయణ, అడవి బాపిరాజు, నోరి నరసింహ శాస్త్రి నవలా రచయిత త్రయంగా అభివర్ణించారు.

తెలుగులో లేఖా సాహిత్యాన్ని గూర్చి, వ్యాసరచన (**Essay**) నను గూర్చి, పత్రికా వ్యాసాలను గూర్చి విపులంగా చర్చించి అనేక ప్రసిద్ధ రచయితలు గ్రాంధిక వచన రచనను విడనాడి సరళ సుందరమైన వ్యావహారిక భాషలో వ్యాసాలూ, గ్రంథాలు వ్రాశారని సోపపత్తికంగా నిరూపించారు.

ఆంధ్ర వచన వాఙ్మయం గొప్ప మౌలిక పరిశోధన గ్రంథం. దీనిద్వారా వేంకటరావుగారు తెలుగుదేశానికి ఎన్నో అపూర్వవిషయాలు తెల్పారు.

## ఉదాహరణ వాఙ్మయం

నిడుదవోలు వేంకటరావుగారి పేరు తెలుగు సాహిత్య లోకానికి తెలియడం త్రిపురాంత కోదాహరణం పరిష్కరణమూలంగానే.

ముందుగా ఉదాహరణ ఆవిర్భావం తెలుసుకోవాలి.

అగ్నే నయ సుపధాయే అస్మాన్
విశ్వాని దేవ వయనాని విద్వాన్
జుహోధ్య స్మజ్ఞు హురాణ మేనో
భూయిష్ఠాం తే నవ ఉక్తిం విధేతు.

అప్పటి మన పూర్వులు అగ్నిని సంబోధించి " ఓ! అగ్నీ మమ్మల్ని సంపత్కర మైన మార్గంలో నడిపించు. నీవు మా సంగతులన్నీ తెలిసిన వాడివి. విఘ్నాలు కలిగించే మా పాపాలన్నీ కాల్చివేయి. నిన్ను పదే పదే నమస్కరిస్తాము" అని ప్రార్థించారు. ఇలాంటివి వేదంలో పలుచోట్ల కనిపిస్తాయి. కొన్ని నరులను సంబోధించి ప్రశంసించిన మంత్రాలు ఉన్నాయి. వీటిని "నారశంసి" అన్నారు. నారశంసి అంటే నరుల మహత్త్వాన్ని ప్రశంసించే మంత్రాలు అని అర్థం.

"ఈ పద్ధతి లౌకిక సంస్కృత సాహిత్యంలో తొలిసారిగా వైష్ణవ భక్త కవి అయిన కులశేఖరుల ముకుంద మాలా స్తోత్రంలో కనిపిస్తుంది. కులశేఖరులు ఈ స్తోత్రం శ్లోకమంతా ఒకే విభక్తితో నడపడమే గాక ఒకటి రెండిటిని అష్ట విభక్తులలోను నడిపారు.

*హే గోపాలక! హే కృపాజలనిధే!*
*హే సింధు కన్యాపతే!*

హే కంసాంతక! హే గజేంద్ర కరుణా
పారీణ! హే మాధవా!
హే రామానుజ! హే జగత్త్రయగురో!
హే పుండరీకాక్ష! మాం
హే గోపీజననాథ! పాలయ పరం
జానామి గత్వా వినా.

ఈ శ్లోకాన్ని కులశేఖరులు సంబోధన ప్రథమావిభక్తిలో నడిపారు.

'భక్తాపాయ భుజంగ గారుడమణి' అనే శ్లోకాన్ని ప్రథమా విభక్తిలోనూ, 'వ్యామోహప్రశ మౌషధం' అనే శ్లోకాన్ని తృతీయా విభక్తిలోనూ

క్షీర సాగర తరంగ శీకరా
సాగ తారకిత చారు మూర్తయే
భోగి భోగ శయనీయ శాయినే
మాధవాయ మధు విద్విషే నమః.

అనే శ్లోకాన్ని చతుర్థీ విభక్తిలోను నడిపారు. ఇలా విడివిడిగా అన్ని విభక్తులలోను నడపటమే గాక సార్వవిభక్తిక మైన శ్లోకాన్ని ఇలా చెప్పారు.

కష్ణో రక్షతునో జగత్త్రయ గురుః
కృష్ణం నమస్యామ్యహం
కృష్ణే నామర శత్రువో వినిహితాః
కృష్ణాయ తస్మై నమః
కృష్ణదేవా సముత్థిం జగదిదం
కృష్ణ స్వదాసోస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమే తదఖిలా
హే కృష్ణ రక్షస్వమామ్

ఈ శ్లోకంలో "కృష్ణుడు మనలను రక్షించు గాక. కృష్ణుణ్ణి నేను నమస్కరిస్తున్నాను. కృష్ణుని చేత దేవశత్రువు లైన అసురులు చంపబడినారు. కృష్ణునికై నమస్కారం. కృష్ణుని నుంచే ఈ జగత్తు ఉదయించింది. నేను కృష్ణునికి దాసుణ్ణి. ఈ అఖిల ప్రపంచము కృష్ణుని యందే ఉంటున్నది. ఓ కృష్ణా! నన్ను రక్షించు" అని అష్ట విభక్తులలోను ప్రార్థన ఉంది. ఇలాంటి ప్రయోగాలు తమిళ సాహిత్యంలో, దివ్య ప్రబంధాలలో, తిరుప్పావైలోను ఉన్నాయని పెద్దలు చెబుతారు.[1]

కాళిదాసు రఘువంశంలోను, విక్రమోర్వశీయంలోను ఉదాహరణం, జయోదాహరణం అనే పేర్లు కనిపిస్తున్న మాట నిజమే. రఘువంశంలో నాల్గవ సర్గతో రఘు మహారాజు జైత్ర యాత్రలో ఈ పదం కనిపిస్తున్నది.

శరైరుత్సవ సంకేతాన్ సకృత్వా రతోత్సవాన్
జయోదాహరణం బాహ్వోగాపయామ సకిన్నరాన్

రఘు మహారాజు హిమాలయ ఉపత్యక ప్రాంతంలోని ఉత్సవ అనే పేరుగల గణరాజస్వాపాలకులను జయించి విరతత్సవులను చేసి (సంతోష రహితులను చేసి) తన బాహుబలాన్ని జయోదాహరణ కావ్యంగా కిన్నెరులతో పాడించాడు - అని ఈ శ్లోకార్థం.

ఇక విక్రమోర్వశీయంలో "వత్తే నివేశిత ముదాహరణం, ప్రియాయాః" అని వుంది.

ప్రాచీనాలంకారికులు ఎవరూ ఈ ఉదాహరణ కావ్యానికి లక్షణం చెప్పలేదు. తొలిసారిగా ఈ లక్షణం చెప్పిన వాడు విద్యానాధుడు. ఇతడు దీనిని క్షుద్ర ప్రబంధాలలో చేర్చి లక్షణం చెప్పాడు.

'యేనకేనాపి తాళేన గద్యపద్య సమన్వితమ్
జయ త్యుపక్రమం మాలిన్యాది ప్రాసవిచిత్రతమ్
తదుదాహరణం నామ విభక్త్యష్టక సంయుతమ్'

1. ఉదాహరణ వాఙ్మయ తొలి ప్రచురణ సమీక్ష - ఆంధ్రప్రభ తిరుమల రామచంద్ర

ఒక విద్యానాధుడే దీనికి లక్షణం చెప్పడాన్ని బట్టి గుప్తరాజుల భారత జైత్రయాత్ర తర్వాత దానికి దాదాపు ప్రతిబింబంగా రచించిన (రఘువంశం లోని) రఘుమహారాజు జైత్రయాత్రలో 'జయోదాహరణం' అని పేర్కొనడంవల్ల ఉపలబ్ధ మైన సంస్కృతోదాహరణ కావ్యాలలో సోమనాథుని బసవోదాహరణమే మొదటిది కావడం వల్ల ఈ కావ్యభేదం తెలుగు నాటి దేశ రచనలో ఉండి ఉండవచ్చునని దానికి ఉదాహరణమనే పేరిచ్చి పాల్కురికి సోమనాధుడు బసవోదాహరణమని వ్రాయగా విద్యానాథుడా తమ సమకాలికమైన దానికి తెలుగు దేశీ సాంప్రదాయానుసారంగా నూతన లక్షణం చెప్పాడని డాక్టరు తిరుమల రామచంద్రగారు అభిప్రాయ పడుతున్నారు.[1]

వారి అభిప్రాయం పరిశీలన యోగ్యం. ఉదాహరణ కావ్యాలు నేడు కూడ ఆంధ్రదేశంలో ప్రచురంగా ఉన్నట్లు సంస్కృత వాఙ్మయంలో అదిన్నీ, ఉత్తరా పథంలో లేవు.

ఉదాహరణకావ్య మంటే అష్టవిభక్తుల నుదాహరించి ఇష్టదైవాన్నిగాని, దైవ సమాను డైన ఆధ్యాత్మిక గురువును గాని, రాజునుగాని, మహాపురుషునిగాని కళికోత్కళికాది నియమంతో కీర్తించే కావ్యం ఉదాహరణకావ్య మని స్పష్టమైంది.

నిడుదవోలు వేంకటరావుగారి దృష్టి ఆంధ్ర వాఙ్మయంలోని సకల కోణాలపైన ప్రసరించినట్లే ఉదాహరణ శాఖమీద ప్రసరించింది. వారే అన్నట్లు 'కాలక్రమమందు ద్వితీయమై, కవితా ప్రకర్షయం దద్వితీయ మగు ద్వితీయమై, కవితా ప్రకర్షయం దద్వితీయ మగు రావిపాటి తిప్పన త్రిపురాంత కోదాహరణమును విపుల పీఠకతో ప్రచురించారు. అది వరకే దానిని మాన్యులు మానవల్లి రామకృష్ణకవి గారు 1912లో తొలిసారిగా ప్రచురించారు. దానిని నిడుదవోలు వేంకటరావుగారు తంజావూరి ప్రతితో సరిచూచి చారిత్రకాది వివిధ విషయ సంబంధ విపుల పీఠికతో వివరణలతో ప్రచురించారు. దానిని తెలుగు దేశం మెచ్చుకుంది. ఆ ఉత్సాహంతో ఉదాహరణ

2. డాక్టరు తిరుమల రామచంద్రగారితో చర్చలో వెలువడిన సారాంశము

వాఙ్మయ చరిత్రను వ్రాయబూనుకొని 1950లో ఉదాహరణ వాఙ్మయ చరిత్ర ప్రచురించారు. తర్వాత అది 1968లో వివిధ పరిష్కరణలతో ద్వితీయ ముద్రణ పొందింది.

ఇది దాదాపు 350 పుటల ఉద్గ్రంథం. నిడుదవోలు వేంకటరావుగారు చారిత్రక దృష్టితో ఉదాహరణ వాఙ్మయ యుగ విభజన చేసి, ఆయాయుగాలకు సంబంధించిన ఉదాహరణ కావ్య లక్షణాలను మార్పులను వివరించి లక్ష్యప్రాయంగా ఉదాహరణ కావ్యాలను కూడా ప్రచురించారు. దీనితో 1) ఉదాహరణములు - వాని లక్షణములు 2) ఉదాహరణములు - సాహిత్య సమీక్ష 3) సంస్కృతోదాహరణములు-వాని లక్షణములు 4) ఛందస్సు - రగడలు 5) ఉదాహరణములు - చరిత్రకయుగ పరిణామము, 6) శివ కవియుగము - బసవోదాహరణము 7) తిక్కన ఎఱ్ఱన యుగము - త్రిపురాంతకోదాహరణము 8) శ్రీనాథయుగము 9) శ్రీ కృష్ణదేవరాయ యుగము - శ్రీ వెంకటేశ్వరోదాహరణము 10) దక్షిణాంధ్రయుగము 11) ఉత్తర ప్రబంధ యుగము 12) ఆధునిక యుగము 13) సంస్కృతోదాహరణము 14) పరిశిష్టము అనే ప్రధాన విభాగాలతో లక్షణాలను చారిత్రక సాహిత్య దృష్టితో పరిశీలించడంతో బాటు లక్ష్యాలుగా ఆయా కాలాల ఉదాహరణ కావ్యాలను సంస్కరించి ప్రచురించారు.

వృత్తం, కళిక, ఉత్కళిక - ఇవి ఒక ముడిగా ఒక్కొక్క విభక్త్యంతంతో ముగిసే లఘుకృతి ఉదాహరణ. సార్వవిభక్తికంగా ఒక వృత్తంతో, అంకితాంక పద్యంతో ఉదాహరణ ముగుస్తుంది. అంటే మొత్తం మీద 21+2=23 పద్యాలలో విశిష్ట సంఖ్యా నియమకృతి ఉదాహరణ కళికోత్కళికలు రగడ లక్షణాన్ని అనుకరిస్తాయి. ఇవి సాధారణంగా దైవస్తుతులు. క్వాచిత్కంగా మానవ నాయక గుణ సంకీర్తనలు, తెలుగులో లభించిన తొలి ఉదాహరణ పాల్కురికి సోమన రచించిన బసవోదాహరణ. అతడే సంస్కృతంలో ఇదే పేరుతో ఉదాహరణ రచించాడు. తరువాత క్రీ.శ. 1380లో వెలసింది. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణం. దీని నాలుగో ముద్రణ స్వయంగా నిడుదవోలు

వేంకటరావుగారే నిర్వహించారు. అందుకు కారణం వారి పీఠికతో కూడిన త్రిపురాంతకోదాహరణాన్ని 1941లో ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు, 1944-50 వరకు, మద్రాసు విశ్వవిద్యాలయంవారు విద్వాన్(బి) పరీక్షకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించడమే.

1946 త్రిపురాంతకోదాహరణపీఠిక పీఠికాకారుని విద్వత్తుకు, పరిశోధనా పాటవానికీ నీరాజనంగా నిలిచింది. తెలుగు ప్రధానంగా అభ్యసించే విశ్వవిద్యాలయ విద్యార్థులకు త్రిపురాంతకోదాహరణం పాఠ్యాంశంగా ఉండడంవల్ల నిడుదవోలు వేంకటరావుగారి ప్రతిభ, పేరు ప్రతిష్ఠలు విద్వల్లోకానికి తెలియవచ్చాయి. నిడుదవోలు వేంకటరావుగారు మూల మాతృకలతో ప్రథమ, ద్వితీయ ముద్రణలను సరిపోల్చి నిర్దుష్టమైన పాఠాన్ని గిడుగు రామ్మూర్తి పంతులుగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వంటి వారి అభిప్రాయానుగుణంగా సవరించారు. కవి చరిత్ర కాల నిర్ణయ చర్చలలో ఆయన కొత్తనిర్ణయమేదీ చేయలేదు. పైగా క్రీ.శే. 1380 అని కవి కాలం నిర్ణయించి, విరేశలింగం పంతులుగారు చేసిన ఇదే కాలనిర్ణయాన్ని విస్మరించడం వింత. కవి కృతేతర గ్రంథ విషయ విమర్శలో కూడా ఆయన కొత్తగా చెప్పిందేమీ లేదు. వారికి ముందున్న మానవల్లివారు తమవ్యాసాల్లో తెలిపినవే.

నిడుదవోలు వేంకటరావుగారి విద్వత్తంతా ఉదాహరణలకు వాఙ్మయంలో ఉన్న స్థానాన్ని నిరూపించడం, మార్గ-దేశి కవితా స్రవంతుల సమ్మేళన ఉదాహరణ అని తెలపడం, తెలుగు కవిత ఏక పదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పద పరిణతి, చెందినట్లు నిర్ధారించడం, ఉదాహరణకూ, సంగీత - సాహిత్యాలకూ సంబంధం, సప్త విధ విభక్తి పరిణామ నిరూపణ, సాధారణాంధ్ర ప్రబంధ ఆశ్వాసాంత పద్య విభక్తి రచన షష్ఠ్యంతాల అంతరార్థ వివేచన, దేశీయ ఛ్ఛందో వికాసం, సంస్కృతోదాహరణల ప్రసక్తి - మొదలైన వాటిని గురించి వివేచించడం - ఈ విమర్శనలు ఆనాటి దండి పండితులను అవుననిపించాయి.

నిడుదవోలు వేంకటరావుగారి చిన్నతనంలోనే త్రిపురాంతకోదాహరణ, బసవోదాహరణ అచ్చు అయినా అవి అనాఘ్రాతపుష్పాలుగానే ఉండిపోయాయి. నిడుదవోలు వేంకటరావుగారు త్రిపురాంతకోదాహరణ ప్రకటన తరువాత తెలుగు

దేశపు సాహిత్య సమారాధకులు సుమారు పాతిక మంది ఉదాహరణలు వ్రాశారు. ముఖ్యంగా పేర్కొనదగినవారు విశ్వనాథ, మధునాపంతులు, తిమ్మావఝుల, దివాకర్లవారు.

శతక కవుల చరిత్ర చదివిన నాటినుంచి ఉదాహరణ వాఙ్మయ చరిత్రకూడా రాయాలని తలంపు కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారిలో కలిగింది. మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధనాచార్యులుగా ఉంటూ ఆ కోరిక నెరవేర్చుకున్నారు. 1950లో ఉదాహరణ వాఙ్మయ చరిత్ర ప్రకటించి, తొలి బసవోదాహరణం నుంచి 1800 వరకు వెలసిన ఉదాహరణలను చేర్చారు. 1968లో హైదరాబాద్ నుంచి ప్రచురితమైన ముద్రణలో 25 మంది ఆధునికుల ఉదాహరణలు అచ్చు వేశారు. ఇంకా కొంతమంది ఆధునికుల ఉదాహరణలు ఇందులో చేరవలసి ఉంది.

ఉదాహరణల మూలంగా తెలుగు విభక్తి చరిత్ర చారిత్రకంగా నిరూపించిన వారు నిడుదవోలు వేంకటరావుగారు 'కొఱకు' అనేది ప్రాచీన కాలంలో లేదని 'కై' అనేది 'కు+అయి' అయిందని నిర్ధారణ పూర్వకంగా వీరి పరిశోధన వల్ల తెలిసింది. దీనివల్ల ఆంధ్ర శబ్ద చింతామణి ప్రాచీన వ్యాకరణం కాదని రుజువైంది.

ఉదాహరణలకు రగడలే ఆయువుపట్లు. రగడ - రఘటా శబ్ద భవం.

షష్ఠ్యంతాలు నన్నయలో లేకపోవడానికి కారణం రాజరాజ నరేంద్రుడు భారతానికి ప్రత్యక్ష్య శ్రోత కావడమే. మిగిలిన సాహిత్యంలోని ఆశ్వాసాంత విభక్తులను గురించి మొదలుగా క్షుణ్ణంగా పరిశోధించిన వారు నిడుదవోలు వేంకటరావు గారే.

ఉదాహరణ సమగ్ర స్వరూపంపైన డాక్టరు కేతవరపు రామకోటి శాస్త్రి, డా॥ గంగప్ప మొదలైన ప్రసిద్ధ విద్వాంసులు వ్యాసాలు వ్రాశారు. ఇందులో కేతవరపు వారి వ్యాసం ఆలోచనా పూర్వకంగా ప్రామాణికమైంది.

ఉదాహరణలను నిడుదవోలు వేంకటరావుగారు పర్యవేక్షణలో తాళయుక్తంగా ఆకాశవాణిలో ప్రసారం అయ్యాయి.

ఒక్క ఉదాహరణ శాఖకే కాక తెలుగు సాహిత్యంలో వున్న ఇతర వాఙ్మయ శాఖలలోను ప్రత్యేక పరిశోధన జరగడానికి ఈ ఉదాహరణ వాఙ్మయ చరిత్ర ప్రాతిపదిక అని చెప్పవచ్చు.

## ఉదాహరణములు - వాని లక్షణములు

నిడుదవోలు వేంకటరావుగారు ఈ మొదటి విభాగంలో ఉదాహరణ లక్షణాలను నిర్వచించారు. "ఉదాహరణ మనగా భాషయందు గల సప్తవిభక్తులు, సంబోధన విభక్తిని ఉదాహరించు లఘుకృతి, ఇది ప్రధానముగా స్తోత్రరూపమగుటచే దేవతాపరమగు కావ్యము. కాని, మానవపరమగు కృతులును ఉండును. ఇందు వృత్తములు, కళికలు, ఉత్కళికలు, సార్వవిభక్తికపద్యము, కవికృత నామాంకిత పద్యము అను విభాగములు గలవు. ప్రతి విభక్తికి ఒకే వృత్తము, ఒకే కళిక, ఒకే ఉత్కళిక నియతములు. వృత్తములలో చంపకోత్పలములు, మత్తేభ శార్దూల వృత్తములు మాత్రమే ప్రయుక్తమగును. కళిక యనగా మాత్రాఛందస్సునకు సంబంధించిన రగడ భేదము, ఇందెనిమది పాదములు మాత్రమే యుండును. ఉత్కళిక యనగా కళికలో సగము భాగము - అర్ధ కళిక. ఇందును ఎనిమిది పాదములే. కళికయందు ప్రతిపాదమునకు విభక్తిప్రత్యయము భాసింపవలెను. ఉత్కళిక యందు చివరి రెండు పాదములలోను మాత్రము భాసింపవలెను, సంబోధనయందు మాత్ర మన్నిపాదములును సంబోధనాంతముగనే యుండ వలెను. చతుర్థీ విభక్తియందు ప్రతి పాదాంతమున విభాక్త్యాభాసము స్పష్టముగా నుండవలెను. కళికలయందు ప్రతిపాదమును స్వతంత్ర వాక్యముగా నుండవలెను. ఉత్కళికయం దేక సమాసముగా పాదము లుండవలెను. సార్వవిభక్తికము దీనియం దొక్క పద్యముననే యన్ని విభక్తులు ప్రయుక్తములు కావలెను. ఇది సాధారణముగా మత్తేభమునగాని, శార్దూల వృత్తమున గాని యుండును. కవికృత నామాంకిత పద్యము ఇందొకేపద్యమున కవిపేరు నుదాహరణము పేరు నుండవలెను,......

ఇందలి కళికోత్కలికోత్కళికా పద్య సంఖ్య యిరువది యారు, ఇది సదాశివుని షడ్వింశతి తత్త్వములకు ద్యోతకము."[1]

ఉదాహరణ కావ్యాలన్నీ ఈ లక్షణానికి అనుగుణంగానే ఉన్నాయి.

తర్వాత నిడుదవోలు వేంకటరావుగారు ఉదాహరణము ప్రాచీనతను చర్చిస్తూ ఈ ప్రక్రియ వేదమందే ఉందని, ఋగ్వేదంలో ఇలాటి స్తుతులుగల సూక్తాలను "కుంతాప సూక్తాలు" అని అంటే అంటారని, వీనికి "నారాశంసి" అని పేరు కూడ కలదని అంటూ, ప్రథమ, సంబోధన ప్రథమా విభక్తులతో ఉన్న కొన్ని స్తుతి మంత్రాల అనువాదాన్ని ఉదాహరించారు.[2]

ఆంధ్ర కవితా పరిణామాన్ని తెలుసుకోవడానికి ఉదాహరణలు సాధనమయ్యాయి. తెలుగు కవిత ఏక పదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పదమై పెరిగినట్లు కనిపిస్తుంది. ఏక పదాలైన పాటలు, ద్విపదాలైన ప్రబంధాలు త్రిపదాది సంయుక్తాలై సంపూర్ణ గాన యోగ్యాలు, సలక్షణ చతుష్పాద వృత్తకవితా సమన్వితాలైన భారతాది గ్రంథాలు వాఙ్మయ వీధిలో ప్రథమ, ద్వితీయ, చతుర్థ ఘట్టాలు ఉదాహరణలో తృతీయఘట్టాన చేరాయి. కేవలం ఏక పదాలు కాక ద్విపదాదుల్లా ఒకే ఛందస్సును అనుసరించక, పద కవితలోని ఏదైనా ఒక ఛందో విశేషాన్ని అనుసరిస్తుంది. యక్షగానాల్లో గాన యోగ్యాలైన పదాలను హెచ్చుగా కలిగి ఉండకపోయినా లయతాళ సమన్వితాలైన పదాలతోకూడిన వృత్తాలు కలిగి వుంటుంది. కనుక ఇవి ద్విపద కవితకూ, యక్షగాన కవితకూ మాధ్యమికాలని నిశ్చయింపవచ్చు.

సరస్వతీ స్తనద్వయమని మన పూర్వులు వర్ణించిన సంగీత సాహిత్యాలకు దగ్గర సంబంధం కలిగింది ఉదాహరణం. స్వర ప్రధానమైన సంగీతానికీ, వర్ణ ప్రధానమైన సాహిత్యానికీ లక్ష్యభూతాలైనవి ఉదాహరణాలు. ఇందులో మాత్రాచ్ఛంద స్సంబంధాలైన రగడలు తాళ సహితంగా, గేయ రూపంగా ఉంటాయి. కనుక ఛందస్సుకు సంగీతానికి ఉన్న సంబంధాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఉదాహరణలలోని

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర పుట 1-2
2. అదే - పుట - 3,4.

రగడలను ఆయా తాళాలతో గానం చేయాలని మన ఆంధ్ర లాక్షణికులు నిర్దేశించారు. అవ్యక్త మధురమైన తెలుగు కవితకూ ఉదాహరణలే కుదిరిక కూర్చాయి.

ఉదాహరణల్లో వృత్తాలు మార్గకవితానుసరణలు. రగడలు దేశకవితానుసరణలు. ఉదాహరణల్లో ఉపయుక్తమయ్యే చంపకోత్పలాలు, మత్తేభ శార్దూలాలు అక్షరగణ ప్రధానమైన సంస్కృత ఛందస్సు నుంచి పుట్టినటువంటివి.

విభక్తి ప్రత్యయాలను నియతంగా కూర్చడంచేత ఉదాహరణలు వాఙ్మయ, భాషాశాస్త్రాలను తెలుసుకోవడానికి ఉపయుక్తా లవుతున్నాయి. ఆంధ్ర వ్యాకరణంలోని విభక్తి ప్రత్యయాల పరిణామాన్ని, వాటి వ్యుత్పత్తులను తెలుసుకోవడం భాషా చరిత్రకారులకు అత్యావశ్యకం - ఆయాకాలాల్లో పుట్టిన ఉదాహరణలను ఆయా కాలాల్లో పుట్టిన వ్యాకారణాలను అనుసరించి పరిశీలిస్తే కొన్ని విభక్తులకు వ్యాకరణాలలో ప్రత్యయాలుగా చెప్పినవి ఉదాహరణలలో కనిపించవు. ఒక్క ఉదాహరణలలోనే కాక ఆయా కాలాల్లో పుట్టిన కావ్యాదులలోనూ ఆయా ప్రత్యయాలు ఉపయుక్తం కాకపోవడం చేత ఆంధ్ర వైయాకరణులు విభక్తులను గురించి చేసిన సిద్ధాంతాలను ఎంతవరకు ప్రమాణాలుగా తీసుకోవచ్చని ఊహించ వలసి ఉంది.

ఇందుకు ఉదాహరణగా 'కై' 'కొఱకు' అనే చతుర్థీ విభక్తి ప్రత్యయాలను వారు చూపారు. క్రీ.శ. 1220 ప్రాంతం నాటి బసవోదాహరణములో కాని, 1380 ప్రాంతంనాటి త్రిపురాంతకోదాహరణములో కాని ఈ ప్రత్యయాలు కానరావు. ఒకవేళ ఉదాహరణ కర్తలు వీటిని వదిలేశారనుకున్నా, అంతకు ముందు క్రీ.శ. 1050 ప్రాంతరచితాలై మనకు లభ్యమైన గ్రంథాల్లో ప్రథమ పరిగణితమైన నన్నయభట్టు రచిత భారతభాగంలో కాని ఆకాలంలో మనకు లభ్యమైన శాసనాల్లోకాని ఈ ప్రత్యయాలు కనపడవు. (చూ. ఆచార్య చిలుకూరి నారాయణరాయ విరచిత ఆంధ్ర భాషా చరిత్రము ద్వితీయ భాగము). ప్రాచీన వ్యాకరణాలలో ఆంధ్రభాషలో పద్యరూపంలో వెలసిన తొలి వ్యాకరణమైన ఆంధ్రభాషా భూషణములలో 'కొఱకు' ప్రత్యయరలేదు, నన్నయ భారతంలో 'కై' ప్రయుక్తమైనా కు+అయి అని భావించారు.

ఆ ప్రత్యయం ప్రయుక్త మైనప్పుడల్లా స్వరయతేకాని వ్యంజనయతి లేకపోవడం చేత, ఈ ప్రత్యయం వాడుకలో లేదని చెప్పుకోవచ్చు. 'కేవలం' 'అయి' అనే ప్రత్యయమే 'కొఱకు' అనే అర్థంలో ప్రాచీన కాలంలో వాడుకలో ఉండేది. బసవోదాహరణము, త్రిపురాంతకోదాహరణములలో చతుర్థీ విభక్తి రూపం 'కునై' అని ఉంది. ఇది షష్ఠీ విభక్తి ప్రత్యయమైన 'కున్' అనే దానికి చతుర్థీ విభక్తి ప్రత్యయం 'అయి' చేర్చడంవల్ల ఏర్పడింది. ఇటువంటి ప్రత్యయ రూప నిష్పత్తి క్రమాన్ని తెలుసుకుంటే వ్యాకరణంలో చెప్పిన చతుర్థికి షష్ఠి నిలుస్తుంది. అనే సూత్రార్థాన్ని సులభంగా గ్రహించగలం. ఆంధ్రవిభక్తి ప్రత్యయాల చరిత్రను మనమీవిధంగా పరిశీలిస్తే భాషాతత్త్వశాస్త్ర మెంతైనా అభివృద్ధి పొందగలదు.

విభక్తి ప్రత్యయాల వాడుక నియంతగా ఉదాహరణల్లో ఉన్నా, ఆంధ్ర ప్రబంధ, యక్షగాన శతకాదులలోనూ విభక్తి నియమం కనబడుతుంది. దీనికి ఆ వాఙ్మయాల మీద ఉన్నది ఉదాహరణల ప్రభావమే కారణమని నిరూపించవచ్చు. కొన్ని ప్రాచీనాంధ్ర ప్రబంధాలలో ఆశ్వాసాంతాలు సంబోధనాంతాలుగా ఉండక, ఒక ఆశ్వాస మే విభక్తితో అంతమైతే తరువాతి ఆశ్వాసం ఆ విభక్తితోనే ప్రారంభం కావడం కనబడుతున్నది.

ఇక సర్వాంధ్ర ప్రబంధ సాధారణాలైన షష్ఠ్యంతాలు కూడా ఈ ఉదాహరణ లక్షణమే అని చెప్పవచ్చు. ఆంధ్ర ప్రబంధాలలో కృత్యవతరణిక పూర్వం సార్వ విభక్తికంగా ఉండే దని, కాలక్రమంలో ఆ పద్ధతి మారి శేష షష్ఠి సంబోధన ఉపయుక్తాలై, షష్ఠ్యంత సంబోధన విభక్తిరచన నియతమైం దని ఊహించాలి. యక్షగానాల్లో అంతం ద్వితీయ విభక్తితో ఉండడం, శతకాలన్నీ సంబోధనతో ఉండడం అందరికీ తెలుసు. పద్యమయాలైన ప్రాచీనాంధ్ర భాషా శాస్త్రాలలో విభక్తులు వెలయడం స్తుతిపరమైన ఉదాహరణల ప్రాచీనతకు దోహదం అవుతూంది.

ఆంధ్రవాఙ్మయంలో పురాణేతిహాస కావ్య నాటకాదులలోని లక్షణాలన్నీ అంతర్భూతంగా ఉండడంవల్ల, ఉదాహరణలు ఆ గ్రంథాల వలన కలిగే ప్రయోజనా లన్నిటిని ఇచ్చి ఆనందం కలిగిస్తున్నాయి.

భక్తి రస ప్రధానలైన మతాలకు, ముఖ్యాంగమైన గానకళకు సంబంధించిన ఉదాహరణలు పన్నెండవ శతాబ్దికి ముందే వెలసినట్లు శైవ వాఙ్మయం వల్ల తెలుస్తూంది.

## ఉదాహరణములు - సాహిత్య సమీక్ష

ఈ రెండవ విభాగంలో నిడుదవోలు వేంకటరావుగారు "తెలుగు కవిత ఆశు మధుర చిత్రవిస్తర కవిత్వములని నాలుగు భేదములు. వీనికే 'చతుర్విధ కవిత' లని పేరు. ఈ కవితా విభాగములు నన్నయ కాలమునుండి క్రీ.శ. (1050) తెలుగున వెలయుచున్నవి"[1] అని కవితారీతులు తెలిపి విపులచర్చ చేశారు. నన్నయ శ్రీనాథు లిద్దరూ మృదు మధుర చిత్ర విస్తర కవిత లని పేర్కొని, ఆశుకవితను మృదువు అని అన్నారు. అప్పకవి నాటి నుంచి (క్రీ.శ. 1656) ఈ సంప్రదాయం ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వమని మతభేధం ఏర్పడింది.

ఉదాహరణ కావ్యాలు మధుర కవితా విభాగంలో చేరుతాయి. అంతేగాక మార్గదేశి భేదాలతో రెండు విధాలుగా ఏర్పడిన సంప్రదాయాలలో ఉదాహరణ కావ్యాలు దేశిసంప్రదాయానికి చెందుతాయి. ఇది విపులచర్చ సారాంశం.

తర్వాత నిడుదవోలు వేంకటరావుగారు విభక్తి ప్రత్యయాలను గురించి చర్చిస్తూ ఉదాహరణ కావ్యం ప్రథమాది సప్తవిధ విభక్తులను ఉదాహరిస్తూ నియతమైన అక్షర గణాలు గల ఒక వృత్తం, అనియత మాత్రాగణాలున్న పద భేదాన్ని కలిపి చెప్పినట్టిది గనుక ఉదాహరణ మైందని, విభక్తులను ఉదాహరించే పద్ధతి వాఙ్మయానికి మూలమయినట్టు. కావ్య లక్షణాలను బట్టి తెలుస్తున్నది గనుక ఉదాహరణ కావ్యాలు సాహితీ పరిణామాన్ని తెలుగసుకొనడానికి అంత్యంతోపయుక్తా లన్నారు.[2]

దీనికి ఉదాహృతిగా తెలుగు కావ్యాలలో ఇష్టదైవస్తుతి, కవితా ప్రశంస, సుకవిస్తుతి, కుకవి నింద, కృతి పతి కీర్తనం, కవి స్వవిషయం, కృతి పతి వర్ణనం,

1. అందే పుట 13.
2. అందే పుట 18.

కవి వంశ వర్ణనం, షష్ఠ్యంతాలు, ఆశ్వాసాంతాలలో సంబోధనం, లేక విభక్తి భేదం, కవి గద్య - స్వవిషయం - అనే విషయాలలో తెలుగుకవులు విభక్తులను వాడడం కావ్యాన్ని శ్రీకారంతో ప్రారంభించి, మంగళ మహాశ్రీతో ముగించడం ఉదాహరణ కావ్య లక్షణం. పూర్వ రూపాలను వివరిస్తూ శాసనాల నుంచి, కావ్యాలనుంచి పెక్కు దృష్టాంతాలు చూపారు. మన కావ్యాలలోని అంకిత షష్ఠ్యంతాల పద్ధతికి రఘు వంశం అవతారిక లోని రఘు వంశరాజుల గుణగణాలను వర్ణించే షష్ఠీ విభక్త్యంతాలే ప్రేరకాలు అని నిరూపించారు. చేత, చే, తోడ, తో అనేవి నేడు తృతీయా విభక్తి ప్రత్యయాలుగా ఉన్నా, నన్నయగాని ఉదాహరణ కావ్యకర్తలు గాని నన్నయకు ముందున్న శాసన కర్తలుగాని తోడ, తో లను తృతీయ విభక్తిగా వాడ లేదని సిద్ధాంతీకరించారు.

## సంస్కృతోదాహరణములు - వాని లక్షణములు

ఈ విభాగంలో నిడుదవోలు వేంకటరావు గారు క్రీ.శ. 1320 ప్రాంతమున ఉన్న సుప్రసిద్ధాంధ్రాలంకారికుడైన విద్యానాథుడు ప్రతాపరుద్ర యశోభూషణంలో చెప్పిన ఉదాహరణ లక్షణాన్ని వివరించారు. ఈ లక్షణం సమగ్రంగా లేనందున ప్రతాప రుద్ర యశోభూషణ వ్యాఖ్యాత అయిన కుమారస్వామి సోమపీధి రత్నాపణ వ్యాఖ్యానంలోని వివరణను అనుసరించి ఉదాహరణాలు మాలినీ వృత్తంతో జయతి అనే ఉపక్రమంతో తాళాను గుణమైన ఎనిమిది వాక్యాలతో గాని, పాదాలతోగాని ఉండాలి. ఇవి కళికలు, వీటిలో సగం ఉత్కళికలు. మొదట ఏ విభక్తి ఉంటే అదే పద్య కళికోత్కలళికలలోను ఉండాలి. ఒక చోట విభక్త్యాభాసం ఉండాలి. తెలుగు ఉదాహరణ లక్షణాలలో సంబోధన విభక్తి చివర సార్వవిభక్తికవృత్తం అంకితాంక పద్యం ఉంటాయి. కాని, సోమనాథుని సంస్కృత బసవోదాహరణలో ఈ రెండూ వున్నా, తెలుగు బసవోదాహరణంలో అంకితాంకపద్యం లేదు. త్రిపురాంత కోదాహరణంలోను ఇది లేదు. తర్వాతి తెలుగు ఉదాహరణల్లో ఉంది.

సోమనాథుని తర్వాతివాడైన విద్యానాథుడు సోమనాథుని సంస్కృత బసవోదాహరణం చూచి ఉంటాడు. అయినా సార్వవిభక్తిక శ్లోక అంకితాంక

పద్యాలను తన ఉదాహరణ లక్షణంలో ఎందుకు చేర్చలేదో కారణం తెలియదు. కనుకనే వ్యాఖ్యాత కుమారస్వామి సోమపీధి. 'అత్ర సంబోధన విభక్తి రష్టమీ ప్రబంధాంతే సర్వవిభక్త్యంకితో ననమ శ్లోకశ్చేత్యాది విశేషాణాం సాక్షి శ్లోకాః సాహిత్య చింతామణౌ ద్రష్టవ్యాం" (సంబోధన విభక్తి తర్వాత సర్వ విభక్తులు తొమ్మిదవ శ్లోకం మొదలైన విశేషాలు సాహిత్య చింతామణిలో చూడాలి) అని పెదకోమటి వేమ భూపాలుడు రచించిన సాహిత్య చింతామణిని ప్రత్యేకంగా తెలిపాడు.

సంస్కృతాంధ్రాలలోని కావ్య రచనా పద్ధతి నుంచే ఉదాహరణ లే విధంగా విభక్తి ప్రత్యయాల విషయంలో విశిష్టత చూపాయో నిడుదవోలు వేంకటరావు గారు వివరించారు.

ఉదాహరణలు సాధారణంగా దైవపరాలు గాను క్వాచిత్కంగా మానవ పరంగాను ఉంటాయి. కావ్యాలూ అంతే, తెలుగులో సాధారణంగా దైవానికి గాని, రాజుకు గాని, గురువుకుగాని అంకితం కాని కృతి ఉండదు. కనుక అంకితానికి అందాలుగా తెలుగుకావ్యాల్లో కృత్యవతరణికలో ఇష్టదేవతా స్తుతి, కవితా ప్రశంస, సుకవిస్తుతి, కుకవినింద, కృతిపతి కీర్తనం, కవి స్వవిషయం, కృతిపతి వర్ణన, కవివంశ వర్ణన, షష్ఠ్యంతాలు కధాభాగంలో ఆశ్వాసాలుగా విభాజితమై, ప్రతి ఆశ్వాసం చివరా కృతిప్రతి ప్రస్తావన (సంబోధన) లేక విభక్తి బేధం కవిగద్య స్వవిషయం, ప్రథమాశ్వాసం కాక తిక్కన ఆశ్వాస ప్రారంభాల్లో ఒక సంబోధన.

పై కృత్యవతరణికలలోను, ఆశ్వాసాద్యంతాలలోను ఇష్టదేవతాస్తుతి, షష్ఠ్యంతాలు, కృతిపతి వర్ణన ఆశ్వాసాంత పద్య రచన వ్యాకరణానికీ, అందులోనూ ముఖ్యంగా విభక్తులకూ సంబంధించినవి. మన తెలుగు కృతులలో అంకితాలు రెండు విధాలు - సంబోధనాంతాలు, విభక్త్యంతాలు. వీటిలో ప్రాయికంగా సంబోధనాంతాలే ఎక్కువ. కాని, విభక్త్యంతాలు మన ప్రాచీన సంప్రదాయాన్ని తెలుసుకోవడానికి ఉపయుక్తమవుతాయి. మనకు ఉపలబ్ధమై ప్రాచీనతెలుగు కృతులలో నన్నయ భారతం మొదటిది. రెండవది నన్నెచోడ కవి కుమార సంభవము. తరువాత వెలసిన ఎన్నో కావ్యాల్లోను గొప్ప విశేష లక్షణాలు కనబడుతున్నాయి.

కావ్యం 'శ్రీ'తో ప్రారంభంకావడం కావ్యాదిలో సంస్కృత శ్లోకం, కావ్యాంతంలో మంగళమహాశ్రీవృత్తం, అందులో కొన్ని.

కావ్యాల్లోని పై లక్షణాలు కొన్ని ఉదాహరణల్లో వున్నా ఉదాహరణలలోని కొన్ని లక్షణాలు కావ్యాలకు ముందుగా వెలసిన పద్యమయ శాసనాలలో వెలసి ఉండడం చేత ఉదాహరణల తరువాతనే కావ్యాలలో ఈ లక్షణాలను పాటించారని నిడుదవోలు వేంకటరావుగారు నిరూపించారు.

నన్నయ తిక్కనాదులు ఆదిలో ఉత్పలమాలలను రచించారు. వారి ననుసరించి కేతన, మంచన, మారన, శ్రీనాధుడు, ఎర్రాప్రగడ, ప్రౌఢకవి మల్లన, అయ్యలార్యుడు రచించారు.

ఉదాహరణలో ఒక్క సంబోధన విభక్తిలో తప్ప తక్కిన చోట్ల ఉత్పల చంపక మాలలు మాత్రమే ప్రయుక్తాలయ్యాయి. తెలుగున మొదటి ఉదాహరణమైన బసవోదాహరణ నుంచి ఈ విధంగానే జరిగింది. కాని, బసవోదాహరణలోనే సంబోధనలో కూడ ఉత్పలమాలిక ఉంది. తక్కినవాటిలో శార్దూలవృత్తా లున్నాయి. తరువాత కవులు విభక్తులలో మత్తేభాలను కూడ వాడిరి, ఉదాహరణ ప్రారంభమైంది, కనుక ఇది దేశి రచనమే అని చెప్పవచ్చును.

బసవోదాహరణలో చంపకోత్పలమాలలే ఉన్నాయి. కాని, త్రిపురాంత కోదాహరణలో సంబోధనలో శార్దూలం ప్రయుక్తమైంది. ఇదే తరువాతి కవులకు ఒరవడి అయి సంబోధనలలో అందరూ శార్దూలాన్నే వాడారు. హనుమోదాహరణనుంచి కవులు శార్దూల మత్తేభాలను రెంటినీ వాడారు.

ఈ విధంగా కేవలం సంస్కృత వృత్తాలు కాని, సంస్కృతం చేసిన దేశివృత్తాలు కాని నియతంగా వాడడము ఉదాహరణలో రెండవభాగంలో ప్రయుక్తమైన పదవికతలో మార్పులేక రగడలే ప్రధానంగా వాడడము చూస్తే తెలుగు కవితలో సంస్కృత వృత్తాలు వాడుకునే ప్రయత్నాలు జరుగుతున్న ప్రాథమికావస్థ నుంచి ఉదాహరణ రచన సాగుతున్నదని గ్రహించే అవకాశం ఉంది. కనుక శతక, యక్షగాన కావ్యాదుల కన్న గ్రంథరూపంలో తెలుగులో తొలుత వెలువడినవి ఉదాహరణలే అని చెప్పవచ్చు.

## విభక్తి ప్రత్యయ విశేషాలు

ఉదాహరణ కావ్యాలు విభక్తి ప్రత్యయాలనే నియతంగా నిరూపించడానికి పుట్టాయని వ్యాకరణ శాస్త్రీయ దృష్టిని చెప్పవచ్చు. ఎందుకంటే విభక్తి ప్రత్యయాలు భాషలో ప్రాథమిక రూపాల్లో ఏ రూపంలో ఉంటాయో, ఆరూపాల్లోనే తరువాత ఒక ఉదాహరణల్లో మాత్రమే ప్రయుక్త మయ్యాయి. కావ్యాదులలో విభక్తి ప్రత్యయాలు ఆయా కాలాల్లో ఏర్పడినవన్నీ ఒకే కాలంలో ప్రయుక్తమయ్యే వీలుంది. ఉదాహరణలలో అలా కాదు. ఇది మన తెలుగు విభక్తి పరిణామాన్ని తెలుసు కోవడానికి ఎంతైనా ఉపయోగపడుతున్నది. ముఖ్యంగా తెలుగులో ఉన్న విచిత్ర పద్ధతి భిన్నార్థకాలైన రెండు ప్రత్యయాలు ఒకే విభక్తిలో ఉండడం అనేది తెలుగుకు భాషాతత్త్వాన్ని బట్టి సరైనదే అని నిశ్చయించడానికి తోడ్పడతాయి. తృతీయా విభక్తి : - ఇందుకు ఉదాహరణగా తృతీయా విభక్తి ప్రత్యయాలైన చే, చేత, తో, తోడ అనే వాటిలో తో, తోడ అనే ప్రత్యయాలు ఏ ఉదాహరణలలోనూ మచ్చుకైన కానరావు. చే, చేత మాత్రమే ప్రత్యయాలనీ క్రమంగా తో, తోడలు తృతీయా విభక్తిగా పరిగణితా లయ్యాయని ఊహించవచ్చు.

## తృతీయా విభక్తి 'తో' 'తోడ'

ఆంధ్రభాషా భూషణంలో 'తోడ' తృతీయా విభక్తిలో లేదు. కనుక క్రమంగా లక్ష్యగ్రంథమైన భారతం నుంచి ఈ ప్రత్యయం వ్యాకరణాలలో తరువాత పరిగణితం కాదగును. కావ్యాలంకార చూడామణిలో (14వ శతాబ్ది) చేతకు, 'తోడ' నామాంతరమని ఉంది కాని, 14వ శతాబ్దం తరువాత నేటివరకు రచించిన ఏ ఉదాహరణలలోనూ తో, తోడ ప్రత్యయాలు ఉపయుక్తం కాలేదు. కనుక 'తోడ' 14వ శతాబ్దం వరకు తృతీయా విభక్తి ప్రత్యయంగా పరిగణితం కాలేదని, ఉదాహరణలో ఆ నియమాన్ని అనుసరించి తొల్లి విరిసిన ప్రత్యయమే రచయిత లుపయోగించి ఆ ప్రత్యయ చరిత్రకు తోడ్పడ్డారని తెలుస్తుంది.

దీనివల్ల 15వ శతాబ్దం వరకు తో, తోడలు పరిగణితాలు కాలేదని, శాసన పద్యాలలో కూడా లేవని తెలుసుకోవచ్చు.

## చతుర్థీ విభక్తి

కై, కొఱకు వీటిలో కూడ ఉదాహరణల్లో ప్రయుక్తం కాలేదు. నన్నయ భారతంలో లేదు, శాసనాల్లో అసలే లేదు.

బసవోదాహరణలో చతుర్థీ విభక్తికి, 'కునై' 'కినై' అనే ప్రత్యయా లున్నాయి. ఇది వాస్తవంగా కన్+ఐ, కిన్+ఐ అనేది కాగా 'ఐ' లేక 'అయి' అనేదే చతుర్థీ విభక్తి ప్రత్యయం,ఈ ప్రత్యయం తక్కిన ఉదాహరణలోనూ ప్రయుక్తం కాలేదు. నీకు నై, చేరు కునై అనే ప్రాచీనప్రయోగా లున్నాయి. కనుక సోమనాథుడు దీన్ని ఉపయోగించాడు. కాని, తెలుగుకు సంబంధించిన వ్యాకరణాలలో తక్కిన వాటి వలె లాక్షణికులు దీన్ని నిరూపించలేదు, దీనికి కారణం 'కొఱకు' అనే విభక్తి ప్రత్యయం పైన ఒక్కొక్కప్పుడు సిద్ధించు కొఱకునై, మద్దించుకొఱకునై అని వస్తుండడం చేత దీన్ని పత్యేకించలేక పోవడమే అని ఊహించవచ్చు నన్నారు.

మొదట 'కొఱకు' విభక్తి కానప్పుడు దానిమీద వచ్చిన ప్రత్యయాన్ని మాత్రం విభక్తిగా ఎట్లా పరిగణిస్తాము? కాని, ప్రాచీన కాలంలో ఇటువంటి చతుర్థీ విభక్తి రూపం ఉన్నట్లూ అది ఉదాహరణముల మూలంగానే తెలియవస్తున్నట్లుగా మనం గ్రహిచవచ్చు. ఇటువంటి వాటి వలన వీటి ప్రత్యేకత తేటపడుతుంది.

త్రిపురాంతకోదాహరణలో 'కై' అనేది నియతంగా ప్రయుక్తమైంది. ఆ వెనుక 'కై' ప్రత్యయాన్నే తక్కిన వాటిలోనూ గ్రహించారు. ఒక్క కృష్ణోదాహరణలో అప్పకవి దీన్ని సాంప్రదాయాన్ని విస్మరించి పప్పులో అడుగు వేశా డన్నారు నిడుదవోలు వేంకటరావుగారు.

ఉదాహరణలలో విభక్తి ప్రత్యయాలు పద్యాలలో పాదాంతాలలో భాసిల్ల నేరవు. కళికోత్కళికలలో మాత్రమే భాసిల్లుతాయి. అందులోనూ కళికలలో ప్రతి పాదాంతాలలోనూ, ఉత్కళికలలో చివరిరెండు పాదాలలోను భాసిల్లవలె. దీని కుదాహరణ

చ॥ వసిగొని యెవ్వఁడేని బసవా యను నీసుకృతాక్షర త్రయం
బెసగఁ బఠించెనేని గిరిజేశుని కాతని వక్త్ర గహ్వరం
బసదృశ గేహమన్నయవి యార్యులవాక్యము లట్ల కావునన్
బసవనఁ బుణ్యమూర్తి 'దలపంగదె చిత్తమ! పాయ కెప్పుడున్.

**కళిక**

వెండియును భక్తాభివృద్ధిఁ చెందినవాని
బండ మాయావాదపథముఁ ద్రుంచిన వాని
అద్వైత వాక్య సంహారుడై చనువాని
విద్వత్తముం గెల్చి వీరుఁ డయి మనువాని
మీమాంసకుల ముక్కు, మిగుల గోసిన వాని
తామస ధ్వాంతంబు తగుల బాసిన వాని
పెక్కు దైవంబు లని పేరు మాపిన వాని
ఒక్కడే రుద్రుఁ డని యుక్తిఁ జూపిన వాని

**ఉత్కళిక**

ప్రకృతి వాదముఁ దుడిచి
వికృత వేషము లుడిచి
సకల వాదుల నోర్చి
సుకృత వాదము దీర్చి
భూమి భారము మాన్ప
గామించు గతిఁ జూప
నెమ్మి జాలిన వాని
మమ్ము నేలిన వాని

పై ఉత్కళికలో చివరిరెండు పాదాలలో ద్వితీయా విభక్తి భాసించింది. తక్కిన వాటిలో పాదాంతంలో విభక్తి ప్రత్యయం లేనేలేదు. పై పద్యం ద్వితీయా విభక్తి ప్రత్యయం చివరి కది గురువు అంతాన గల పద్యం కావడంచేత నిలిచే అవకాశమే లేదు. అట్లాగే ప్రధమా విభక్తి కూడ వృత్తాలలో నిలవదు. ప్రథమ ద్వితీయా విభక్తుల ప్రత్యయాలు రెండింటిలోనూ అక్షరాలు లఘువులు. కానీ తృతీయా విభక్తి ప్రత్యయం చే, చేతలలో మొదటి అక్షరాలు గురువులు. కాని 'నే' అనేది గురువైనా స్వంతం కావడం చేతను ద్రుతాంతంగా ఉంటేగాని శ్రవణ సుఖదంగా ఉండకపోవడం చేతను శ్రుతి మనోహరమైన తెలుగు భాషకు ఇలాంటి పద్ధతి అస్వాభావికం కావడం చేతను దీన్ని ఉదాహరణ పద్యాలలో కవులు ఉపయోగించలేదు. దీని వలన 'చే' ప్రత్యయం మొదట ధృతాంతం కాదని 'ఒరుచే పడవు' - మొదలైన తిక్కనాది మహాకవుల ప్రయోగాల వలన అది కళగానే ఉండేదని నన్నయ ప్రయోగాలలో గల "చేన్" అనేదాన్ని అనుసరించి తరువాత ఇది ద్రుతాంతంగా పరిగణితమైందని ఊహించవచ్చును.

## ఇక 'కై' ప్రత్యయం

బసవోదాహరణలో చతుర్థి 'కునై' 'కినై' అనే ప్రత్యయాలతో ఉన్నట్లు తెలిపారు నిడుదవోలు వేంకటరావుగారు. త్రిపురాంతకుడు తన ఉదాహరణలో చూపిన విశేషమేమిటంటే తక్కిన తృతీయాది ప్రత్యయాలలో వలె ఉత్కళికలోను చివరరెండు పాదాలలోనేకాక తక్కిన ఆరు పాదాలలోనూ దీన్ని చూపాడు. పద్యంలో "త్రిపురాంతక దేవునకై నమస్కృతుల్" అని చూపి, కళికలో శృంగారికినై, హరికినై, బావకునై, త్రోవకు నై, జోగికినై, త్యాగికినై, దేవునికై, భావునకై - అని సోమనాథుని 'కునై' 'కినై' ప్రత్యయాలను ఉపయోగించి, చివరి రెండు పాదాలలో మనకు నేటి వరకు నిలిచి ఉన్న 'కై' ప్రత్యయంలో ముగించా డన్నారు.

ఇంకా ఉత్కళికలో
కడు దీనతతో ముదితాపసికై
పడి నింటికిఁ జని వెడ కప్పెరగై

కొని యాలు మగల పెను రచ్చలకై
చను దెండని నిక్కము సేయుటకై
వెనుదిప్పిన గుండము లోపలఁ గై
కొని చను యెప్పటి రూపముఁ గై
కొని గుండయ మెచ్చిన వేల్పునకై
వినత పితా మహోఫణి తల్పునకై"

అని అన్ని పాదాలలోనూ ఈ ప్రత్యయం పాటించి రచించాడని ఉదాహరణ చూపారు.

## విభక్తి ఆభాస సంప్రదాయం

వాస్తవానికి కొన్ని పదాలలోని 'కై' విభక్తి ప్రత్యయం ఎంతమాత్రమూ అయి ఉండదు. ఉదాహరణకు తాపసికై, రచ్చలకై, సేయుటకై, వేల్పునకై, తల్పునకై అనే చోట్ల మాత్రమే 'కై' విభక్తి ప్రత్యయం అయింది కాని తక్కినచోట్ల కప్పెరకైకొని, లోపలఁగైకొని, రూపముఁగైకొని మొదలైన వాటిలో విభక్తి ప్రత్యయం కానేకాదు. ఇది కేవలం శబ్ద గతమే అయినా దీన్ని ప్రతి పాదాంతాన ఉపయోగించి ఆ పాదాంతాన్ని చతుర్థ్యంతంగా తోపింపచేయడం అనేది ఒక సంప్రదాయంగా తరువాతి ఉదాహరణ కర్తలందరూ పాటించారు.

ఈ సంప్రదాయాన్ని గురించి 'కావ్యాలంకార చూడామణి'లో విన్నకోట పెద్దన అంత్య చతుర్థ కళికోత్కళికాఖ్యఁ జూడఁబడి చతుర్థియుఁ బోలె చూపట్ట వలయుఁ అని చెప్పాడని ఉటంకించారు. (4-ఉ-18పద్యం) ఇది పై త్రిపురాంత కోదాహరణలో కూర్చిన చతుర్థీ విభక్తి పద్ధతి నుంచే పెద్దన గ్రహించాడనీ, అంతకు ముందీ పద్ధతి అనగా - సోమనాథుని కాలంలో లేదనీ మనం గ్రహించవచ్చు. ఇక్కడ విభక్తి ప్రత్యయం చివర భాసించి, తక్కిన చోట్ల ప్రత్యయ రూపంగానే భాసించి విభక్తి కాక పోయి విభక్తి అనే భ్రమ కలగజేయడమే 'విభక్తి అభాస' మని, అది చతుర్థీ విభక్తిలో మాత్రం తప్పక చూపాలనీ కావ్యాలంకార సంగ్రహము (నరస భూపాలీయము) లో చెప్పారు.

కం. కలికోత్కలికలు పద్యము
లలరారు విభక్తులుం, దదా భాసయుతో
త్కళికలు సజయతి పదమౌ
నలమానిని మొదలుగా నుదాహరణంబుల్.

కం. అందు విభక్త్యాభాసము
లందుఁ జతుర్థికిని "తెనుఁగుదాహరణము పెం
పొందు గలికోత్కలికల
సందీప్త విభక్తి తాళస ప్రాసంబై'

ఇందులో స్పష్టంగా చతుర్థీ విభక్తిలో మాత్రమే విభక్త్యాభాసం కలుగుతుంద
అందులోనూ ఉత్కళికలోనే ఒక దానిలో విభక్త్యాభాసం ఉండడంచేత 'అభాసం
తోత్కలికలు' అనీ చెప్పాడు. పై నరస భూపాలీయ పద్యం విన్నకోట పెద్ద
సంప్రదాయాన్ననుసరించి సరిగ్గా వుంది.

కానీ, కావ్యాలంకార సంగ్రహానికి బృహద్వ్యాఖ్య రచించిన శిరోమ
సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రులవారు, వారి వ్యాఖ్యానంలో పైన చెప్పి
'అందు విభక్త్యా భాసము' అనే పద్యాన్ని ఉదహరిస్తూ ఇట్లా వ్రాశారని దా
ఉదాహరించారు.

"ఈ పద్యము యొక్క యర్థ మస్పష్టము ,,,. ఆంధ్రమున .... మరిం
విభక్త్యాభాసాంకితములైన వాక్యములు గల యుత్కళికలును లేవు"

నిడుదవోలు వేంకటరావుగారు పై వాక్యంవల్ల విమర్శక శిరోమణుల
ఉదాహరణ సంప్రదాయమే తెలియలేదన్నారు. వారు ఇటువంటి విభక్త్యాభాసాం
తావైన ఉదాహరణలను చూసినట్లు వారిచ్చిన ఉదాహరణ పట్టికల
త్రిపురాంతకోదాహరణమే సాక్ష్యమని అన్నారు. పరిశీలన లేకుండా వార
వ్రాయడమేకాక, ఉదాహరణ లక్షణాన్ని గురించి చర్చించేటప్పుడు అప్ప
ఉదాహరణను ప్రమాణంగా స్వీకరించడం చేత వారి అభిప్రాయాలు మరిం

తలక్రిందులయ్యా యన్నారు. పై పద్యార్థము అస్పష్టము కాదు. వారికే అస్పష్టమైన అభిప్రాయం కలగడం చేత అర్థం చేసుకోలేక పోయారన్నారు.

నరస భూపాలీయములో విభక్త్యాభాసాలక్షణా లున్నాయి. అప్పకవి తనకు ముందున్న త్రిపురాంతక వేంకటేశ్వర, హనుమోదాహరణలలో ఈ విభక్త్యాభాస ఉన్నా, వీటిని తన ఉదాహరణంలో పాటించక పోవడం అతని పరిశీలన లోపమే గాని, మరొకటి కాదని ఖచ్చితంగా చెప్పారు. అప్పకవి తరువాత వచ్చినటువంటి శేషార్యోదాహరణలో దీన్ని పాటించి ఉండడం చేత అటువంటి లక్షణాన్ని విస్మరించడం అప్పకవి తప్పుగా ఎన్నవచ్చున్నారు. కనుక అట్టి తప్పులక్షణాన్ని ఇచ్చిన గ్రంధాన్ని ప్రమాణీకరిచండం అంతకన్నా గొప్ప తప్పిదం వారి దృష్టిలో.

అప్పకవి చతుర్థీ విభక్తి ఉత్కళికలో

*"తొలి పుట్టువు నోము ఫలంబున వే*
*బలువిడి నగు పేదటికంబున వే*
*సరి కొందల మందుచు పయనంబై"*

అని రాసి చివరి పాదాలలో

*"కలిమిచ్చిన బాల స్నేహునకై*
*కలుములచే నేలిన స్నేహునకై*

అని యీ సంప్రదాయం మరుగు పరిచారు.

ఒక్క చతుర్థీ విభక్తి కే యిటువంటి ప్రాధాన్య మెందుకని మనకు సందేహము కలుగ వచ్చు. కాని, యిలా చెప్పడం చేత తెలుగు కవులు ఉదాహరణలలో ఒక విశిష్టమైన శాస్త్రీయ సాంప్రదాయాన్ని నిలిపిన వారని అనుకోవలసిఉంది. తిక్కన శాంతి పర్వంలో భీష్మ ధర్మజు సంవాదములో విష్ణు మంత్ర ప్రభావాన్ని గురించి చెబుతూ-

*ప్రణవ పూర్వకమగు నమః పదము వొంద*
*షడ్గుణైశ్వర్య వాచక సర్గ వసన*

నిర్వచన శబ్దములు క్రమ నిష్ఠమెయి చ
తుర్థి గూర్పంగ మంత్రంబఁ దోచు బెరసి (4ఆ-213)

అని చతుర్థిని గురించిన సంప్రదాయం వివరించారు.

ఉదాహరణ స్తోత్ర రూప గ్రంథం భగవంతుని గురించే ప్రధానంగా రచితం, ఇందులో విభక్తి ప్రత్యయాలే నియతాలు. అందువల్ల చతుర్థిలో ఈ నియమాన్ని కవులు పాటించారని తెలుస్తుంది.

## చతుర్థి

తెలుగులో ఉన్న ఈ విభక్త్యాభాస సంప్రదాయాన్ని చిక్కదేవరాయోదాహరణలో సంస్కృతంలో కూడ పాటించారు. విద్యానాధుని 'ప్రతాపరుద్రీయము' లో దీనికి కూడా వివరంగా ఉంది.

అపిచ నూత్న రత్న ఖచిత హర్మ్యరచిత తోషణాయ
విపులతర సమస్తదాన విహిత విబుధ పోషణాయ
సర్వచంద్ర చంద్రికా విభాసి కీర్తి మండనాయ
సర్వదేవతా వితాన సన్నుతారి ఖండానయ

## ఉత్కలిక

సమర సమయ విహతమాయ
విమత కుమత రాడపాయ
కరణ పటుతలోగ్ర సాయ
కరణ కరణ చణదుపాయ
ఫలిత మహిత జయనికాయ
విలసరతి మనోజ్ఞకాయ
కలిత వివిధ భూషణాయ
లలిత సరస భాషణాయ."

పై వాటిలో మొదటి ఆరు పంక్తులలోనూ విభక్తి ప్రత్యయం లేదు. ఇది తెలుగు ననుసరించిన విభక్త్యాభాసమే అని చెప్పుకోవచ్చు నిస్సందేహంగా.

పైగా ఈ సందర్భంలో మనం గుర్తు పెట్టుకోవలసిన విషయం ఏమిటంటే తక్కిన ద్రవిడ భాషలలో లాగా తెలుగులోనూ చతుర్థీవిభక్తిలో ఒక్కటే ప్రత్యయం.

"తక్కిన విభక్తులలో వివిధ ప్రత్యయముల నొకటే యర్థమున ద్రావిడభాషలో వాడవచ్చునుగాని, చతుర్థీ ప్రత్యయము మాత్ర.మొక్కటే యున్నది".

"ఆయా ద్రావిడ భాషలయందు ద్వితీయా, తృతీయా, పంచమ, సప్తమీ విభక్తుల యందు వివిధార్థములతో వివిధ ప్రత్యయములున్నవి. కాని, చతుర్థికి ప్రత్యయ మొక్కటి మాత్రమున్నది." అని కాల్డువెల్ (ద్రావిడ భాషా సామయిక వ్యాకరణము) - అని బలపరిచారు.[1]

దీన్ని బట్టి తెలుగులో చతుర్థీ విభక్తికి రెండు ప్రత్యయాలు లేవని, 'కొఱకు' అనేది విభక్తి కాదని దాన్ని విభక్తిగా పరిగణించక తెలుగు వ్యాకరణ మయిన 'ఆంధ్రాభాషా భూషణము'లో ఇవ్వడం శాస్త్రీయంగా ఉందని గ్రహించాలి. కావ్యాలంకార చూడమణిలో దాన్ని విభక్తికి నామాంతరంగా గ్రహించడం కూడ పై అభిప్రాయాన్నే బలపరుస్తూ ఉందన్నారు.

చిన్నయ సూరి 'బాలవ్యాకరణం'లో 'కయి-కొఱకు' అని 'కై' ప్రత్యయాన్నే రెండు లఘువులుగా నిరూపించారు. దీన్ని 'కొఱకు కయి చతుర్థ్యాస్తః' ఆంధ్ర శబ్దచింతామణి అనుసరించింది. కాని ఇక్కడ 'కయి' అని గ్రహిస్తే, మాత్ర గణ ప్రధానాలైనా సీస గీతాది పద్యాలలో ఎలాగైనా సరిపోతుంది కాని అక్షరగణ ప్రధానాలైన శార్దూలాది వృత్తాల్లో సరిపోదు. "నీకై వాక్పూజలొనర్తు" అని పాదాదిలో, "హరికై" అనే పాదాంతంలో రెండు లఘువులుగా వీటి నెలా సమర్థించాలో దురూహ్యమన్నారు. నిడుదవోలు వేంకటరావుగారు. అందుకు కారణంగా ప్రాచీన ప్రయోగాలు చూడకుండా, చిన్నయసూరి ఆంధ్ర శబ్దచింతామణినే ఆధారంగా

---

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర.పుట 51. తొలిముద్రణ 1950. మద్రాసు.

గ్రహించినందువల్లనే ఇటువంటి అవ్యవస్థ ఏర్పడిందన్నారు. బాల వ్యాకరణ వ్యాఖ్యాత లెవ్వరూ ఇంతవరకూ దాన్ని తాక లేదు. 'కై' ప్రత్యయానికి నన్నయ కాలంలో కు+ఐ=కై అని స్వరయతే ఉంది. తరువాతి కవులు స్వరయతితోపాటు 'కై' అన్న ఏకాక్షరం ఏర్పడిన తరువాత దానికి వ్యంజన యతిని పాటించారు. 41 రకాలయతులను పేర్కొన్న గొప్పకవి అప్పకవి కూడా దీన్ని జారవిడిచాడని అతనిమీద తన కోపాన్ని ప్రకటించారు. అందుకు ఉదాహరణలుగా

1. తే. అనఘ । మా మామ శకుని నాకయిగడంగి. (సభ-2-174)

2. "గాన ఎంత వారికైన" (భాగ 7-3) అని ఇచ్చారు.

పంచమీ విభక్తిలో 'వలన' అనే ప్రత్యయం తప్ప- తక్కినవి 'కంటె' 'పట్టి' ఉదాహరణలలో ప్రయుక్తం కాలేదు. షష్ఠీ విభక్తిలో 'కు' ప్రత్యయమే కాని; యొక్క, లో, లోపల వాడలేదు. సంబోధనాలలో 'ఓ' అనేది ప్రయుక్తం కాలేదు.

## సార్వవిభక్తికం

తెలుగులోని ఉదాహరణల్లో అష్టమీ విభక్తి చివర సార్వ విభక్తి స్తవ రూపంలో ఒక పద్యం ఉంది. ఇది విద్యానాధు డిచ్చిన ఉదాహరణ లక్షణాలలో లేదు. ఈ సార్వ విభక్తిక స్తవ పద్యం పాల్కురికి సోమనాధుని సంస్కృత బసవోదాహరణలో ఉంది. తెలుగు బసవోదాహరణలోనూ ఉంది. మరి విద్యానాథుడు ఎలా దీన్ని విస్మరించాడో తెలియడం లేదని నిడుదవోలు వేంకటరావుగారు ఆశ్చర్యం ప్రకటించారు. ఈ విభక్తి స్తవం తెలుగు ఉదాహరణలో ప్రత్యేక లక్షణంగా ఉంది, సంస్కృతంలో కులశేఖరాళ్వారు 'ముకుందమాల'లో సహససుందరమైన సార్వ విభక్తిస్తవం రచించాడు. ఈయన పాల్కురికి సోమనాధునికి పూర్వుడు,

---

1. కృష్ణో రక్షతునో జగత్రయ గురుః కృష్ణం నమస్యా మ్యహం
కృష్ణే నామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః
కృష్ణా దేవ సముత్థితం జగ దిదం కృష్ణస్య దాసో స్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం హే కృష్ణ! రక్ష స్వమామ్ ॥

ఉదాహరణలలో సోమనాథుడే ఈ సార్వవిభక్తిక స్తవాన్ని నెలకొల్పాడని ఊహించవచ్చు నన్నారు.[1]

## అంకితాంక పద్యం

అంకితాంక పద్యంకూడా విద్యానాథుని గ్రంథంలో లేదు,[2] ఇదీ సోమనాథుని సంస్కృతోదాహరణలో ఉంది.[3] తెలుగులో లేదు గనుక త్రిపురాంతకోదాహరణంలోనూ లేదు, కాని, తరువాతిదైన వేంకటేశ్వరోదాహరణలో ఉంది.[4] ఇందులో కవి పేరు, కృతిపతి పేరు ఉన్నాయి. దీన్ని తరువాతి కవులంతా అనుసరించారు.

ఈ అంకితాంక పద్యం సోమనాథుని కృతిలోని విశేషమే.

కనుక సోమనాథుడు దేశీయ వాఙ్మయమైన ద్విపదలోనే కాక ఉదాహరణ వాఙ్మయములోనూ ఒక ప్రత్యేకతను నిరూపించుకొని తరువాతి వారికి మార్గదర్శకు డయ్యాడు.

సోమనాథునికి ముందు సంస్కృతంలో అతి ప్రాచీన కాలంనుంచి ఉదాహరణలున్నా, అందులో ఒకటైన ఉదాహృతిగా మనకు లభ్యం కాకపోవడం

---

1. కులశేఖరుల తరువాతి వాడు, క్రీ.శ. 6వ శతాబ్దివాడూ అయిన భట్టబాణకవి తన 'కాదమ్బరి' లో ఈ విభక్తి నియమాన్ని ఒకచోట పాటించాడు.
2. ప్రతాప రుద్రీయ వ్యాఖ్యానంలో ఉంది. చూ. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, పుట 56 (1950)
3 శ్రీ బసవరాజ గుణమణి
ఖచితమ్ జయతాత్ సువర్ణమేతత్
సోమ సుకవినా రచితమ్
హృదయాభరణమ్ సముదాహరణమ్.
4. ఆరవితారకంబుగ నుదాహరణంబు రచించె భక్తి వి
స్తారతఁ దాళ్లపాకపురశాసనుఁ డన్నయ తిమ్మయార్యు డిం
పారగఁ జక్రనందక గదాంబుజధారికి శ్రీవధూమనో
హారికి, వేంకటాచలవిహారికి శౌరికి నంకితంబుగన్.

మన దురదృష్టం. మొత్తంమీద తెలుగులో ఉన్న ఉదాహరణలు సంస్కృతంలో లేవు. తెలుగులో తొలి గ్రంథ రూపాలు ఉదాహరణలే అనే చెప్పుకోవచ్చు.

## ఛందస్సు - రగడలు

ఛందస్సు రగడలు అనే విభాగంలో విద్యారత్న నిడుదవోలు వేంకటరావుగారు మాత్రాఛందస్సు పుట్టుకను విపులంగా చర్చించారు. ఉదాహరణ కావ్యాలలో వాడిన రగడలు మాత్రాఛందస్సులు, తెలుగులో రగడలు అతి ప్రాచీన కాలంనుంచి ఉన్నా వీటి లక్షణం తెలుగులో తొలి ఛందో గ్రంథ మైన కవిజనాశ్రయంలో లేదు. తర్వాతి వాడైన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో ఈ రగడ లక్షణాలు చెప్పాడు.[1] కాని, ఈ లక్షణం సమగ్రం కాదు, రగడలను విపులంగా చెప్పినవాడు అనంతుడు, ఇతడు హయ ప్రచార రగడలే కాక తురగ వల్గన రగడ, తురగ వల్గన రగడ రెండు పాదాలతో విజయ మంగళం, ద్విరదగతి రగడ, లయగ్రాహి, జయభద్ర రగడ, మధురగతి రగడ, హరిగతి రగద, వృషభగతి రగడ, హరిణగతి రగడ అనేవి చెప్పాడు.

నన్నయ, నన్నెచోడులు రగడలను వాడక పోయినా తర్వాతి కవులు వాడారు. రగడలు కన్నడంలో క్రీ.శ. 840 ప్రాంతానికి వర్ధిల్లినట్లు కవిరాజ మార్గము తెలుపు తున్నది. పంపమహాకవి లలిత, మందానిల, ఉత్సవ అనే మూడురకాల రగడలను వాడాడు. సంస్కృతంలో రగడ ప్రచారంలో లేదు. దాక్షిణాత్య సంస్కృతకావ్యాల్లో మాత్రమే ఈరగడలు కనిపిస్తాయి. క్రీ.శ. 9వ శతాబ్దం వాడైన సోమ దేవసూరి యశస్తిలక చంపువులో రగడలు వాడాడు, కన్నడ వాఙ్మయంలోను తమకు ముందున్న దక్షిణాది సంస్కృత కావ్యాలలోను ఉన్న ఈ రగడలను నన్నయ, నన్నెచోడులు గ్రహింపక పోవడం ఆశ్చర్యం.

పాల్కురికి సోమనాథుడు ద్విపదలకు వలెనే రగడలకూ ఒక ప్రత్యేక స్థానం కల్పించాడు. ఇతడు ఈ ఛందస్సును కన్నడం నుంచి తీసుకొని కన్నడంలో లేని

1. అందె పుట 71

యతి నియతిని కల్పించి సమాన వర్ణాద్యంత ప్రాసలను నిర్ణయించి, మనోహర గేయ ఛందస్సుగా తీర్చి దిద్దాడు.

ఉదాహరణ శాఖ తిరిగి ప్రారంభమైంది. ఆ కాలం నుంచి ఆధునిక యుగం వరకు వెలువడిన ఉదాహరణలను, వాటి గ్రంథ కర్తలను ఇలా పేర్కొన్నారు నిడుదవోలు వేంకటరావుగారు.

1. నాగేశ్వరోదాహరణము - మండపాక పార్వతీశ్వర శాస్త్రి 1938.
2. గోపాలోదాహరణము - విశ్వనాథ సత్యనారాయణ 1940.
3. వీరేశలింగోదాహరణము - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 1948.
4. అన్నమాచార్యోదాహరణము - తిమ్మావజ్ఝల కోదండరామయ్య 1951.
5. శంకరోదాహరణము - కవికిశోర్ శంకర ప్రసాద్ 1952.
6. శ్రీ మద్రామానుజోదాహరణము - శిరోమణి చెలమచెర్ల రంగాచార్యులు 1955.
7. ఆంధ్ర లక్ష్మి వైభవోదాహరణము - శిరోమణి చెలమచెర్ల రంగాచార్యులు 1953.
8. విశాలాంధ్రోదాహరణము - డా॥ దివాకర్ల వేంకటావధాని 1956.
9. వీరభద్రోదాహరణము - మల్లంపల్లి వీరేశ్వర శర్మ 1961.
10. విరూపాక్షోదాహరణము - మల్లంపల్లి వీరేశ్వర శర్మ 1961.
11. లక్ష్మీ నృసింహోదాహరణము - డా॥ సుప్రసన్న 1962.
12. సామగాన ప్రియోదాహరణము - బుర్రా కమలాదేవి 1963.
13. వివేకానందోదాహరణము - పాటిలు తిమ్మారెడ్డి 1965.
14. వేంకటాద్రి నిలయోదాహరణము - గాజుల వీరయ్య 1966.
15. శ్రీ రామోదాహరణము - నిడుదవోలు వేంకటరావు 1966.

# దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము

దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము కూడ నిడుదవోలు వేంకటరావుగారి విశేష కృషికి పరమోదాహరణంగా నిలుస్తుంది.

చారిత్రక కాలంలో నవీన యుగంలో తెలుగు వారు తమిళ రాష్ట్రాన్ని స్వాధీనం చేసుకుని 300 ఏళ్ళు పాలించారు. ఆకాలంలో తెలుగు భాష సంస్కృతులను తమిళనాడులో చిరస్థాయిగా నిలిపారు. తంజావూరు, మధుర, పుదుక్కోటలలో తెలుగు నాయక రాజుల పాలన క్రీ.శ.1550-1855 వరకు సాగింది. వీరి తరువాత పాలించిన మహారాష్ట్రులు కూడా వీరిని అనుసరించే రాజ్యపాలన చేశారు. స్వాతంత్ర్యం రాకముందు పుదుక్కోట సంస్థానం కోటమీద జెండాలో 'శ్రీబృహదంబా సహాయం' అని తెలుగు లిపిలో ఉండేదని వారు పేర్కొన్నారు. ఈ నాటికీ దక్షిణదేశంలో 75 లక్షల మంది తెలుగు వారున్నారు.[1] తమిళ దేశంలో తెలుగువారి పరిపాలన తమిళ దేశానికీ సాంస్కృతికంగానే కాక ఇతర విషయాల్లోనూ ఎంతో లాభదాయక మైంది. ఇది భారత చరిత్రలో ఆశ్చర్యకరము, స్తవనీయము అయిన లక్షణం. అంతేకాక అవిచ్ఛిన్నమైన సంస్కృత చరిత్రలో ఒక మనోహర ఘట్టమని తమిళులే పొగిడారని పేర్కొన్నారు.[2]

ఇందువల్ల తమిళనాడులో తెలుగు వారి పాలన ఆంధ్రదేశచరిత్రలోనే కాక, భారత దేశ చరిత్రలోనే ఒక స్మరణీయమైన ఘట్ట మనుకోవచ్చు.

ఈ యుగంలోని విశేషాలు చాలా వున్నాయి. మొదటిది తొలిసారిగా తెలుగు అధికార భాషగా రూపొందడం. తంజావూరు, మధుర నాయకులు తెలుగును అధికారభాష చేసి శాసనాలను తెలుగులోనే వేయించారు.

రాజకీయ ప్రాభవంతో పాటు జాతీయ భాషా సమైక్యాలు సాధించిందీ దక్షిణాంధ్ర యుగమే. ముఖ్యంగా తంజావూరిలో మహారాష్ట్ర రాజపాలనంలో ఇది

---

1. మదరాసు శాసన సభ్యులైన కె.యస్. కోదండరామయ్య గారు తెలిపారు.
2. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము పుట 14

సమకూడింది. దేశ ప్రజలు, తమిళులు, రాజకీయ స్థానికులు, తెలుగువారు, మహారాష్ట్రులు పాలకులు కావడంచేత తెలుగు, తమిళ, మహారాష్ట్ర జాతులు సమైక్యం సాధించాయి. నేటి ఆంధ్రరాజధాని హైదరాబాదులా ఆనాటి దక్షిణ తంజావూరు జాతీయ సమైక్యం సాధించింది. శివకవుల యుగంలో పాల్కురికి వృషాధిప శతకం, పండితారాధ్య చరిత్రల తరువాత తెలుగులో భాషావైవిధ్యాన్ని ప్రకటించినవి తంజావూరు నాటకాలే! మహారాష్ట్ర రాజులు, సంస్కృత భాషాభిమానులు కనుక సంస్కృత నాటకాలూ ఉన్నాయి. నాయక రాజుల కాలంలో విద్వాంసులు, భగవద్భక్తులు, సంస్కృతంలోనే ప్రసంగించే వారని గ్రంధస్థ ప్రమాణాలు తెలుపుతున్నాయి. వీటన్నిటి కన్నా నేటి దేశ భాష అయిన హిందీ నాయకరాజుల మహారాష్ట్ర రాజుల కాలంలో వెలసిన కృతులలో ఉండడం విశేషం.

దక్షిణాంధ్ర వాఙ్మయానికి ప్రత్యేక లక్షణాలు కొన్ని వున్నాయి. 1. ఉత్తరాంధ్రం లోని చిన్న మండలాల్లో, చిన్న ప్రదేశాల్లో, కొంచెం కాలపరిమితితో, అంత రాయాలతో, తెలుగు భాష సాహిత్యం వర్ధిల్లాయి. దక్షిణాంధ్రంలో అలా కాకుండా మూడు వందల ఏళ్ళకే అవిచ్ఛిన్నంగా ఆంధ్ర వాఙ్మయాభివృద్ధి జరిగింది. 2. తెలుగు భాష రాజ పోషణ వల్లనే పెంపొందిందన్నది చారిత్రక సత్యం, రాజరాజ నరేంద్రుడు, మనుమసిద్ధి, కృష్ణరాయలు, ఆర్వీటి రాజులు తెలుగు భాషను పోషించారు. ఇది ఒక ప్రాంతంలో కాదు. కాని దక్షిణాంధ్రంలో క్రీ.శ. 1600 నుంచి 1855 వరకు తెలుగు నాయక రాజులు, మహారాష్ట్ర రాజులు ఏ మాత్రం అంతరాయం లేకుండా తెలుగు భాషను పోషించి చిరస్థాయిగా నిలిపారు. 3. తెలుగు దేశంలో లేని కవులు కృతులకు ప్రతులు వ్రాయించే ఆచారం దక్షిణాంధ్రంలో వుంది. తంజావూరు మహారాష్ట్ర రాజులు తాము రచించిన, కృతిపొందిన రచనలే కాక నన్నయాది పూర్వకవుల కృతులన్నిటికీ ప్రతులు వ్రాయించి ఒక భండాగారంలో భద్రపరిచారు. ఆ విధంగా వారు ప్రాచీన కావ్య రక్షణ చేశారు. వారా విధంగా చేసి భద్ర పర్చకపోతే ప్రాచీన సాహిత్యమే కాక ఈనాడు మనకు నన్నెచోడుని కుమార సంభవము వంటివి లభ్యమయ్యేవే కావు. ప్రాచీన కావ్యాలకు ప్రతులనే గాక భారత దేశ ప్రసిద్ధ కావ్యాలకు పెక్కు ప్రతులు వ్రాయించి, నేటికీ సంప్రతించే వీలు

కల్పించారు. 4. దక్షిణాంధ్రంలో రాజ కవులు 20 మంది, కవయిత్రులు 7 గురు ఉండేవారు. ఇంతమంది పూర్వయుగాల్లో లేరు.

సాహిత్య ప్రక్రియా వైవిధ్యానికైతే ఈ యుగం స్వర్ణయుగమని పేర్కొనవచ్చు. ఆనాడు సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం ఉండేది, పూర్వయుగాల్లో సాహిత్యానికి తప్ప సంగీతం, ఇతర శాస్త్రాలకు అంత ప్రాధాన్యం లేదు. పద్యకవిత, పదకవిత గంగా యమునల్లా ఏకాకారం దాల్చాయి. తెలుగులో స్వతంత్ర నాటక రచన మొదలైం దీ తంజావూరిలోనే. తెలుగు వచన రచన మధురలో ప్రారంభమై మైసూరులో వ్యాప్తి చెందింది. పదకవితకు పట్టం కట్టినా ద్విపద కృతులను నశించి పోకుండా చూశారు. నాటక రచన పెంపొందించినా ప్రాచీనమైన యక్షగాన రచన సంప్రదాయాన్ని నిలిపిం దీ యుగం. పూర్వయుగంలో అతి తక్కువగా ఉన్న ఆశు కవిత ప్రక్రియ లైన సమస్యా పూరాణాలు, మాలికా కవిత్వం ఈ రెండూ గ్రంథ రూపం దాల్చడం ఈ యుగంలోనే జరిగింది. శివకవుల యుగం తరువాత తెలుగు జాతీయాన్ని తెలుగు దనాన్ని ఈ యుగం తెలుగు దేశపు సాంఘిక పరిస్థితులను సాహిత్యంలో ప్రతిబింబింప జేసింది.

ఆంధ్రసాహిత్య వాహినిని భిన్న సాహిత్య ప్రక్రియ లనే కాలువల ద్వారా సర్వాంధ్ర దేశాన్ని సాహిత్యక్షేత్రంగా చేసిం దీ దక్షిణాంధ్ర యుగం. ఈ యుగమే తెలుగు వాఙ్మయ చరిత్రలో ఆధునిక యుగానికి నాందీ ప్రస్తావనలు పలికింది.

## యక్షగానాలు నాటకాలు

దక్షిణ దేశంలో యాక్షగాన, నాటక, పద రచయితలందరూ సంగీత సాహిత్యాల్లో సమర్థమూ, శాస్త్రీయమూ అయిన జ్ఞానం గలవారు. నాయక, మహారాష్ట్రుల పాలనల్లో యక్షగాన రచన అపారంగా అభివృద్ధి చెందిం దని సాహితీ చారిత్రక విమర్శకులంతా వ్రాశారు. కానీ, నిడుదవోలు వేంకటరావుగారు ఆ గ్రంధాలను సాకల్యంగా పరిశీలించి దక్షిణాంధ్ర వాఙ్మయంలో అభివృద్ధి చెందినవి నాటకాలే కాని, యక్షగానాలు కావని సిద్ధాంతీకరించారు.[1]

1. ద.దే. వా. పుట 26

శ్రీరుక్మిణీ కృష్ణ వివాహము, జానకీ కళ్యాణము అనే యక్షగాన చాటు కావ్యాలు రఘునాథ నాయకుడు వ్రాశాడు. విజయరాఘవ నాయుడు కూడా 26 నాటకాలు రచించారు. వాటిలో 6 మాత్రమే లభ్యాలు, కాళీయ మర్దనము, రఘునాథాభ్యుదయము, ప్రహ్లాద చరిత్రము, పూతనా హరణము, విప్రనారాయణ చరిత్ర, కృష్ణ విలాసము.

విజయ రాఘవ నాయకుని ఆస్థానకవులు కూడా నాటకాలు రచించారు. వీరే కాకుండా మహారాష్ట్ర ప్రభువు, సాహితీ భోజుడు అయిన శివాజీ మహారాజా కూడా నాటకాలు రచించాడు. 16 నాటకాలు, 4 ప్రబంధాలు రచించాడు.[1] చిన్నవి ప్రబంధాలని పేర్కొన్నా, అవి నాటకాలే అంటారు. నిడుదవోలు వేంకటరావుగారు.[2] ఇంతేగాక ఇతర కవుల రచన లైన నాటకాలుకూడా ఇచ్చారు.

ఇక ఇతర వివరాలను విశేషాలను ఇలా చెప్పారు. తంజావూరు నాయక రాజైన రఘునాథ నాయకుడు అట ప్రభవించిన స్వతంత్ర తెలుగు నాటక రచనకు మూల పురుషుడు. అతని కుమారుడైన విజయరాఘవ నాయకుడు కూడ నాటక రచన చేశారు.

అంత వరకు నాటకాలలో స్త్రీ వేషాలు పురుషులే వేసేవారు. రఘునాధ నాయకుడా పద్ధతిని మాన్పించి, స్త్రీ వేషాలను స్త్రీలచేతనే వేయించాడు. నాటకశాల నిర్మాణం చేయించాడు. అంతేకాక రాణివాస స్త్రీలకోసం ప్రత్యేకంగా నగరంలో ఒక నాటకశాల కట్టించాడు. పాత్రోచిత భాష విషయంలో సంస్కృత నాటకాలలో వలె ప్రాకృతాది భాషాభేదాలు వదలి తెలుగు గ్రాంథిక వ్యవహార భాషలలో సంభాషణలు రచించాడు. పాత్రోచిత భాషను తెలుగు నాటకాల్లో ప్రప్రథమంగా ప్రవేశపెట్టింది తంజావూరి నాయకులే.

1. దక్షిణదేశ యాంధ్రవాఙ్మయము పుట: 28-29
2. దక్షిణదేశ యాంధ్రవాఙ్మయము పుట: 29
3. దక్షిణదేశ యాంధ్రవాఙ్మయము పుట: 30-32

## తమిళ సంభాషణలు

నాయక రాజులు తెలుగు వారైనా వారు పాలించింది ద్రవిడ దేశం. అక్కడి ప్రజా వ్యవహార భాష తమిళం. అందువల్ల వారి నాటకాలలో తమిళంలోనూ సంభాషణ చొప్పించారు.

సంస్కృతం, తమిళం, తెలుగు భాషలతో పాటు మహారాష్ట్ర రాజులు వచ్చాక మహారాష్ట్రం, హిందీ, కన్నడం కూడా వాడారు.[1] సంస్కృతం నాటకాలను అనువదించకుండా ప్రత్యేకంగా ఆంధ్రతాముద్ర గల నాటక సృష్టి చేయడమే వారి అపూర్వ సాహిత్యాభిమానానికి నిదర్శనం.

నాందీ ప్రస్తావనలతో పాటుగా మేళగాండ్రు చదివే 'కైవారము' కూడ ప్రవేశ పెట్టారు. విజయ రాఘవ నాయకుడైతే సీస పద్యంలో ఇష్ట దేవతాస్తుతి, శ్రీకృష్ణుడి అష్ట మహిషులనూ, తన పేరునూ కూడ చేర్చి నూత్నమైన మార్గం అవలంబించాడు.[2] నాటకాలు కొన్నింటిలో విదూష పాత్రకు బదులుగా కొన్ని చోట్ల 'ఆస్థాన సంతోషి' అనే నూతన పాత్ర కనిపిస్తుంది. అన్నిటి కన్నా ముఖ్యమైన సంస్కారం నాటకంలోని సంగీత నాట్యావధానం, యక్షగాన రచనల్లో ఏలలు, జోలలు, సువ్వాలలు, మంగళారతులు, ధవళములు చందమామ పదములు, దరువులు, ద్విపదలు, జేపదలు ఉేకులు మొదలైన వాటిని నాటకాల్లో ప్రవేశపెట్టారు. నాయక రాజులు విష్ణు భక్తులు, మహారాష్ట్రులు శివభక్తులు. వారి వారి భక్తి కనుగుణంగా నాటక రచన చేశారు. మహారాష్ట్రుల నాటకాల్లో సంస్కృత భాషా ప్రాధాన్యం హెచ్చు. కవిత్వం కన్నా పాండిత్య ప్రదర్శన ఎక్కువ.

తెలుగు నాటకాల్లో అంక విభజన ప్రవేశ పెట్టిన వారు, మహారాష్ట్ర రాజులు, నాయక రాజుల నాటకాలలో ఇది లేదు. 1674 ప్రాంతంలో ఉన్న గణపవరపు వేంకటకవి తన 'సర్వలక్షణ శిరోమణి'లో నాటక లక్షణాలను పేర్కొన్నాడు.

---

1. వీటికి ఉదాహరణలు - ద.దే.వా. పుటలు 51-55
2. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము పుటలు: 36-39.

నేడు ప్రచారంలోకి వచ్చిన జానపద గేయాలను నాయక రాజులు, ఆస్థాన కవులు వారి నాటకాలలో ప్రవేశపెట్టడం ముదావహం. అది ఆనాటి నాటకాలలో ఒక ప్రత్యేక లక్షణం.

ఆంధ్ర వచన వాఙ్మయాలలో కూడా దక్షిణాంధ్ర యుగమే ప్రథమ ప్రకరణం. వచన రచన దక్షిణాంధ్ర యుగంలో మూడు శతాబ్దులు కిందటనే ప్రారంభమైంది. భారత భాగవత రామాయణాలు మూడూ దక్షిణాంధ్ర యుగంలో వచనంగా పరివర్తితా లయ్యాయి. భాగవతం మాత్రం అలభ్యం.

కళువె వీరరాజు భారతం ఆది, సభా, భీష్మ పర్వాలు లభ్యాలు. వీటిని కవిత్రయ భారతంతో పోల్చి చూడ వలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

వీరరాజు పుత్రుడు నంజరాజు తెలుగులో ప్రసిద్ధ వచన రచయితులలో ఒకరు. అతని వచన రచనలు బ్రహ్మోత్తర ఖండము, శివభక్తి విలాసము గరళపురీ మాహాత్మ్యము మొదలైనవి. శివభక్తి విలాసము తమిళశైవ వాఙ్మయ ప్రసిద్ధులైన అరవై ముగ్గురు నయినారుల చరిత్ర తెలిపే గ్రంథం. దక్షిణాంధ్ర వచన వాఙ్మయంలోనూ రాజకవు లుండడం విశేషం. తెలుగు కవులందరూ పద్య కావ్యాలే రచించారు, గానీ వచన కావ్యాలు వ్రాయలేదు, కనుక ప్రథమంగా ఆ కీర్తి కూడా దక్షిణాంధ్ర యుగానిదే. విజయరంగ చొక్క నాథుడు, తుపాకుల అనంత భూపాలుడు, కళువె వీరరాజు, నంజరాజు - ఈ నలుగురూ రాజకవులే.

పదకవితలు తంజావూరులోనే అవతరించి అక్కడే పరాంకోటి కెక్కాయి.

## పదకవితలు

విజయ రాఘవ నాయకుడు పదకవితా ప్రవీణుడు కాని కృతులు అలభ్యాలు, ఇతని కాలంలో రంగాజమ్మ రచించిన 'మృదు రసాస్పద పదాలు' కూడా

1. దక్షిణదేశీ యాంధ్ర వాఙ్మయము పుట: 40
2. దక్షిణదేశీ యాంధ్ర వాఙ్మయము పుట: 56-60.

లభించలేదు. పదకవితా ప్రవీణుడైన క్షేత్రయ విజయ రాఘవునిపై 'వేయి పదాలు' రచించాడు. వాటిలో అత్యల్ప సంఖ్యలో మాత్రమే పదాలు లభించాయి.

మహారాష్ట్ర రాజుల కాలంలో పదకవితకు ముందెన్నడూ లభించని ప్రాధాన్యం లభించింది. సంగీత సాహిత్య విద్యాభోజుడైన శివాజీ పదకవిత్వంలో ప్రవీణుడు, తన ఇష్ట దైవమైన త్యాగేశుని పైన ఇతడు 'భక్తి, భావ వైరాగ్య, శృంగార, హాస్య నీతి మంగళ పదాలనే శీర్షికలతో 200 పైగా రచించాడు. 'త్యాగేశ పదములు' అన్న పేరుగల గ్రంథంలోను 353 పదాలున్నాయి. ఇవి అతని పదాలే.

శివాజీ ననుసరించి అతని ఆస్థాన కవులు కూడా పదకవితలు వెలయించారు. వారిలో గిరిరాజకవి ముఖ్యుడు. ఇతని పద రచనలు ఆ కాలంలో చాలా ప్రాచుర్యం పొందడం చేత, శివాజీ తన రెండు నాటకాలలో వాటి ప్రశంస చేశాడు[1].

మొదట శరభోజీ, తులజాజీ, రెండవ శరభోజీ కాశీనాథ, నారణ కవులుకూడా పదరచనలు చేశారు[2].

చతుర్విధాలుగా రూపు దాల్చిన కవిత్వంలో ఆశుకవితను నాయకరాజుల ఏల్బడిలో ఎక్కువ ఆదరం అభించింది. రఘునాథుని కాలంలో విలసిల్లిన రామభద్రాంబ 'శతలేఖినీ, సమయ లేఖినీ అష్ట భాషా కల్పిత చతుర్విధ కవిత ప్రణుత సాహిత్య సామ్రాజ్య భద్ర వీరమాత' అని తన రఘునాథాభ్యుదయ గద్యంలో చెప్పుకొన్నది. మధురవాణి అనే రచయిత్రి కూడా అతని కాలంలో ఆశు, చిత్ర, కవిత్వాలలో నేర్పరి అని తెలుస్తూంది. ఈమె రామభద్రాంబ కలిసి రఘునాథుని కొలువులో సమస్యలను పూరించే వారట. ఈ సందర్భంలో నిడుదవోలు వేంకటరావుగారు 'ఆశు, చిత్ర, కవిత్వ రచన యాడువారి కానాడు నల్లేరుపై బండి నడక యైనది' అని చమత్కరించారు[3]. విజయ రాఘవ నాయకుని కాలంలో రంగాజమ్మ, కృష్ణమాంబ అనే యిద్దరూ గట్టి వారే.

1. ద. దే. వా. పుట 64
2. ద. దే. వా. పుట 65
3. ద. దే. వా. పుట 73

రఘునాథుడే ఈ యుగంలో ఈ ఆశు కవితకు ఆద్యుడు, 'పారిజాతాపహరణము' అనే తెలుగు కృతిని ఆశువుగా ఆరు గంటల్లో అతడు చెప్పగా, దాన్ని లేఖకులు అతి కష్టం మీద వ్రాయగలిగా రట - అతని వేగాన్నందుకొని అతని తండ్రి అయిన అచ్యుతప్ప నాయుడు కుమారుని ఆశుకవితా వైదుష్యానికి ఆనందించి అతనికి కనకాభిషేకం చేశారట[1].

సమస్యాపూరణ అతిగా వ్యాప్తి చెందింది. రఘునాథుని కాలంలో, కొలువులో నడచిన సమస్యా పూరణలు రఘునాథాభ్యుదయ నాటకంలో ఉదాహరించారు. విజయ రాఘవ నాయకుని కాలంలో 'విజయ రాఘవ కళ్యాణము' నాటకంలో సంస్కృత అష్టవిధ ప్రాకృత తెలుగు సమస్యలు, పూరణలు ఉన్నాయట[2].

శత లేఖినీ విద్య కూడా ఆనాడు ప్రాచుర్యంలో ఉండేది. ఒకకవి నూరు మందికి విరామం లేకుండా నూరు పద్యాలు ఆశువుగా చెప్పాడు. ఆ కాలంలో శతావ ధాను లందరూ పురుషులే అయినా, రామభద్రాంబ, మధురవాణి, రంగాజమ్మ, శతలేఖినీ ప్రపంచానికీ త్రిశక్తులవలె తేజరిల్లారు. ఇదే అక్కడి విశిష్టత.

సమయలేఖినీవిద్య అంటే నిర్దిష్ట కాలంలో నూరు పద్యాలు చెప్పడం. పైన పేర్కొన్న ముగ్గురూ సరస్వతీ మూర్తులు ఇందులోనూ దిట్టలే. మాలికా కవిత్వంలో ఆనాటి గణపవరపు వేంకటకవి ఉద్దండుడు.

## యక్షగానాలు

మధుర కవితలుగా ప్రసిద్ధి గాంచిన యక్షగానాలు, నాటకాలు, నృత్యనాటికలు ఈ యుగంలోనే వెలిశాయి.

'అక్క మహాదేవి చరిత్ర' అనే యక్షగానాన్ని గురించి 'ఆంధ్రమహిళ - అక్టోబరు 1954' సంచికలో ప్రప్రథమంగా ప్రపంచానికి తెలియ జెప్పిన ఘనత నిడుదవోలు వేంకటరావుగారిదే! ఆ మాట ఆయనే చెప్పుకున్నారు.[3]

1. దక్షిణదేశీ యాంధ్ర వాఙ్మయము పుట 71
2. దక్షిణదేశీ యాంధ్ర వాఙ్మయము పుట 74-77
3. ద. దే. వా పుట 86

కంచిరాజు వీరభద్రకవి రచన సీమంతినీ చరిత్ర, రామాయణ యక్షగానం, హోసూరి సాకమ్మ రామాయణము, ముక్తి కాంతా కళ్యాణము, రంగ విలాసము, చక్రపురి రాజ వర్యుని విప్రనారాయణ చరిత్ర ఈ యుగంలోనే వెలువడ్డాయి.

కృష్ణరాయలయుగం తరువాత దక్షిణాంధ్రయుగం ద్విపద వాఙ్మయానికి మూడవ ఘట్టం, ఈ యుగంలో ద్విపద రచనకు శ్రీకారము చుట్టినవాడు రఘునాధ నాయకుడు. విజయ రాఘవ నాయకుని పాదుకా సహస్రము అలభ్యం, మహారాష్ట్రరాజు ఏకోజి ద్విపద రామాయణము, పరమానంద యతి అనుభవ దర్పణము, శివజ్ఞాన మంజరి పేర్కొనదగినవి. తెలుగు వాఙ్మయంలోని ద్విపద కావ్యాలన్నింటిలోకి పెద్దది కట్టా వరదరాజు ద్విపద రామాయణము - ద్విపద కవులలో తాళ్ళపాక చిన్నన్న తరువాత ఇతడే గణనీయుడు.

దీన్ని 1951లో నిడుదవోలు వేంకటరావుగారి సంపాదకత్వంలో 4 సంపుటాలుగా తంజావూరి సరస్వతీ మహల్ వారు ప్రకటించారు. కాని, సాహిత్య విమర్శకులు చక్కగా పరిశీలించినట్లు లేదని ఆయన బాధపడ్డారు. దీన్ని గురించిన విపుల పరిశోధన ఇంకా జరగవలసి వుంది.

దక్షిణాంధ్ర వాఙ్మయంలో బాలకవి అనంతయ శేషార్యోదాహరణము, పుదుక్కోట రఘునాధరాజు ఉదాహరణ చిక్కదేవరాయోదాహరణము - అనే మూడు ఉదాహరణములే లభించాయి. చివరిది సంస్కృత ఉదాహరణ కూడా ఈ యుగంలోని వాఙ్మయంలో ఉందని చెప్పుకోడానికే తప్ప వీని కే మాత్రం ప్రాధాన్యం లేదు.

ఈ యుగ వాఙ్మయంలో దండకాలు చాలా తక్కువ. ఒకటి రెండుభక్తి పరమైనవి తప్ప తక్కిన వన్నీ శృంగార పరాలే. ఆంధ్ర వాఙ్మయంలో దండక రచన నన్నయతో ప్రారంభమైంది. ఇది కావ్యం మధ్యలో ఉంది. ప్రత్యేక గ్రంథ రూపంలో ఉన్నది - పోతన భోగినీ దండకము. దండకాలను భక్తిపథంనుంచి తప్పించి శృంగారపరం చేసింది ఈ దండకమే అంటారు - నిడుదవోలు వేంకటరావుగారు[1].

1. ద దే. వా. పుట 91

రాజ గోపాల దండకము, విజయ రాఘవ దండకము, విద్యావతి దండకము, శహాజీ దండకము, బృహన్నాయికా దండకము, చంద్రాననా దండకము ఇత్యాదులు ఇతర దండకాలు.

చిత్ర కవిత్వ శాఖలో గణపవరపు వేంకటకవి రచన 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, సీస పద్యములో 60కి పైగా పద్యాలు గర్భితమైనాయి. ఒక కందంలో 20 బంధా లిమిడ్చాడు. శహాజీ రచించిన త్యాగ వినోద చిత్ర ప్రబంధము వంటి 'చిత్రకృతి' మరొకటి లేదని చెప్పవచ్చు.

గణవరపు వేంకటకవి కృత ఆంధ్రప్రయోగ రత్నాకరము - ఇందులో అప్పకవీయములో లేని గ్రంథాల నుండి ఉదాహృతు లున్నాయి. 'స్థానశబ్దయతి' మొదలైన శాబ్దిక విషయాల చర్చ ఉంది. కస్తూరి రంగకవికృత 'ఆనంద రంగరాట్ఛందస్సు' పుదుచ్చేరిలో పుట్టింది.

గణపవరపు వేంకటకవికృత ఆంధ్రకౌముది వ్యాకరణ గ్రంథం. వేయిచరణాల సీసమాలిక సుపరిష్కృతం కావలసివుంది. ఇందులో కొన్ని భాగాలు అచ్చయినాయి.

మైనంపాటి చంద్రకవి కృష్ణభూపాలీయము ఆంధ్రశబ్ద చింతామణికి తెలుగు పద్యానువాదం నివృత్తిశేషాచల కవికృత ఆంధ్రవ్యాకరణము, తెలుగు భాషకు సంస్కృతంలో రచించినది.

రఘునాధీయము (భామకవి రసమంజరికి తెలుగు) రసమంజరి నారాయణ సూరి కవికృతము. అలంకార గ్రంధాలలో గణపవరపు వేంకటకవి ప్రతాపరుద్రీయం అలభ్యం.

## అభ్యుదయ రచనలు

అభ్యుదయము అనే పేరుతో ఉన్న రచనలు వెలిశాయి. ఈ యుగంలో ఇదొక ప్రత్యేక లక్షణంగా పరిణమించింది. తంజావూరి నాయక రాజులకు ముందు

(చూ. వెంకటేశాంధ్రం, ఆంధ్రకౌముది)

విజయనగర సాళువ, తుళు, వంశీయుల కాలంలో అటువంటి రచనలు సంస్కృతంలో వచ్చాయి. వీటిని తెలుగులోనికి తెచ్చిన ఘనత రఘునాథనాయకునిదే. రామభద్రాంబ-రఘునాథాభ్యుదయము. ఇదీ సంస్కృతమే.

రఘునాథ నాయకుడు 'అచ్యుతాభ్యుదయము' అనే పేరుతో తన తండ్రి జీవిత చరిత్ర వ్రాశాడు. అది అలభ్యమైన తెలుగు ద్విపద గ్రంధ మని అతని 'నలచరిత్ర' వల్ల తెలుస్తుంది. విజయ రాఘవ నాయకుడు రఘునాథాభ్యుదయము, ద్విపద నాటకం రచించాడు. రెండవది సంపూర్ణంగాను, మొదటిది చివరి ఆశ్వాసం అసంపూర్ణంగా లభించింది. రెండు రఘునాథుని దినచర్యను గురించి ఆకాలంలోని రాజ వ్యవస్థల గురించి అనేక విషయాలు తెలుపుతూ చరిత్ర అత్యంతోపయుక్తంగా వున్నాయి. విజయ రాఘవుని కుమారుడు మన్నారుదాసు 'విజయ రాఘవ నాయకాభ్యుదయము' రచించాడు గాని, అది అలభ్యం. ఈ విషయం అతని హేమాబ్జనాయికా స్వయంవరం వల్ల తెలుస్తుంది.

ఉత్తరాంధ్రంలో 18వ శతాబ్దాంతంలో భద్రాయు రభ్యుదయము, గణనాథాభ్యుదయము, శ్రీ కుమారాభ్యుదయము, కృష్ణాభ్యుదయము, ఉమాపత్యభ్యుదయము మున్నగు అభ్యుదయ కావ్యాలు వెలిశాయి. ఇవన్నీ పద్యకృతులు. శ్రీ కుమారాభ్యుదయము వావిలికొలను సుబ్బారావుగారి కృతము. ఆధునాతన కాలంలో పుట్టిన ప్రౌఢ ప్రబంధాల్లో ఒకటి - 'కుమారాభ్యుదయము', పేరిణి శ్రీ విశ్వనాథవారు రచించారు గాని దీన్ని చూడక పోవటం వల్ల దీన్ని గురించి యేమియు వ్రాయలేదని చెప్పారు - వేంకటరావుగారు.

సాంత్వన రచనలుగా సత్యభామా సాంత్వనమును లింగనమఖి శ్రీకామేశ్వరకవి, రాధికా సాంత్వనమును సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు రచించారు.

ఇటువంటి సాంత్వన రచనలు గూడ ప్రప్రథమంగా ఈ యుగంలోనే వెలిశాయి. రాధికా సాంత్వనము - ముద్దుపళిని రచన కూడ మహారాష్ట్ర రాజు ప్రతాపసింహుని కాలంలో వచ్చింది. ఈ కావ్యాలలో మొదటిది కామేశ్వర కవిదే కనుక అతడే ఈ రచనల కాద్యుడని చెప్పవచ్చు.

ఈ రచనలలోనిది 'మోహశృంగారము' అని విమర్శకులు అనడానికి వేంకటరావుగారు నిశితంగా ఖండించారు.[1] సత్యభామ సాంత్వనమునకు, నన్నెచోడుని కుమార సంభవమునకు పోలికలు చూపారు[2]. ఆవిధంగానే రాధికా సాంత్వనములు రెండింటిలోనూ ఉన్నత వర్ణనలు వారు కల్పించినవి కావని అంతకుముందు నన్నెచోడ శ్రీనాథాది మహాకవులు రచించినవే, వీరు అనుసరించారనీ సోదాహరణంగా చెప్పారు[3].

## చిత్రబంధకవితలు

బంధ కవిత్వానికి నన్నెచోడుడే ఆద్యుడు. బంధ కవిత్వమంటే ఒకే వృత్తంలో వేరే వృత్తాలు. ఇమిడ్చి రచించడం, గర్భకవిత్వానికి గణపవరపు వేంకటకవి రచన పరమావధి. ఒక సీస పద్యములో 60 రకాలైన పద్యభేదా లున్నాయి. అవి- కందాలు, తేట గీతులు ఆట వెలదులు, శోభనములు, మంగళహారతులు, చౌపదాలు, వృత్తాలు, అష్టకాలు, దరువులు, రగడలు, శ్లోకాలు.

ఇక ద్వ్యర్థి కావ్యాలు చిత్రకవిత కోవలోకే వస్తాయి. కృష్ణాధ్వరి రచించిన నైషధ పారిజాతీయము అనే దొక్కటే ఆ యుగంలోని ద్వ్యర్థి కావ్యం.

విస్తర కవిత్వం అంటే అష్టాదశ వర్ణనాత్మకమై కథా సరణి కలిగిన ప్రబంధ రచన.

ఈ యుగంలో ప్రబంధాలలోని కొన్ని యితివృత్తాలు కొత్తవి. రఘునాథుని వాల్మీకి చరిత్ర - దీన్ని మనస్తత్త్వ ప్రబంధంగా పేర్కొనవచ్చు.

'ప్రబంధ మణిభూషణము' అనే సంకలన గ్రంథంలో దీనినుంచి అనేక పద్యాలు ఉదాహృతులుగా ఇచ్చేరు. 1700 ప్రాంతంలో రచితం.

1. ద. దే. వా. పుట 119-120
2. ద. దే. వా. పుట 121-122-123
3. ద. దే. వా. పుట 126-132
4. ద. దే. వా. పుట 140-141

ఇతనిదే శృంగార సావిత్రి, దీని కర్తృత్వ విషయంలో సందేహాలున్నాయి[1]. పేరును బట్టి శృంగార భూయిష్ఠము అనుకుంటారు. కాని, అందరికి పఠనీయమే.

చేమకూర వేంకటరాజకవి 'విజయవిలాసము' కందుకూరి వారి ప్రశంసకు పాత్రమైంది. చేమకూర వేంకటకవి రచించిన ముప్పై ఏళ్లకు అప్పకవి వంటి లాక్షణికుల దృష్టి నాకర్షించిందంటే ఈ కావ్య ప్రాశస్త్యం గురించి వేరుగా చెప్ప పనిలేదు.

దీని తరువాత సారంగధర చరిత్ర - తొలుత ప్రత్యేక గ్రంథంగా రాసి కీర్తి పొందాడు చేమకూర కవి. ఇతడు రచించిన తరువాతనే ఆంధ్రదేశంలో దానికి ప్రాముఖ్యం ఎక్కువైంది - సారంగధరుని కథ ఆ తరువాత ద్విపద యక్షగాన, వచన రూపాలలో వెలిసింది.

వేదాంత గ్రంథాలు - పరమానందయతి, అద్వైత వేదాంత గ్రంథాలు కావ్యనాటక రూపాలలతో వెలువడ్డాయి. అద్వైత వేదాంత గ్రంథాలు సరళ సుందరమైన తెలుగుభాషలో రచించిన ఈ యతి కృషి ప్రశంసనీయం. ఈతని రచనలు బహుముఖాలు.

శతకాలు - సంపెగిమన్న శతకము, దత్తాత్రేయ శతకము, శివముకుంద పరమానంద శతకము అనుభవ దర్పణము, శివజ్ఞాన మంజరి అనే ద్విపదలు, ముక్తికాంతా పరిణయము అనే నాటకాన్ని, బ్రహ్మవిద్యా సుధార్ణవము, వివేక చింతామణి, (ఉపదేశక్రమము) అనే వచన కావ్యము వ్రాశాడు. వాటిలో బ్రహ్మవిద్యా సుధార్ణవము మాత్రము ముద్రితం.

చల్లా సూరయ వివేక విజయము అనే అద్వైత వేదాంత ప్రతిపాదకమైన సంస్కృత ప్రబోధ చంద్రోదయ నాటకాన్ని తెలుగులో చక్కని నాటకంగా రచించాడు.

ఖడ్గలక్షణ శిరోమణి, మల్లు పురాణము గణిత దీపిక అనే శాస్త్ర గ్రంథాలు వెలిశాయి.

1. ద. దే. వా. పుటలు 100-103

ఖడ్గ లక్షణ శిరోమణి కత్తుల లక్షణాన్ని తెలిపేది. ఇటువంటిది మరి ఏ ఇతర దక్షిణాది భాషలల లోను లేదు. ఇవి నవనప్ప రచితం. పద్యరూప గ్రంథం ఇందులో 77 పద్యాలు, ఒక పెద్ద వచనం, ఒక చిన్న వచనం వున్నాయి. ఒక్కొక్కటి చొప్పున చంపకోత్పలాలు, 15 కందాలు, 14 గీతాలు 46 సీసాలు వున్నాయి. దీని రచయిత 'అసి' ప్రబంధమని చెప్పి ఖడ్గలక్షణ శిరోమణి అని పేరు పెట్టడంలో ఖడ్గ పదవ్యాప్తికి తార్కాణం. ఇందులో ఖడ్గాల వివరణ, లక్షణాలు ఇత్యాదులు పట్టికగా ఇచ్చారు వేంకటరావుగారు.

మల్లు పురాణము సాము నభ్యసించే విషయాన్ని తెలిపేది.

గణిత దీపిక గణిత శాస్త్ర సంబంధిత ఏకైకకృతి.

రాగతాళ చింతామణి, అభినయ దర్పణము, తాళ దశప్రాణదీపిక మొదలైన గ్రంథా లుద్భవించాయి. భరత సంగీత శాస్త్రాలు రెంటికి లక్ష్యలక్షణ సమన్వయం కుదిరిన సన్నివేశం ఆంధ్ర సాహితీ ప్రపంచంలో ఒక్క దక్షిణాంధ్ర వాఙ్మయంలోనే. అందులో తంజావురాంధ్ర వాఙ్మయంలోనే అని చెప్పవచ్చు.

శహాజీ కాలం సంగీత శాస్త్ర చరిత్రలో ఒక చిరస్మరణీయ ఘట్టం. సంస్కృత సంగీత శాస్త్రాలన్నిటినీ సేకరించి ఒక బృహత్ సంగీతకోశాన్ని వ్రాయించాడు శహాజీ - తానే ప్రత్యేకంగా రాగాలను, కూర్చి 'రాగమేళ వివేకము' అనే గ్రంధము రచించాడు. సంస్కృతంలో ప్రామాణికాలైన భరతనాట్యశాస్త్రాది గ్రంధాలకు తెలుగులో టీకలు వ్రాయించి, తెలుగువారి కందించిన కీర్తి మహారాష్ట్రులదే. అభినయ దర్పణము, అర్జున భరతము, ఆది భరతము భరతార్ణవము, మొదలగు వాటిని అందరికీ సుబోధకమయ్యేలా టీకలు వ్రాయించాడు.[2]

'తాన నిఘంటువు' అనే సంగీత శాస్త్ర నిఘంటువు తయారు చేయించాడు. ఇటువంటి లోకోత్తర గ్రంథం ఇంతవరకు ఏ భాషలోనూ రాలేదు.

2. ద. దే. వా. పుటలు 438-443

శహాజీ పంచరత్న ప్రబంధములోనూ నాట్యోపయోగ గీత ప్రబంధ విశేషాలున్నాయి. భాష తక్కువ. స్వరతాళ లయ విన్యాసము.

పద్యమయమైన అచ్చతెలుగు నిఘంటువులు పుట్టాయి. గణపవరపు వేంకటకవి, వేంకటేశాంధ్రము, కస్తూరి రంగకవి సాంబ నిఘంటువు, నుదురుమాటి వేంగనార్యకృత ఆంధ్రభాషార్ణవం, (ఇది సంస్కృత అమర నిఘంటువునకు సీస పద్యాలతో వుంది). ఆంధ్ర నిఘంటు కారులకు పరమోపాదేయమైన ప్రామాణిక కృతి.

ద్విరూప కోశం - ఇందులో ఆచ్చతెలుగు పదాని కున్న రేండేసి రూపాలుంటాయి. అన్నీ సీసపద్యాలే.

## సింహావలోకనము

తెలుగు వారికి దక్షిణాదిలో వెలసినక్షేత్రాలను గూర్చి, వాటి మాహాత్మ్యాలను గురించి సాహిత్య ప్రక్రియలద్వారా తెలపినవారు దక్షిణాది తెలుగుకవులు, మధుర, శ్రీముష్ణం, వృద్ధాచలం, ఘటికాచలం, తంజావూరు, మొదలయిన క్షేత్రాలు ఆవిధంగా పరిచిత మైనాయి.

దేవాలయాలు కళకళలాడాయి. ఎక్కడ చూసినా అన్న సత్రవులే. కవులకు, కవిమిత్రులకు అన్ని ఋతువులలోను కనకవర్షాలే. సంగీత సాహిత్యాలు అక్కచెల్లెండ్ల పోలిక నాట్యం చేశాయి. సంస్కృత నాటకాలు లేని లోటు తంజావూరి నాటకాలు తీర్చాయి. దేశి నృత్యరీతులకు పునరుజ్జీవనం కలిగింది. వ్యవహారిక భాష పట్టం కట్టుకొంది.

అవధాన ప్రక్రియ ఆనాటి పురుషులకే కాక మహిళలకు కూడా అలవడిపోయింది. అష్టభాషలను వారు నేర్చుకొన్నారు. తెలుగు భాషలోని సొగసులు చేమకూర వేంకటకవి విప్పిచెప్పాడు. ఆటవిక జీవితేతివృత్తం ప్రధానంగా తీసుకొని రఘునాధ నాయకుడు వాల్మీకి చరిత్ర వ్రాశాడు. ఆ వాల్మీకి రచించిన రామాయణాన్ని అనువదించాడు. మధుర మీనాక్షికి చారుతరమైన నగలు తిరుమల నాయకుడు చేయించి, దేవాలయాన్ని శిల్పకళానైపుణ్యంతో కలకల లాడించాడు.

వైష్ణవాలయాలను తంజావూరు నాయకరాజులు పోషిస్తే, శైవాలయాలను మహారాష్ట్ర నాయకులు ధర్మకర్తలై నృత్య, నాట్య, సంగీత కళలను దేవాలయపరం చేశారు. ఇంతటి మహోన్నతి తెలుగు వారికి గర్వకారణమైనది. దానికి కారణం చెప్పాలంటే చాలా ఉంది.

విజయ నగర సామ్రాజ్యం కూలిపోయిన తరువాత దక్షిణదేశంలో నాయకరాజ్య స్థాపన జరిగింది. వీరు తెలుగువారు, తెలుగు భాషాభిమానం ఉండటం వీరికి సహజమే కాని వారు పాలించిన దేశం శుద్ధద్రవిడభూమి. ఇది ఒక వింత సంఘటన.

తూర్పు చాళుక్యులకు, తమిళదేశాన్ని ఏలిన చోళులకు సంబంధ బాంధవ్యాలు ఉండేవి. అయినా తమిళ సాహిత్యాన్ని పోషించిన జాడలేదు. కృష్ణదేవరాయల కాలంలో నాగమనాయుడు, అతని తనయుడు విశ్వనాధనాయకుడు మధురలో రాజ్యస్థాపన చేశారు. అచ్యుత దేవరాయల కాలంలో పినచెవ్వప్ప తంజావూరులో రాజ్యం ఏర్పాటు చేశాడు. ఈ రాజ్యాలు ఏర్పాటయిన తరవాత తెలుగువారు చాలా మంది దక్షిణానికి తరలిపోయి, తెలుగురాజుల ప్రాపకం సంపాదించి తెలుగు సంస్కృతిని ప్రవేశపెట్టారు.

శ్రీకృష్ణ దేవరాయలే తంజావూరు రఘునాధ నాయకుడుగా అవతరించినట్లు తెలుగువారు భావించారు. శ్రీ కృష్ణదేవరాయల తోనే తెలుగుసిరి వన్నె తగ్గింది. రక్కస-తంగడి (తాలికోట - తల్లికోట) యుద్ధంతో విజయనగర వైభవ ప్రాభవాలు సన్నగిల్లిపోయాయి. కవులు, గాయకులు, నట్టువకాండ్రు, నాట్యకత్తెలు, రాజపోషణకై తంజావూరు, మధుర సంస్థానాలకు తరలి పోయారు. నాయకరాజులు వారి నాదరించి, మడిమాన్యాలిచ్చి పోషించారు. కళలు కళకళలాడాయి. సాహిత్యోద్యాన వనాన్ని పుష్ప ఫలభరితం చేశారు.

రాష్ట్రేతర ప్రాంతంలో, ముఖ్యంగా దక్షిణదేశంలో విస్తరిల్లిన తెలుగు సాహిత్యాన్ని పరిశీలించి, పఠించి, నిడుదవోలు వేంకటరావుగారు సమగ్ర సాహిత్య చరిత్రను వ్రాసి తెలుగు ప్రజలకు అందజేశారు. తెలుగు సాహిత్య చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని వారు తెరచారు.

# గ్రంథ సంస్కరణలు

గ్రంథ సంస్కరణలు - ఒక శాస్త్రం - ఒక కళ క్రమపద్ధతిలో చేయవలసి ఉంటుంది. కనుక శాస్త్రం రచయిత పొరపాటు నవో లేఖకుడి ప్రమాదం వల్లనో, వదలి పోయిన పదాలను వాక్యాలను, కవి హృదయాన్ని, గ్రహించి మూలవిరోధం గాకుండా చేర్చవలసి ఉంటుంది కనుక కళ ఈచేర్చినవి రచయితవి కావు. పరిష్కర్త సుమా! అని తెలుపడానికి ఆ పదానికీ వాక్యానికీ అటూ ఇటూ కుండలీ కరణం చేయడం పరిష్కర్త కర్తవ్యం. ఇలాటి పరిష్కారణ కేవలం సూచన మాత్రమే. పాఠకులకు అంతకన్నా మంచివే తట్టవచ్చు.

ఈ పరిష్కరణ పద్ధతి పాశ్చాత్య దేశాలలో కొన్ని శతాబ్దాలకు ముందునుంచే బాగా అభివృద్ధి చెందింది. ఇది ఒక విధంగా 'ఎడిటింగ్', పత్రికల ఎడిటింగ్ కన్నా పుస్తకాల ఎడిటింగ్ విలక్షణమైనది. సంపాదకుడు తనకు చేరే వార్తలలోను వ్యాసాలు మున్నగు వాటిలో తనకు నచ్చనివే పాఠకులకూ నచ్చవని భావించినవాటిని తీసి వేయవచ్చు. అతనిదే తుది నిర్ణయం. గ్రంథాల (ఎడిటింగ్) పరిష్కరణ అలాటిది కాదు. సంపాదకుడు లేక పరిష్కకర్త తనకు నచ్చని దానిని తీసివేయడానికి వీలులేదు. నచ్చనిదానిని గురించి అధస్సూచికలో గాని పుస్తకం చివరగాని తన అభిప్రాయం చెప్పవచ్చు. తాను మంచి దనుకున్న దానిని సూచించవచ్చు. తనకు అర్థంకాని చోట కుండలీకరణంలో ప్రశ్నార్థక చిహ్నం (?) పెట్టాలి. ఇతరులు దానిని తెలుసుకొని చెప్పడం అవసరమని దాని భావం.

పరిష్కర్త గ్రంథంలో క్లిష్టంగా ఉన్న విషయాన్నో రచయితకు సమకాలీనమైన విషయాలను అధోజ్ఞాపికలలో చూపాలి. దానివల్ల పాఠకులకు కొత్త విషయాలు తెలుస్తాయి. అంతేకాని తనయిష్టం వచ్చినట్టు మూలగ్రంథాన్ని దిద్దివేయరాదు. పాఠాంతరాలు క్రింద పేర్కొనాలి. తనకు, కవి హృదయ మని నచ్చిన దానిని పైన వ్రాసి, క్రింద తక్కి నవి ఇవ్వాలి. ఇతర విషయాలూ అంతే.

గ్రంథ పరిష్కరణ మనదేశంలో ఒక విధంగా వ్యాఖ్యాన పద్ధతిలో ప్రారంభ మయిం దనవచ్చు. వ్యాఖ్యాతలు సంస్కృత గ్రంథాలను

"పదచ్ఛేదః పదార్థోక్తిః
విగ్రహో వాక్యయోజనో
ఆక్షేపస్య సమాధానం
వ్యాఖ్యానం పంచలక్షణమ్"

అన్నరీతిగా వ్యాఖ్యానించేవారు. శ్లోకా లయినా గద్యమయినా, మొదట పదవిభాగం చేయడం; తర్వాత పదాల అర్థాలు చెప్పడం; సమాసాలు వివరించడం; వాక్యాలకు అన్వయం కుదర్చడం; ఎవరన్నా ఆక్షేపణలు చేస్తే వాటికి సమాధానాలు చెప్పడం వ్యాఖ్యాత పని. కొన్ని చోట్ల సంస్కరణలుకూడ సూచించేవాడు. కాని, ఉన్న దానికి, పలువురు సరైనవని నమ్మిన పాఠాలకు వ్యాఖ్యచేయడం అతని పనిగాని పరిష్కరణ గాదు. కనుక పరిష్కర్త వేరు, వ్యాఖ్యాత వేరు. పరిష్కర్త వ్యాఖ్యాత కాదు. తనకు తెలిసిన విషయాలను, మూలానికి మెరుగుపెట్ట గల వన్న వాటిని అథస్సూచికల్లో తెలుపడమే అతని పని.

ఈ గ్రంధ పరిష్కరణ తెలుగునాట సక్రమంగా ప్రారంభం కావడం బ్రౌను మహాశయుని కృషివల్లనే నని అనవచ్చు. ఆయన మహాభారతం, ప్రబంధాలు మున్నగువాటిని వివిధ ప్రతులతో తైపారు చేయిచి, బహుప్రతులలో గల పాఠాలను మూలంలో ఉంచి, తక్కిన వాటిని అథస్సూచికలో తెలుపుతూ, ప్రతి అంచున విశేషాలు గుర్తు వేసే పద్ధతిని ప్రవేశపెట్టాడు. తర్వాత ఇది బాగా వ్యాప్తిలోకి వచ్చింది. బ్రౌను మహాశయుడు జూలూరు అప్పయ పంతులు వంటి మహా పండితులను నియమించి ఈ పరిష్కరణ పనిచేయించి ముద్రణకు సిద్ధపరచారు పెక్కు ప్రబంధాలను, జానపద రచనలను.

ఇంత జాగరూకతతో నకలు చేయించి, ఇతర ప్రతులతో తైపారు చేసినా లేఖక ప్రమాదాలు ఉండనే ఉంటాయి. నేటి ముద్రారాక్షశాల లాగ, లేఖకుడు తగిన మాత్రం పండితుడే అయినప్పటికీ తన అభిరుచిని బట్టి పాఠనిర్ణయం చేసి వ్రాసేవాడు. దానివల్ల కవి హృదయానికి కొంత ఆఘాతం కలిగే అవకాశం ఉంది. ఈ లేఖక ప్రమాదాలు మహాకావ్యాలలో పాఠాంతరాలు కల్పిస్తూ, అపార్థాలకు

అవకాశమిస్తూ, పాఠకులను భ్రాంతి పారావారంలో పడేసేవి. అలాటి కొన్ని ఘట్టాలను డాక్టర్ తిరుమల రామచంద్రగారు తెలియజేశారు.

"భారతంలో అరణ్యపర్వంలో ద్రౌపది యుధిష్ఠిరునికి నీతిబోధ చేసే ఘట్టం. 'కర్మఫలంబులు దైవ మానుషసిద్ధంబు లయిననుం బురుషోత్సాహ సముపార్జితంబు లయిన నవి సుస్థిరంబులయి వర్తిల్లు. అనీహమానుం డయి దైవపరుం డయిన వాఁడు నీలోని యానపాత్రంబునుం బోలె నవసన్నుండగుం గావున గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండ వయి నీయనుజుల పరాక్రమంబునం బరుల జయించి మనయందలి యర్థకృశత్వం బపనయింపుము" (అరణ్యా. ప్రథమ.236) అని యాజ్ఞసేని హితవాక్యం.

"అనీహమానుండయి దైవపరుం డయినవాడు నీరిలోని యానపాత్రంబునుం బోలె" ఎందుకు అవసన్నుడవుతాడు? అర్థమేమీ కుదరదు. యానపాత్ర మంటే ఓడ. అవసన్నమంటే పగిలి నాశనం కావడం. నీటిలో పయనించే ప్రతి ఓడ పగిలి మునిగిపోతే, సముద్రయానం ఎప్పుడో ఆగిపోయేది. కనుక, 'యానపాత్ర' మన్నచోట లేఖక ప్రమాదం జరిగింది. ఆ ప్రమాదమే ముద్రిత ప్రతులలో చోటు చేసుకుంది. పరిష్కర్తలు చూచినవారు కారు. ఈ లోపం తెలుసుకోవడానికి మూల భారతం చూడవలసి వచ్చింది.

"యోహి దిష్ట ముపాసీనో
నిర్విచేష్టః సుఖంశయేత్
అవసేదేత్స దుర్బుద్ధిః
ఆమోఘట ఇవోదకే"

(వన. అధ్యా. 32, శ్లో.14)

దైవాన్ని నమ్మి అకర్మణ్యుడై సుఖంగా నిద్రపోయే దుర్బుద్ధి ఆమఘటం - పచ్చికుండ - వలె వ్రస్సి పోతాడు అని దీని వ్యాఖ్య. నన్నయగారు "నీరిలోని యామ పాత్రంబునుం బోలె అవసన్నుం డగు. అని మూలానుసారంగానే అనువదించి ఉంటాడు. కాని, లేఖకుడు తర్వాత ముద్రారాక్షసుడు సంధికార్యంగా వచ్చిన

యడాగామాన్ని చూచుకోక యామపాత్ర మేమిటి అని ఆలోచించి యామపాత్రలోని 'మ'ను 'వ' గా మార్చి యావ పాత్రం చేశారు. అర్థం పాడయిం దని గ్రహించలేదు.

శృంగార నైషధంలోని భోజన వర్ణనం
ఆకు పచ్చళ్ళు చవిచూచి రాదరమున
పొగలు నెగయగ నాసికాపుటములందు
ఎ(ద్రదనమున ........

ఇక్కడ 'ఎ(ద్రదనం' కాదు ఉండవలసింది. వ(ద్రదనం ఉండి ఉంటుంది. వ(ద్రదన మంటే తీవ్రత, కారం, ఈ మంచి అర్థాన్ని లేఖకుడు 'వ' కు మారు 'ఎ' వ్రాసి పాడుచేశాడు.

లేఖకులు స్వతంత్రించి ఉత్తమ పాఠాలు అధస్సూచికలోను చెత్త పాఠాలు పైనను ఇవ్వడంవల్లకూడ యథాశక్తి అపార్థాలు పుట్టించి పుణ్యాం కట్టుకున్నారు.

భారతంలో అరణ్యపర్వంలో భీముడు ధర్మరాజుకు హితం చెప్పే ఘట్టం "శూద్రాన్నంబు నందలి దుగ్ధంబునుం బోలె దుర్యోధను రాజ్యంబు దూష్యంబగుట బౌర జానపద బ్రాహ్మణవరులు నీ కనురక్తు లయి భవద్రాజ్యంబ వలసియుండుదురు. (అరణ్య ప్రథమ.252) 'శూద్రాన్నంబు నందలి' అనే మాటలకు 'శ్వదృతి యందలి' అనే పాఠం ఉంది. దీనిని అధస్సూచికలో పడేశారు లేఖకులు. పై వాక్యాలలోని 'శూద్రాన్నంబు నందలి దుగ్ధంబునం బోలె అనేది తక్కిన వాటితో ఏమైనా అన్వయిస్తున్నదా? పదాలలో తప్పేమీ లేదు. నిజానికి శూద్రాన్నంబులోని పాలు ఎందుకు రుచిగా ఉండవూ? ఎందుకు పరిహరించాలి? సంస్కృత మూలం చూడనిదే పసి పడేట్టులేదు అర్థం! సంస్కృత మూలం ఇట్లా ఉంది.

"పౌర జానపదాస్సర్వే ప్రాయశః కురునందన
సవృద్ధ బాల్ల సహితాశ్శంసంతి త్వాం యుధిష్ఠిర
శ్వదృతౌ క్షీర మాసక్తం బ్రహ్మవాదృషలే యధా
సత్యం స్తే నే బలం నార్యాం రాజ్యం దుర్యోధనే తథా"
(వన. ఆ. 33 శ్లో. 80,81)

మూల వ్యాసభారతంలో దుర్యోధనుని రాజ్యం సరిగా లేదనడానికి ఎన్ని ఉపమానాలున్నాయో చూడండి. శ్వదృతిలోని క్షీరం, వృషలుని బ్రహ్మ, దొంగ సత్త్వం, ఆడదానిబలం. "శ్వదృతౌ సారమేయ చర్మకోశే, బ్రహ్మ వేదః" అని నీలకంఠాచార్యుని వ్యాఖ్య. దుర్యోధనుని రాజ్యం కుక్కతోలు సంచిలో నింపిన పాలవలె దూషితమైం దన్నమాట. దీనిని వదలి శూద్రాన్నంబు నందలి దుగ్ధం బునుంబోలె అనే పాఠం లేఖకుడు ఎక్కడనుంచి సంపాదించాడో పాపం!"[1]

ఆధునిక పరిష్కర్త లయిన కొందరు పెద్దలు కూడ పొరపడటం వల్ల మూలాన్ని దిద్దివేసి అపార్థాలు కల్పించారు. సితాబ్‌ఖాను చారిత్రక పురుషుడు. తాటాకులలో సితాబ్‌ఖాను అని వ్రాసేటప్పుడు పొరపాటున సితాబ్జఖాను డని వ్రాయడం సంభవించింది. దానికి కారణం 'ఖ' 'భ'లకు గల సామ్యం. సితాబఖాను నేమిటి? అనుకొని శ్రీ వీరేశలింగం పంతులుగారి వంటివారు 'సితాబ్జఖానుడు' అని దిద్దివేశారు. తర్వాత లక్ష్మణరావు గారు, ఆదిరాజు వీరభద్రరావుగారి సితాబ్‌ఖాను సీతపతి రావని, ఇతనినే ముస్లిము చరిత్రకారులు సితాబ్‌ఖాన్ అన్నారని తెలియలేదు.

మహావ్యాఖ్యాత లయిన వేదం వేంకటరాయశాస్త్రిగారు ఒకొకప్పుడు తాటాకు ప్రతులలోని అక్షరాలు పోల్చుకొనడంలో పొరబడి మంచిపాఠాన్ని కోల్పోయారు. నైషధంలోని ఒక పద్యం నలుడు దమయంతితో ఇలా అంటున్నాడు. 'ప్రేయసీ! చూచావా! రాత్రి అనే ఇల్లాలు ఆకాశమనే నీలాలకంచంలో మన్మథునికి నేయి నూటిడిపాటు వడ్డించిన పాయసంలాగ చంద్రుడు కన్పిస్తున్నాడు. చకోరాలు బంతి కూటికి రావాలని ఉవ్విళ్లూరుతున్నాయి'. ఆ పద్య మిది.

"ఉడు వీధీ హరినీల రత్నమయ పా
త్రోత్సంగ భాగంబునం
గడు గారా మొనరన్ ఝుషాంకునకు నం
కచ్ఛాయయన్ గమ్మమా౦
టిడితోఁగూడ సుధాంశుబి బమను నే

1 సాహితీ సుగతుని స్వగతం : పుట 183-185.

యిం బాయసాహారముం
గుడువం బెట్టెనొ బంతికూళ్ళకును జా
కోరంబు లేపార గన్"

(8.198)

ఈ పద్యం పూర్వ ముద్రణలోను తాటాకులలోను ఇలాగే ఉంది. ముఖ్యంగా మూడవ పాదం మొదలు 'నూటిడి' అని వేంకటరాయశాస్త్రిగారు నూటిడిలోని 'టి' ని 'బి'గా భ్రాంతి పడి, 'నూఁబడి' అని దిద్దిచేసి వ్యాఖ్యానించి, 'నూఁబిడితో' పిడికెడు నూవులతో గూడ' అని అర్థం చెప్పారు. వారు నూటిడి తప్పనుకొనడం వల్ల నూటిడితో గూడ సుధాంశు బింబ మను నేయిం బాయ సాహారమున్ అన్న దానిని 'నూఁబడి'తో గూడ సుధాంశ సుధాంశుబింబ మను సర్పిఃపాయసా హారమున్ అని 'నేయింబాయసా' నూ దిద్దివేశారు. తాము నూటిడిని నూబిడిగా దిద్దినందుకు పెద్దచర్చ జరిపారు.

నిజానికి శ్రీనాథుడు ఈపద్యాన్ని సంస్కృత నైషధంలోని శ్లోకానికి మక్కీకి మక్కీగా అనువదించలేదు. రంభామంజరి అనే నాటికలోని చంద్ర వర్ధన ఘట్టంలోని అంకచ్ఛలేన తిలతైల గుడాంశయుక్త చంద్రోవిభాతి గగనే బలిదుగ్ధికేవ అనే వర్ణనను స్వీకరించి మార్చుకొన్నాడు. నూటిడి అని బలిహరణ మప్పుడు నువ్వులు, నూనె, బెల్లం కలిపిన ముద్దను పిడచగా పెట్టి పాలు వదులుతారు. ఈ తిలతైల గుడాంశాన్ని శ్రీనాథుడు కమ్మనూఁటిడిగా రుచికరంగా చేసుకొన్నాడు. 'నూటిడి' అనేది తినుబండారం. నువ్వులు కొట్టిన యిది నూటిడి. నువ్వులుకొట్టిన పిట్టులో బెల్లం కలిపితే అయ్యేది చిమ్మిలి వంటిది.[1]

కనుక ప్రాచీన గ్రంథ పరిష్కరణ అసిధారావ్రతం. వేంకటరావుగారు ఆనువంశికంగా వచ్చిన తాళపత్రగ్రంధ పరిశీలనలో ఆరితేరిన వారుగనుక, వివిధ ప్రబంధాల అపూర్వప్రయోగాలు వ్యాకరణచ్ఛందోవిశేషాలు జిహ్వాగ్రంపై ఉన్నవారు గనుక గ్రంధ పరిష్కరణను గొప్పగా నిర్వహించారు.

1. సాహితీ సుగతుని స్వగతం. పుట 37-44

## (1) ద్విపద వాఙ్మయము

ద్విపద వాఙ్మయ శాఖలోని గ్రంథ పరిష్కరణంలో కట్టా వరదరాజకృత శ్రీరామాయణమును మించిన గ్రంథం లేదు. తంజావూరు శ్రీసరస్వతీ మహల్ గ్రంథాలయంలో లభించిన సంపూర్ణ రామాయణ తాళ పత్రగ్రంథం పరిశీలించి నిడుదవోలువారు గ్రంథం సంస్కరించారు. ఆ తాళ పత్ర గ్రంథం పాతదనాన్నిబట్టి అది నేటికి 240 సంవత్సరములనాటి దని చెప్పారు.[1]

వరదరాజు రామాయణంలోని ద్విపదలను చాలావాటికి లేఖకులు రంగనాథ రామాయణ ప్రతులలో చేర్చారన్నారు. దానికి ఋజువు చూపించారు.[2] అది ఏయే పుటల్లో ఎన్ని పంక్తులుగా ఉన్నాయో వాటి సంఖ్యలు వివరంగా ఇచ్చారు.[3]

### యుద్ధకాండ

ఈ ద్విపద రామాయణ సంస్కరణ సందర్భంలో ఛందోవ్యాకరణాది విశేషాలను కూడ చెప్పారు.[4] తమాషా ప్రయోగాలైనటువంటి కవుసల్య (కౌసల్య) కలెబడి (కలియబడి) ఇత్యాదులను ఉదాహరించారు. అవి యతి ప్రాసాదులలో ఉండడం చేత వాటిని దిద్దబూనడం అతి సాహస మన్నారు.

కొన్ని ప్రయోగాలను విమర్శించిన వారికి[5] సహేతుక వివరణ నిచ్చారు.[6] పాదవు+గుబ్బలి. ఇత్యాదులు - అచ్చుతప్పులు కావనీ తెలుగులో పాదువు+తెంచు=పాడతెంచు వంటివి ఉన్నాయనీ, బాలకవి శరణ్యము సమర్థించిన

1. శ్రీరామాయణము పీఠిక పుట 22
2 శ్రీరామాయణము పీఠిక పుటలు 35-36
3. శ్రీరామాయణము పీఠిక పుటలు 36-37.
4. శ్రీ రామాయణము యుద్ధకాండ పీఠిక పుట 25-30
5 శ్రీ రామాయణము యుద్ధకాండ పీఠిక పుట 30
6 శ్రీ రామాయణము యుద్ధకాండ పీఠిక పుట 26.27.28

ప్రయోగాలనీ చెప్పారు. కొన్ని ప్రయోగాలకు అంబికా శతకము, ఉత్తర హరివంశము, యయాతి చరిత్రములలోని ప్రయోగాలు చూపారు.

ఏకైక ప్రతిని ఆధారం చేసుకొని చూసినందున ముద్రణ స్ఖాలిత్యాలు దొర్లినందుకు తాను క్షంతవ్యుడనని తమ వినయశీల ప్రకటనం చేశారు.

## (2) ఉద్భటారాధ్య చరిత్రము

వేంకటరావుగారు ఉద్భటారాధ్యచరిత్ర తాళపత్రప్రతుల నిర్ణయ విషయాన్ని వివరంగా రాశారు.[1] రెండు తాళపత్ర ప్రతులలోని లుప్తభాగాలు, శిధిల పూరణాలు ప్రథమ ద్వితీయ ముద్రణలలో జరిగినవి వివరంగా చెప్పారు.

ద్వితీయ ముద్రణలో ముదిగొండ వీరభద్రమూర్తి, కరుణశ్రీగార్లు పూరించిన వాటిని తెలియజేశారు.[2] ఆ తరువాత తాము సవరించినవి చెప్పారు.[3]

*1/సీ.* *సోలుచుఁ బూదేనెఁ గ్రోలు రోలంబ బాలిక*
*లంబితాక్షమాలికలు గాఁగ 1-80*
*ఇది ముద్రిత పాఠం*

*సవరణ. సోలుచుఁ బూదేనెఁ గ్రోలు రోలంబ*
*బాలికలు రుద్రాక్ష మాలికలు గాఁగ*

*1.* *ఇది శివునికి కైలాస పర్వతానికి పోలిక.*
*శివుని మెడలో రుద్రాక్షమాలిక లున్నాయి.*
*కైలాస పర్వతం మీద తుమ్మెదలున్నాయి.*
*రుద్రాక్షలను తుమ్మెదలతో పోల్చడం కవిసమయం.*

---

1. ఉద్భటారాధ్య చరిత్రము: పీఠిక : పుట 201
2. ఉద్భటారాధ్య చరిత్రము: పీఠిక : పుటలు 203-208
3. ఉద్భటారాధ్య చరిత్రము: పీఠిక : పుటలు 209-212

2.4. ప్రేమశరా (1-86). సవరణ - శాతశరా

క కుసుమాయుధు (ప్రేమసరా) గ్ని సముత్థిత
ధూమవితతి.

ఇక్కడ 'ప్రేమసరా' అనడంకన్న 'శాతశరా' అనడమే ఒప్పు. కుసుమాయుధుని శాతశరాలు - వాడియైన బాణాలు అని అర్థం, వస్తుంది. మన్మథ బాణాలు చాలా వాడివి గదా!

3. సీ. శాతమన్యవ శిలాశకల దామజ ధామ
కల్పిత కారండకారభరము 1-149

సవరణ: శాతమన్యవ శిలాశకల దామజ ధామ
కల్పిత గాఢాంధకారభరము

ఇంద్రనీలమణి శకలముల కాంతి పుంజంచేత కటిక చీకటిని కలుగ జేస్తున్నామని అర్థం.

4. మ.వలదింద్రోపలఖండ దీధితులలేవన్ - 1-151

సవరణ: వలభీంద్రోపల ఖండ దీధితుల లేవన్.
వలభి అంటే కొణిగె చంద్రశాల

5. శా. ధీని స్ఫూర్తి పయోజ సంభవ. భవానీశ
స్తవోచ్చారణ - 1-205

సవరణ: దీని స్ఫూర్తి పయోజ సంభవ. భవాధీన
స్తవోచ్చారణ.

భవాధీనస్తవం అంటే శివు నధీనం చేసుకొనే స్తుతులు - శివపంచస్తవాలు.

6. కలికి బాగులు మీఱ నిలువు 2-129

సవరణ: కలికి బాగులు మీఱ నిలువు చూపు.

## ప్రశ్నార్థకచిహ్నాలు

1. గీ. పూర్ణ వెతల నిండ? -2-22

సవరణ: గీ. పూర్ణతల నిండు/పూర్ణములు కాగా అనే అర్థం.

2. సీ. దుస్తరం బైన సీతుం గందు వను గంఠదఘ్న
నీరంబుగా దవిలి యరలు. 3-22.

సవరణ. కంఠదఘ్ననీరంబుల దవిలి యరలు?

అరలు అంటే ప్రకాశించు. ఇది అలరు దాకు రూపాంతరం అని, నన్నెచోడుని ప్రయోగం. ప్రాసలో నెమ్మనం బరల అని ఇచ్చారు. (కు.సం. 1081) [1]

3. ఉ. ప్రాయము సత్తనాగ దగు పంచము?
వాగుర భోగ్య మింక, నాకాయజ వైరిఁ జేయుటయె
కర్జము. 2-105

సవరణ: ప్రాయము సత్తనాగదగు పంచము వాసర
భోగ్య మింక నా కాయజ వైరిఁ జేయుటయె కర్జము.

పంచకువాసర భోగ్యమంటే అయిదునాళ్ళముచ్చట. (మున్నాళ్ళ ముచ్చటవలె) పెండ్లి అయిదు దినాలే శోభ. తరువాత ఉండదు. ప్రాయం అనిత్యమని అర్థం.

**4.సీ.** డాకేలు తామెడ? మైకొల్పి 3-195

సవరణ: డాకేలు తామెడ మైకొల్పి

1. ఉద్భటారాధ్య చరిత్రము - పీఠిక - పుట : 211

## యతిప్రాసలు

| ముద్రితము | సవరణ |
|---|---|
| 1. సీ.అవని నార్యావర్తమను<br>దేశమున వల్లకీ సోమ<br>విఖ్యాతమైన పురము 1-193 | అవని నార్యావర్తమను<br>దేశమున వల్లకీ నామ<br>విఖ్యాతమైన పురము. |
| 2. గీ.సాధు సాలోక్య లక్ష్మిఁ<br>జెందంగఁ గలఁడు 1-200<br>3.క. అది/ముక్తంబులు తక్కిన<br>యవి ముక్త శరీర జం<br>పుంజంబులు. | సిద్ధ సాలోక్య లక్ష్మి<br>జెందంగఁ గలఁడు.<br>అవి ముక్తంబుట<br>తిక్కన భువిముక్త<br>శరీర జంపుంజంబులు |
| 3. క అది ముక్తంబులు తక్కిన<br>యవి ముక్త శరీరజంపుంజంబులు | అవి ముక్తంబులు తక్కన<br>భువిముక్త శరీరజంపుంజబులు. |
| 4. గీ.మూఢ దతనికి చావు<br>చావునకె మూఢు 2-93 | మూఢ దతనికి చా వది<br>మూఢు చావె. |
| 5. క.పంచప్రేతేశ పువ్వు<br>లుంచెద గొనుమా. | ఉంచప్రేతేశపువ్వు<br>లుంచెద గొనుమా. |
| 6. సీ. అగుటకు సకల<br>భూతాళి ప్రభూతహర్షం<br>బున నచ్చెరు వడుచుండ | అగుటకు సకల భూతాళి<br>ప్రభూత హర్షంబున<br>మిగుల నచ్చెరువు పడంగ<br>అచ్చరువు- అచ్చెరువు<br>రెండురూపా లున్నాయి. |

## 3. ప్రబోధ చంద్రోదయము

ఈగ్రంధ సంస్కరణ సందర్భంలో విశిష్ట పదాలు, వాటి అర్థాలు కొన్నింటిని శ్రీ వేంకటరావుగారు సాహిత్య ప్రపంచానికి అందజేశారు.

1. అనుభోగించు - అనుభవించు అని అర్థం.
   తనువుకు నాత్మవేఱట
   యనుభోగించు నమపిదప, నాముష్మికమున్ 2-31

ఈపదానికి ఇదొక్కటే ప్రయోగంగా సూర్యరాయాంధ్రనిఘంటువు తీసుకొందని చెప్పారు.[1]

2. అనునయించు - అంటే అనునినుగాఁ జేయు,
   గౌరవించు పూజించు అని అర్థాలు.

ఉపనిషద్దేవిని ననునయించి తోకొంచురండని పలికి 1-84.

3. అవధాని - అవధానము కలవాడు.
   అర్థంబు తెలియక యఱచెద రవధాను లూరక
   వేదాలు నోరికొలది 2-7

4. అహం బ్రహ్మీభవించు - నేనే బ్రహ్మమని అనుకునేవాడు. అహం బ్రహ్మీభవించి తల్లికిం దగిన బిడ్డ కలిగె నన మెలంగుచుండు 1-76

5. ఆగ్రహముచేయు - కోపము చేయు
   చెఱచెదనంచు నాగ్రహము చేయుగాని 5-51

ఇది నిఘంటువు కెక్కని ప్రయోగమని శ్రీ వేంకటరావుగారు పేర్కొన్నారు.

6. ఆశుకవిత్వము - ఆశుకవి అనే పదం ఉంది కాని ఆశుకవిత్వ మనేది లేదు. అందువల్ల తాము ఆ పదాన్నే ఈ గ్రంథప్రయోగంగా తమ శబ్దరత్నాకరానుబంధంలో చేర్చా మని చెప్పారు.

1. ప్రబోధ చంద్రోదయము - పీఠిక - పుట 91

అశ్రుత వ్యాఖ్యాన మాశుకవిత్వంబు - *5-56*

*7.* ఆలు ప్రత్యయప్రయోగాలు

కులస్థులు - అభాసురాలు - *8-59;* జోగురాలు - *3-49;* భావకురాలు - *5-57;* వృధారంజకురాలు - *1-73;* సేవకురాలు - *2-54;* విహ్వాలురాలు - *3-74.*

పైవాటిలో జోగురాలు అనే పదానికి మాత్రమే నిఘంటువులో ప్రయోగం ఉంది.[1] తక్కిన వాటికి లేవు. జోగురాలు అనే శబ్దప్రయోగం ప్రథమంగా చేసింది నందిమల్లయ - ఘంటసింగన కవులే అన్నారు.

*8.* ఇవతాళించు - చల్లనగు శీతమగు అని అర్థము.

ఇవతాళింపంగ బొద్దు డిట్లని పలికెన్ - *3.46*

*9.* ఉత్సార్యం చేసి - *5-36* ఉత్సార్యమంటే తొలగిపోయేలా చేయడం. దీనికి నిఘంటువులలో ప్రయోగం లేదు.[2]

*10.* ఎడమ వెనివెట్టు - పాడుచేయు

పెనిమిటి ధర్మమున కెడమ పెనివుట్టుదునే

ఇది ఒక విశేష ప్రయోగంగా కనిపిస్తుంది.

నేత సంబంధ ప్రయోగం - నేత పని వాళ్ళు

కుడివైపుగా పెనవెట్టి వేటలతో నేస్తారు. ఎడమ వైపు నైతే అది తక్కిన వాటితో కలవదు. నేత సరిగా జరగదు. ఈ క్రియకు ఈ గ్రంథ ప్రయోగం ఒక్కటే కనిపిస్తుంది.[3]

1. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 92
2. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 93
3. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 93

1. గాణు - గాడు - హాని అని అర్థం
రాణించి - ప్రాణేశ్వర - జాణ - గాణు (ప్రాస)

దీనికి నిర్ధారకంగా ఈ ఒక్కటే ప్రయోగమన్నారు.[4]

ఈ పద్యం ఈ గ్రంథంలో లేదు. ఒకసారి పరిశీలించి తీసెయ్యొచ్చు.

2. గ్లౌ - చంద్రుడు
గ్లౌ వంశ యనంత మంత్రి కమలజగంగా

3. జముకాణము - జంబుకానా

ఈ అన్యదేశ్యపదాన్ని మొట్టమొదట ప్రయోగించింది ఈ కవులే.[2]

॥ ...... తచ్ఛాసన
మున చేరువ జమ్ముఖానమునఁ గూర్చుండన్

4. జంత - గయ్యాళి.
ఏజంత బోధించెనే - 3-3. ఇదీ ప్రథమ ప్రయోగమే.[3]

5. తలనొప్పి - ఇది కూడ వీళ్ళు చేసిన మొదటి ప్రయోగము.
తలనొప్పేమియు జెందకే హృదయ సంతాపం - బునుం జెందకే 4-23

6. తామ్రంపుగిండి - రాగిపాత్ర
తామ్రంపుగిండి నంబువు లిడ - 2-14
ఇది నిఘంటువు కెక్కని ప్రయోగము [4].

. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 93
. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 94
. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 94
. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 94

17. నిబద్ధి - సత్యము.
ఇది నిబద్ధి తప్పదు మీ పాదమున - 2-53
ఈ పదానికీ ఇదే మొదటి ప్రయోగం[1].

18. పరామర్శించు - చక్కగా విచారించు
దిగంబరా ఇవ్విరాళిం బరామర్శింపుము 3-63

19. పల్లటపులు - దుర్భాషలు
శాస్త్రంపు పల్లటపులు 3-2

20. బోడి - బోడ = సన్యాసి. విధవ
నిందాద్యోతకపదం.
ఏబోడి గావించెనే ఇంత విరిపోటు తల్లీ నాకుపనిషత్తమణితోడ. 3-3.

21. మనవిపత్రము.
గీ. అనుచు మనవి పత్ర మర్పింత 2-52

22. మృద్బిందులు - మట్టి కలిసిన నీటి కణాలు
మృద్బిందులు దాల్చి 2-10

23. లక్కముద్ర - లక్కతో ముద్రవేసిన పత్రం
గీ. తత్పత్ర
మునకు నిడిన లక్కముద్రఁ జూచి 2-52
ఈ పదాని కిదే తొలిప్రయోగం[2].

24. విరాకులవిత్తు
విరియు+ఆకు+విత్తు=చెడినది
అలవడ వేదమార్గమున విరాకుల విత్తుగ 2-45
ఈ పదాని కిదొక్కటే ప్రయోగం[2].

1. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 95
2. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 97

25. విరాళి - మోహపు వలపు
దిగంబర ఇవ్విరాళిం - 3-65

26. విరుద్ధపఱచు
వేదమార్గో పనిషత్తులతోడ శ్రద్ధను
విరుద్ధపఱచి - 3-2
దీనికి ప్రయోగాంతరం లేదు[1].

27. సంకట పఱచు - బాధించు: పీడించు
చపలు నికిం గ్రొత్త చేసి సంకట పఱచెన్ - 3-70
దీని కిదొక్కటే ప్రయోగం[2].

28. సంచెల - వక్కలాకుల తిత్తి
సంచెళలోపలి దేవ పూజలున్ - 2-8

29. సాహూ - పరివారజనం చేసే హెచ్చరిక
సాహూ యని కటికవాడు సందడి జడియం 2-29
ఈ పద ప్రయోగం చేసిన తొలి కవులు వీరే[3].

30. సురధాణి - సురధానీ - తురకదొర
గజపతి సురధాణి గడి దుర్గముల కెల్ల

31. రాజు వజ్రంపు బోరు తప్ప (1-19) ఇందులో బోరుతప్ప అని ఉండకూడదు. 'బోరుతల్పు' అని ఉండాలన్నారు. పైగా ఎనిమిదవ సంపుటంలో చాలా తప్పు లిలాంటివి ఉన్నాయనీ, ఇది పూర్తిగా సంస్కరించ దగిన దనీ చెప్పారు[4].

1. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 97
2. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 97
3. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 98
4. ప్రబోధ చంద్రోదయము - పీఠిక పుట - 98

## 4. సకల నీతి సమ్మతము

మడికి సింగన సంకలనం చేసిన సకల నీతి సమ్మతము నుంచి కూడా కొన్ని విశేషాలు సంస్కరించినవి తెలిపారు. శ్రీ నిడుదవోలు వారు.

1923లో ప్రథమ ముద్రణ పొందిన ఈ గ్రంథంలో యతిచ్యుతులు కొన్నింటిని పేర్కొన్నారు. వాటికి ప్రత్యంతరం లేక పోవటంచేత అలాగే ఉన్నాయన్నారు[1].

పూర్వ ముద్రణలో కొన్ని పద్యాలకు ప్రశ్నార్థక చిహ్నాలున్నాయి. 1970లో దీన్ని అలతి మార్పులతో పద్యాలు సరిచేసి, అవి తీసేసి ముద్రించా రన్నారు.

(1). 111గా సంఖ్యాక్రమం ఉన్న ఒక ఉత్పలమాల నాలుగవ పాదంలో భూవరు నెగ్గుగా గొనక బుద్ధి విధిం జమ విత్తు రాత్ములై (?)

'భూవరు నెగ్గుగా' బదులు 'బూవరు లెగ్గుగా' అని ఉండాలి. మొదటిపాదం చివరలో, 'వక్రశీలులై' బదులుగా 'శీలురై' అని ఉండాలి.

ఆత్మీయులై అనడానికి 'ఆత్ములై' అన్న పదం ఉంది. అని వివరించారు.[2]

*2. క. అడపఁ గలంతియ (?) బానసి*
*యొడలంటుట వైద్యమొద్దనుండుట తనకుం*
*గుడువఁగఁ బెట్టుట యను పను*
*లడరఁగ నాప్తులనె పంచు నధిపతి సుమతీ!*

ఇందులో ప్రశ్నార్థక చిహ్నం అక్కరలేదు.

అడప. అడప పని - అంటే తాంబూలపేటిక ధరించేపని.

అడప - అంటే తాంబూల కరండవాహి.

1. సకలనీతి సమ్మతము పీఠిక పుట 19
2. సకలనీతి సమ్మతము పీఠిక పుట 19

ఉ॥ కావున గాపు లొక్కటికిఁగా గలహించిన వక్రశీలురై
చేవిరులం గృషి క్రియలు సేయక తక్కిన నెన్ను పన్నుకున్
గావడిఁ బోరిన న్మనవి కాల మెఱుంగక చెప్పిరేనియున్
భూవరు నెగ్గుగాఁ గొనక బుద్ధివిధిం జనువిత్తురాత్ములై.

గలంతియ - గలంతియపని - అంటే పాత్రలు పెట్టేపని.

బానసి - వంటపని.

ఒడలంటుట - శరీర మర్దనాది స్నానక్రియ.

వైద్య యొద్ద నుండటం - తెలుస్తూనే ఉంది అర్థం.

కుడువఁగ బెట్టుట - ఆహారం పెట్టేపని

ఈ పనులన్నిటికీ ఆప్తులనే నియమించాలి గాని ఇతరులను కాదని అర్థం[1].

## గ్రంథపద్య సంఖ్య

ఈ గ్రంథంలో మూడాశ్వాసాలున్నా, ప్రత్యేకంగా ఒక్కొక్క ఆశ్వాసానికీ వేరుగా పద్య సంఖ్య లేదు. గ్రంథమంతటికీ ఒకే సంఖ్య ఉంది.

ముద్రిత గ్రంథ పద్యసంఖ్య - 992 కానీ, ఈ సంఖ్య సరిగాదనీ, 982 మాత్రమే అనీ శ్రీ వేంకటరావుగారు వెల్లడించారు[2]. (ఇందులో 191 పద్యం 959గా తిరిగి ముద్రితం కావడంవల్ల 991 రెండు చోట్ల 854-857 తరువాత రెండు పద్యాలకు సంఖ్య లివ్వకపోవడం వల్ల 991+2=993. వీటిలో ఆశ్వాసాంత పద్యాలు11 పోగా మిగిలినవి (ప్రథమ-3, ద్వితీయ-4, తృతీయ-4) 982.

వీటి వివరాలు, ఏయే గ్రంథాలనుంచి ఎన్ని పద్యాలు తీసుకొన్నారో అవి అనుబంధంలో చూపారు[3]. ఇందులో ఉదాహరించిన పద్యాలు ఏ గ్రంథంలోనివో పరిశీలించి 17 గ్రంథాలనుంచి అని తేల్చిచెప్పారు.[4]

వీటిని కొన్ని లభ్య పద్యాలతో పోల్చి చూసినపుడు కొన్ని కనబడటం లేదన్నారు. ఒక గ్రంథానికి బదులుగా మరొక దానినుంచి అని ఉదాహరించారన్నారు[5].

1. సకలనీతి సమ్మతం - పీఠిక పుట 20
2. సకలనీతి సమ్మతం 1970 ముద్రణ.
3. సకల నీతి సమ్మతం 1970 ముద్రణ సాహిత్య ఏకాడెమి వారిది అనుబంధం పుటలు 148 నుంచి 150.
4. స.స. పీఠిక పుటలు 21-22.
5. స.స. పీఠిక పుటలు 22-26.

ఏయే గ్రంథాలనుంచి సకల నీతి సమ్మతములో పద్యాలున్నాయో వాటి రచయితలు, వారి కాలాలు కూడా చర్చించారు.[1]

కొన్ని పదాలను, వాటి అర్థాలను వివరంగా ఇచ్చారు[2]. కొన్ని పదాలకు అర్థాలు స్పష్టం కావడం లేదనీ, పారభేదా లున్నా యేమో తెలుసుకొనే ఆధారం లేదనీ, పండితుల పరిశీలన కోసం పేర్కొంటున్నానని వాటినిచ్చారు. అవిఘట్మరులు (192) జనటాయగాంఁడ్రు - (196) దులాయించు (218) మిషి (388) శకడి (497) సావుతేలు (387) సుత్తెకడుగు (122) సొనారని (566)

ఆయన ఇచ్చిన సుదీర్ఘమైన పట్టికలోని పదాలుకొన్ని నిఘంటువుల కెక్కలేదు. 15వ శతాబ్దానికి పూర్వ ప్రయోగాలే అన్నీ[2].

## బసవ పురాణము

1. ప్రథమాశ్వాసంలోని 9వ పాదంలో భక్త వ్రజత్ర అని వుంది. దీన్ని భక్త వ్రజత్రామె అని సంస్కరించారు శ్రీ రావుగారు. భక్తులలో వ్రజాల్లాంటి వాళ్ళకు కాక భక్తుల సమూహాలనే రక్షిస్తాడు భగవంతుడు. అందువల్ల ఈ సంస్కరణం బాగుంది. తీసుకోవచ్చు.
2. రెండవ పుటలో 5వ పాదంలో "విస్ఫురణ దుల్కాడ" అనివుంది. అధోజ్ఞాపికలో 'దాల్కాడ' అని వుంది. అదే సరైనది. అతిశయించు అని అర్థం.
3. మూడవ పుటలో 7వ పాదంలో
"బసవ పురాణంబు బ్రసరించు శక్తి"-
దీన్నె 'బచరించుశక్తి' అని వారు సూచించినట్లు తీసుకోవచ్చు. ప్రకాశింప జేయుశక్తి.

---

1. స.స. పీఠిక పుటలు 26-43.
2. స.స. పీఠిక పుటలు 50-54
3. స.స. పీఠిక పుటలు 54

4. నాలుగవ పుటలో 'పాశముక్తుండ' అని వుంది. 'పాపముక్తుండ' సరియైన పాఠం. పాశంనుంచి విముక్తులు కావడం శరీరం వదిలిన తరువాతే సాధ్యమవుతుంది.

5. 4 పుటలో 16వ పాదం "సకల వేదపురాణ సమ్మతంబైన - యాతత బసవన పురాతన భక్తగీతార్థ సమితి" భక్తుల గీతార్థాలు కాకుంటే సకల అనడమే బాగుంది.

6. అలాగే 28వ పాదంలో 'నసలారు కీర్తి' కన్న 'బసలారు' బాగుంటుంది.

7. 5వ పుట 28వ పంక్తి "వీటఁబో రిత్త" కు బదులుగా 'వీటఁబో' వీటి వలననే అనే ప్రయోగం బాగుంటుంది.

8. పుట 6లో 4వ పాదం 'మానసులగు' బదులుగా 'మానసుఁడగు' బాగుంటుంది. క్రియ ఉపమన్యు డొక్కడికే వర్తిస్తుంది.

9. పుట 7లో

'నెట్టణ నేనొల్ల' ..... 'బదులుగా నెట్టన'

10. పుట 8లో 'వర్షంబు భోరన' కు బదులుగా జోరున వర్షం భోరుమని కురవదు గనుక జోరున అన్నది సరి అయిన ప్రయోగం.

11. "వెత్తి పశుజీవు లార!" బదులు - 'యట్టి పశుజీవులార' (9వపుట)

12. 'నీకొండుక పదవి' బదులు 'నీకొండొక' (అదేపుట)

13. 'మా భక్తులాన' బదులుగా 'మాకన్నలాన' (అదేపుట)

14. 'తేట తెల్లయె' - బదులు 'తెల్లమై', తేట తెల్లము అన్నదే సరియైన ప్రయోగం. (అదేపుట)

15. 'కలయ' బదులు 'కదియ' ఉచితమైన ప్రయోగం. (అదేపుట)

16. 'దరహాస' కాంతి బదులుగా 'లక్ష్మి'. (అదేపుట)

17. దుల్కాడ బదులుగా దోల్కాడ.

18. 'ధరజాఁగఁబడి బదులుగా ధరణిఁ జాఁగిలి.

19. పుట 10లో నేన కాకేల యొండొకఁడె బదులుగా కానెలమి నొండొకఁడె.

20. మీనిత్య సత్య బదులుగా నిత్య సత్య.

21. నిన్ను ధరింపంగ - బదులుగా భరింపంగ

22. సర్వేశ కు బదులుగా మహేశ

ఈశ తరువాత మహేశ అనడమే అలవాటయిన పద్ధతి గనుక మహేశ అనడం బాగుంది.

23. ఇది తత్వసార బదులుగా ధర్మసారమని గాని పుణ్యాసారమని అనడం మేలు.

24. పుట 11లో నీకు నెక్కుడుఁ గూర్మి బదులుగా నీక యెక్కుడు.

25. కేల్మోడ్చి - కేల్మోన్చి.

26. మెయికొని - మేదినిఁ బనులు

27. నినుగూడి - నీ తోడ.

28. దీను జేర్చుగొను వాడ - నను జేర్చుకొనువాడ

29. భాగవాటి - భాగవత, భోగవత

30. నెల్లను - లోనెల్ల.

31. వెడ నోములన్నియు - వెడనోములోని కొన్ని.

32. 12వ పుట మెయినిండఁ గప్పి - గట్టి.

33. గంటలు - మువ్వలు.

34 గోరి జయలు - గోరి జెలును.

35. కుదిపి - వెట్టి.

36. బ్రోవగా బ్రోసి - ప్రోక
37. ప్రతతకి నెల్ల - ప్రకారంబుకెల్ల
38. పసాదంబు వెట్టు - ప్రసాదించినంత
39. నోమె - నోచె
40. దానంకురించె - దామంకురించె
41. అమృతాంశుడగు - అమృతాంకుడగు
42. వెలరొందె మైదీఁగ - వెల్లనొందె
43. నల్పెక్క - గప్పారె
44. పుట 13 - పెనుపారి - ననుపారి
45. మవ్వమొందె - చెల్వమొందె
46. కేలీవిలోలుడై - క్రీడా విలోలుడై
47. ఓలలాడుచును - తేలనాడుచును
48. సంభవమైన యట్టి - సంబంధమైనట్టి.
49. శాంతవ్యోమచంద్ర - శాంతర్వ్యోమ
50. మూఁడేడులున్న - మూఁడేండ్లు మన్న
51. పుట 14 పొలఁతులు నెలల - పోలతుక లెల్ల
52. నన్నింత - నన్నెంత
53. యల్లట - యల్లడ
54. నుస్సని - నుహ్వాని
55. నిద్రబొందుతును - నిద్రఁజెందంగ
56. కట్లని యనతి యిచ్చె - కప్పుడెట్లానతి యిచ్చె

57. మన్వ(గా యంచి - మాన్వగా ముందె

58. చూచుచు(గాన - చూచుడ(గాన

59. గానోపు - గాబోలు

60. గడువేడు(దెలిపి - దెలియ( జెప్పుచును

61. యఱకువ గాకుంత - యఱము లేకుండంగ

62. గుప్తాకృతి - గుర్వాకృతి

63. యొమొకో - యేమకో

64. పుట 15 - లానసుమీ యించుకం తైన( నడుగ లానుచు - యించుక యైన గుడ్చినను.

65. వర్పుట - పరుగుట

66. చెల(గి యాడెడు గతి( జేతులాడించు - చెలగి యాడుగతి, జేతులు విచ్చియాడు.

67. భవు(జూడ - భవు(జూడ

68. పుట 184 నుపవీతమగును - భూమీసురులు

69. పుట 182 ఎచట బ్రాహ్మణులకు నితరుల ముట్ట - ఎచటను బ్రాహ్మల కితరుల

70. 178 పుట లెవ్వరే దేవరికే నిచ్చిరే పదము - లెవ్వ రెవ్వరి కిచ్చి రేమేమి పదవి.

71. పుట 176 హరిని హరించుట హరి హరంతత్యు - హరిని హరింపుడే హరి హరు( డనెతి.

72. పుట 177 వయ్యడే(నా(టి యధ్వరము లోపలను - వెయ్యు(డే యధ్వర వేళ( దెల్లముగ

73. పుట 174 నానాటికిని గళానష్టతఁ బొందు - నానాటికి నిపుడును నష్టంబుఁ బొందు

74. చరులై కొల్చు పశువులుగాక - వారమై కొల్చి బ్రదుగుదుర్గాదె

75. పుట 172 నది యేల దృష్టకు మయినను గలదె - నిది - యేల దుష్టాంతఁమిటు చూపగలవోఁకు చూపగలదె

76. పుట 170 దప్పేమి మునుజేసెఁ జెప్పుమా విప్ర - తప్పేమి సేసెనే విప్రుఁడు సెపురు.

77. పుట 158 మంత్ర తంత్రానేక మాయాదులను - యంత్ర తంత్రార్ధ మాయా వాదములను

78. పుట 157 వెల్లఁగా జేసితి దెల్లంబుగాదె - వెల్లఁగాఁజేసిన వేల్పవు నీవు. తెల్లంబుగాన

79. పుట 155 భసితంబులందని పాతకులార! - భసితంబుఁ బూయని పాపాత్ములార

80. పుట 149 పుచ్చిన పిమ్మటాఁ బుచ్చెడు శిరము - పూన్పంగ నొయ్యనఁ బొందుదు శిరము.

గ్రంధ పరిష్కరణాన్ని గురించి వారు తమ అభిప్రాయాన్ని ప్రకటించారు ఒక వ్యాసంలో[1]. భాషలోనూ, కవిత్వ రచనలోనూ చారిత్రక పరిణామాన్ని వివరించి వాటి పరిస్థితి తెలిపేవి శివకవుల రచనలు. వారి వ్యావహారిక గ్రాంథిక రచనలే దేశి మార్గ రచనలు. నన్నయాది కవులు గ్రాంధిక సంప్రదాయాన్ని నెలకొల్పి మార్గ రచన విధానాన్ని స్థిరపరిచారు.

మల్లికార్జున పండిత, నన్నెచోడ, పాల్కురి సోమనాధుల రచనలు ప్రకటితాలయ్యాక కవిత్రయ సంప్రదాయానుబద్ధులగు మన పండితులకు, విమర్శకులకు-

1. 1964 ఫిబ్రవరి సంచిక - భారతి పుటలు 27-28.

ఏ ముగ్గురో నలుగురికో తప్ప ఆ గ్రంథాల్లోని భాష రచనా పద్ధతి విలక్షంగా అనిపించాయి. వారు నన్నెచోడుని కవితలో కొత్తరకమైన భాష నన్నయలా ప్రసన్నంగా లేదట! కారణం నన్నయ పట్టుబట్టి దేశి సంప్రదాయం విడిచి మార్గ సంప్రదాయావలంబి కావడమే! నన్నెచోడుడు భాషలో దేశి సంప్రదాయాన్ని ఆధారం చేసుకొని రచించడంవల్ల అది విలక్షణమైంది.

ఇందుకు ఉదాహరణగా వారు నన్నయ నన్నెచోడుల సంస్కృత పదప్రయోగాలను ఇచ్చారు.

1. నన్నయ - హర్షము

నన్నెచోడుడు - హరుషము

దేశి తెలుగులో పదమధ్యంలో సంయుక్తా క్షరాలు ఉండవు. తెలుగువారి ఉచ్చారణలో సంయుక్తాలు శిథిలా లవుతాయి.

కనుకనే 'హర్షము' అనే సంస్కృత పదం 'హరుషము' అనే శిథిలోచ్చారణ రూపం దాల్చి, అపైన 'అరుసము' అనే తద్భవ రూపం దాల్చింది - అని వివరించారు.

2. యౌవనము అనే శబ్దం

నన్నయాదులు 'యౌవనము' అనే వాడారు. నన్నెచోడుడు 'యవ్వనము' అన్నాడు. ఇది దేశీ ఉచ్చారణవల్ల ఏర్పడిన రూపం. పదాదిలో సంధ్యక్షరం కాని సంయుక్తాక్షరం కాని దేశిలో ఉండదు. ఐ-ఔ లు. అయి, అవులు కావడం దీన్ననుసరించే. అందువల్ల యౌవనము - యవ్వనము - జవ్వనము అయింది. యముడు - జముడు అయినట్లు.

3. ఇత ప్రత్యయం ఉన్న బహుప్రీహి సమాసాలను నన్నయ వాడుతాడు - 'బధిరీకృత దిక్కృత' నన్నెచోడుడు దీన్ని దేశిసమాసం చేసి 'దిగ్బధిరీకృతంబు' అనే వాడుతాడు.

**4.** నన్నయ తద్భవ పదాలతో సంస్కృత సమాసం చేయడు. కాని, నన్నెచోడుడు 'అర దాశ్వభటతతి' 'అమరలేమ' మొదలైన సమాసాలు చేస్తాడు.

**5.** నన్నయ అనుకరణం కాని సంస్కృత వాక్యాన్ని తెలుగులో ప్రవేశపెట్టడు. నన్నెచోడుడు 'ప్రధానవైరేణా' ఇత్యాదిగా అనుకరణ విరహితంగా వాడుతాడు.

**6.** నన్నయ, సంస్కృతంలో లేవు కాబట్టి, ఉపమాన పూర్వ పదకర్మ ధారయ సమాసాలు వాడడు.

**7.** కవిత్రయంవారు దీర్ఘపూర్వక పూర్ణ బిందుప్రాసము వాడరు. శివకవులు దీన్ని ఉపయోగించడం భాషాతత్త్వ శాస్త్ర సిద్ధాంత నిరూపణకు ఉపయుక్తాలు.

**8.** కవిత్రయంవారు ఇతర భాషా పదాలను వాడరు. శివకవులు తమిళ కన్నడాది పదాలను స్వేచ్ఛగా వాడుతారు. జీవద్భాషకు ఇటువంటి సౌకర్యం అనివార్యం.

ఈ విధంగా నన్నయాదులు రచనలు గ్రాంధిక లేక మార్గ సంప్రదాయాన్ని తెలిపే సాధనాలు. ఇందుకు ఉదాహరణగా భాగవతదశమ స్కంధోత్తర భాగంలోని 'పరియంకము' అనే పదాన్ని చెప్పి నన్నెచోడుడు వాడిన 'బరిహి' మొదలైనవి లాక్షణికా లైనవే అని, కవిత్రయ మతానుసారంగా తర్వాతి ప్రయోగాలను లేఖకులు మార్చడం సమంజసం కాదనీ అభిప్రాయపడ్డారు. దీన్నిబట్టి మనం గ్రహించ వలసిం దేమి టంటే - మన ప్రాచీన గ్రంథపరిష్కరణం నవీన వ్యాకరణాది సూత్రాలతో కేవలం కవిత్రయ సంప్రదాయ పద్ధతిని అనువర్తించక, ఆయాకాలాల్లో వెలువడిన శివకవుల దేశి సంప్రదాయ పద్ధతుల ననుసరించి పరిష్కరిస్తే మేలు. అప్పుడు కాని తెనుగుభాషా విశిష్టత తేటపడదు.

వేంకటరావుగారి గ్రంథ పరిపూరణ పద్ధతిని గురించి మన్నవ ఉపేంద్రరావు ఇలా అన్నారు. "శ్రీనిడుదవోలువారి పరిశోధన తీరు ఎలా ఉంటుందని ఆసక్తి కలగటం సహజం. అది ఏవిధంగా తెలుసుకోవాలంటే ఆగ్రంధాలన్నీ చదవాలి. ఆ గ్రంథాలంత గ్రంధం వ్రాయాలి. అయితే ఒక మెతుకు పట్టి చూచినట్టుగా వారు

శివతత్త్వసారమునకు వ్రాసిన పీఠికను అతి క్లుప్తంగా చూద్దాం. శివతత్త్వసార మనేది ముందు ఏరూపంలో ఎవరికి దొరికింది. తాళపత్రప్రతి, దాని కాలం, వ్రాతప్రతి, ముద్రితప్రతులు - ఇప్పటికెన్ని, ఎవరి వలన, ఏయే కాలాల్లో ముద్రితమయ్యాయి. కన్నడ శివతత్త్వ సారం ఎప్పుడు ఎవరు బయట పెట్టారు, దాని వలన కలిగిన మేళ్ళు, నష్ట భాగపూరణము, అర్థ సంస్కరణ, యతి సంస్కరణము, గ్రంథ కర్తృత్వము పండితారాధ్యుల కాలనిర్ణయము. దాని కాధార భూతమైన కథలు, శాసనాలు. వాటి సమయవ్యవధి, పండితారాధ్యుల జీవిత చరిత్ర, వారి సంతతి, శివ తత్త్వ సారకృతి కర్త - నన్నెచోడుని కృతి భర్త ఒక్కరే అని నిరూపణ, పండితుని మిగిలిన కృతులు, అక్షరాంకగద్యం (ఇది అముద్రితం కనుక మొత్తం వ్రాశారు. ఇలాగే స్తుతి శ్లోక పంచకం. పర్వతాష్టకం, శివచరణ పదము మొత్తం ఇచ్చారు). అలభ్యకృతులు జాబితా శివతత్త్వసార కావ్యత్వచర్చ కంద పద్య రచన శివతత్త్వసారానికి అనుకరణలు. సంస్కృత సాహిత్యంలో శివతత్త్వసారము. శివభక్తులుగా సంస్కృత మహాకవులు. పండితత్రయము, బసవ వాఙ్మయము, భక్తుల కథలు, ఛందో విశేషాలు, వలపలగిలక, వ్యాకరణ విశేషాలు. పండితారాధ్యుని ప్రశస్తి, సాహిత్యము, మతసంప్రదాయాలు - ఇలా వరదనీరు లాగ బండ్లను ముంచి అడ్డము వచ్చిన వాటిని, చుట్టుప్రక్కల దాన్ని అంతా లాక్కుంటూ, నురుగులతో, ఉరుకుతూ పారుతుంది. అసలు విషయం కంటె చుట్టుపట్ల విషయం ఎక్కువగా ఉన్నదే అనిపిస్తుంది. కాని, నిజం కాదు. ప్రసక్తానుప్రసక్తంగా వచ్చిన చుట్టుపట్ల విషయాల కంటె అసలు విషయమే అత్యధికం.

అర్థ సంస్కరణము - అనే విషయం కింద 'అన్నడు' అన్న దానిని గూర్చి, పూర్వ పీఠికలో ఉన్న పొరబాటును గూర్చి, దాని అర్థ నిర్ణయంలో శ్రీ వేంకటరావుగారి బహు భాషానేతృత్వము, పరిశోధనాసామర్థ్యము తెలియడమేగాక, సంప్రదాయ విజ్ఞతకూడా స్పష్టమవుతుంది. పూర్వముద్రణలో.

నిన్నెరుగుచు దన్నెరుగని
యన్నడు శివ యోగమగ్ను డనబడు మదిలో

నిన్నును¯దన్ను నెరింగెడి
యన్నడు శివయోగమగ్ను డనబడును శివా!

అని ఉన్నదనీ - దాని పీఠికలో 'ఆనాడు అనుటకు అన్నడు, మలహాడు అనుటకు మలహు అను మారురూపములు కానవచ్చు చున్నవి' అనువాక్యము కలదని, ఆ అభిప్రాయము పొరబాటు అనీ, కన్నడభాషలో అన్నన్, అన్నళ్ అనగా అలాటివాడు, అలాటిస్త్రీ అనునర్థములు. కిట్టల్ నిఘంటువులోనున్న వని, కన్నడమున 'అన్నన్' తెలుగున 'అన్నండు' - అన్నాడు అని రూపాంతరము చెందినవి అని వ్రాశారు. నిడుదవోలువారు. అద్వైత యోగులు తమ్ము మరచి బ్రహ్మను మాత్ర మెరుగుదురు. ఆవిధంగా నిజస్థితిని తెలుసుకోరు. అది సరి గాదు. శివయోగులు శివుని, తన్నుకూడా యోగస్థితిలో తెలిసి ఉంటారు కనుక పై పద్యము

నిన్నెరుగుచు దన్నెరుగని
యన్నడు శివ యోగిమగ్ను డనబడ డెపుడున్
నిన్నును దన్ను నెరింగెడు
యన్నడు శివయోగమగ్ను డనబడున్ శివా!

అని ఉండాలని తీర్మానించారు. వారి రచనలు మొత్తం చూస్తే ఇలాటి అధికార నిర్ణయాలు అసంఖ్యాకంగా కనిపిస్తాయి.... (1) 1973-11-8 కృష్ణాపత్రిక[1].

ప్రాచీన గ్రంథ పరిపూరణలో మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గార్లకు దీటైన వేంకటరావుగారు విపుల పీఠికలతో పరిష్కరించిన ప్రాచీనగ్రంథాలు కోకొల్లలు. పీఠికలు వ్రాయడం మనకు పాశ్చాత్యులనుంచి సంక్రమించిన పద్ధతి. బెర్నార్డుషా పీఠికలు సుప్రసిద్ధాలు. ఆయన "మిరాక్యులస్ బర్త్ ఆఫ్ ఎ లాంగ్వేజ్" అనే పుస్తకానికి వ్రాసిన పీఠిక పుస్తకాన్నే మించిపోయింది. వేంకటరావుగారూ బెర్నార్డుషా లా మొదటిలో బ్యాంకులో పని చేశారు. పీఠికలూ పెద్దవి వ్రాశారు. కనుక ఆయనను 'ఆంధ్రా బెర్నార్డుషా' అని అప్పు లనడం కద్దు[2]. ఆయన బృహత్

1. మూడు వాఙ్మయ శిఖరాలు - పుటలు: 129 - 130.
2. నిడుదవోలు వేంకటరావులు - మూడు వాఙ్మయ శిఖరాలు - పుట: 127.

పీఠికలతో పరిష్కరించిన ప్రబంధాలను మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ, వావిళ్ళ రామస్వామి శాస్త్రి ఎండ్‌సన్స్. ఆంధ్ర గ్రంథమాల మున్నగు సంస్థలు ప్రచురించాయి.

వారు పరిష్కరించిన పుస్తకాలు కొన్ని ఖడ్గలక్షణ శిరోమణి, విద్యావతీ దండకం, కట్టా వరదరాజు రామాయణం 4 సంపుటాలు, చంగళ్వ కాళకవి రాజ గోపాల విలాసం. మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారము, ఏకామ్రనాథుని అన్యవాద కోలాహలము. నన్నెచోడుని కుమార సంభవము.

పాల్కురికి సోమనాథుని బసవపురాణము, నాచనసోముని ఉత్తర హరివంశము, ఉత్తర హరి వంశము - తృతీయాశ్వాసం - సవ్యాఖ్యానం, భాస్కర రామాయణము, ఆంధ్ర మహాభాగవతము, చదలవాడ మల్లన విప్రనారాయణ చరిత్ర, నాదెండ్ల గోపకవి కృష్ణార్జున సంవాదము, వసుచరిత్ర, ధనాభిరామము తంజావూరు రఘునాథరాయల వాల్మీకి చరిత్ర, కదిరీపతి శుకసప్తతి, యజ్ఞ రమ్యచరిత్ర, సత్యాభామా సాంత్వనము, రాధా మాధవ సంవాదము, సీతారామచరిత్ర, భగవద్గీత, [illegible] శాస్త్రి అమరుకము, సకల నీతిసమ్మతము, ప్రబంధమణి భూషణము, [illegible] తాళ్ళపాక అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరశతకము, శతక సంపుటము, కవిజనాశ్రయము, ఛందోదర్పణము, లక్షణ సార సంగ్రహము, అప్పకవీయము, కవి సంశయ విచ్ఛేదము, పట్టాభిరామపండితీయము. రావిపాటి గురుమూర్తి శాస్త్రి వ్యాకరణాలు. ప్రశ్నోత్తర రాంధ్ర వ్యాకరణము, లఘువ్యాకరణము, ప్రౌఢవ్యాకరణము, ఉద్భటారాధ్యచరిత్ర, పాల్కురికి సోమనాథుని సంస్కృత బసవోదాహరణము. శబ్దరత్నాకరము - బహుజనపల్లి సీతారామచార్యుల నిఘంటువు. ఇందులో అదనంగా [illegible] పదాలు అనుబంధంగా ఇచ్చారు బైబిల్‌సొసైటీ[1].

---

1 [illegible] వాఙ్మయ శిఖరాలు - పుట 128

సంఘం ప్రవాహిని. దానిని అంటి పెట్టుకొని ఉన్న భాష కూడా ప్రవాహిని. సంఘంలో ఎప్పటికప్పుడు కలుగుతున్న మార్పులను బట్టి భాషలో ఉన్న పదాలు కొన్ని వ్యవహారచ్యుతం కావడం, కొత్త పదాలు తల ఎత్తడం సహజం. ప్రజాసామాన్యానికి వ్యవహారంతో పని, మార్పులు, చేర్పులు ఎలా కలిగాయన్న ప్రసక్తి దానికి లేదు. పరిమిత పద సముదాయంతో దాని అవసరం తీరుతుంది. కాని, విస్తృత ప్రయోజనాపేక్షులు కొందరు తమ భావాల స్పష్టీకరణకు ఎక్కువ పదాలు గుర్తు పెట్టుకోవలసి వస్తుంది. తాము వ్యవహరించిన పదాల సాధుత్వనిరూపణకు పాత పదాలను ప్రచురించవలసి వస్తుంది. అయితే ప్రతి పదాన్ని జ్ఞాపకం ఉంచుకొనడం సాధ్యమా? అభిరుచి కలవారు, అవసరమని భావించేవారు వీటిని విస్మరించకుండా ఉండడానికి ప్రయత్నిస్తారు ఇదే నిఘంటు నిర్మాణానికి అంకురార్పణం.

19వ శతాబ్దం వరకు తెలుగు నిఘంటువులన్నీ సంస్కృత నిఘంటువుల ఫక్కీలోనే ఛందోబద్ధంగా నడిచాయి. తమ పరిపాలన సౌకర్యం కోసం దేశభాషలు నేర్చవలసిన పాశ్చాత్యులకు తమ భాషలలో ఉన్నట్లే దేశభాషలలోను అకారాది క్రమంగా నిఘంటువులు అవసర మనే భావం కలిగింది. దీనితో భారత దేశమంతటా దేశభాషలలో మాత్రమేకాక సంస్కృతంలోను అకారాది రూపంలో ఉన్న నిఘంటువుల రచన 19వ శతాబ్ది ప్రధమ పాదంలో ప్రారంభమయింది. సంస్కృత శబ్దకల్పద్రుమం, వాచస్పత్యం, లఘు శబ్దార్థ సర్వస్వం వెలిశాయి. చివరిది మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులు రచించినది. తెలుగునాట విశాఖనగరంలో ప్రారంభమయిన తొలి నవీన సంస్కృత నిఘంటు విది. ఇది 'అ' 'ఆ' భాగాలవరకే ముద్రితమైంది. ఈ శతాబ్దం ప్రారంభంలో కొత్తపల్లి సుందరరామయ్య అనే వారు అమరాన్ని సవ్యాఖ్యానంగా అకారాదిగా కూర్చారు. దీనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తకాలయం ప్రచురిస్తున్నది[1].

1. సంస్కృత నిఘంటు చరిత్ర తెలుసుకొనగోరేవారు బరోడాసిరిస్‌వారు ప్రకటించిన 'కేశవస్వామికృత 'నానార్థార్ణవ సంక్షేపః' పీఠికను చూడవచ్చు.

పాశ్చాత్య సంప్రదాయం వచ్చినప్పటికీ తెలుగులో నిఘంటు నిర్మాణం రెండువిధాలుగా సాగింది. ఒకటి - పరిపాలనకు అవసరమైన వ్యవహారాల పట్టిక. రెండవది - ప్రాచీన గ్రంథాలలోని పదాల పట్టిక. మొదటి వర్గంలో మొట్టమొదటిది తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు. దీని నిర్మాత విలియమ్ బ్రౌన్. దీని మొదటి పేరు 'ఎ వొకాబులరీ ఆఫ్ .జెంటూ అండ్ ఇంగ్లీష్'. ఇది 1807లో రచితమై 1818లో తొలిముద్రణ పొందింది. 135 సంవత్సరాల తర్వాత 1953లో మలి ముద్రణ పొందింది.

ఈ తెలుగు - ఇంగ్లీషు నిఘంటు నిర్మాణ లక్ష్యం మన దేశానికి వచ్చిన విదేశపాలకుల, వ్యాపారుల సౌకర్యం. కనుక విలియం బ్రౌన్ అప్పటికి సామాన్య వ్యవహారంలో ఉన్న పదాలను గ్రహించి వాటికి ఇంగ్లీషులో అర్థాలిచ్చి వచన క్రియా కారకాలను వివరించారు. తెలుగు అర్థాలివ్వలేదు. కవి ప్రయోగాల జోలికి పోలేదు. ఈ తెలుగు నిఘంటువు, నిఘంటు నిర్మాణ పరిణామం తెలుసుకొనడానికి, ఆంధ్ర భాషా పరిణామం తెలుసుకోగోరిన భాషా పరిశోధకులకు ఎక్కువగా ఉపయోగ్యమైనది.[1]

రెండవ రకం అకారాది నిఘంటువులలో మొదటిది ఆంధ్రదీపిక. దీనిని మామిడి వెంకయ్యగారు 1810లో రచించారు. దీని ఉద్దేశ్యం కేవలం కావ్య ప్రబంధాల పట్టిక సిద్ధపరచి ప్రయోగాలు వివరించడం. కాగా మొదటిది కాంబెల్ సి.పి. బ్రౌన్ మున్నగు వారికి, రెండవది పండితులైన సీతారామాచార్యులు మొదలైన వారికి మార్గదర్శకాలైనవి. కనుక, క్రమంగా బ్రౌణ్యనిఘంటువు, శబ్దరత్నాకరం ఆంధ్ర వాచస్పత్యం, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు వావిళ్ల నిఘంటువు వెలువడ్డాయి.[2]

బ్రౌణ్య, శబ్దరత్నాకరాల నిర్మాణ కాలానికి నన్నెచోడుని కుమార సంభవం పాల్కురికి సోమనాథుని బసవపురాణం మున్నగు ఉద్గ్రంథాలు లభ్యం కానందున వాటిలో ఎన్నో పదాలు చేరలేక పోయాయి.

2. తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు, విల్లియం బ్రౌన్ పీఠిక.
3. తొలి తెలుగు నిఘంటు - మలి ముద్రణ, డాక్టర్ తిరుమల రామచంద్ర, ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం 19-4-53.

శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరము పీఠికలో ఇలా వ్రాశారు. '.... ముందు సంస్కృతమునందుఁ బద్య రూపములుగా నున్న నిఘంటువులన్నియు నిప్పుడు అకారాది క్రమమున వచన రూపములుగా నేర్పరుపబడియున్నవి. ఇంకను కొన్ని ఏర్పరుచ బడుచున్నవి. అట్లే యాంధ్ర ద్రవిడాది భాషల యందును గొన్ని యేర్పరుపబడి యున్నవి. అందు ద్రవిడాది భాషల కేర్పరుపబడినవేమో విద్యార్థుల ఉపయోగమునకు జాలు నంతటివి గాను, లక్ష్య విరుద్ధములుగాను నున్నవి. ఈ యాంధ్రమున కేర్పరుపబడి యుండు నొకటి రెండు నిఘంటువులన్ననో యట్లుకావు.

'కావున నీలోపంబుం బాప గొంతకాలంబునకు ముందు సంస్కృతాంధ్రముల యందు విశేష పాండిత్యంబు గలిగి యాసేతుహిమాచలము చాల ప్రసిద్ధి వహించి యుండిన పరవస్తు చిన్నయసూరిగారు జీవితులై యుండిన కాలంబున దీర్ఘసూత్రతతో ననేక గ్రంథ పరిశోధనంబు గావించి మిగుల విరివిగా ప్రయోగ సహితంబుగ అకారాది తెలుగు నిఘంటు వొకటి వ్రాయంబ్రారంభించి నడపుచుండిరి. ఆ మహాప్రారంభము జూచి యది పరిపూర్తి యగుటకు బహుకాలము చెల్లుననియు పరిపూర్తియయినను అందు దెనుగు పదములు మాత్రమే చేర్చబడి యుండుటం జేసి యది విద్యార్థుల కంతగా బ్రయోజనకారి కాజాల దనియు, ఇదిగాక బళ్లయందు జదివెడు విద్యార్థు లంత పెద్ద పుస్తకము గొనియుంచుకొనుట కష్టముగా నుండుననియు నూహించి సంస్కృతాంధ్ర భాషలయందు గొంత పరిశ్రమముగల నే నీయాంధ్ర భాష జదువ దొరకొను విద్యార్థుల సహాయార్థము, వారి యుపయోగమునకు జాలినంతటిదిగాను, లక్ష్యావిరుద్ధముగాను నుండునట్లు తెనుగు పదములతో గూడ తదపేక్షితము లైన సంస్కృత పదములను చేర్చి చిన్నదిగ అకారాది నిఘంటు వొకటి వ్రాసి శీఘ్రకాలముననే పూర్తిచేసెదగాక యని మిక్కిలి పూనికతో దీని వ్రాయ నుద్యమించితిని...

దీనిని బట్టిగూడ శబ్దరత్నాకరం ఎక్కువగా సాహిత్యదృష్టి కలదే ననటం స్పష్టం. ఆయన కాలానికి దక్షిణాంధ్ర వాఙ్మయంకూడ చాలావరకు వెలికి రాలేదు.

పిదప సూర్యరాయ నిఘంటువు ఈలోపాలను కొన్నిటిని తీర్చింది. తర్వాత 1950 ప్రాంతంలో వెలువడిన వావిళ్ళ నిఘంటువు తత్సమ శబ్దాల వివరణకు కూడ కవి ప్రయోగాలు విరివిగా ఉదాహరించడం, నవీన కవుల ప్రయోగాలను కూడ ప్రామాణికాలుగా పొందు పరచడం, నిత్యవ్యవహారంలో ఉన్న అన్యదేశ్యాలు ఇస్త్రిరి, వోటువంటి వాటిని జంకు కొంకులు లేకుండా ఇవ్వడం, మునుపటి నిఘంటువులు వదలిన పెక్కు పదాలను పొందుపరచడం మొదలయిన సత్సంప్రదాయాలతో ముందుకు సాగింది.

కాని, నిఘంటు పరిధి అతి విస్తృతం. భాషలోని ఏ మారుమూల పదమైనా దానిలో వుండవలసిందే. ఇక కావ్య ప్రాయాలయిన శాసనాల పదాల సంగతి వేరుగా చెప్పనవసరం లేదు. ఈ నిఘంటువులో దీర్ఘాసి శాసనంలోని ఇష్టపూర్తి వంటి పదాలు చేరి వుండవలసింది. అఖండదీపం (నిర్వచనోత్తర రామాయణం) అగస్త్యమంత్రం (నవనాథ చరిత్ర), అబిరాంశువు (నన్నెచోడ కుమార సంభవం), అడవి చిచ్చు (భారతం) అప్పాజి (ఆనంద రంగరాట్ఛందం), అరుసు (బసవ పురాణం), అసిత పక్షం (భీమేశ్వర పురాణం), అరగజం, ఇంద్రపదం (హంసవింశతి), ఉత్పిబం (పాండురంగ మాహాత్మ్యం), ఎల్లారు (హాలాస్య మాహాత్మ్యం), ఏకవాక్యం (మార్కండేయ పురాణం), ఏకాంగియుద్ధం (శివరాత్రి మాహాత్మ్యం), ఏమారమి (భారతం), చిరుత చౌకం (క్రీడాభిరామం), కరివంక బొమలు (హరవిలాసం), కన్న (ఉత్తర హరి వంశము), కుట్రమీల, కొత్తడి (బసవ పురాణం), కొత్త-స్త్రీ (బసవ), చట్టుతనం (కుమార సం.), కిరిడియ, కరడియ (ఒకధాన్యం) (కుమార), కాదలి-ప్రియురాలు (కుమార), రేకించు (కుమార), జల్లి-కావ్యదోషం, గట్టుబోయ, గొట్టుబోయ, కొట్టరువు, (బసవ పురాణం, పాండురంగ మాహాత్మ్యం), కందుబండ్లు-నల్లని పండ్లు (కుమార), కైదీవియ (కుమార), కొరనెల-చంద్రరేఖ (కుమార), కాపు - కుచ్చెళ్లు, కాసె (కుమార), గండబేటం=పురుషునికి పురుషునిపై కలిగే మోహం (కుమార), గిర్జు=గర్జించు (కుమార), గొడుగు కింది రూపు (కుమార), ఘనం పరచు (కుమార), చనుము=సమూహం, చనుమెత్తు, చరులు=చప్పట్లు, చిర్రని తిరుగు=తిరుగడంలో అనుకరణ ధ్వని, చిల్లతర్కం, చెప్పు=మాట, చేయుడు=



చేయడం, (అన్నీ కుమారసం.) కాటమరాజు కథలోని కాలావు=నల్లావు, కల్లుగా= చిత్తుగా, కంపటం=సైన్యం, కంపటీడు=సైనికుడు, కైతాళం, గుమ్మడిగింజలు, గుమ్మడిగింజలుగు=ఆయుధ విశేషాలు, గంటగాలం=నగ, చిత్తు చిత్తుగా, ఛప్పన్న, ఛత్తీస, గండముంగలి=కోటలో ఒక భాగం (ఉత్తర హరి) గొంత=పాములవాడు, శాపం, దుయ్యంకి, చాపడం (ఆముక్త మా.), జబురురొట్టు=గుప్పుమని వాసన కొట్టు (కర్పూరవీటి జబురు గొట్టుచు - ఆము.) ఇలాటి పదాలు, అన్నమాచార్యుల సంకీర్తనలలోని పదాలు ఎన్నో నిఘంటువులకు చేరలేదు[1].

ఇలాటి పదాలన్నిటినీ కొత్తగా ఏర్చి కూర్చనక్కరలేదు. కీ.శే. మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకర శాస్త్రి, గిడుగు రామమూర్తి పంతులు, తాపీ ధర్మారావు, నిడుదవోలు వేంకటరావు, బులుసు వేంకటరమణయ్య మున్నగు పలువురు పండితులు పెక్కు వ్యాసాలలో తెలియజేశారు.

ఇక పూర్వ నిఘంటుకారులు దేశ్య అన్యదేశ్యాల వింగడింపులో ఎంతో భ్రమకు పాలయ్యారు. ఈ వింగడింపు సుకరం కాదు. సజాతీయమైన కన్నడ, తమిళ పదాల మాట అలా వుండగా విజాతీయమైన పార్సీ అరబ్బీ పదాలు దేశిపదా లనే భ్రాంతి కలిగించే విధంగా తెలుగులో కలిసిపోయాయి. సి.పి. బ్రౌన్ తెలుగులో అన్యదేశ్యాల నిఘంటువును విడిగా కూర్చాడు. పూర్వపు నిఘంటువులనాటికన్న నేడు ఇలాంటి అన్యదేశ్యాలు తెలుసుకొనడానికి తగినన్ని అవకాశాలు ఎన్నో ఉన్నాయి. అయినా మన నిఘంటుకారులు కస్బా, కిమ్మతు, కిల్లా, కిస్సా, ఖరాబు, ఖాతరు, ఖామందు, ఖావింద్, ఖుషి, ఖూనీ, జరీ, జరతారు వంటి పదాలకు ఆకారాం పార్సీయో, అరబ్బీయో అనేది స్పష్టంగా తెలుపక హిందూస్థానీ అని ఇచ్చారు. ఈ పదాలన్నీ, హిందూస్థానీ, ఉరుదూ అని వ్యవహారంలో ఉన్న హిందీ భాషకు చెందినవి కూడా అన్య దేశ్యాలే. జలతారు అనే పదానికి ఉత్పత్తి జలకము+తారు అని కొన్ని

---

1. నిఘంటుకారుల బాధ్యత - తిరుమల రామచంద్ర, ఆంధ్రప్రభ సారస్వతానుబంధం, 2.2.52, కొత్తపదకోశం - డా॥ తిరుమల రామచంద్ర, ఆంధ్రప్రభ సారస్వతానుబంధం. 5.2.50

నిఘంటువులు ఇచ్చాయి. ఇది తప్పు. జర్+తార్=జలతారు అని వాస్తవమైన ఉత్పత్తి. జర్ అంటే బంగారు, ఇది ఫార్సీ పదం. తార్ - తీగ=బంగారు తీగ.

అన్యదేశ్యాల సంగతి అలా వుండగా సంస్కృత పదాల విషయంలోను మన నిఘంటుకారులు విస్తృత దృష్టిలో ప్రవర్తించలేదు. సంస్కృత పదాలు మన దేశంలోని వివిధ భాషలలో వివిధ రీతుల అర్థాలలో ఉన్నాయి. మన ఉపన్యాసం హిందీ, బెంగాలీలకు నవల, మన అవసరం తమిళులకు తొందర, మన కాదంబరి కన్నడులకు నవల. మన ప్రబంధం హిందీ వారికి ఏర్పాటు. మన నిబంధం హిందీ వారికి వ్యాసం. కనుక తెలుగు సాహిత్యంలోను, తెలుగు వారి వ్యవహారంలోను వున్న ప్రతి సంస్కృతపదమూ, అవసరమైతే ఇతర భాషలవారు వాడే అర్థాల మార్పుతో మన నిఘంటువులకు ఎక్కాలి. మన సాహిత్యంలోనే నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, నాచన సోముడు, కృష్ణదేవరాయలు వంటివారు ప్రయోగించిన సంస్కృత పదాలు నిఘంటువులలో పదిలం కావాలికదా! కడార పటుడు=పీతాంబరుడు (పాండురంగ), కౌసూధరుడు=శక్తి ధరుడు (పాండురంగ), కుటిలాలకి (కుమార), క్షుల్లకాశిక్యం=జోలె సంచి (పాండురంగ) గద=దుఃఖం (బసవ), గమకి=శ్రావ్యంగా పద్యాలు పఠించే వాడు (కుమార), గాంగేయ గర్భుడు=బ్రహ్మ (పాండురంగ), గరుడాండం=పచ్చరాయి (కుమార), గుడరసము=తేనెపాకం (కుమార), గోమిని=లక్ష్మి (కుమార), ఘటయోని=అగస్త్యుడు (కుమార), చంద్రగోళి=వెన్నెల (పాండురంగ), జయచూళి=వ్యూహవిశేషం (కుమార). జీరం=జిలకర (కుమార) జనాంతిక పదం=రహస్య ప్రదేశం, అంతఃపురం (పాండురంగ), కాంబవ=కంబు సంబంధి (ఆముక్త) చూత్కృతం, ఝూత్కృతం (ఆముక్త), ఇలాంటి వెన్నో చేరలేదు.

వాస్తవానికి నిఘంటు నిర్మాణం ఒకరి చేతిమీద జరగవలసిన పనికాదు. అది ఒక్క శబ్దరత్నాకరకారునికే చెల్లింది. ఇలాటి పనులు ఒంటి చేతిమీద నడవటంవల్ల సమగ్రత, ప్రామాణికత చేకూరవు. ఇంతకు ముందు చెప్పినట్లు వివిధ శాఖలలో నిష్ణాతులైన వారి సహకారం, తోడ్పాటు,రాజకీయ ప్రాబల్యం కారణంగా ఎప్పటికప్పుడు కొత్త పదాలు సృష్టిస్తున్న పత్రికల తోడ్పాటుకూడ నిఘంటునిర్మాణానికి అవసరమని

వేరుగా చెప్పనక్కరలేదు. ఈ భూమికతో వేంకటరావుగారి నిఘంటునిర్మాణ దక్షతను పరిశీలించడం అవసరం.

నిడుదవోలు వేంకటరావుగారు పట్టభద్రులైన పిదప అప్పటి ఇంపీరయల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో గుమాస్తాగా జీవిక ప్రారంభించారు. బ్యాంకు ఉక్కు కటకటాల వెనుక, ఉక్కు తెరల మధ్య పనిచేయడం సాహిత్యలుబ్ధులైన ఆయనకు ఎంతో విసుగు పుట్టించింది. ఆ విసుగుతోనే పన్నెండేళ్లు పనిచేశారు.

'పనియెన్ ద్వాదశహాయనంబుల పయిన్
షణ్మాసకాలంబు బ్యాం
కునకే దేహపుటస్థి చర్మముల రెం
డున్ ధారగా బోసి జీ
వనమున్ బుచ్చితి సేవజేసితి మనో
వాక్కాయ కర్మంబులన్
వినియోగించితి నాదు ధీపటిమ వ
న్నెందెచ్చు నెద్దానిలోన్'

అని ఆ విసుగులోను ఆత్మవిశ్వాసం ప్రకటించారు. ఆ తరుణంలో పిఠాపురం రాజాగారితో ఆయనకు పరిచయం కలుగడం, శ్రీసూర్య రాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పండితుడుగా నియమితులు కావడం యాదృచ్ఛికంగా జరిగింది. దానిని ఆయన అరమరికలు లేకుండానే ఈ విధంగా వర్ణించారు. "నలుబదేండ్ల నాటి ముచ్చట. నా జీవితమున కొక మలుపు నా సాహిత్యమున కొక వెలుగు నిలిపినది. పుష్కరకాలము బ్యాంకు గుమాస్తాగా పనిచేయు కాలములో హఠాత్తుగా ఒకనాడు ఆంధ్రభోజులు పిఠాపురం మహారాజావారు వర్తమాన మంపగా వారిని దర్శించుటకు వెళ్లినాను. అపర కృష్ణరాయలైన ఆయనకు ఆముక్తమాల్యద పద్యము 'ఖనటత్పయోబ్ధి వీక్ష రాసాతలాన్యోన్య పిండీకృతాంగ భీతాండజములు' తో ఆశీర్వదించినాను. 'మీరు చదివిన పద్యములో చటులఝంపా

అనియున్నది. ఝుంపా శబ్దమున కర్థమేమి?' అని ప్రశ్నించినారు. నేను వెంటనే 'ఇంగ్లీషులో 'జంప్' అను మాటయే దాని కర్థము' అన్నాను. 'తెలుగు మాటకు ఇంగ్లీషు అర్థమా?' అన్నారు. అంతటితో వదలలేదు. ఆ పద్యానికి అర్థము చెప్పుమన్నారు. ఆ ముక్త మాల్యద పద్యాలు ఇనుప గుగ్గిళ్లు. నన్ను పరీక్షించుటకు అడిగినా రేమో నాకు తెలియదు. పదార్థము వివరముగా విశేషములతో విన్పించినాను. మహారాజా వారు 'మేము నన్నెచోడుని కుమార సంభవము చదువుచున్నాము. కాని, అది కాళిదాసు కృతి కంటే భిన్నముగా ఉన్నదే, కారణమేమి?' అన్నారు. 'కాళిదాసుని కుమారసంభవము కావ్యదృష్టితో పరాంకోటి కెక్కినది. కాని, నన్నెచోడుని కృతియందు కావ్యదృష్టితోపాటు వీరశైవ సంప్రదాయిక మగు ఆధ్యాత్మిక మత విషయాలు నిండియున్నవి' అని బదులు చెప్పినాను. వారు 'ఇదియేమి? కేవలము రసవిషయకమగు కావ్యమున మత సంప్రదాయ ప్రవేశమెట్లు?' అని ప్రశ్నించినారు. నేను 'రాయలవారు రసైకమగు గోదా శ్రీరంగ నాయకుల ఉదంతమున విశిష్టాద్వైత మత సంప్రదాయమును నిబంధించియున్నారు గదా?' అన్నాను. ఇంతలో ఆస్థానకవి ఓలేటి వేంకటశాస్త్రిగారు వచ్చినారు. 'డబ్బాటు అనే పదమునకు ప్రయోగమున్నదా?' అని రాజావా రడిగినారు. వారు స్ఫురణలో లేదన్నారు. నేను వెంటనే అప్పటికి ఇరువదేండ్ల క్రిందటవారు రచించిన పద్యమును జదివి ప్రయోగము తెలిపినాను. పదినిమిషము లనుజ్ఞ గొని వచ్చిన నేను వారితో పన్నెండు పదుల నిమిషములు (రెండు గంటలు) గడపినాను. అవే నా జీవితములో అమృత ఘడియలు. ఆనాడే వారు నన్ను అంకెల నుండి తప్పించి అక్షరములలో ప్రవేశ పెట్టవలె నని తీర్మానించుకున్నారు. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితునిగా నియమించినారు. పిఠాపురం రాజావారు నాకు నిత్య స్మరణీయులు[1].

అప్పుడే, అదే వేంకటరావుగారి జీవితంలో మలుపు, ఆయనే అన్నట్లు ఆయన సాహిత్యంలో వెలుగు నింపింది. ఆ ఆనందం అగ్గలం కాగా ఆయన

1. మూడు వాఙ్మయ శిఖరాలు - డా॥ తిరుమల రామచంద్ర, పు.106

'అంకెల బారులంబడి యహర్నిశ
మిట్టటు గొట్టుకొంచు నే
వంకయు బుద్ధికి న్నెడ రవంతయు
లేకను సాహితీ రసం
బింకగ నున్న వేళ నను నెంతయు
బ్రీతిః దెలుంగువారి ది
వ్యాంకమునందు నిల్పిన మహాప్రభు
నెన్నెద సూర్యరాయనిన్"

అని పిఠాపురం రాజావారిని స్తుతించారు[1].

వేంకటరావుగారు సూర్యారాయాంధ్ర నిఘంటువు కార్యాలయంలో చేరిన తర్వాత చేతి నిండా పని, నోటినిండా పని, మెదడు నిండా పని దొరికింది. ఆయన ధారణాశక్తికి నిఘంటు ప్రధాన సంపాదకులైన జయంతి రామయ్య పంతులుగారు, పండితులు వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు మున్నగువారు విస్తుపోయేవారు. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుందన్న సామెతగా ఒక పదం సంగతి ప్రస్తావనకు వస్తే నన్నయ మొదలు నవీన కవులదాకా అన్ని గ్రంథాలలోని ఆపద ప్రయోగ సరళి నిర్ఝరపాతంగా మనపై పడవలసిందే, ఝంఝూమారుతంగా మనపై వీచవలసిందే. అందుకనే ఎవరో (విశ్వనాథ సత్యనారాయణ గారు కాబోలు) ఈయనకు 'ప్రయోగ మూషిక మార్జాల' అనే బిరుదం ప్రసాదించారు. సూర్యరాయాంధ్ర నిఘంటువులో అసమగ్రమైన మూడవ సంపుటి సమాప్తి కావడం, నాల్గవ సంపుటి సిద్ధం కావడం ఈయన నిఘంటు కార్యాలయంలో ఉన్నప్పుడు జరిగిన కృషి. తెలుగు భాషలో ఏమూల ఏ పదం ఉందో చూపగల జగా దీవిటీ ఈయన.

ధారణా శక్తికి తోడుగా సూర్య రాయంధ్ర నిఘంటు కార్యాలయానుభవం, నిరంతర పరిశ్రమ పరిశీలనలతో ఈయన ఏ తెలుగుకోశంలోను చేరని పదివేల

1. మూడు వాఙ్మయ శిఖరాలు - డా॥ తిరుమల రామచంద్ర, పు.107

పదాలను కార్డులపై ఎక్కించి ఉంచారు. ఉదాహరణకు ఒక కార్డు వివరణ: ఒరవడి- ఇది తప్పు వరువడి, వఱువడి, వరివడి సరైన రూపాలు. తమిళంలో వరివళివు, వరివు. కన్నడంలో బరదెదొడ, వరవది. మలయాళంలో బరిముళి. వడి పాళీలో ఉంది. "ప్రతి పదానికీ ప్రయోగము చూపి ప్రామాణికమైన గొప్ప నిఘంటువును- అదిన్నీ అనుకూల సాధన సహాయ సంపత్తి లభించిన ఒకే సంపుటమున పదునైదు వందలు లేక రెండు వేల పుటలతో రచించి ఆంధ్రమహాజనులకు అందజేయగలను' అని వేంకటరావుగారు నాతో 1961 జనవరిలో అన్నారు. అనంతరం శబ్దరత్నాకరం సంస్కరించి తాము సిద్ధపరచిన అనుబంధం చేర్చారు. దానిని మద్రాసు స్కూలుబుక్ అండ్ లిటరేచర్ సొసైటీ వారు ప్రచురించారు. 1975లో వారిని కలుసు కొన్నప్పుడు 'దానిని మరీ సంస్కరించాను. 35 వేల పదాలతో నా ప్రతిజ్ఞమేరకు సిద్ధపరచాను', అన్నారు[1].

శబ్దరత్నాకరానికి అనుబంధమైన పట్టికలో దాదాపు 2500 పదాలు పున్నాయి. వేంకటరావుగారు అనుబంధ పీఠికలో ఈ విధంగా తమ నిఘంటు నిర్మాణ పద్ధతిని తెలియజేశారు. 'శబ్దరత్నాకరము ముద్రితమైన నాటికి, నేటికి భాషావాఙ్మయ చరిత్ర యందు విశేషముగ పరిశ్రమ జరిగి యనేక నూతన విషయములు వ్యక్తమగుట చేతను, మూల గ్రంధము నందును సంస్కారము చాలగా నావశ్యకమగుట చేతను గ్రంథ ప్రకటనాధినేతలే దీనికొక ' అనుబంధము' గూడ చేర్చుటకు నిర్ణయించిరి. ఆ అనుబంధ రచనమునకే గాక మూల గ్రంథమును సవరించుటకును నన్ను వారు నియమించిరి. పై సంస్థవారి యాదేశానుసారమున నేను ఈ గ్రంథమునకు సవరణలు, వివరణలు అను నొక శీర్షికను,అనుబంధమును జేర్చితిని. ఈ రచనమున నే నేర్పరచు కొనిన విధాన మీక్రింద వివరించుచున్నాను:

1. పూర్వ నిఘంటువులయందు అన్నింటియందు తెలుగు భాషా భేదములు అకారాదిగా నొకేవర్గము కింద పరిగణితము లైనవి.

   అనుబంధమునందు తత్సమములు, తత్సమాంధ్ర మిశ్రపదములు, తద్భవదేశ్యపదములు, అన్యదేశ్యములు అను నాలుగు వర్గములుగా

1. మూడు వాఙ్మయ శిఖరాలు - డా॥ తిరుమల రామచంద్ర - పు.139

విభాగింపబడినవి. దీనివలన తెలుగు భాష వ్యుత్పత్తి, వికాసము, పరిణామ క్రమము తెలియుట కవకాశము కలుగును.

2. తెలుగు భాషలో సంస్కృత పదములు నాల్గింటిలో మూడు పాళ్లున్నవి. అందును పూర్వకవులు విశేషముగా సంస్కృతము నుపయోగించిన వారే. తెలుగున నధికముగా గన్పట్టు నీ సంస్కృత పదములను సూర్యరాయాంధ్ర నిఘంటుకారులు తెలుగు గ్రంథముల నుండి సంగ్రహింపక సంస్కృత నిఘంటువుల నుండి యధామాతృకముగా గ్రహించిరి. గ్రహించిన వానికి ప్రయోగములు లేవు. ఈ పద్ధతి ననుసరించిన మన నిఘంటువులు తత్సమ నిఘంటువు లనిపించుకొనునే గాని తెలుగు నిఘంటువులు కాజాలవు. అనుబంధమున ప్రతి తత్సమ శబ్దమునకు నాంధ్రకవి ప్రయోగ మీయబడినది.

3. దేశి పదములకు సజాతీయములైన తమిళ, కన్నడ పదములు చూపబడినవి.

4. అన్యదేశ్యములలో అరబ్బీ పార్సీ తురుష్క భాషాపదములు వేరుగాను, ఇంగ్లీషు పదములు వేరుగాను చూపబడినవి. శబ్దరత్నాకర ప్రధమ ముద్రణమున (1885) ఇంగ్లీషు పదములు లేవు. తర్వాతి ముద్రణములలో అవి చేర్చబడినవి.

5. ప్రతి పదముయొక్క ఆకారమును దెలిపితిని.

6. కేవల పద్యకృతులేకాక వచన రచనల నుండియు, శాసనముల నుండియు పదములను గ్రహించితిని.

శబ్దరత్నాకర మూలమును సంస్కరించుటలో నేను ముద్రణాది దోషములను దిద్దుటయేగాక కొన్నింటికి సవరణ వివరణలు చేర్చితిని. ఈ భాగము పరిశీలించిన యొక్కొక్క పదమును గూర్చి మనమెంత దీర్ఘ పరిశ్రమ చేయవలెనో తెలియగలదు. ఇక సంపూర్ణ సంస్కారము చేయుట యన్న తిరిగి ఆ పేరుతో నొక కొత్త నిఘంటువు రచించుట శ్రేయస్కరము[2].

2. శబ్దరత్నాకరము అనుబంధము పీఠిక, పు. 121, 122 (మార్చి 1959)



## సవరణలు - వివరణలు

ఈ శీర్షిక క్రింద చేర్చిన అంశాలలో వేంకటరావుగారు పుటల వారీగా శబ్దరత్నాకరం పరిశీలించి, తత్కర్త వదలిన ప్రయోగాలను, పదాలను, అర్థవిశేషాలను పొందుపరచారు. కొన్నిటిని పేర్కొనడం అవసరం.

'అ' అనే అక్షరానికి బ్రహ్మ, శివుడు, విష్ణువు, వాయువు అనే అర్థాలను సూర్యరాయాంధ్ర నిఘంటువు ఇచ్చి, దీనికి 'తెనుగున వ్యస్త ప్రయోగము లేదు' అని వ్రాసిన దానిని వేంకటరావుగారు పేర్కొని 'కాని అ అనువర్ణమునకీ యర్థము వచ్చునట్లుగా తంజావూరు రఘునాథ నాయకుడు వాల్మీకి చరిత్రలో నిట్లు వ్రాసియున్నాడు.

*ఎత్తుగీతి.* *నిఖిల జగ దింద్రజాలంబు నెఱపు మాయి*
*అచ్చులకు నెల్ల మొదలి యచ్చైన వ్రాయి*
*కొలుచు వారలపాలిటి తలపు రాయి*
*రావణానుజ దాయి శ్రీ రంగశాయి*

***2.24***

అచ్చులకు నెల్ల మొదటి యచ్చు అయిన వ్రాయు ఆకారము. ఇచ్చట ప్రస్తుతుడయినవాడ శ్రీరంగశాయి విష్ణువే కావున అ విష్ణువు అని యర్థము చెప్పవచ్చును." అని వ్యాఖ్యానించారు. సంస్కృతంలాగ విడిగా అకార ప్రయోగం లేకపోయినా భంగ్యంతరంగా అకారం ప్రయుక్తమైందని చెప్పడానికి ప్రయోగ బలం చూపించారు.

అక్షిగతుడు అనే పదానికి శ.ర. పగగొనదగినవాడు అని అర్థం మాత్రం ఇచ్చింది. ప్రయోగం ఇయ్యలేదు. వేంకటరావుగారు "గీ...... అక్షిగతుడైన ఇనుని జూచి పద్మిని ముడించె నెమ్మోము' అనే వసుచరిత్ర (ఆ.3) ప్రయోగమిచ్చారు.

అక్షౌహిణికి శ.ర. అర్థం మాత్రం చెప్పింది. ప్రయోగం ఇయ్యలేదు. అక్షోహిణి అనే రూపాంతరం కూడ చూపలేదు. వేంకటరావుగారు -

సందడింపుచు దశాక్షౌహిణీ సైన్యంబు
లని శంబు గొలగొల మనుచు నుండె
జైమి. భార 1.76

కూరిమి వెలయ నక్షోహిణిపై కొంత'
భార. ద్రోణ 4.139

అని రెండు రూపాలకు ప్రయోగా లిచ్చారు.

వేంకటరావుగారు అన్నట్లు మన నిఘంటుకారులు తెలుగు ప్రబంధాలలోని సంస్కృత పదాలు తీసుకోక సంస్కృత నిఘంటువుల నుండే గ్రహించడంవల్ల, తెలుగు కావ్యాలలోని సంస్కృత పదాలు నిఘంటువులలోకి ఎక్కలేదు. రావుగారు శ.ర. వదలిన అతివర్తించు, అతీవ, అత్యనఘ చరిత్రుడు, అత్యనభిజ్ఞుడు, అత్యాచారము వంటి పదాలు పొందుపరచి ప్రయోగా లిచ్చారు.

అడిత్రాగుడు=అడిగి+త్రాగుట అని శ.ర. అర్థం చెప్పింది. అది సరికాదని రావుగారు చెబుతూ సంస్కృతంలో ఉన్న అతి అనే ఉపసర్గతద్భవాలై దేశ్యధాతువులతో కలిసి దేశ్యంగా పరిగణించ బడిం దని ఆంధ్ర భాషా చరిత్ర (పు.126)లో వ్రాయబడింది, గనుక అడ్డిత్రాగుడుకు అతి తృష్ణామూలమై వుంటుందని నీరులేమి, కరువు అని అర్థమని నిరూపించారు.

ఆటతోట అనే పదానికి శ.ర. ఉద్యానవనమనే అర్థమిచ్చి

'నీవును వాలియు నేడును నాడును
నయముతో బాలించు నాటతోట'
భార. అర.7

అని ప్రయోగం చూపింది. సూ.రా.

'నీవును వాలియు నేడునాడు ప్రి
యంబున బాటించు నాకతోట'
భార. అర. 7.9

అని ఆటతోటకు మారు ఆకతోట అని ఉదాహరించింది.

రావుగారు ఈ రెండింటిని చర్చించి వ్రాతప్రతులలో

'నీవును వావియు నేండును వాండును
బ్రియమునం బాలించు పెద్దతోట'

అని ఉందని, ఇది మూలానుసరణ మని మూల శ్లోక భాగం ఉదాహరించారు.

'రక్షితం వావినా యత్తత్ స్ఫీతం మధు వనం మహత్' మూలంలో స్ఫీతం అని ఉంది గనుక పెద్దతోట అనే పాఠమే సరైనదని, దానిలో శ.ర. ఉదాహరించిన దానిలోని అఖండయతి దోషం కనిపించ దని వివరించారు.

ఆరగింపు అనే పదానికి శ.ర. ఆహారము అనే అర్థము, పరమయోగి విలాసంలోని పద్యం ఉదాహరించి చివర 'ఇంప్వంతము ప్రాచీన కవి సమ్మతము గాదు' అని వ్యాఖ్యానించింది. రావుగారు దీనిని కాదంటూ

'అగ్గలింపు సందడి నూష్మ జనింప'
భా. ఆశ్వ. 43
'అందంద వక్షోరుహంబు వేధింపులు'
కాశీ. 4.18. (వ్రాతప్రతి)

కోపగింపు - కోపించుట - కా. వ్యా 8 ఉ
సొళగింపు - పాండు 3.43
నుగ్గడింపు - ఆం.భా 1.130
తల్లడింపు - ఆం.భా 1.133
ఆరగింపు - ఆం.భా 2.160

అని తిరుగులేని ప్రాచీన కవుల ఉదాహరణ లిచ్చారు.

ఎసగు అనే పదాన్ని శ.ర., సూ.ని. ఎసఁగు అని సార్థబిందుకంగా గ్రహించాయి. కాని, ప్రాచీన ప్రయోగాలలోగాని, శాసనాలలోగాని ఇది సార్ధబిందుకంగా లేదు. దీనికి

ఎసవు అనే రూపం ఉండడం వల్ల ఇది సార్ధబిందుకం కాదు. ఈ విషయాన్ని రావుగారు విపులంగా చర్చించి 1935 (భారతి - యువ, మార్గశిరం)లో తిరుమల రామచంద్రగారు ఎసగు ఒసగులపై వ్రాసిన వ్యాసాన్ని ఉదాహరించారు. ఎసగు - ఒసగులలో అర్ధబిందువు ఉందని భ్రమపడడానికి కారణం పొసఁగులో మొదటి నుంచి అర్ధబిందువు ఉండడం కావచ్చని తత్సాదృశ్యంతో ఎసగు ఒసగుల లోను అర్ధబిందువు వుందని అనుకొని భారత కవులు కూడ ఖండాఖండ ప్రాసవాడారాని కొత్త వాదం లేవదీశారని, అది సరికాదని తిరుమల రామచంద్రగారు ఆ వ్యాసంలో నిర్ధారించారు.

'ఓ' అక్షర ఆరోపంలో రావుగారు ఈ తెలుగు వ్యాకరణము లందు సంబోధనమున 'ఓ' వచ్చునని చిన్నయసూరి 'ఓయా మంత్రణంబునం దగు' అని ఆంధ్రశబ్దచింతామణిని బట్టి సూత్రించినాడని, కాని, నన్నయ భారత భాగము నం దెచ్చటను సంబోధనమున 'ఓ' ప్రత్యయం రాలేదని స్పష్టపరచారు. ఆ సందర్భంలోనే అవతో ప్రారంభమయ్యే తత్సమపదాలు తెలుగులో తద్భవాలయినప్పుడు 'ఓ' తో ప్రారంభమవుతా యని పెక్కు ఉదాహరణలిచ్చారు.

అవఘటించు - ఓహటించు

అవలోకము - ఓలగము

అపసరిల్లు - అవసరిల్లు - ఓసరిల్లు

అవసరక - ఓసరి

అవఘట్టన - ఓహరి

సంఘట్టన - సాహరి

అహోబలుడు - ఓబళుడు.

ఈ తద్భవాలు సరాసరి సంస్కృతం నుంచి తెలుగులోకి రాలేదని, ప్రాకృతం ద్వారా వచ్చాయని అపసర - అవసర - ఓసర - ఓసరిల్లు అయిందని తిరుమల రామచంద్రగారు అంటున్నారు. నిజానికి మన తద్భవాలన్నీ ఎక్కువగా ప్రాకృతం నుంచే వచ్చాయని వారి వాదం[1].

1. తెలుగు ప్రాకృతాల పరస్పర సంబంధం - తెలుగు పత్రిక, నవంబరు 1990.

కలుహారము - కలహారము - కల్హారము అనే శబ్దాలపై రావుగారు అత్యంత విపుల చర్చ జరిపారు. శ.ర. కల్హార రూపము మాత్రమే గ్రహించింది. రావుగారు నన్నిచోడుని కుమార సంభవం మొదలు తర్వాతి పలువురు కవులు కలుహార, కలహార అనే ప్రయోగాలు చేశారని పెక్కు ఉదాహరణ లిచ్చారు.

వహ్నిర్వహ్నీతి కహ్లారం కల్హార మభిధీయతే
బ్రహ్మబమ్హామతస్తేషాం స్థితిరూర్ధ్వమితీదృశీ

అని ప్రాకృత మంజరి వీటి ఉచ్చారణ విషయమై చేసిన నిర్ణయాన్ని ఉదాహరించి, కలుహార, కలహార శబ్దాలు సాధువులని సిద్ధాంతీకరించారు.

కూతురు పదానికి శ.ర. కొమార్త, పుత్రిక అని అర్థాలు ఇచ్చిందేకాని కూఁతురులో అరసున్నకు ప్రమాణం చూపలేదు. రావుగారు 'ఈశబ్దము తొలుత ఆడశిశువు అను అర్థమున నుండి, యా వెనుక పుత్రిక అనునర్థమున వాడుక లోనికి వచ్చినది. ఈ శబ్దమున నర్ధబిందువున్న దనుటకు నీ క్రింది ప్రయోగము ప్రమాణము.

నిజభుజ ప్రధాని బెజయిత దేవని
కూఁతు సరియే పోల్పం గాంతలందు

ద్రాక్షారామ శాసనము. సోమలదేవి శాసనము. క్రీస్తు శకం 1065 తె.క.చ.పుట 164) పై పద్యము ద్రాక్షారామ దేవాలయమున శిలాశాసనమున నున్నది. అని కూఁతు - కాంత అని ప్రాసయతిలోని ప్రయోగం చూపారు.

గజస్నానం అనేపదం సోమనాథుడు బద్దెన, భాస్కరుడు, నారాయణ శతకకారుడు మొదలైన వారు ప్రయోగించారు. కాని, శ.ర.గ్రహించలేదు. రావుగారు గజస్నాన శబ్దాన్ని సూచించి పెక్కు ఉదాహరణ లిచ్చారు.

'... పలు తీర్థములను
మునుగు జలస్నానములు వేన వేలు

మొనయు భూతిస్నానమున కెనగామి
పూని భూతిస్నాన హీనుండు సేయు
స్నానంబు లవి గజస్నానంబు లగుట'.

(పండిత. దీక్షా ప్రక.పు.164)

పెక్కు తీర్థాలలో చేసే జలస్నానాలు ఎన్నివేలయినా భూతిస్నానంలో సమానం కాదు గనుక భూతి స్నానం చేయనివాని స్నానాలన్నీ గజస్నానం వంటివి అని పై ద్విపదల అర్థం. ఏనుగు మడుగులో దిగి తొండంతో నీళ్లు పీల్చి ఒంటిమీద పోసుకుంటుంది. జలక్రీడలాడుతుంది. కాని గట్టెక్కి తర్వాత తొండంతో దుమ్ము కొట్టుకుంటుంది. కనుక గజస్నానం వ్యర్థం. రావుగారు దీనికి కులశేఖరాళ్వార్ల ముకుందమాల లోని గజస్నాన ప్రయోగం గల శ్లోకాన్ని, కువలయానందంలోని శ్లోకాన్ని ఉదాహరించారు.

'ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం
వేదవ్రతా న్యన్వహమ్
వేదశ్ఛేద ఫలాని పూర్త విధయః
సర్వేహుతం భస్మని
తీర్థానా మవగాహనాని చ గజ
స్నానం వినాయత్పద
ద్వంద్వాంభోరుహ సంస్మృతి ర్విజయతే
దేవ స్సనారాయణః'

భగవంతుడైన నారాయణుని పాదపంకజ ద్వయాన్ని స్మరించినవాడు చేసే వేదాధ్యయనం అరణ్యరోదనం, ప్రతిదినం చేసే వేదోక్త వ్రతానుష్ఠానం ఒంటిలోని కొవ్వును కరిగించేది మాత్రమే. శుభాలకోసం చేసే ఇష్టాపూర్తాది హోమాలు బూడిదలో హోమం వంటివి, తీర్థాలలో మునగడ గజస్నానం వంటిది, అని దీని తాత్పర్యం.

గాసట బీసలు అనే పదానికి శ.ర. సలక్షణము కాని చదువు అనే అర్థం చెప్పి, గాసట బీసటే చదివి గాథలు త్రవ్వు తెనుంగు వారికిన్ (నర.ఆ)అనే ఎర్రాప్రగడ ప్రయోగం ఇచ్చింది. రావుగారు ఈ అర్థం సరిగాదని నిరూపించారు. గాసట - అనగా గాధాసప్తశతి. బీసట అనగా భేతాళ పంచవింశతి. ఇవి రెండూ ప్రాకృత కావ్యాలు. కేవలము కథలు జాతీయ జీవితము ప్రధానముగా గలవి, ఆధ్యాత్మిక దృష్టిలేనివి కావున గాసట బీసట యనగా ఆధ్యాత్మిక దృష్టిలేని చదువు అని అర్థము. ఈ పదము ఎఱ్ఱాప్రగడయే గాక విన్నకోట పెద్దన కావ్యలంకార చూడామణిలో ప్రయోగించి యున్నాడు.

*ఈసడములు గోరడములు*
*గాసట బీసటలు నైన కట్టడిపలుకుల్*
*భాసిల్లు గ్రామ్యములు నా*
*హాస్యోక్తులు దెగడుచోట నదియును నొప్పున్*

గాసరబీసరలు అని ముద్రణము. 9-20 గాసట బీసట అను పదము వ్యుత్పత్తి మరుగు పడుట చేత కవులు ఈ పదమును అర్థముగానిమాటక్రింద జేర్చిరి. పై ఎర్రన ప్రయోగములోని గాథలు త్రవ్వు అను పదములోని గాథలు కథలుగాథలు కావు. గాధియనువది ప్రాకృతములో ఛందోవిశేషము. గాథాసప్తశతి ఆ ఛందస్సులో వ్రాయబడినది. ప్రాకృతభాష మాటలాడు ప్రాచీననాంధ్రులకు పై రెండు గ్రంథములే వాఙ్మయము.

చాఱును గురించి రావుగారు చాల చర్చ చేశారు. చాఱులోని ఱు శకటరేఫమా, సాధారణ రేఫమా అని చర్చ సుదీర్ఘంగా సాగింది. తమిళ, కన్నడ భాషలలో చాఱు అని శకట రేఫంతోనే ఉంది గనుక ఇది దేశ్యపదమనే నిర్ణయించారు. కాని, సాధారణ రేఫగల చారు కూడ వుంది. ఇది ప్రాకృతం నుండి వచ్చింది. సారః సారో - సారు - చారు. కన్నడంలో సారు నిత్యవ్యవహారంలో ఉంది. కనుక చారు, చాఱు రెండు రూపాలు ఉన్నాయి[1].

1. నుడి - నానుడి, డా॥ తిరుమల రామచంద్ర, పు.73,74,75

జాజర ఒక గీత విశేషం. జాజర పాటలు అన్నమాచార్యుల కీర్తనలలో ఉన్నాయి. కాని, శ.ర. జాజర అన్న పదానికి వంచన అనే అర్థం చెప్పింది. జాజర జాదురంబు అనే పదం గ్రహించి మిక్కిలి చాతుర్యము అనే అర్థం చెప్పి శ్రీనాథుని భీమేశ్వరపురాణం లోని

జాదుర జాదరంబు మృదుచర్చరిగీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకముల జంద్రిక కాయగ దక్షవాటికా
వేదుల మీదటన్ గనక వీణలు మీటుచు బాడి రచ్చరల్
మోద మెలర్పగా భువన మోహన విగ్రహు భీమనాథనిన్
(5-102)

అనే పద్యాన్ని ఉదాహరించింది. కాని, తిమ్మకవి సర్వ లక్షణసార సంగ్రహంలో వీధీ శబ్దం వీది అవుతుందన డానికి ఈ పద్యాన్నీ క్రింది విధంగా ఉదాహరించాడు.

'జాదుర జాదురంచు మృదు చర్చరిగీతులు వారుణీరసా
స్వాద మదాతిరేకమున జంద్రిక గాయగ దక్షవాటిలో
వీదుల వీదులం గనక వీణలు మీటుచు పాడి రచ్చరల్
మోద మెలర్పగా భువనమోహన విగ్రహు భీమనాథునిన్

దీనిని రావుగారు వివరిస్తూ 'జాదుర జాదుర' అనునది అనునొక విధమగు పల్లవి, దీనికి జాదర, జాజర, జజ్జర, జాజర, జజ్జర రూపాంతరాలు, ఇవి పల్లవిగా గలపాటలు అని అర్థము, కావున 'జాదుర జాదురంచు' అను పాఠమే సరియయినది', అని నిర్ధారించారు. జాజర చర్చరీ పద భవం[1].

సంస్కృతంలో దంభ, డంబ శబ్దాలే ఉన్నాయి. గాని ఢంభ, ఢంబ అనే పదాలు లేవు. కాని పాల్కురికి సోమనాథుడు వృషాధిప శతకంలో

---

1. తెలుగు మెఱుగులు - వేటూరి ప్రభాకరశాస్త్రి గారు.



'ఢంభ మయాన్య దర్శన విడంబను డష్టమదాపహారియా
శుంభదుదారకీర్తి....' ప.84

అని ప్రయోగించినాడు. దీనిని దంభమని దిద్దడానికి వీలులేదు. డష్టమదాపహారి అని యతివేశాడు గనుక డంభ శుంభ అని ప్రాసలో వుంది. దీనిని బట్టే కావ్యాలంకార చూడామణి 'ఢంభలాంఛనకోలఢాలునకును' (7.37) అని ప్రయోగించాడు. అన్నమాచార్యులు ఆధ్యాత్మకీర్తనలలో సంస్కృతంలోవున్న ఒకకీర్తనంలో 'కింభాషసేఢాంభికతయా' అని ప్రయోగించాడు. సంస్కృతంలో లేకపోయినా తెలుగు కవులు వాడారు గనుక ఈ డంభ, ఢంభ పదాలు కోశాలకు ఎక్కాలంటారు రావుగారు.

దమన పున్నమ అనే పదం శ.ర.లో లేదు. ఈ పదం సోమనాథుడు పండితారాధ్యచరిత్రలో ప్రయోగించాడని, 13వ శతాబ్ది శాసనాలలోను ఉందని, శ్రీశైల మల్లికార్జున స్వామికి దవనం సమర్పించే దినం అయినందున దీనికి దవన పున్నమ అని వ్యవహారం వచ్చిందని, ఇది నిఘంటువులలో చేరాలని సూచించారు. ఈపదం క్రీడాభిరామంలోను ఉంది.

దవన పున్నమ కాకుళాధ్యక్షు డైన
తెలుగు రాయుడు దేవతాధీశ్వరుండు
(పు.65)

దీని పీఠికలో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'కథాపాత్రమగు మంచెనశర్మ శ్రీకాకుళాంధ్ర నాయక స్వామికి వైశాఖ పూర్ణిమనాడు జరుగు దవనోత్సవము నాటి శృంగార విహార విశేషముల జెప్పినాడు' అని వ్రాసినదానికి ప్రమాణం కావాలని వ్రాశారు రావుగారు. చైత్రశుద్ధ పూర్ణిమే దవనోత్సవమని రావుగారి అభిప్రాయం.

కాని, మద్రాసు తిరువల్లిక్కేణిలో దవనోత్సవ బంగళా అని ఒక భవనావరణం ఉంది. అక్కడికి శ్రీపార్థ సారధిస్వామి వైశాఖ శుద్ధ పూర్ణమినాడు వేంచేస్తారు. దవనోత్సవం శైవదేవాలయాలలోనే కాదు, వైష్ణవ దేవాలయాలలోనే జరుగుతుంది. మద్రాసులో వైశాఖంలో జరుగుతుంది. బహుశా ఇది పూర్ణిమాంత మాస పరిగణనతో చైత్రపూర్ణిమనాడూ, వైశాఖ పూర్ణిమనాడూ జరిగేదని తోస్తుంది. కనుక ప్రభాకర శాస్త్రిగారు వ్రాసింది సరైనదే నని భావించవచ్చు.

శ.ర. వదలిన నూలిపున్నమ (శ్రావణపౌర్ణిమ), పెరుగు వడ్లు, ముష్టాముష్టి యవ్వనం, సమూహి (సమూహం), సరము (సరస్సు), సౌదామిని, హల్లో హలము మొదలయిన పదాలు చేరాలని సూచిస్తూ పెక్కు ప్రయోగాలు ఉదాహరించారు.

తెలుగుకవులు వాడిన సంస్కృతపదాలు తెలుగు నిఘంటువులకు ఎక్కాలని, కొన్ని తెలుగు పదాలుకూడ ఎక్కాలని ఈ సవరణలు - వివరణల ప్రధానోద్దేశం.

సవరణలు - వివరణల అనుబంధంలో వేంకటరావుగారు చేర్చని పదాలు సుమారు రెండు వేలదాకా ఉంటాయి. అవి కార్డులు మీద చక్కని వ్రాతతో ఉన్నాయి.

శ.ర. పూర్తిగా సంస్కరించవలసిన నిఘంటువు. గిడుగు రామ్మూర్తి పంతులుగారు శ.ర. లోని వేలకొలది తప్పులను తమ ప్రతిలో పెన్సిల్‌తో దిద్ది పెట్టుకున్నారు. దానిని కూడా వేంకటరావుగారు పరిగణనలోకి తీసుకున్నారు.

## శబ్దరత్నాకరం - అనుబంధం

ఈ అనుబంధంలో నాలుగు పరిచ్ఛేదాలున్నాయి. 1. తత్సమ పదములు, 2. సంస్కృ తాంధ్ర మిశ్రమ పదములు, తత్సమ పద రూపాంతరములు, 3. తద్భవదేశ్యపదములు, 4. అన్యదేశ్యములు . ఈనాలుగు పరిచ్ఛేదాలలోను మొత్తం దాదాపు 2500 ప్రయోగ పూర్వకంగా చేర్చారు.

1. తత్సమ పదములు - అనే పరిచ్ఛేదంలో శబ్ద రత్నాకరాదులు ప్రయోగ రహితంగా గ్రహించినవాటికి ప్రయోగాలు అర్థభేదాలు చూపడమేగాక అవి వదలిన తెలుగు సాహిత్యంలోని తత్సమ పదాలు చేర్చారు. ఉదాహరణకు కొన్నింటిని పేర్కొంటాను.

అంకపాళి - దీనికి శ.ర. కవుగరి, తిన్నె, దాది అనే అర్థాలు చెప్పి దేనికీ ప్రయోగాలు ఇయ్యలేదు. ముఖ్యంగా ఒడి అనే అర్థం ఇయ్యలేదు. రావుగారు ఒడి పైభాగము అని అర్థము ఇవ్వడమే కాక 'అంకపాళి వలిద్దుకూలాంచలములు' (మను చ. పీఠి.12) అని, 'కౌగిలి కూరువర దృఢాంక పాళిదీరిన దానని' (విప్ర. 1-90) అనే రెండు ప్రయోగా లిచ్చారు.

అరరము - దీనికి శ.ర. తలుపు, ఆకు అనే అర్థాలిచ్చింది. ప్రయోగం లేదు. రావుగారు కవాటము, తలుపు అనే అర్థాలివ్వడమే గాక 'సారలోహారరము భూధ్రవెర్రిబద్ధబుద్ధిజొర' (పాండురంగ 3.142) అనే ప్రయోగం కూడా చూపించారు.

కలకేత విద్య - ఈ పదం శ.ర.లో లేదు. వేంకటరావుగారు దీనిని గ్రహించి ఇంద్రజాలవిద్య అని అర్థంచెప్పి, 'కాయికం బలరంగ గల కేతవిద్య, యామయ్య మహిమదానతి విస్మయుంబె' (బసవ. 5.131) అనే చక్కని ప్రయోగం ఇచ్చారు.

హతామతి - ఈ పదం శ.ర.లో లేదు. దీనిని రావుగారు గ్రహించి దెబ్బలు తినుట అనే అర్థం ఇచ్చి 'హతాహతి మార్వేటకపాటి' (కుమా. 12. 129) అనే ప్రయోగం ఇచ్చారు.

2. సంస్కృతాంధ్ర మిశ్రమ పదములు, తత్సమ పద రూపాంతరములు అనే పరిచ్ఛేదంలో శ.ర.లో లేని పదాలు, శ.ర. చెప్పని తత్సమ రూపాంతరాలు ఇచ్చారు. ఉదాహరణకు :-

అన్నువబ్రహ్మచారి - ఇది సంస్కృతాంధ్ర మిశ్రమపదము. ఇది శ.ర. లో లేదు. రావుగారు దీనిని గ్రహించి మనోహరుడైన బ్రహ్మచారి అనే అర్థం చెప్పి, 'అన్నువబ్రహ్మచారి ముఖ మంబురుహంబు సమంబు జూడగన్ (భార.అరణ్య. 3. 107) ప్రయోగం చూపారు. భారతంలోని ఇలాటి ప్రయోగాన్ని శ.ర. ఎలా వదలి పెట్టిందో!

అక్షింతలు - ఇది అక్షతలకు రూపాంతరము. ఇది శ.ర.లో లేదు. అక్షతలు మాత్రమే ఉంది. దీనికి సేసబ్రాలు అని అర్థం ఉంది. రావుగారు అక్షింతలు అనే రూపాంతరమిచ్చి 'సుం-దరి యక్షింతల బొట్టునుం బసుపుమోదంబార దాల్పందగున్' (రుక్మాం 4.89)అనే ప్రయోగ మిచ్చారు.

3. తద్భవదేశ్య పదములు అనే పరిచ్ఛేదంలో శ.ర. ఇవ్వని ప్రయోగాలు ఇవ్వడమేగాక, అందులో లేని పదాలు, దేశ్యపదాలకు సజాతీయ భాషా పదాలు ఇచ్చారు. ఉదాహరణకు -

ఉవిద:- ఇది తద్భవం. దీనికి శ.ర. ఆడుది, ఇంతి, మగువ అని అర్థపర్యాయా లిచ్చింది. కాని, ప్రయోగం ఇవ్వలేదు. రావుగారు ఉవిద (సం.యువతి), ఆడుది, స్త్రీ అనే అర్థా లిచ్చి 'ఉవిదకన్నొగిచియుండె' (భార. ఆది. 4. 243) ప్రయోగం చూపారు. భారతం ఆదిపర్వంలోని ప్రయోగాన్నే శ.ర. ఎందుకు తీసుకోలేదో! ప్రసిద్ధమైన దానికి ప్రయోగం ఎందుకని ఉపేక్షకాబోలు!

అడియేను - ఇది శ.ర.లో లేదు. రావుగారు దీనిని గ్రహించి దాసత్వము (దాసుడు, దాసి) అనే అర్థమిచ్చి 'ఇంగలమించువచ్చి యడియేనని కొత్తైమసాని మ్రొక్కగా కొంగు బిరాల్న బట్టి' (క్రీడాభిరామ పీఠిక) అనే ప్రయోగమిచ్చి ఇది తమిళు నుంచి వచ్చిందని (త. అడియేన్) అని కుండలీకరణంలో చూపారు.

4. అన్యదేశ్యాలు అనే పరిచ్ఛేదంలో శ.ర. వదలిన పెక్కు అన్య దేశ్య పదాలను ఇచ్చి, వాటి మూలస్వరూపం, ఆకారం, ప్రయోగం చూపారు. ఉన్నవాటికి ప్రయోగాలిచ్చారు. ఉదాహరణకు -

ఇస్త్రరి - దీనిని శ.ర. గ్రహించింది. కాని ప్రయోగం చూపలేదు. రావుగారు 'ఉ.. యిస్త్రరియిచ్చి కోటు తన మేన ధరించి భుజాన రుమాలు వైచి' (తెలుగునాడు నియోగి ప్రశంస)

కంఖాణము - ఈపదము శ.ర.లో లేదు. రావుగారు దీని నిలా వివరించారు - కంఖాణము - గుఱ్ఱము, ఆఫ్ఘనిస్తాన్ పై సరిహద్దునగల దేశము. ఆ దేశము నుండి వచ్చిన గుఱ్ఱము. 'శా. రింఖాపాత.. ప్రేంఖద్వాత... వైశృంఖల్య ఉచ్చైశ్రవః కంఖాణంబు గదల్చె నానపుడు'. (నిరం. 4.125)

నిడుదవోలు వేంకటరావుగారి పరిశ్రమ అసాధారణమైనది. ఆయన అనుబంధము పీఠికలో, 'తెలుగు నిఘంటువుల యందు ప్రయుక్తమైన ప్రతి పదమునకు కవి ప్రయోగము లభించగలదని నా యనుభవమును బట్టి నిశ్చయముగా జెప్పగలను', అన్నట్టు ప్రతిపదానికి ప్రయోగం చూపగల పరిశోధకులు. ఆయన ధారణకు, పరిశ్రమకు, ప్రయోగ వైదుష్యానికి 'సవరణలు - వివరణలు' అనుబంధమే సాక్షి.

# జ్ఞ చిక

## కవిత

| | | | |
|---|---|---|---|
| 1. | మహాత్ముని 50వజయంతి | 1919 | భారత మాత పత్రిక - విజయనగరం |
| 2. | బాల గంగాధర్ తిలక్ | 1920 | రెడ్డిరాణి.. అనపర్తి.. తూ.గో. జిల్లా |
| 3. | అన్వేషణ జ్యోతి | 1920 | ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం (ఆం.సా.అ) 25-9-1920 మద్రాసు |
| 4. | భారతీయ ప్రబోధము | 1922 | ఆంధ్రపత్రిక దుందుభి ఉగాది సంచిక (ఆ.ప్ర.ఉ.సం.) పుట 54 మద్రాసు |
| 5. | పాల్కురికి సోమనాధుడు | 1922 | పైసంచిక |
| 6. | సుకవీశ్వర ప్రశంస | 1923 | ఆం.ప.ఉ.సం. రుధిరోద్గారి పుట. 152 |
| 7. | మహా మహోపాధ్యాయ-పరవస్తు వేంకట రంగాచార్యులు | | ఆం.ప.ఉ.సం. |
| 8. | టేంకణాదిత్య కవన ప్రశంస | 1925 | ఆం.ప.ఉ.సం. క్రోధన - పుట-306 |
| 9. | అమరుకము-ధ్యాన పంచకము | 1930 | కల్యాణి మాసపత్రిక.. విజయనగరం. |
| 10. | బిల్హణుని కవిత | 1932 | కల్యాణి మాసపత్రిక సంపు.2. సంచిక 7 |

| | | | |
|---|---|---|---|
| 11. | ఆశీస్సు-పసుమర్తి వీరభద్ర స్వామి | 1932 | కల్యాణి మాసపత్రిక సంపు.2 సం.7 పుట-174 |
| 12. | మాటవరుసలు-కవిచకోరాలు | 1932 | కల్యాణి మాసపత్రిక సంపు.2 సంచి.8 |
| 13. | సామీ-వెంకటాచల చెట్టి-అభినందన | 1933 | కల్యాణి మాసపత్రిక సంపు.2 సంచి.8 |
| 14. | సూర్యశతకము | 1933 | కల్యాణి మాసపత్రిక సంపు.2 సంపు .10 |
| 15. | కుసుమాంజలి | 1933 | చంద్రిక మాసపత్రిక - మద్రాసు |
| 16. | మేలుకొలుపు - పొగడిక ఆదిభట్ల నారాయణ దాసు రుబాయత్ ఉమర్ఖయాం అచ్చ తెనుగు అనువాదంపై ప్రశంస | 1933 జనవరి | హైదరాబాదు బులెటెన్ |
| 17. | ధ్యాన పంచకము | 1934 మే | కల్యాణి. విజయనగరం |
| 18. | వైరాగ్య శతకము | 1934 జూన్ | చంద్రిక. మద్రాసు |
| 19. | బాణుని కవిత | 1934 జూన్ | కల్యాణి. విజయనగరం |
| 20. | ఆత్మబోధ | 1934 జూలై | కల్యాణి. విజయనగరం |
| 21. | చిన్నిపూలు | 1936 మార్చి-ఏప్రిల్ | ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (ఆం.స.ప) సం.1. సం.25 పుటలు 2-3 |
| 22. | గౌరీపతిస్తవము | 1937 | సమదర్శిని మద్రాసు సం॥రాది సంచిక |

| | | | |
|---|---|---|---|
| 23. | వెండి పండుగ ఆ.సా.ప. రజతోత్సవం | 1937 జూన్-జులై | ఆ.సా.ప.ప. పుట 92-93 |
| 24. | జయంతి రామయ్య పంతులుగారి చిత్రపట ప్రశంస | 1937 జూన్-జులై | ఆ.సా.ప.ప. పుట. 92-93 |
| 25. | భారత ప్రశంస | 1939 నవంబరు | ఆంధ్రి. పిఠాపురం. పుట 26 |
| 26. | ఓలేటి వెంకట్రామశాస్త్రి | 1940 జనవరి | ఆంధ్రి. పుట 23 |
| 27. | రాజారామమోహన్‌రాయ్ | 1942 అక్టోబరు-మార్చి | పిఠాపురం మహారాజా కళాశ పత్రిక పుటలు 120-128 |
| 28. | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | 1961 | శాంతి: ఏకాదండయ్య ధర్మ స్మారక సంచిక 701 |
| 29. | శ్రీ రామోదాహరణం | 1963 | విక్రమ సింహపురి మండల సర్వస్వము .. పుట .. 42 |
| 30. | ఆశీస్సు - బోయి భీమన్న షష్టిపూర్తి సంచిక | 1983 | హైదరాబాదు. |
| 31. | కంద పద్యశతకము ఆంధ్ర నలందా శతకము | 1960 జనవరి | ఆంధ్ర నలందా గుడివాడ కృష్ణాజిల్లా |
| 32. | లఘు పద్యకృతి.. శ్రీరామ గీతామృతము | 1974 | శ్రీ సీతారామాంజనేయ భక్త సమాజము, న్యూ నల్లకుంట |
| 33. | ఖండ కావ్యము .. మించుపల్లె తెలుగు పొలుపు | 1959 | పద్మాలయ పబ్లికేషన్స్ హైదరాబాద్ |

# మౌలిక పరిశోధన గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1. | త్రిపురాంతకోదాహరణం | 1946 | స్వీయ ప్రచురణ.. మద్రాసు |
| 2. | ఉదాహరణ వాఙ్మయ చరిత్ర | 1950 | స్వీయ ప్రచురణ.. మద్రాసు |
| 3. | భాషా పరిశోధన-ప్రయోగ విశేషములు | 1954 | స్వీయ ప్రచురణ.. మద్రాసు |
| 4. | చిన్నయసూరి జీవితము | 1953 | వావిళ్ల .. మద్రాసు |
| 5. | తెలుగు కవుల చరిత్ర ప్రాచీన కాలము నుండి 1250 వరకు | 1950ప్ర.ము. 1956ద్వి.ము. | మద్రాసు విశ్వవిద్యాలయము |
| 6. | ఆంధ్ర వచన వాఙ్మయము | 1954 | ఆంధ్రగ్రంధమాల .. మద్రాసు |
| 7. | దక్షిణ దేశీ యాంధ్ర వాఙ్మయము | 1954ప్ర.ము. 1960ద్వి.ము. 1978తృ.ము. | మద్రాసు విశ్వవిద్యాలయము |
| 8. | శబ్దరత్నాకరం అనుబంధం | 1958 | Madras School Book & Virnacular Society - Madras |
| 9. | శతకకవుల చరిత్ర - వంగూరి సుబ్బారావు .. అనుబంధము | 1960 | వంగూరి నర్సింహారావు .. సుజన రంజని .. నర్సాపురం.. ప.గో.జిల్లా |
| 10. | ఆంధ్రవాఙ్మయ చరిత్ర, వంగూరి సుబ్బారావు .. అనుబంధము | 1960 | వంగూరి నర్సింహారావు .. సుజన రంజని .. నర్సాపురం.. ప.గో.జిల్లా |
| 11. | పోతన | 1961 | National Book Trust - N Delhi |
| 12. | కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము - సాహిత్య అకాడమి బహుమతి పొందిన గ్రంధం | 1962 డిసెంబరు | స్వీయ ప్రచురణ ..మద్రాసు |

| | | | |
|---|---|---|---|
| 13. | చిన్నయసూరి జీవితము హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము | 1962 | స్వీయ ప్రచురణ .. మద్రాసు |
| 14 | విజయనగర సంస్థానము సాహిత్య పోషణము | 1965 | స్వీయ ప్రచురణ .. మద్రాసు |
| 15. | నియోగి సర్వస్వము | 1971 | నియోగి మహాసభ, 2-2-1136/1 న్యూ నల్లకుంట, హైదరాబాదు. |
| 16. | హంసడిభకోపాఖ్యానము | 1971 | విజయభాస్కర పబ్లికేషన్స్ హైదరాబాద్ |
| 17 | కొప్పరపు సోదర కవుల చరిత్ర | 1974 | కుంటుముక్కల వెంకట జానకి రామ శర్మ, పెనుగురు పాడు, తెనాలి, గుంటూరు జిల్లా |
| 18. | నన్నెచోడుని కవితా వైభవం | 1976 | యువభారతి - హైదరాబాద్ |
| 19. | The Southern School of Telugu Literature (ఆంగ్ల గ్రంథం) | 1978 | మద్రాసు విశ్వవిద్యాలయం మద్రాసు |
| 20. | బసవ పురాణ వచనము | 1981 | శ్రీశైల దేవస్థానం - శ్రీశైలం - కర్నూలు జిల్లా |

## మౌలిక పరిశోధన వ్యాసాలు

| | | | |
|---|---|---|---|
| 1. | బసవనామ నిర్వచనము | 1925.3.23 | ఆం.ప.సా.అ. మదరాసు. (ఆంధ్రపత్రిక సారస్వత అనుబంధం) |
| 2. | వేల్పూరి వేంకటకవి | 1925 | ఆం.ప.సా. అ. మదరాసు. |
| 3. | నన్నెచోడుని కాల నిర్ణయము | 1925 | విజయనగర మహారాజా కళాశాల సంచిక 52-65 పు |
| 4. | పండితత్రయము | 1925 మార్చి | భారతి పుటలు -28-33 |

| | | |
|---|---|---|
| 5. చాట్రాతి లక్ష్మీ నరసకవి | 1926 | స్వశక్తి పత్రిక .. విజయనగరం |
| 6. వృషాధిప శతకము | 1926 జూన్ | భారతి పుటలు 10-16 |
| 7. సౌగంధికాపహరణము | 1927 అక్టోబర్<br>1928 జనవరి | విజయనగర మహారాజ కళాశాల<br>సంచికలు 1-2, పుటలు 27-32 |
| 8. రత్నాకరం గోపాలరాజు | 1928 జనవరి | విజయనగర కళాశాల సం.3.సం.1 |
| 9. ప్రాచీనాంధ్ర వార్తా పత్రికలు | 1929 మే | భా. 723 |
| 10. బ్రౌన్‌దొర వారి జీవితము | 1929 మే | భా. 607 |
| 11. భవదూరుడు | 1930 అక్టోబర్ భా. | |
| 12. మండపాక పార్వతీశ్వరశాస్త్రి | 1930 జూన్ | భా. 951 |
| 13. అముద్రిత గ్రంథ చింతామణి | 1930 ఆగష్టు | భా. 229 |
| 14. కళింగదేశ శతక వాఙ్మయము | 1930 ఆగష్టు | కళింగ సంచిక. పుటలు 129-33<br>రాజమండ్రి. |
| 15. ఆంధ్రదేశపు సంస్కృతాలంకారికులు | 1933 | ఆం.ప.సా. అ. మద్రాసు. |
| 16. కాకతీయ సామ్రాజ్యాంధ్ర వాఙ్మయము | 1935 | కాకతీయ సంచిక పు.133<br>రాజమండ్రి |
| 17. ప్రాచీనాంధ్ర కవులు - వటమూలుడు | 1936 జనవరి | భా. 43-44 |
| 18. ప్రాచీనాంధ్రకవులు - అమృతనాధుడు | 1936 ఫిబ్రవరి | భా. 165 |
| 19. ప్రాచీనాంధ్ర కవులు - శరభాంకుడు | 1936 మార్చి | భా. |
| 20. ప్రాచీనాంధ్రకవులు - భవదూరుడు | 1936 ఏప్రిల్ | భా. 408 |

| | | | |
|---|---|---|---|
| 21. | ప్రాచీనాంధ్ర కవులు - తాళ్ళపాకవారు | 1936 జూన్ | భా. 701 |
| 22. | ప్రాచీనాంధ్రకవులు - తాళ్ళపాకవారు | 1936 నవంబరు | భా. 697 |
| 23. | ప్రాచీనాంధ్ర కవులు - తాళ్ళపాకవారు | 1936 డిసెంబరు | భా. 839 |
| 24. | ఉదాహరణ గ్రంథములు | 1936 ఆగష్టు-సెప్టెంబరు | ఆ.సా.వ.ప 117-118 |
| 25. | త్రిపురాంతకోదాహరణము | 1937 | ఆ.సా.ప.ప. 149 |
| 26. | తంజాపురాంధ్ర వాఙ్మయము | 1937 | ఆ.సా.ప. రజతోత్సవ సంచిక |
| 27. | శ్రీగిరి | 1937 జులై | భారతి |
| 28. | ప్రాచీనాంధ్ర కవులు - నాగువేటి శేషనాధుడు | 1938 జనవరి | భా. 56-58 |
| 29. | పోతన భాగవతము | 1940-41 | ఆ.సా.ప.ప. సం.29. సం.1 |
| 30. | విష్ణుమాయా విలాసము - కుంకటి నరసింహకవి | 1941 మే | ఆంధ్రి.. పిఠాపురము పు. 9-2 |
| 31. | గోపాల లీలా సుధాలహరి | 1941 మే | ఆంధ్రి.. పిఠాపురము సం.3 సం.3. పుట 68 |
| 32. | పాలవేకరి కదిరీపతి | 1941 జులై | ఆంధ్రి.. పిఠాపురము సం.3 సం.4. పుట 89 |
| 33. | ఆంధ్ర రాజకవులు - కట్టా వరదరాజు | 1941 | ఆంధ్రి.. పిఠాపురము సం.3 సం.5. పుట 112-113 |
| 34. | భీమ ఖండము - పాఠభేదములు | 1941 | ఆంధ్రి.. పిఠాపురము సం.3 సం.7. పుట 175-184 |

| | | | |
|---|---|---|---|
| 35. | పండితారాధ్య చరిత్ర | 1942 అక్టోబరు-మార్చి | ఆ.సా.ప.ప. పుటలు 175-184 |
| 36. | శివ పంచస్తవములు | 1942 | సరస్వతీ సామ్రాజ్యము - అయ్యంకి వెంకటరమణయ్య సన్మాన సంచిక బెజవాడ పుట -9 |
| 37. | హల్లోహలము | 1943 | ఆ.సా.ప.ప. సం.32 |
| 38. | శివకవుల పదములు - శాసన ప్రయోగములు | 1944 అక్టోబరు | భా. పు. 321 |
| 39. | శివకవి యధావాక్కుల అన్నమయ్య | 1944 డిసెంబరు | భా. 513-518 |
| 40. | శివకవి యధావాక్కుల అన్నమయ్య | 1945 మార్చి | భా. 219 |
| 41. | పశుపతి నాగనాధకవి | 1945 జులై | భా. 3 |
| 42. | వచన వాఙ్మయ ప్రధమాచార్యులు | 1945 ఆగష్టు | భారతి |
| 43. | ప్రధమాంధ్ర కవితా పితామహుడు శివదేవయ్య | 1946 మార్చి | భా. 403 |
| 44. | సస్యానందము - దానయామాత్యుడు | 1946 జూన్ | భా. 497-502 |
| 45. | శివలీలా విలాసము | 1947 | రెడ్డి సంచిక పు 366 ఆంధ్ర ఇతిహాస పరిశోధకమండలి రాజమండ్రి |
| 46. | శివకవుల పలుకుబడి | 1948 సెప్టెంబరు | భా 257 |

| | | | |
|---|---|---|---|
| 47. | భాగవత ముద్రణము | 1948 | వావిళ్ళ - మదరాసు పు 1-26 |
| 48. | సౌదామని - సౌదామిని | 1948-49 | త్రిలింగ 32వ సం.మదరాసు |
| 49. | వీరశైవ వాఙ్మయము | 1949 జనవరి | భారతి రజతోత్సవ సంచిక సం.26 సం.1, పు. 1-25 |
| 50. | పూర్వసాహిత్య వీధులు - తెలుగు కన్నడములపొత్తు | 1949 మార్చి | భా. 135 |
| 51. | పూర్వ కవి కృతులు పునర్ముద్రణావశ్యకత | 1949 జూన్ | భా. 436 సం.36. సం.3 |
| 52. | కవికాల నిర్ణయము శాసనాధారములు | 1949 జులై | భా. పుట 10 |
| 53. | బ్రౌన్‌దొరవారి పద్యలేఖలు | 1949 | ఆం.ప.ఉ.సం. విరోధి-105 |
| 54. | విస్మృత ద్విపద కావ్యములు | 1949 | త్రిలిఙ్గ - మదరాసు |
| 55. | మల్లంపల్లి బుచ్చికవి | 1949 | త్రిలిఙ్గ - మదరాసు |
| 56. | ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మ | 1949 | త్రిలిఙ్గ - మదరాసు |
| 57. | శివ రహస్య ఖండము తెలుగు ముగుద కథ | 1950 జూన్ | భా. 548 |
| 58. | నన్నయ యుగము నాటి తెనుగు వాఙ్మయము | 1950 | ఆం.ప.ఉ.సం.కృతి పుట 128 |
| 59. | వేదం పట్టాభిరామశాస్త్రి | 1950 | త్రిలిఙ్గ |
| 60. | భాషా పరిశోధన - ప్రయోగ విశేషములు | 1951 ఫిబ్రవరి | భా.213 |
| 61. | కొక్కొండ వెంకటరత్నం పంతులు | 1951 మార్చి | భా. 231-237 |

| | | | |
|---|---|---|---|
| 62. | కొక్కొండ వెంకట రత్నం పంతులు | 1951 ఏప్రిల్ | భా. 367 |
| 63. | కొక్కొండ వెంకటరత్నం పంతులు | 1951 | భారతి |
| 64. | కొందరు యక్షగాన కవులు | 1951 అక్టోబరు | భారతి |
| 65. | కొక్కొండ వెంకటరత్నం పంతులు | 1951 నవంబరు | భా. 1001 |
| 66. | అమరుకము | 1951 డిసెంబరు | భారతి |
| 67. | తెనుగువచన రచన | 1951 | ఆం.ప్ర.ఉ.సం. 41-53 |
| 68. | ఆంధ్ర వైష్ణవ వాఙ్మయము | 1951 డిసెంబరు | భా. 1085 |
| 69. | అక్కమహాదేవి చరిత్ర బాల పాపాంబ | 1952 | ఆంధ్ర మహిళ. మదరాసు |
| 70. | అమరుకాంధ్రీకరణములు | 1952 | భా. 462 |
| 71. | కంఠీరవరాజు యక్షగాన కృతులు | 1952 | భా. 325 |
| 72. | కంఠీరవరాజు యక్షగాన కృతులు | 1952 అక్టోబరు | భా. 421 |
| 73. | గంగాగౌరీ విలాసము పెదకెంపా రాయుడు | 1952 డిసెంబరు | భా. 497 |
| 74. | దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము | 1952 | వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రి షష్టిపూర్త్యుత్సవ సంచిక మదరాసు పుటు. 180 |



| | | | |
|---|---|---|---|
| 75. | ద్విపద గ్రంథములు వివరణ పట్టిక | 1952-53 | Annuals of Oriental Research - Madras unit |
| 76. | చెన్నపట్టణ నిర్మాత - పెదకెంపారాయుడు | 1953 జనవరి | భా.76 |
| 77. | తడకమళ్ల వెంకట కృష్ణారావు | 1953 జులై | భా.82 |
| 78. | బాలికా విద్యాభ్యాసము | 1953 | ఆంధ్రమహిళ - మదరాసు 14వ వార్షిక సంచిక |
| 79. | లక్షణ గ్రంథములు వాఙ్మయ పరిశోధన | 1953-54 | ఆం.ప.ఉ.సం.జయ 180 |
| 80. | పండితత్రయము | 1953 అక్టోబరు | ఆం.పత్రిక దిన పత్రిక |
| 81. | హరవిలాస కిరాతార్జునీయములు | 1954 జులై | భా.75 |
| 82. | నన్నయ పదములు కొన్ని విశేషములు | 1954 | పరిశోధన. మద్రాసు 26-27 |
| 83. | మనుచరిత్ర - పెద్దన | 1954 నవంబరు | భా. 4-8 పుటలు |
| 84. | నిఘంటువు కెక్కని నన్నయ పదాలు | 1954 అక్టోబరు | పరిశోధన అ.8. మదరాసు |
| 85. | మనుచరిత్ర - పెద్దన | 1954 డిసెంబరు | కిన్నెర - 573 |
| 86. | విస్మృత కవయిత్రి బాలపాపాంబ | 1954 అక్టోబరు | ఆంధ్రమహిళ 113-118 |

| | | | |
|---|---|---|---|
| 87. | జానపద గేయాలు-విశేషాలు | 1955 అక్టోబరు | కిన్నెర 41 |
| 88. | వేయేండ్ల తెలుగు నాటకము | 1954 డిసెంబరు | పరిశోధన 24-28 |
| 89. | తడకమళ్ల వేంకటకృష్ణారావు | 1954 | భారతి |
| 90. | కవిత్రయంలో ఎర్రన పెట్టిన పద్ధతి | 1956 జులై | పరిశోధన - మదరాసు |
| 91. | యక్షగానములు | 1955 | భా. 43-95 |
| 92. | సోమన సృష్టించిన ఛందస్సు | 1955 ఆగష్టు-నవంబరు | పరిశోధన 57-68 |
| 93. | దండక వాఙ్మయము | 1955 | పరిశోధన |
| 94. | అష్టదిగ్గజములు | 1955-56 | ఆం.ప.ఉ.సం.మన్మథ 73-79 |
| 95. | ఎర్రాప్రగడ హరివంశ రచన కాలము | 1956 | పరిశోధన మదరాసు |
| 96. | క్షేత్రయ పదములు - భాష | 1956 | 258 క్షేత్రయ్య వర్ధంతి సంచిక విశాఖ పట్టణం పుటలు 29-35 |
| 97. | ఆంధ్రవాఙ్మయంలో బౌద్ధ సాహిత్యం | 1956 ఏప్రిల్-మే | పరిశోధన - 23 |
| 98. | ఆంధ్రకవులు వర్ణించిన బుద్ధావతారం | | పరిశోధన - 9 |
| 99. | కన్యాశుల్కం భాష కృష్ణమాచార్యులు ఆంధ్రదేశము | 1955-56 డిసెంబరు-జనవరి | పరిశోధన-9; ఆంధ్రప్రదేశ్ ఆవతరణ సంచిక. వెంకట్రామా అండ్ కంపెనీ, ఏలూరు. |
| 100. | ఆంధ్ర వచన రచనా భేదములు | 1959 జనవరి | భా. పుటలు 5-15-13 |

| | | |
|---|---|---|
| 101. కొన్ని ప్రయోగాల పరిశీలనము | 1959 ఏప్రిల్ | భా. పుటలు 54-60-22 |
| 102. ఆక్షేపము - సమాధానము | 1959 జులై | భా. పుటలు 22-25 |
| 103. బసవ పురాణ ప్రయోగాల సమర్థన | 1959 | ఆం.ప.ఉ.సం.వికారి 81 |
| 104. ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వం | 1959 ఏప్రిల్ | భా. 54 |
| 105. అభినవ పండిత రాయలు అవధాన ప్రతిభ | 1960 ఫిబ్రవరి | భా. 40-48 |
| 106. శివతత్త్వసార పారాలుమార్పు తగునా? | 1960 ఏప్రిల్ | భా. 78-81 |
| 107. పాల్కురికి సోమనాథుడు శివకవి కాడా? | 1960 | భారతి |
| 108. గురజాడ అప్పారావు కన్యాశుల్కము | 1961 మార్చి | తెలుగు మహాజన సమాజము |
| 109. మయూర మహాకవి : ఆంధ్ర వాఙ్మయము | 1961 ఆగష్టు | ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పత్రిక పుటలు 10-19 |
| 110. బాలవ్యాకరణము - పుట్టు పూర్వోత్తరములు | 1961 ఏప్రిల్ | భా. 72-75 |
| 111. ఉదయనోదయ ప్రబంధము | 1961 ఆగష్టు | భా. 32-34 |
| 112. నన్నయ ఇష్టదేవతాస్తుతి | 1962 | ప్రజాసేవ ప్రారంభోత్సవ సంచిక హైదరాబాదు. |
| 113. రాయలవారి ఆంధ్రవాఙ్మయసేవ | 1962 | శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం. హైదరాబాదు వజ్రోత్సవ సంచిక 67-68 |

| | | | |
|---|---|---|---|
| 114. | మంచెన కవితా శిల్పము | 1963 ఏప్రిల్ | భా. 79-82 |
| 115. | నన్నయ ఇష్టదేవతాస్తుతి | 1963 ఏప్రిల్ | భా. 79-82 |
| 116. | నన్నయ - నన్నెచోడ కవులు | 1963 | భా. 58-64 |
| 117. | బ్రౌన్ స్వీయ చరిత్ర | 1965 మే | భా. 75-86 |
| 118. | నన్నయ వాగనుశాసనుడా? | 1963 జూన్ | భా. 41-45 |
| 119. | నన్నయ వాగనుశాసనుడా? | 1963 ఆగష్టు | భా. 10-14 |
| 120. | కానాల నృసింహకవి | 1963 ఆగష్టు | భా.50-52 |
| 121. | క్షేత్రయ్య - క్షేత్రజ్ఞ | 1964 సెప్టెంబరు | భా. 76-78 |
| 122. | అముక్తమాల్యద - బ్రౌన్ దొరవారి ప్రతులు | 1963 అక్టోబరు | భా. 68-74 |
| 123. | అముద్రిత నానార్థ నిఘంటువు | 1963 అక్టోబరు | భా. 68-74 |
| 124. | శృంగార నైషధము పాఠభేదాలు | 1963 నవంబరు | భా. 51-58 |
| 125. | తెలుగులో ఆకర గ్రంథాలు | 1963 డిసెంబరు | భా. 59-58 |
| 126. | పోచిరాజు వీరన | 1963 డిసెంబరు | భా. 59-64 |
| 127. | మనసాహిత్యంలో నెమలి | 1963 | ఆం.ప.ఉ.సం.శోభకృత్ 97-10 |
| 128. | తెలుగు సాహిత్యంలో నెల్లూరు | 1963 | విక్రమసింహపురి మండల సర్వస్వము 287-293 |
| 129. | శృంగార నైషధము సుపరిష్కృత ముద్రణ | 1964 జనవరి | భారతి |
| 130. | శృంగార నైషధము సుపరిష్కృత ముద్రణము | 1964 ఫిబ్రవరి | భా. 64-69 |

| | | |
|---|---|---|
| 131. ప్రాచీన గ్రంథ పరిష్కరణము | 1964 ఫిబ్రవరి | భా. 27-28 |
| 132. కవి ప్రయోగ పరిశీలన | 1964 ఏప్రిల్ | భా. 76-80 |
| 133. సాహిత్య చరిత్రలు-విమర్శలు | 1964 మే | భా. 41-48 |
| 134. ప్రయోగ విశేషములు పాఠ భేదములు | 1964 జులై | భా. 73-76 |
| 135. సాంఖ్యాయన శర్మ సాహితీ సేవ | 1964 ఆగస్టు | భా. 71 |
| 136. దత్తాత్రేయ వాఙ్మయము | 1964 | ఆం.వి.ఉ. సం.క్రోధి |
| 137. ఆంధ్ర బౌద్ధ వాఙ్మయము రసార్ణవము | 1964 | ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు 29-33 |
| 138 పండితారాధ్య చరిత్ర-1 | 1966 ఏప్రిల్ | భా. 5 |
| 139. పండితారాధ్య చరిత్ర-2 | 1966 మే | భా. 27 |
| 140. అష్టభాషలు | 1965 జులై | భా. 51-58 |
| 141. తెలుగు - ప్రాకృతము | 1966 ఆగస్టు | భా. 28-38 |
| 142. ఎర్రన మత సమన్వయము | 1967 జూన్ | భా. 38-47 |
| 143. లక్షణ నవరత్న మాలిక | 1967 మార్చి | భా. 62 |
| 144. మడికి సింగన కాలము | 1967 జులై | భా. 60-64 |
| 145. కేయూర బాహు చరిత్ర | 1967 ఆగస్టు | భా. 53-59 |
| 146. దశకుమార చరిత్ర | 1967 సెప్టెంబరు | భా. 41-49 |
| 147. తెలుగు - తమిళము | 1967 నవంబరు | భా. 7-15 |
| 148. కాకతీయులనాటి సాహిత్యము | 1968 | సాహితీ వాల్లభ్యము ముళ్ళపూడి తిమ్మరాజుగారి అభినందన సంచిక - తణుకు |

| | | |
|---|---|---|
| 149. బద్దెన నీతి శాస్త్రముక్తావళి | 1968 | సాహితీ వాల్లభ్యము ముళ్ళపూడి తిమ్మరాజు గారి అభినందన సంచిక - తణుకు 244-251 |
| 150. తెలుగు - సంస్కృతము | 1968 మార్చి | భా. 2-10 |
| 151. నన్నెచోడకవి శైవ సాంప్రదాయం | 1969 ఏప్రిల్ | భా. 57-75 |
| 152. విక్రమదేవ వర్మ రచనలు | 1970 | భా. విక్రమదేవవర్మ జయంతి సంచిక - ఆంధ్రవిశ్వవిద్యాలయం వాల్తేరు |
| 153. తెలుగు సాహిత్యంలో తొలి జంటకవులు | 18-1-1970 | కృష్ణాపత్రిక - హైదరాబాదు |
| 154. కంజజ తత్త్వ భంజనము | 1970 నవంబరు | భా. 67-77 |
| 155. ఆంధ్ర సాహిత్యంలో తిరుపతి వేంకటకవుల యుగం | 1971 | ఆం.ప.ఉ.సం. విరోధికృత్ |
| 156. తిరుపతి వేంకటకవుల సరస్వతి పత్రిక | 1971 ఏప్రిల్ | భా. 33-38 |
| 157. సువర్ణ పాత్రికము | 1971 మే | భా. 14-24 |
| 158. ఆముక్తమాల్యద ఆశ్వాస సంఖ్య | 1971 జులై | భా. 2-12 |
| 159. అముద్రి తాంధ్ర గ్రంథాలు | 1971 ఆగష్టు | పాములటి బుచ్చినాయని స్మారక సంచిక - త్రివేణి |
| 160. తెలుగు లిపి | 1971 డిసెంబరు | భా. 3-14 |

| | | |
|---|---|---|
| 161. నన్నయ యతిప్రాసలు | 1972 | పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సంచిక హైదరాబా అక్షరార్చన పుటలు 97-117 |
| 162. ఆధునికయుగము-గాంధీ సాహిత్యము | 1973 ఫిబ్రవరి | భా. 12-24 |
| 163. ఆంధ్రదేశంలో వర్ధిల్లిన శైవము ఆరాధ్య సంప్రదాయము ప్రథమ ఖండము | 1973-9-1 | శివజ్యోతి మాస పత్రిక |
| 164. ద్వితీయ ఖండము | 1974-7-4 | పుటలు 3-28 |
| 165. స్వర్ణోత్సవ భారతి | 1974 జనవరి | భా. 12-29 |
| 166. ఆధునిక యుగము-గాంధీ సాహిత్యము | 1974 | ఆం.ప.ఉ. ప్రమాది 9-35 |
| 167. ద్విత్వ మకారబిందు పూర్వక బకార ప్రా.స. | 1975 ఆగష్టు | భా. 45-53 |
| 168. గణపతి - తెలుగు సాహిత్యం | 1975 అక్టోబరు | భా. 15-30 పుటలు |
| 169. ఆంధ్ర దీపిక - మామిడి వెంకయ్య | 1975 అక్టోబరు | జమీన్ రైతు, నెల్లూరు |
| 170. ఆంధ్ర దీపిక - చుండూరి వారి చౌర్యమే | 1975 అక్టోబరు 26 | జమీన్ రైతు, నెల్లూరు |
| 171. సంశోధిత మహాభారతము అప్పకవి పాఠములు | 1976 మే | భా. 44-52 |
| 172. సంశోధిత మహాభారతము అప్పకవి పాఠములు | 1976 జూన్ | భా. 43 |

| | | |
|---|---|---|
| 173. నాసికేతుని కథ | 1976 మార్చి | ఆం.సచిత్ర వారపత్రిక 16-34పు |
| 174. శృంగార నైషధము-సర్వంకష | 1976 ఏప్రిల్ | భా 41-52 |
| 175. పాల్కురికి సోమేశ్వర చరిత్ర యక్షగానము | 1976 ఆగష్టు | భా. 7-13 పుటలు |
| 176. తెలుగులో స్త్రీవాచకాలు | 1978 ఏప్రిల్ | ఆం.ప.ఉ.సం.కాళయుక్తి 57-69పు |
| 177. తంజావూరి నాటకాలు పాత్రోచిత భాష | 1978-79 | ఆం.ప.ఉ.సం. సిద్ధార్థి పుటలు 43-47 |
| 178. బ్రౌన్ ఉత్తరాలు - విశేషాలు | 1978 మే | ఆం.ప.ఉ.సం. |
| 179. బ్రౌన్‌దొర పండిత సదస్సు-1 | 1977-11-10 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 180. బ్రౌన్‌దొర పండిత సదస్సు-2 | 1977-17-11 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 181. ప్రఖ్యాతుడైన మరో బ్రౌన్ ఇందులో బ్రౌన్‌తండ్రి డేవిడ్‌బ్రౌన్ ఫోటో ఉంది. | 1977-7-16 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 182. బ్రాహ్మణ క్రైస్తవుడు | 1973-7-20 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 183. చౌదరి పురుషోత్తం | 1973-8-20 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 184. యుగయుగాల ఆంధ్రుల చరిత్ర | 80-11-1 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 185. రాయలసీమ నేలిన రాజ వంశములు | 1980 | రాయలసీమ ప్రత్యేక సంచిక 21-4-82 ఆం.ప.ది.ప. |
| 186. మల్లికార్జున పండితారాధ్యుని జీవితము పునఃపరిశీలన | | ఆం.ప.ఉ.సం. దుర్మతి పు. 74-84 |

# సాధారణ వ్యాసాలు

| | | | |
|---|---|---|---|
| 1. | రత్న పాంచాలిక - అనువాదం అభిప్రాయము | 1941 | ఆం.సా.ప.ప |
| 2. | శ్రీ నాగేశ్వరరావు పంతులు | 1944 ఏప్రిల్ | భా. పుట 365 |
| 3. | త్యాగరాజు మొదలి | 1945 | ఆం.ప.ఉ.సం. పార్థివ |
| 4. | వీరేశలింగ కవి | 1948 ఏప్రిల్ | భా. 303 |
| 5. | తత్వబోధిని మాసపత్రిక | 1948 | త్రిలిఙ్గ. మదరాసు |
| 6. | వావిళ్ల రామస్వామి శాస్త్రులు | 1948 | త్రిలిఙ్గ. మదరాసు |
| 7. | కావలి వెంకటబొర్రయ్య | 1948 | త్రిలిఙ్గ. మదరాసు |
| 8. | మల్లంపల్లి బుచ్చికవి | 1949 | త్రిలిఙ్గ. మదరాసు |
| 9. | శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి | 1949 | ఆం.పత్రిక దినపత్రిక |
| 10. | ఆచండ వేంకట సాంఖ్యాయన శర్మ | 1949 | త్రిలిఙ్గ. మదరాసు |
| 11. | వేదం పట్టాభిరామశాస్త్రి | 1950 | త్రిలిఙ్గ. మదరాసు |
| 12. | విజ్ఞాన శాస్త్ర పరిశోధన | 1952 | భారతి |
| 13. | ఆంధ్ర వాఙ్మయ ప్రభాకరుడు | 1954 | పరిశోధన |
| 14. | ప్రాకృతభాష - పరవస్తు వారిసేవ | 1959 నవంబరు | భా.66-70 |
| 15. | ఇదంతా - ఉపనిషత్ విహారము | 1959 నవంబరు | Courtoılam Sıddheswarı Mutt |
| 16. | ఉల్లిచేసిన మేలు | 1959 డిసెంబరు | భా. కలగూర గంప 90 పు |

| | | | |
|---|---|---|---|
| 17. | కళింగ చాటువులు | 1961 జనవరి | భా.పు.94 |
| 18. | కాటూరి వేంకటేశ్వరరావు | 1961 మార్చి | భా.50 |
| 19. | పొడుగు - గిడుగు | 1963 మే | భా. 32 |
| 20. | అముద్రిత రచనలు | 1961 అక్టోబరు | భారతి |
| 21. | బ్రౌన్ ప్రశస్తి - పద్యాలు | 1963 మే | భా. 41-53 |
| 22. | శ్రీనివాస సభా వర్ణన మాలిక వట్టిపల్లి నీరకంఠీరవశాస్త్రి | 1963 సెప్టెంబరు | భా. 56-57 |
| 23. | పరవస్తు చిన్నయసూరి | 62-4-21 | ఆంధ్రజ్యోతి.. విజయవాడ |
| 24. | శార్వరిలో సాంగత్యవికాసము | | ఆం.ప.ఉ.స.ప్లవ |
| 25. | బ్రౌన్ నిఘంటువు పునర్ముద్రణ సమస్య | 1964 జూలై | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 26. | బ్రౌన్ - ప్రశస్తి | 1967 మే | భారతి |
| 27. | హిందీతో పోటీ చేయగల తెలుగు | 1969 | తెలుగు దేశం ఉగాది సం. |
| 28. | జయంతి రామయ్యపంతులు | 1975 అక్టోబరు 15 | ఆంధ్రప్రభ వారపత్రిక |
| 29. | సాహిత్యంలో విజయవాడ | 7-11-25 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 30. | నేనెరిగిన గంటిశాస్త్రి గారు | 1978 | భా. 62-66 |
| 31. | ఆంధ్రాఏథెన్స్ - విజయనగరం | 79-7-2 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 32. | వాసిరెడ్డి వారి వంశచరిత్ర | 80-3-2 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 33. | సిసలైన తుఫాన్ సీసపద్యం | 78-5-2 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 34. | చిన్నయసూరి-అక్షరగుచ్ఛము | 80-10-5 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 35. | బుట్టెడాకుల నమలెడు పుణ్యాజనులు | 29-1-78 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |

| | | |
|---|---|---|
| 36. బ్రాహ్మణ క్రైస్తవుడు: మాంచాల వెంకటరత్నం: | 76-3-76 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 37. బ్రాహ్మణ క్రైస్తవుడు మాంచాల వెంకటరత్నం | 78-5-14 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 38. పాడుంలేని వాని బాధ ముమ్మాటికీ బాధే | 77-12-22 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 39. తెలుగు సాహిత్యంలో మీసాలు | 77-10-9 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 40. మీరుంబొగ ద్రావుదురా? | 77-10-30 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 41. చలి - చలీ | 78-3-19 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |

# వివిధ గ్రంథాల పీఠికలు

| | | | |
|---|---|---|---|
| 1. | వీరశైవ ప్రమాణాష్టకాభరణమ్ (సంస్కృతము) ఇవటూరి నందికేశ్వరశాస్త్రి | 1934 | విజయనగరం |
| 2. | లక్షణ సార సంగ్రహము | 1937 | ఆం.సా.ప. కాకినాడ |
| 3. | సత్యభామా సాంత్వనము లింగనముఖి కామేశ్వరకవి | 1938 | శృంగార గ్రంథమండలి మచిలీపట్టణం |
| 4. | అమరుకము - శిష్టు సర్వశాస్త్రి | 1938 | శ్రీశ్యామల కామశాస్త్రి, కడప. తూ.గో.జిల్లా. |
| 5. | విప్రనారాయణ చరిత్ర చదలవాడ మల్లన | 1938 | ఆం.సా.ప. కాకినాడ పుటలు |
| 6. | రాధామాధవ సంవాదము: వెలిదెండ్ల వెంకటపతి | 1940 | ఆంధ్రవిజ్ఞాన సమితి విజయనగరము |
| 7. | వాల్మీకి చరిత్ర-తంజావూరు రఘునాథ భూపాలుడు | 1941 | ఆంధ్ర విజ్ఞాన సమితి, విజయనగరము |
| 8. | సీతారామ చరిత్ర - మంత్రి ప్రగడ సూర్యప్రకాశ కవి | 1941 ఏప్రిల్ | ఆం.సా.ప. కాకినాడ పు. 1-8 |
| 9. | అభిషేక నాటకము అనువాదము - బులుసు వెంకటరమణయ్య | 1949 | మద్రాసు |
| 10. | భాగవతము - పీఠిక శతజయంతి | 1948 | వావిళ్ల - మద్రాసు 1-26 |
| 11. | కృష్ణార్జున సంవాదము నాదెండ్ల గోపన | 1949 | వావిళ్ల.. మద్రాసు పుటలు 1-38 |



| | | | |
|---|---|---|---|
| 12. | అన్యవాద కోలాహలము సీసపద్య శతకము | 1949 | వావిళ్ల.. మద్రాసు |
| 13. | చారుచర్య - అప్పన మంత్రి | 1949 | వావిళ్ల.. మద్రాసు |
| 14. | భగవద్గీత : గోపీనాథం వెంకటకవి | 1949 | వావిళ్ల.. మద్రాసు |
| 15. | ధనాభిరామము : నూతన కవి సూరన | 1950 | వావిళ్ల.. మద్రాసు |
| 16. | గురజాడ అప్పారావు గేయాలు | 1950 | వావిళ్ల.. మద్రాసు |
| 17. | గురజాడ అప్పారావు చిన్నకథలు | 1950 | వావిళ్ల.. మద్రాసు |
| 18. | నిర్వచనోత్తర రామాయణము : తిక్కన | 1950 | వావిళ్ల.. మద్రాసు |
| 19. | కాశీ ఖండము : శ్రీనాథుడు | 1950 | వావిళ్ల.. మద్రాసు |
| 20. | శృంగార నైషధము : శ్రీనాథుడు | 1950 | వావిళ్ల.. మద్రాసు |
| 21. | తెలుగు వ్యాకరణము - రావిపాటి గురుమూర్తి శాస్త్రి | 1951 | వావిళ్ల.. మద్రాసు |
| 22. | చిత్రరత్నాకరము - గురజాడ శ్రీరామమూర్తి పంతులు | 1951 | వావిళ్ల.. మద్రాసు |
| 23. | కవిజనాశ్రయము : మల్లియ రేచన | 1951 | వావిళ్ల.. మద్రాసు |
| 24. | హరవిలాసము - శ్రీనాథుడు | 1951 | వావిళ్ల - మదరాసు. |
| 25. | బసవపురాణము - పాల్కురికి సోమనాథుడు | 1952 | ఆంధ్రగ్రంథమాల మద్రాసు |
| 26. | దీపసభ - బోయిభీమన్న | 1952 | మద్రాసు |

| | | | |
|---|---|---|---|
| 27. | భాస్కర రామాయణము | 1953 | వావిళ్ల.. మద్రాసు |
| 28. | కుమార సంభవము | 1953 | వావిళ్ల.. మద్రాసు |
| 29. | అమరజీవి పొట్టిశ్రీరాములు : కోట సోదరకవులు | 1953 | వావిళ్ల.. మద్రాసు |
| 30. | వసు చరిత్ర | 1954 | వావిళ్ల.. మద్రాసు |
| 31. | యాజ్ఞవల్క్యచరిత్ర : లింగంగుంట రామకవి | 1954 | మద్రాసు |
| 32. | ఆంధ్రపారాశరహోరా : పూసపాటి విజయరామ గజపతి | 1955 | దువ్వూరి జగన్నాధ శర్మ, విజయనగరము |
| 33. | కవి సంశయ విచ్ఛేదము - అడిదము సూరకవి | 1955 | వావిళ్ల.. మద్రాసు |
| 34. | అడిదము సూరకవి - జీవితము అడిదము రామారావు | 1955 | వావిళ్ల.. మద్రాసు |
| 35. | శ్రీ గణేశ్వరీయము : వరలక్ష్మమ్మ | 1959 నవంబరు | కుర్తాళం సిద్దేశ్వర సీరిస్ తమిళనాడు, నెం.4 |
| 36. | శతక కవుల చరిత్ర : వంగూరి సుబ్బారావు | 1960 | వంగూరి నరసింహారావు, నరసాపురం |
| 37. | ఆంధ్ర వాఙ్మయ చరిత్ర : వంగూరి సుబ్బారావు | 1960 | వంగూరి నరసింహారావు, నరసాపురం |
| 38. | బిల్వ మంగళీయము | 1960 | వంగూరి నరసింహారావు, నరసాపురం |
| 39. | దాశరధీ శతకము : దాశరధి | 1962 ఏప్రిల్ | దాశరధీ.. హైదరాబాదు |



| | | |
|---|---|---|
| 40. మేఘ సందేశము - ఎం.వి.ఆర్ కృష్ణశర్మ | 1963 | |
| 41. ఛందోహంస - బుర్రా కమలాంబ | 1963 | |
| 42. ఉపగుప్త | 1963 ఏప్రిల్ | |
| 43. జయరామ నానార్ధ నిఘంటువు | 1964 | కడప పబ్లిషింగ్ కార్పోరేషన్ మదరాసు |
| 44. మామహారాజా వారితో దూరతీరాలు - కురుమెళ్ల వెంకటరావు | 1966 జులై | |
| 45. శివ మహిమ్నస్తోత్రము ఆంగ్ల భాషానువాదం : టి. కృష్ణమూర్తి | 1967 | |
| 46. గిడుగువారి వంశ వృక్షము గిడుగు లక్ష్మీకాంతమ్మ | 1968 జూన్ 15 | బాపట్ల |
| 47. షట్పది మేఘసందేశం - డా. గాజుల వీరయ్య | 1971 | విజయవాడ పు.8-35 |
| 48. సకలనీతి సమ్మతము - మడికి సింగన | 1970 | ఆం.ప్ర.సాహిత్య అకాడమి హైదరాబాదు |
| 49. ప్రబంధమణి భూషణము | 1971 జులై | ఆం.ప్ర.సాహిత్య అకాడమి హైదరాబాదు |
| 50. అష్టదిగ్గజ కవుల సమాజములో తొలి తెలుగు కవి ఎవరు? కె.యస్. కోదండ రామయ్య | 1972 | శివదేవ గ్రంధమాల హోసూరు, సేలం జిల్లా |

| | | |
|---|---|---|
| 51. ఎస్తేరు. క్రీస్తు గ్రంథం బి. పురుషోత్తము | 1972 ఏప్రిల్ | |
| 52. జాను - తెనుగు వాఙ్మయమహాధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణ | 1972 | |
| 53. విశ్వదాభిరామము | 1973 సెప్టెంబరు | |
| 54. బ్రహ్మాండ వచనము - మాచనా మాత్యుడు | 1974 | గాయత్రీ ప్రచురణలు ఉ. కోత్తకోట డోన్ లే కర్నూలు జిల్లా |
| 55. ఉద్భటారాధ్య చరిత్ర - తెనాలి రామలింగం | 1974 | Lotus Publications Main Road, Tenali, Guntur Dist |
| 56. శిశుపాల వధ - గోపీనాథం వెంకటకవి | 1975 | |
| 57. విశ్వదీపము - బి. పురుషోత్తము | 1975 | |
| 58. వెన్నెలకంటి సుబ్బారావు - అనువాదం డా॥ అక్కిరాజు రమాపతిరావు | 1976 | శ్రీ భారతి ప్రచురణలు |
| 59. ప్రబోధచంద్రోదయము - నందిమల్లయ - ఘంట సింగయ | 1976 | ఆం.ప్ర.సా.అ హైదరాబాదు |
| 60. ప్రబంధరత్నావళి - వేటూరి ప్రభాకరశాస్త్రి | 1976 | ప్రభాకర పరిశోధక మండలి హైదరాబాదు |

| | | | |
|---|---|---|---|
| 61. | శివతత్త్వ సుధానిధి - ములుగు మృత్యుంజయారాధ్యుడు | 1978 జనవరి | |
| 62. | సూర్యశతకము - దాసు శ్రీరాములు | 1979 | |
| 63. | ఆదిభట్లవారి అశుకవితలు : శ్రీశైల చరిత్ర | 1979-24 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 64. | శ్రీమత్ర్పతాపగిరి ఖండము - కపిలవాయు లింగమూర్తి | 1983 జనవరి | |
| 65. | ప్రాఙ్నన్నయ యుగము | 1979 జూన్ | భా. 75-76 |

## సమీక్షలు

| | | | |
|---|---|---|---|
| 1. | అలంకార మంజరి - శ్రేష్ఠలూరి రాఘవయ్యంగారు | 1936 | ఆం.సా.ప.ప. పు. 96-99 |
| 2. | రాధామాధవము - చింతలపూడి ఎల్లకవి (రాధామాధవ కవి) | 1936 | ఆం.సా.ప.ప. సం.3 సం.25. పుటలు 73-82 |
| 3. | నవనాధ చరిత్రము - గౌరన | 1938 ఫిబ్రవరి-మార్చి | ఆ.సా.ప.ప పుటలు 301-310 |
| 4. | శాంతి సమ్రాట్ అశోక చక్రవర్తి | 1959 సెప్టెంబరు | భా. 88-91 |
| 5. | పాల్కురికి సోమనాధుడు - చతుర్వేదసారము | 1962 సెప్టెంబరు | భా. 30-36 |
| 6. | పాల్కురికి సోమనాధుని లఘుకృతులు | 1962 | భా. 13-17 |

| | | | |
|---|---|---|---|
| 7. | నన్నెచోడుని పదప్రయోగ సూచిక | 1963 | భా. 70-78 |
| 8. | వీరేశలింగకవి చరిత్ర | 1963 | భా. 65-68 |
| 9. | సాహిత్యోపన్యాసములు | 1963 | భా. |
| 10. | వాత్స్యాయన కామసూత్రములు | 1963 | భా. 88 |
| 11. | జకార్డీలో సందె చీకటి | 1963 మే | భా. 65-67 |
| 12. | బ్రౌన్ నిఘంటువు - పునర్ముద్రణ | 1963 ఆగష్టు | భా. 85-87 |
| 13. | గ్రంథ విమర్శలు - చిల్లర పుస్తకాలు | 1963 | భా. 107-108 |
| 14. | ఆంధ్రసాహితీ సార్వభౌముడు | 1963 అక్టోబరు | భా. పు. 84-87 |
| 15. | సి.పి. బ్రౌన్ - కొత్తపల్లి వీరభద్రరావు | 1963 డిసెంబరు | భా. 88-92 |
| 16. | శ్రీశైలమల్లికార్జున మాహాత్మ్యం | 1964 జనవరి | భా. 97-98 |
| 17. | నన్నెచోడుని కవిత్వము - వేదం వెంకట్రాయశాస్త్రి | 1964 జూన్ | భా. 40-48 |
| 18. | సాహిత్య అకాడమి వారి భాగవతము | 1964 జూన్ | భా. 17-29 |
| 19. | సమగ్రాంధ్ర సాహిత్యం 1,2,3 సంపుటములు | 1965 ఆగష్టు | భా. 92-100 |
| 20. | సమగ్రాంధ్ర సాహిత్యం 4,5,6, సంపుటములు | 1965 అక్టోబరు | భా. 70-81 |

| | | | |
|---|---|---|---|
| 21. | సమగ్రాంధ్ర సాహిత్యం 7వ సం. | 1965 డిసెంబరు | భా. 58-67 |
| 22. | తెలుగు సామెతలు | 1966 జనవరి | భా. 63-75 |
| 23. | సమగ్రాంధ్ర సాహిత్యం 8వ సంపుటము | 1966 ఫిబ్రవరి | భా. 48-59 |
| 24. | సమగ్రాంధ్ర సాహిత్యం 9వ సంపుటము | 1966 మార్చి | భా. 39-50 |
| 25. | పండితారాధ్య చరిత్ర | 1965 జూన్ | భా. |
| 26. | తిరుపతి కవుల సాహిత్య సమీక్ష | 1966 సెప్టెంబరు | భా. 45-58 |
| 27. | తిరుపతి కవుల సాహిత్య సమీక్ష | 1967 అక్టోబరు | భా. 87-90 |
| 28. | ద్విపద వాఙ్మయము - ప్రొ. జి. నాగయ్య | 1967 అక్టోబరు | భా. 34-48 |
| 29. | సమగ్రాంధ్ర సాహిత్యం 12వ సంపుటం | 1968 నవంబరు | భా. 83-86 |
| 30. | ఆంధ్ర గద్య చంద్రిక | 1969 నవంబరు | భా. 42-63 |
| 31. | తారకా పరిచయము సాధారణ 111-122 | 1970 | ఆం.ప.ఉ.సం. |
| 32. | మాండలిక వృత్తి పదకోశం | 1970 ఏప్రిల్ | భా. 23-32 |
| 33. | సాహిత్యోపన్యాసములు | 1968 నవంబరు | భా. 64-72 |
| 34. | ఆంధ్రదేశ చరిత్ర - భూగోళ సర్వస్వం - ముఖ ద్వారం | 1970 సెప్టెంబరు | భా. 21-415 |
| 35. | మాండలిక పదకోశము | 1971 మార్చి | భా. 34-50 |
| 36. | సంశోధిత - మహాభారతము | 1972 నవంబరు | భా. 7-24 |

| | | | |
|---|---|---|---|
| 37. | తిక్కన పదప్రయోగ సూచిక | 1973 జూన్ | భా. 3-18 |
| 38. | సంశోధిత మహాభారతము | 1973 అక్టోబరు | భా. 19-28 |
| 39. | శ్రీపర్వత పురాణము - నాగులేటి శేషనారాధ్యుడు | 1973 అక్టోబరు | భా. 56-57 |
| 40. | సంశోధిత మహాభారతము - అనుశాసనిక పర్వము-1 | 1973 నవంబరు | భా. 37-46 |
| 41. | సంశోధిత మహాభారతము - అనుశాసనిక పర్వము-1 | 1973 డిసెంబరు | భా. 41-52 |
| 42. | సంశోధిత మహాభారతము - అనుశాసనిక పర్వము-1 | 1974 మార్చి | భా. 39-46 |
| 43. | శివజ్యోతి పత్రిక | 1974 జులై | భా.56-60 |
| 44. | సంశోధిత మహాభారతము, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు | 1974 అక్టోబరు | భా. 38 |
| 45. | బయోగ్రఫీస్ ఆఫ్ డక్కన్ పోయెట్స్ | 1977 మార్చి | భా. 13-20 |
| 46. | బుక్‌ప్రింటింగ్ ఇన్ ఇండియా - శ్రీమతి జి. మంగమ్మ | 1976 మార్చి | భా. 45-53 |
| 47. | బ్రౌన్ లేఖలు - బంగోరె | 1977 జూన్ | భా. 48-57 |
| 48. | వైకృత చంద్రిక మంచెళ్ల వాసుదేవకవి | 1977 అక్టోబరు | భా. 25-32 |
| 49. | ఆంధ్ర గీర్వాణ ఛ్ఛందము (బ్రౌన్) | 1977 నవంబరు | భా. 68-74 |
| 50. | డెల్టా - శిల్పి ఆర్థర్ కాటన్ - గూమ్మలూరి సత్యనారాయణ | 1977-11-27 | ఆంధ్రప్రభ - దినపత్రిక |

| | | | |
|---|---|---|---|
| 51. | బసవేశ్వర వచనాలు | 1977 డిసెంబరు | భా. 43-49 |
| 52. | కాటమరాజు కథలు | 1978 జనవరి | భా. 19-28 |
| 53. | వావిళ్ల ఆంధ్ర వాఙ్మయము - బులుసు వెంకట రమణయ్య | 77-12-25 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 54. | శ్రీమదాంధ్రాభ్యుదయము భూతపురి సుబ్రహ్మణ్యశర్మ | 78-1-29 | ఆం.ప.ది.ప |
| 55. | విజ్ఞాన వేదిక | 1978 ఫిబ్రవరి | భా. 7-11 |
| 56. | కోలాచలం శ్రీనివాసరావు నాటక సమాలోచనము | 1978 ఫిబ్రవరి | భా. 77-80 |
| 57. | బ్రౌన్ జాబుల్లోని స్థానిక చరిత్ర శకలాలు | 1978 ఏప్రిల్ | భా. 8-12 |
| 58. | విమర్శిని - విశ్వనాథ సంచిక | 1978 మే | భా. 40-44 |
| 59. | ఆంధ్రవాఙ్మయము వావిళ్ల-మరుపూరికోదండ రామరెడ్డి | 1978 అక్టోబరు | భా. 79-80 |
| 60. | తరతరాల తమిళ కవిత - చల్లా రాధాకృష్ణ | 78-7-14 | ఆం.ప.ది. |
| 61. | కుంతకుని వక్రోక్తి జీవితము - పరిష్కర్త పుల్లెల రామచంద్రుడు | 78-4-30 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 62. | మాండలిక వృత్తిపదకోశం | 78-4-5 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 63. | కబుర్లు చలసాని ప్రసాదరావు | 78-3-19 | ఆంధ్రపత్రిక - దినపత్రిక |
| 64. | కొమర్రాజు వేంకట లక్ష్మణరావు జీవిత చరిత్ర | 1977 | భా. 47-50 |

| | | |
|---|---|---|
| 65. యోగశాస్త్ర గ్రంధాలు నల్లగొండ రామచంద్రరావు | 78-8-6 | ఆం.ప.ఉ.సం. |
| 66. భగవద్గీత - తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు | 1978 సెప్టెంబరు | భా. 46-50 |
| 67. యుగయుగాల్లో భారతీయ మహిళ - వరలక్ష్మి | 1978 సెప్టెంబరు | భా. 71-86 |
| 68. సుకవి మనోరంజనము - కూచిమంచి వెంకట్రాయుడు | 1978-10-28 | ఆంధ్రపత్రిక దినపత్రిక |
| 69. తెలుగు వారెవరు? - వేదం వేంకటరాయశాస్త్రి | 1978 డిసెంబరు | భా. 73-74 |
| 70. ఉమామహేశ్వర వ్రతకల్పము | 1978-11-10 | ఆం.ప.ది.ప |
| 71. పాశ్చాత్యులు - భాషాసేవ | 78-12-24 | ఆం.ప.ది.ప |
| 72. తెలుగు వ్యుత్పత్తి పదకోశము - ఆంధ్రవిశ్వవిద్యాలయము | 1979 జనవరి | భా. 31-55 |
| 73. బ్రౌన్ స్వీయ చరిత్ర | 1979 జనవరి | భా. 77-80 |
| 74. చర్ల వారి కృతుల సమీక్ష | 1979 మార్చి | భా. 74-80 |
| 75. బసవేశ్వరుడు - తిప్పరుద్రస్వామి | 4-3-79 | ఆంధ్రపత్రిక - దిన పత్రిక |
| 76. బసవ వచనామృతము | 1979 ఏప్రిల్ | భా. 77-80 |
| 77. మా పిఠాపురం - కూరెళ్ల వెంకటరావు | | భా. 79-80 |
| 78. పాశ్చాత్యులు - తెలుగుభాషా సంస్కృతులు | 1979 ఏప్రిల్ | భా. 77-80 |
| 79. క్రియాశక్తి - విద్యారణ్య (కన్నడ గ్రంధం) | 1979 మే | భా. 55-57 |

| | | | |
|---|---|---|---|
| 80. | తెలుగు వ్యుత్పత్తి సమీక్ష పరామర్శ | 1979 ఆగష్టు | భా. 60-64 |
| 81. | తాళ్లపాక కవులు | 1979 ఆగష్టు | భా. 60-64 |
| 82. | వ్యాస భారతము - నన్నయ పరిష్కారము | 1979 అక్టోబరు | భా. 47-50 |
| 83. | శైవ సాహిత్య పరిషత్ ప్రచురణలు | 1980 మే | భా. 74 |
| 84. | ఆంధ్ర భారత నిఘంటువు | 1982 మార్చి | భా.53-75 |
| 85. | ప్రాచీన సాహిత్యానికి సమాధి తెనుగు అకాడమీ సాహిత్య పదకోశం | 1982 | భా. 5-12 |
| 86. | పాల్కురికి సోమన చతుర్వేద సారము | 1982 సెప్టెంబరు | భా. 30-36 |

## పరిష్కృత గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1. | బసవోదాహరణము : పాల్కురికి సోమన - బండారు తమ్మయ్యగారితో | 1943 | ఆం.సా.ప.ప. |
| 2. | త్రిపురాంతకోదాహరణము | 1946 | స్వీయప్రచురణ.. మద్రాసు |
| 3. | రామాయణము - కట్టా వరద రాజు.. మొదటి సంపుటి | 1950 | తంజావూర్ సరస్వతీ మహల్ గ్రంథాలయ ప్రచురణ-తంజావూర్ |
| 4. | ఖడ్గలక్షణ శిరోమణి | 1950 | మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథశాల ప్రచురణ. మద్రాసు |
| 5. | విద్యావతి దండకము - గణపవరపు వెంకటకవి | 1950 | మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం |

| | | |
|---|---|---|
| 6. రాజగోపాల విలాసము - చెంగళ్వ కాళకవి | 1951 | తంజావూరు సరస్వతీ మహల్ గ్రంధాలయ ప్రచురణ, తంజావూరు |
| 7. రామాయణము, కట్టా వరద రాజు అరణ్య, కిష్కింధ కాండములు 2 సం. | 1952, జనవరి | తంజావూరు సరస్వతీ మహల్ గ్రంధాలయ ప్రచురణ, తంజావూరు |
| 8. రామాయణము : సుందర కాండము - కట్టావరద రాజు | 1952 | తంజావూరు సరస్వతీ మహల్ గ్రంధాలయ ప్రచురణ, తంజావూరు |
| 9. రామాయణము - యుద్ధ కాండము 4సం. కట్టావరదరాజు | 1953 | తంజావూరు సరస్వతీ మహల్ గ్రంధాలయ ప్రచురణ, తంజావూరు |
| 10. కుమార సంభవము - నన్నె చోడుడు | 1953 | వావిళ్ల.. మదరాసు |
| 11. మూలస్థానేశ్వర శతకమ్ - (సంస్కృతము) తిరుపతి వేంకటీయము | 1963 | నెల్లూరు మండల సర్వస్వము - నెల్లూరు |
| 12. శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యుడు | 1968 | కృష్ణాపత్రికా కార్యాలయం హైదరాబాదు |
| 13. తెలుగు శాసనాలు Telugu Inscriptions | | University of Madras |
| 14. మయూరుని సూర్య దండకము Surya dandaka of Mayura (సంస్కృతం దేవనాగర లిపి) | 1975 | Silver Jubilee Volume Univ - of Madras |



# సామూహిక సంపాదకత్వం

| | | | |
|---|---|---|---|
| 1. | Comparative Dravidian Vocabulary | 1961 | University of of Madras |
| 2. | సాటి సామెతలు | 1960 | Southern Language Book Trust, Madras |
| 3. | Vasantarajeeyam· A forgotten work on Indian Dramaturgy | | Bhandarkar Oriental research Institute., Poona |
| 4. | Krishna Devaraya & his literary circle | 1936 | Vijayanagar Sixteenth Centerury Volume Dharwada - Karnataka |
| 5 | Telugu Literature Under Madhura Niaks | 1942 | J A H.R.S Rajahmundry |
| 6 | Telugu Literature Under National Govt | 1951 | Madras |
| 7. | Manjurastava - a forgotten work of Mayura | 1952 | K.V. Rangaswami Ayyangar Commommoratur Volume Madras |
| 8 | KulaseKhara In Telugu Literature | 1952 | Madras University Journal Vol XXIII No 182 |
| 9 | Origin and Development of Telugu Drama | 1956 | Madras Nataka Akademi Journal-Madras. |
| 10. | History of Telugu Linguistics | | Annals of Oriental Research Vol.XIII pages 16-26, Centenary number page. 16-26. |
| 11. | The Literary and Philosophical works of Tarigonda Venga Mamba | 1958 January | Madras University Journal (Section-A) Vol XXX, No.1 |
| 12 | Studies in Telugu Linguistics | 1961 | Annals of Oriental Research of the University Madras Vol.XVII part-II |

| | | | |
|---|---|---|---|
| 13. | Works relating to Dattatreya Cult inTelugu Literature | | Essays in philosophy Presented to Dr.T.M. Mahadevan on his 50th Birthday - Ganesh & Co Madras P 464-475 |
| 14. | Telugu Land of Dance Romance | 1958 | Jubilee Volume of Madras Arya Vaishya Sangam - Madras Pages 44-48 |
| 15 | The Southern School in Telugu Litt | 1978 | University of Madras Madras |
| 16. | Telugu a link between North and South | 1961 | Andhra Sahitya Parishad - First Anniversary - Calcutta Page No 27-29 |
| 17. | Tamilian Poets and Patrons of Telugu Literature | 1962 | Prof R.P. Sethu Pillai Commemoration Volume, Madras 119-125 |
| 18. | Literary Journalism | | Studies in the History of Telugu Journalism V.R Narla 60th Birthday Celebrations Volume New Delhi Page 53-91 |
| 19 | Poineers of English writing in India The Cavelly Telugu family | | Annals of Oriental Research - Madras. |
| 20 | Telugu Literature under Mysore Rulers | | Annals of Oriental Research - Madras |



కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు గారి ప్రతిభ బహుముఖీనమైన
నిజానికి ఆయన ఏ రంగంలో ఉన్నా ప్రతిభావంతులుగా ఉండే వారేమో! ఆయ
ఈ విషయాన్ని ఈ విధంగా చెప్పుకొన్నారు.

"చనియెన్ ద్వాదశ హాయనంబుల పయిన్
షాణ్మాస కాలంబు, బ్యాం
కున కీ దేహపు టస్థిచర్మములు రెం
డున్ ధారగా:బోసి జీ
వనమున్ బుచ్చితి, సేవచేసితి మనో
వాక్కాయ కర్మంబులన్
వినియోగించితి, నాదు ధీపటిమ వ
న్నెందెచ్చు నెద్దానిలోన్"

వాఙ్మయానికి, ఏమాత్రమూ సంబంధం లేని రంగంలో ఉంటూ సహజమై
సాహిత్యాభిరుచిని రక్షించుకుంటూ, అవకాశం కలిగినపుడు సాహిత్య రంగంల
దూకుదామనే తహతహతో ఉన్న రావుగారికి పుష్కరంపైగా ఇంపీరియల్ బ్యాంకు
గుమాస్తాగా తపస్సు చేయక తప్పలేదు.

నిడుదవోలు వేంకటరావుగారి ఈస్థితిని గమనించినపుడు తెలు
వాఙ్మయానికి అపారసేవ చేసిన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌గారు జ్ఞప్తికి వస్తా
బ్రౌనుగారు మనదేశానికి వచ్చి కడపజిల్లా కలెక్టరుకు అసిస్టెంటుగా చేరారు. పెక
ప్రభుత్వ శాఖలలో పనిచేశారు. పనిచేస్తూనే స్థానిక ప్రజలతో వ్యవహారానికి తెలు
అవసర మైనందున, దానిని నేర్చారు. తియ్యని తెలుగు పలుకులకు లోబడిపోం
సాహిత్యంలో ప్రవేశించి, భారతదేశంలో సంపాదించి దంతా తెలుగు సంస్కృ
సమర్పించి, చివరకు లండన్ విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్య పద

అందుకొన్నారు. ఇక వేంకటరావుగారు విజయనగరంలో ఇంపీరియల్ బ్యాంకులో గుమస్తాగా చేరి, మనఃపూర్వకంగా పనిచేస్తూ, బ్యాంకు పని తర్వాత తమకు అభిమతమైన సాహిత్యాభిరుచి పెంపొందించుకుంటూ, సాహిత్య పరిశోధన చేస్తూ, కాకినాడ కళాశాలలోను, సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయం లోను, దొరికిన సదవకాశాన్ని సంపూర్ణంగా వినియోగించుకొని రాటుదేరి పండితుల ప్రశంసలను అందుకున్నారు. చివరకు మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు అధిపతు లయ్యారు.

వీరిద్దరి జీవితాలు సూక్ష్మంగా పరిశీలించి చూస్తే, మరికొన్ని సన్నిహితమైన పోలికలూ కనిపిస్తాయి. తాళపత్ర గ్రంధాలను సేకరించడం, ప్రాచీన గ్రంధాలను సంస్కరించడం, కవిప్రయోగాలకు ప్రాధాన్యమిచ్చి సంగ్రహించడం, దీక్షాదక్షత, నిఘంటు రచన, వీరశైవ వాఙ్మయాభిమానం - ఇద్దరికీ సమానమే. వేంకటరావు గారికి ఆవేశ మెక్కువ. ఆవేశమంటే ధర్మావేశం. కాదన్న వాడు కారణం అన్న సామెతగా ఆయన "అసలది అసలుకాదు" - అని ప్రసంగం ప్రారంభించేవారు. బ్రౌనుగారు కూడా "నోనో" అని సంభాషణ ప్రారంభించేవారని సమకాలిక పాశ్చాత్య విద్వాంసులు వ్రాశారు.

రావుగారు కవి ప్రయోగాలకు ప్రాధాన్య మివ్వాలనేవారు. తెలుగు కావ్యాలలోని సంస్కృత పదాలు నిఘంటువులకు ఎక్కలేదని వాదించేవారు. ఈ విషయాలలో వారి పట్టుదలను సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయ ప్రధాన పండితులు వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు ఇలా ప్రశంసించారు - "వ్యాకరణము నకు విరుద్ధమైనను కవిప్రయుక్తము కాదనరాని దని వారు వాదించేవారు. శివకవులన బడు నన్నెచోడ పాల్కురికి సోమనాధాదుల గ్రంధములందలి ప్రయోగములు సంస్కృతాంధ్రములు విడువకుండ నిఘంటువులో గ్రహించవలెనని వాదించెడి వారు. వ్యాకరణ విరుద్ధములు పండితులు పనికిరావు అనెడివారు. దానిపై పెద్దగా చర్చ జరుగు చుండెడిది. ప్రాచీన గ్రంధములలో కాలము, విషయము, ముందు వెనుకలు వారికి బాగుగా తెలియును. బహుగ్రంథ ద్రష్టలు స్నేహపాత్రులు.."

రావుగారి ధారణ అద్వితీయం. "ధీర్ధారణావతీ మేధా" అన్నారు పెద్దలు. ధారణ గల బుద్ధే మేధ. ఆమేధ వారిలో అపారం. ఈ ధారణాపటిమలో వారు మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, గిడుగు రామమూర్తి పంతులు గార్ల వంటి వారినే కాక ఒకప్పుడు మాడభూషి నరసింహాచార్యులను గూడ తలపించే వారని తిరుమల రామచంద్రగారు ఒక ఉదంతం చెప్పారు.

ప్రభాకర శాస్త్రిగారి వద్దకు ఒక యువకవి వచ్చి తన కావ్యం వినమని కోరాడు. వారు సరే వినిపించమన్నారు. అప్పుడు నరసింహాచార్యుల వారు అక్కడ ఉన్నారు. పండుముసలి, చామన చాయతో, నామాలతో ఏదో వైదిక బ్రాహ్మణుని లాగ కనిపించేవారు. ఆయువకవికి వారెవరో తెలీదు. శాస్త్రిగారు కూడ పరిచయం చేయలేదు. యువకవి కావ్యం వినిపిస్తున్నాడు. దోషాలు చెవిని పడినపుడు ఆచార్యులవారు ఎత్తి చూపసాగారు. యువకవికి కోపం వచ్చింది. "ఊరుకోవయ్యా! శాస్త్రిగారు ఊరుకుండగా నీదేమిటి ఆక్షేపణ?" అని కసురుకున్నాడు. శాస్త్రిగారు యువకవికి ఆయ నెవరో చెప్పబోయారు. ఆయన చేతి సన్నతో వారించారు. కావ్యశ్రవణం పూర్తయింది. ఆచార్యులు నెమ్మదిగా. "అబ్బాయీ! చాలబాగుంది. నాపద్యాలు నీవు చక్కగా ఎత్తివ్రాసుకొని శ్రావ్యంగా చదివావు. చాలా సంతోషం! అని అన్నారు. ఏదో తయాషా చేయదలచారు, ఆయన అని శాస్త్రిగారు ఊరుకున్నారు. యువకవి మండిపడ్డాడు. "ఏమిటయ్యా, నేను రెండు సంవత్సరాలు కష్టపడి వ్రాసిన కావ్యాన్ని నాది కాదంటున్నావు. ఎంత అన్యాయం చూడండి శాస్త్రిగారు, ఈ ముసలాయన ఆగడం?!!" అన్నాడు ఆవేశంతో. "ఆదేనయ్యా నేనూ అన్నది. రెండేళ్లు కష్టపడి నకలు చేశావు. చక్కగా చేశావు" అన్నారు ఆచార్యులు గారు. యువకవికి వెర్రెత్తిపోయింది. "చాల్లే ఊరుకో. వయసొస్తే సరా? వివేకం ఉండాలి." అని చీదరించు కొన్నాడు. అబ్బాయ్! మనకు వాదం ఎందుకు? నీవు ఆ పుస్తకం మూసి నేను చూపిన చోటినుంచి పదిపద్యాలు వరసగా చెప్పు చాలు. కాదూ, నన్ను చెప్పమంటవా?" అన్నారు ఆచార్యులుగారు. "మహా ఇదిలే చెప్పు చెప్పు చూద్దాం. పది పద్యాలు వరుసగా"! అన్నాడు మహాకవి. "శాస్త్రిగార్తూ, ఆ కావ్యం పుచ్చుకోండి సగంలో ఓచోటనుంచి చూడండి." అంటూ సగం కావ్యంనుంచి

చివరిదాక అప్పజెప్పి "అబ్బాయ్, ఇప్పుడు చెప్పు. కావ్యం నీదా, నాదా?" అన్నారు ఆచార్యులుగారు. యువకుడు ఆశ్చర్య దుఃఖాలతో కుంగిపోయి ఏడ్చేశాడు. వెంటనే లేచి "మహానుభావా మీరేదో ఇంద్రజాలికులులా వున్నారు. నేను కష్టపడి వ్రాసిన కావ్యం. నన్ను కాపాడండి" అని కాళ్లమీద పడ్డాడు. రావుగారి ధారణకూడా అలాంటిదే.

వేంకటరావుగారి ధారణ, పరిశోధనా ఎంతో స్తుతి పాత్రాలై ఎన్నోబిరుదులు పొందాయి. ఉదాహరణ వాఙ్మయ చరిత్రను చదివిన విశ్వనాథ సత్యనారాయణగారు వేంకటరావుగారిని "పరిశోధన పరమేశ్వరులు" అని కీర్తించారు. వారు రావుగారికి వ్రాసిన లేఖలో" తమ ఉదాహరణ వాఙ్మయ చరిత్రము అందందు చదివితిని. ఉదాహరణ కావ్యము యొక్క గొప్పదన మిట్లను కొందును:-

జగత్తంతయుఁ గ్రియారూపము.
సర్వక్రియయుఁ బరమేశ్వరునందుఁ బర్యవసించును.
ధాతువు సర్వదా విభక్త్యాశ్రయము.
ఏ విభక్తికో సంబంధము లేక క్రియ లేదు.
అందుచేత నన్ని విభక్తులతోఁ బరమేశ్వరుని
జెప్పినపుడు భగవంతుడు సర్వక్రియాస్థాన
భూతుడని వ్యంగ్యము.
ఇది ఉదాహరణ కావ్య రహస్యము.
తాదృశకావ్య చరిత్ర వ్రాసిన మీ పరిశ్రమ
భవగత్సేవ యందు బర్యవసించుచున్నది.
మీరు పరిశోధన పరమేశ్వరులు

ప్రేమతో
విశ్వనాధ సత్యనారాయణ

అని ఉగ్గడించారు విశ్వనాధవారి వంటి కవిసమ్రాట్టులు "మీరు పరిశోధన పరమేశ్వరులు" అనడం వల్ల ఆనాటినుంచి రావుగారు పరిశోధన పరమేశ్వరులుగా

ఖ్యాతి పొందారు. నిజానికి ఆయన పరిశోధన పరమేశ్వరులే. ఆపరమేశ్వరత్వా
గుర్తించిన వారు విశ్వనాధులు.

వేంకటరావుగారు పొందిన మొదటి బిరుదు "విద్యారత్న" దీని నరసారావుపేటలో ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ఉయ్యూరురాజా శ్రీ వేంకట రంగయ్యప్పారావు బహద్దర్ వారి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో రావుగార శ్రీ ఈయుణ్ణి వీరరాఘవాచార్యులకు ఈ బిరుదం ఇచ్చారు

కవిసమ్రాట్, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత విశ్వనాధ సత్యనారాయణగార 'ఆంధ్రధాతు క్రియా మణిదీపిక' అనే గ్రంధాన్ని సమకూర్చగా ఆనాటి ఆం.ప్ర సాహిత్య అకాడమీ ప్రకటించింది.

ఆంధ్రధాతు క్రియామణి దీపిక అంటే అచ్చయిన నిఘంటువులలో నుం కాకుండా ఇతరత్రా సేకరించిన తెనుగు క్రియల నిఘంటువు.

ఈ నిఘంటు చిత్తుప్రతిని పరిశీలించ డానికి ఒక సంఘాన్ని అకాడమీ నియమించింది. అందులో వేంకటరావుగా రొకరు.

నిఘంటు నిర్మాణంలో కాని, ప్రయోగ ప్రదర్శనలోగాని వేంకటరావుగారి సాటి మరొకరు రారని వేరే చెప్పనక్కర లేదు.

సమావేశాలు వారంరోజులు హైదరాబాదులో జరిగాయి. విశ్వనాథవారు ఆధునిక సాహిత్య యుగానికి సమ్రాట్టులు; స్రష్టలు. వారికీ ఈ పరిశోధన పద్ధతులకు గుడికి బారెడు దూరం. వారూ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారి వద్ద అంతేవాసు లయినా ఇద్దరి ప్రతిభావ్యుత్పత్తులు వేరువేరు

ఒకరోజు వేంకటరావుగారిని విశ్వనాధవారు ఈ విధంగా అడిగారు.

"చాలా పుస్తకాలు చదివాను. ఎక్కడా 'మనసైనది' అనే ప్రయోగం దొరకలేదు. ఎవరి నడిగినా చెప్పలేక పోయారు" అన్నారు.

"ఒక్కప్రయోగం ఏమిటండి వందలున్నాయి" అన్నారు వేంకటరావుగారు.

"మీరు ఆవేశంతో మాట్లాడుతున్నారు. ఒక్క ప్రయోగమయినా దొరకలేదని నేనంటే వంద ప్రయోగాలున్నాయని అంటారేమిటి? అయితే చెప్పండి చూద్దాం" అన్నారు విశ్వనాధ.

"నీ చక్కదనంబు చూడ మనసైనది నామది నందనందనా" అని నంద నందన శతకంలోని ప్రయోగం చూపారు.

"మరి ఏందప్రయోగాలు చూపుతామన్నారే" విశ్వనాధ.

"ఇది శతకం కాబట్టి వందపై చిలుకు ప్రయోగాలున్నాయి కదా" - అన్నారు వేంకటరావుగారు.

విశ్వనాధవారు ఆశ్చర్య చకితులయ్యారు. వెంటనే వేంకటరావుగారే ఈ నిఘంటువును సంస్కరించగల రని చెబుతూ ఆపని వారికి అప్పగించారు.

ధాతుక్రియా మణి స్వరూపదీపిక అచ్చయింది. పీఠికలో - నిఘంటు నిర్మాణం అంటే ఒక్క వేంకటరావుగారు తప్ప మరొకరు చేయలేరని - లిఖిత పూర్వకంగా ప్రశంసించారు.[1]

వేంకటరావుగారు ఏ ప్రయోగం ఎక్కడున్నా పట్టుకొని మనస్సులో పెట్టుకుని అవసరమైనప్పుడు చెప్పేవారు. కనుక ఎవరో వారిని "ప్రయోగ మూషిక మార్జాల" అని అన్నారు. అది కృష్ణాపత్రిక ఏటా ప్రకటించే వ్యంగ్య బిరుదాల జాబితాలో చేరింది. కాని, రావుగారి దెబ్బకు ప్రయోగాలే తమంతటతామే గ్రంధాల పేజీల పొరలనుంచి వణుక్కుంటూ వచ్చి రావుగారిని ఆశ్రయించేవి.

తెనాలి తాలూకా పెదపూడి పాఠశాలలో అభ్యుదయ రచయితల సభ జరిగినప్పుడు వేంకటరావుగారు వేదికపైన ఒక ప్రక్కగా కూర్చుని, ఉపన్యాసకులలో ఎవరు ఏది మరిచినా, విషయాన్నో, పద్యాన్నో ఎవరు అరకొరగా చెప్పినా, వారికి వాటిని ఆమూలాగ్రంగా అందించేవారు. సభానిర్వాహకులు ఆయనను "జంగమ విజ్ఞాన సర్వస్వం" అని ప్రసంశించారు. ఈ ప్రశంసలో ఒక చమత్కారం ఉంది.

1. ఈ విషయాన్ని వేంకటరావుగారే చెబుతూ వచ్చారని సుందరేశ్వర రావుగారు అన్నారు.

జంగమ విజ్ఞాన మంటే పాల్కురికి సోమనాథాదులు రచించిన వీరశైవ సాహిత్యం. ఆ సాహిత్యంలోనూ ఇతర సాహిత్యంలోను కూడ ఏది అడిగినా రావుగారు చటుక్కున చెప్పేవారు. "ఏకసంధాగ్రాహి" అని కూడ ఆసభలలోనే పొగిడారు.

రావుగారి చిరపరిశ్రమకు సముచితమైన పరిగణన ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి "కళాప్రపూర్ణ" బిరుద ప్రదానం. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1973 అక్టోబరు 19వ తేదీన 46వ పట్టప్రదాన మహోత్సవంలో ఛాన్సలర్ గవర్నర్ ఖండూభాయి దేశాయిగారి అధ్యక్షతన ఈబిరుదు ప్రదానం జరిగింది.

సి.వి. జగదీశ్వర రావుగారు వేంకటరావుగారి గొప్పదనాన్ని తెలుపుతూ ప్రఖ్యాపన ప్రసంగం చేశారు.[1] ఈ బిరుదు ప్రదానం సందర్భంగా అభిమానులు మద్రాసులో జరిపిన సభలో

"ప్రథిత వేదము వేంకటరాయ శాస్త్రి
పొందగా బుట్టిన కళాప్రప్రూర్ణ బిరుదు
సార్థకంబయ్యె సాహిత్యజగతి నేడు
నిడుదవో ల్వేంకట రాణ్మనీషి వలన"

అని పొగిడారు.[2]

రావుగారు ఆంధ్రప్రదేశ్ అంతటా పెక్కు సన్మానాలు పొందారు. బహుమతులు పొందారు. వారు త్రిపురాంతకోదాహరణాన్ని పరిష్కరించి విపుల పీఠికతో ప్రచురించారు. దానికి 1949లో ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం తెలుగు భాషా వచన వాఙ్మయమునకు 1958లో తెలుగు భాషా సమితి బహుమతి లభించింది. వారి

1. ప్రఖ్యాపన పత్రం అనుబంధంలో

2. విశ్వవిద్యాలయాల బి.ఏ.ఎం.ఎ. వంటి డిగ్రీలు లేని, ప్రాచీన సంప్రదాయాను సారంగా, విద్యాధ్యయనం చేసి గొప్ప వారైన పండితుల కోసం, డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గారు ఈ బిరుదాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో స్థాపించారు. దీనిని మొట్టమొదట పొందినవారు. వేదం వేంకటరామ శాస్త్రిగారు.

"కన్నడాంధ్రముల పరస్పర ప్రభావము గ్రంధానికి 1962లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి లభించింది వారి "విజయనగర సంస్థానం - సాహిత్య పోషణ" అనే గ్రంధానికి 1963లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. వైయక్తికంగా ఆయన ప్రతిభను ఎందరో కొనియాడారు. అరబ్బీ ఫార్సీ సంస్కృతాంగ్లాది భాషలలో ఉద్దండ పండితులు ఖురాన్ షరీఫ్‌ను సంస్కృతీకరించిన వారు, సెషన్స్ జడ్జీగా ఉన్నవారు అయిన శ్రీగుండేరావు హర్కారేగారు వేంకటరావుగారి ప్రతిభను ముగ్ధులై ఒక శ్లోకంతో స్తుతించారు.

"నక్షత్రేషు యధాశశీ నిడదవోల్
శ్రీవేంకట శ్శాస్త్రవిత్
సంసత్స్వద్భుత తత్త్వ శోధనకళా
పూర్ణః సతాం వల్లభః,
అజ్ఞానం హరతి క్షణాత్ హృదయుగం
జ్యోత్స్నాం కిరన్ చిన్మయీం
జీయా ద్దివ్య శరత్‌శతం భగవతో
విష్ణోర్దయా వేశతః"[1]

రావుగారి పరిశోధన రచనలు సహస్రాధికాలు. ఆకాశవాణి ప్రసంగాలు శతాధికాలు. ఆంగ్ల వ్యాసాలు అసంఖ్యాకాలు. మెకంజీ రికార్డుల వంటి వాని ఆంగ్లానువాదాలు చెప్పుకోదగ్గవే. కాళిదాసు పరమేశ్వరుని అష్టమూర్తులను ఈ ప్రబంధ పరమేశ్వరునికి అన్వయించవచ్చును.

"యాసృష్టిస్స్రష్టురాద్యా, వహతి విధిహుతం
యాహవి ర్యాచ హోత్రీ
యే ద్వేకాలం విధత్తః శ్రుతి విషయగుణా
యా స్థితా వ్యాప్య విశ్వమ్,

1. మూడు వాఙ్మయ శిఖరాలు - పుట 118.

యమాహుః సర్వభూత ప్రకృతి రితియయా
ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభి ప్రపన్నః స్తనుభి రవతువః
తాభిరష్టాభి రీశాః" [1]

## వేంకటరావుగారి మూర్తిమత్త్వము

"చుళికిత సకలాంధ్ర సారస్వత సముగ్ర రసాంబువులైన నవకుంభ సంభవులు; అవలోడిత సకల శైవాగమ సంప్రదాయ విజ్ఞాన పండితులైన అపరమల్లికార్జున పండితులు; మధితాఖిల పూర్వ మహాకవి విరచిత లిఖిత గ్రంథ క్షీరసాగరు లైన మానవరూప మంధానగిరులు, విమర్శన కళాపూర్ణులయ్యు సర్వవిద్యారత్నా కరులు."[1]

పరిశోధన పరమేశ్వరులు అని విశ్వనాథ సత్యనారాయణగారు. ఏతా దృశలక్షణ భూషితులైన వేంకటరావుగారు విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖలో పనిచేసిన అధ్యాపకులలో వారు కావించిన కృషి అనిదం పూర్వం - అనన్యసామాన్యం - అద్వితీయం.

## అందుకు సమర్థన

1. సరస్వతీ భండాగారం వారి ఇల్లు
2. సాహిత్యోద్ధారకులే కాక సరసకవితా ధురంధరులు వారి తండ్రిగారు.
3. కవి పండితులతోనే వారి సాహచర్యం.
4. ధారణ, శ్రావ్యపద్యపఠనం వారి పూర్వార్జిత జన్మఫలం.
5. అభినవాంధ్ర భోజులు పిఠాపుర రాజు ప్రభువు.

1. అభిజ్ఞాన శాకున్తలం మంగళాచరణ శ్లోకం.

1. హైదరాబాదులో 18-1-76న జరిగిన ఆంధ్ర సాహిత్య అకాడమీ పట్టప్రధానోత్సవ సభలో ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి ప్రశంస.

మనఃఫలకంపై ప్రతిష్ఠించి, వలసినప్పుడు జిహ్వాగ్రానికి తెచ్చుకొని ప్రదర్శించగల శక్తి ఒక్క నిడుదవోలు వేంకటరావుగారికే ఉండేది.

ఒక్క తెలుగు సాహిత్యమేకాదు సంస్కృత శ్లోకాలు కూడా వారికి కంఠోపాఠాలే. మయూరుని క్లిష్ట సంస్కృతపద భూయిష్ఠమైన సూర్యశతక స్రగ్ధరా వృత్తాలను నూరింటిని నూరి, ఔపోసనం పట్టిన అగస్త్యులు వారు.

## 1. ఉదాహరణ కావ్యోద్ధరణ :-

పాల్కురికి సోమనాధుడు మొదలుగా జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి వరకు ఉదాహరణలు రచించారు. ఆధునిక యుగంలో మచ్చ వేంకటకవి (1863-1904) రచించిన ముఖలింగేశ్వ రోదాహరణమే తొలికృతి.[1] మాన్యశ్రీ బెజవాడ గోపారెడ్డిగారి వివాహ (8-5-38) సందర్భంగా విశ్వనాధ సత్యనారాయణగారి గోపా లోదాహరణం రెండో ఉదాహరణ. ఆ సంవత్సరం జూలై నెలలో మండపాక పార్వతీశ్వర శాస్త్రి (1983-1941) గారి నాగేశ్వ రోదాహరణం మూడోది. ఈ మధ్యకాలంలో మానపల్లి రామకృష్ణ కవిగారు 1912లో ప్రచురించిన రావిపాటి తిప్పన త్రిపురాంత కోదాహరణం, వేటూరి ప్రభాకర శాస్త్రులవారు 1928 భారతి ఫిబ్రవరి సంచికలో పాల్కురికి సోమన తెలుగు బసవోదాహరణం వెలిశాయి.

1946లో వేంకటరావుగారు త్రిపురాంత కోదాహరణం విపుల పీఠికా సమేతంగా ప్రకటించడం, అద్దానిని విశ్వవిద్యాలయాలు పాఠ్యగ్రంథంగా నిర్ణయించడం జరిగాయి. విద్యార్థులకు ఈ సాహిత్య ప్రక్రియ పరిచయమైంది. విద్వజ్జనులు నిడుదవోలు వేంకటరావుగారి విద్వత్తును కొనియాడారు.

ఆ తరవాత పుంఖాను పుంఖంగా ఉదాహరణ రచనలను పలువురు విద్వాంసులు చేపట్టారు.

1. ఈకృతి పర్లాకిమిడిలోని గజపతి ముద్రాక్షరశాలలో ముద్రితమని ఉదాహరణ వాఙ్మయ చరిత్ర (1950) పుట 172లో సూచన కనబడుతోంది. కాని, దీనిని నిడదవోలు వెంకటరావుగారు సంపాదించినట్టు లేదు.

శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, తిమ్మావఝులకోదండ రామయ్య, శిరోమణి చెలమచర్ల రంగాచార్యులు, డా॥ దివాకర్ల వెంకటావధాని, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి మొదలైన ప్రసిద్ధ - రచయితలు ఉదాహరణ రచనలు చేశారు. 1968లో ఉదాహరణ వాజ్మయ చరిత్ర పునర్ముద్రణలో నిడుదవోలు వేంకటరావుగారు 75 ఆధునిక ఉదాహరణ కావ్యాల జాబితా ఇచ్చారు. ఆ తరువాత చాలామంది ఉదాహరణలు వ్రాశారు. కొన్ని అముద్రిత ప్రతులు కూడా శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి చేరాయి.

ప్రాచీన ఉదాహరణ కావ్యప్రక్రియ నిడుదవోలు వేంకటరావుగారి కృషివల్లనే ఉద్ధరింపబడి, పునరుజ్జీవనం పొందిందని సిద్ధాంతము.

## 2. తెలుగు కవుల చరిత్ర :-

కవి జీవితాలను మొదట వ్రాసినవారు గురజాడ శ్రీరామ్మూర్తి పంతులుగారు. తరువాత కందుకూరి వీరేశలింగం పంతులుగారు. ఈ రెండింటి కంటె ప్రామాణికంగా చాగంటి శేషయ్యగారు. ఆంధ్రకవితరంగణి సమకూర్చారు. ఈ మూడింటి ఆధారంగా ఆరుద్ర వ్యావహారిక శైలిలో సమగ్రాంధ్ర సాహిత్య సంపుటాలను తయారు చేశారు.

నిడుదవోలు వేంకటరావుగా రనేక ప్రాచీనాధునిక కవిజీవితాలను పరిశోధించి వెలికి తీశారు. అయితే అవి వ్యాసరూపం గానే మిగిలిపోయాయి. ఆంధ్రకవి తరంగిణిలో శేషయ్యగారు గౌరవపురస్కరంగా గ్రహిస్తే సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్ర వినోద విమర్శనాత్మకంగా స్వీకరించారు.

1. పుట 169-70.

ఈ జాబితాలో వచనవాజ్మయ ప్రధమాచార్యునిగా కృష్ణమాచార్యులను (సింహగిరి నరహరి వచనకర్త) తొలుత గుర్తించినవారు వెంకటరావుగారే. వారే ఆంధ్రప్రదేశ్ - కృష్ణమాచార్యులు అనే శీర్షికలో పెద్దవ్యాసం వ్రాశారు. అది వెంకట్రామా కంపెనీవారు ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంగా ప్రకటించిన సంపుటంలో వుంది. కృష్ణమాచార్యులను గూర్చి వెలువడిన వ్యాసాలలో కల్లా వెంకటరావుగారి వ్యాసాలే తొలుతటివి.

1. ప్రథమాంధ్ర కవితా పితామహుడు శివదేవయ్య
2. పశుపతి నాగనాథ కవి
3. వచన వాఙ్మయ ప్రథమాచార్యుడు (కృష్ణమాచార్యులు)
4. దోనయామాత్యుడు.
5. భవదూరుడు
6. వటమూలుడు
7. అమృత నాధుడు
8. బాల పాపాంబ
9. మహోపాధ్యాయ ఆచంట సాంఖ్యాయన శర్మ.
10. మల్లంపల్లి బుచ్చికవి.
11. మహామహోపాధ్యాయ మానవల్లి గంగాధరశాస్త్రి
12. కొక్కొండ వేంకటరత్నం పంతులు.
13. తడకరుల్ల వేంకటకృష్ణరావు

మొదలైనవారి కవిజీవితాలు నిడుదవోలు వేంకటరావుగారి స్వోపజ్ఞము ఇవికాక దక్షిణదేశీయాంధ్రవాఙ్మయంలో, వచన వాఙ్మయంలో అనేకమం రచయితలను వెలుగులోకి తెచ్చారు.[1]

విడివిడి కవుల చరిత్రలు కాక 'తెలుగు కవుల చరిత్ర' అనే బృహత్ప్రణా కను వారు విశ్వవిద్యాలయంలో ఉండగా రచించారు. అందులో పూర్వయుగ నుండి 1250 వరకు ఉన్న కవులను ప్రథమ సంపుటంగా మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురించింది. తిక్కన, ఎఱ్ఱన యుగాలు అముద్రితంగానే నిలిచిపోయాయి

1. వంగూరి సుబ్బారావుగారి శతకకవుల చరిత్రలో చేరని పెక్కు శతకకవులను ఆగ్రంధాని అనుబంధాలుగా చేర్చారు.
2. "ఆంధ్రప్రదేశ్ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం, పరిశోధన సంస్థ"లో భద్రంగా ఉన్నాయి

తెలుగు కవుల చరిత్రలో నిడుదవోలు వేంకటరావుగారు సాహసంతో పద్యమయ శాసన రచయితలను, కర్త తెలియని శాసనాలు కాలానుపూర్వికంగా చేర్చారు. నన్నయ కవిత్వం హఠాత్ సంభవం కాదని తెలపడానికి ఈ చేర్పు శాస్త్రీయమే. ఒక్క కవిత్వమే కాదు. శాసనపద్యాలలోని ఛందోవ్యాకరణ విశేషాలను గూర్చి తెలుసుకోడానికి కూడా ఇది అవసరమే. పద్యం వ్రాసినవారు కవి అయి ఉండాలని కూడా వారి దృఢాభిప్రాయం. సప్రాణికంగా, సాధికారంగా పూర్వయుగం మీద వచ్చిన గ్రంథాల్లో ఇది మకుటాయమాన మైనదని పండితులు, పత్రికలు శ్లాఘించాయి.[1]

నూతన కవులను, రచయితలను వెలికితీసి ఆంధ్రకవితరంగిణి, సమగ్రాంధ్ర సాహిత్యం కర్తలకు ప్రామాణికులై, కవుల చరిత్రలో శాసన కవులను కూడ చేర్చిన పరిశోధకులు నిడుదవోలు వేంకటరావుగారే అని సిద్ధాంతం.

## 3. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం

తంజావూరు, మధుర, మైసూరు, కార్వేటి నగరం, పుదుక్కోట మొదలైన దక్షిణాది సంస్థానాలలో వర్ధిల్లిన తెలుగు సాహిత్యాన్ని గూర్చి సమగ్రంగా వెలువడిన ఏకైక బృహత్ గ్రంథం ఇది.

దీని తరవాత నేలటూరి వారి దక్షిణాంధ్ర సాహిత్యం, కాకర్ల నరసింహంగారి దక్షిణాంధ్ర సాహిత్యం చిన్న పుస్తకాలైనా చారిత్రకంగా, సవిమర్శ నాత్మకంగా వెలువడిన గ్రంథాలు. తక్కినవి కేవలం వేంకటరావుగారి గ్రంథాన్నే ఆధారంగా తీసుకొన్న రచనలు. సునాయాసంగా రచించి ఆర్థిక సహాయమో, అవార్డ్ పొందిన గ్రంథాలు. దీని తొలిముద్రణ 1954లో మద్రాసు విశ్వవిద్యాలయం ప్రకటించింది. కవిచరిత్ర కారులుకు, సాహిత్య ప్రియులకు చేమకూరవారి విజయవిలాసం, ముద్దుపళని రాధికా సాంత్వనము, తారాశశాంక విజయం తప్ప చాలాగ్రంథాలు తెలియవు.

1. శాసనకవులను చేర్చినందుకు దీనిని 'అఖండ దీపారాధన కవుల చరిత్ర' అని ఆచార్య యస్వీ జోగారావుగారి విమర్శ.

విజయనగర సామ్రాజ్య పతనాంతరం సాహిత్య సరస్వతి దక్షిణాదికి వలస వెళ్లిపోయింది. పాలించినది తమిళ ప్రాంతమైనా ఆ నాయక రాజులు పోషించినది సంస్కృతాంధ్ర సాహిత్యాలనే. సాహిత్యంతో పాటు వారు సంగీతాన్ని కూడా ఆదరించారు. ముఖ్యంగా కవయిత్రులకు కనకాభిషేక గౌరవం లభించింది, దక్షిణాంధ్ర నాయకుల ప్రోత్సాహం వల్లనే. యక్షగాన, ద్విపద, వచన నృత్యనాటికలు వెల్లివిరిసిన దీ నాయకరాజుల ప్రోత్సాహం వల్లనే. ఆంధ్ర సాహిత్య చరిత్రలో దక్షిణ దేశీయాంధ్ర సాహిత్యం రసవత్తరమైన అధ్యాయం. అది లేనిదే సాహిత్య చరిత్రకు తుష్టి పుష్టి రెండును లేకుండెడిది. ఈ లోటును వేంకటరావుగారే విజయవంతంగా నెరవేర్చారనీ, ఆంధ్రసాహిత్యానికి నిండుదనం కూర్చిన వారు నిడుదవోలు వేంకటరావుగారే అని సిద్ధాంతం.

## 4. ఆంధ్రవచన వాఙ్మయం

తెలుగు సాహిత్యానికి పరిపుష్టి నిచ్చిన మరోగ్రంథం వేంకటరావు గారి వచన వాఙ్మయం.

'తెనుగు వచన కావ్యాభివృద్ధి' అనే చిన్న పుస్తకాన్ని మల్లాది వేంకటరత్నం గారు 1918 లో ప్రకటించారు. విద్యార్థులు ఏ విధమైన రచన శైలి అలవరచుకోవాలో ఈగ్రంథం తెలియజేసింది. 1923లో గొబ్బూరి వెంకటానంద రాఘవరావు గద్యవాఙ్మయ చరిత్ర వ్రాసి అందులో నన్నయకు పూర్వయుగ వచనాన్ని మాత్రమే తెలిపారు. 1935 ఏప్రిల్, మేనెల భారతి సంచికల్లో నన్నెచోడుని వచనం గురించి, 1938 ఫిబ్రవరి, మార్చి పత్రికల్లో 'ఆంధ్రగద్య వాఙ్మయ పరిణామము అనే శీర్షికలో నన్నయ మొదలు పింగళి సూరన వరకు తెలిసిన చంపూకావ్యాల్లోని వచనరచనను గూర్చి వివరించారు. ప్రభాకరశాస్త్రిగారు 'ప్రాచీనాంధ్రగద్య కావ్యములు' అనే వ్యాసాన్ని ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రికలో ప్రకటించారు. గిడుగు రామ్మూర్తి పంతులుగారి గద్య చింతామణి వ్యావహారిక భాషోద్యమాన్ని దృష్టిలో పెట్టుకొని సంకలనం చేసిన గ్రంథం. అందు వచన వాఙ్మయ చరిత్ర మృగ్యం.

1954లో నిడుదవోలు వేంకటరావుగారి గ్రంథం వెలువడక ముందు

ముద్రితమైన వచన వాఙ్మయ చరిత్ర గ్రంథాల్లోగాని, వ్యాసాల్లోగాని సమగ్రతలేదు. విషయవైవిధ్యమంతగా కన్పట్టదు. ఆధునిక యుగంలో వచనం వేయిపడగలుగా విస్ఫారింది. ప్రజాస్వామ్యయుగంలో ప్రజల భాషకే ప్రాధాన్యం. ఆంధ్ర వచన రచనా పరిణామాన్ని గూర్చి పునరాలోచన చేసి ప్రాఙ్నన్నయ యుగం మొదలు నిన్న మొన్నటి వరకు ప్రవహించిన వచన శాఖాస్రవంతిని, దాని పాయలను గూర్చి వేంకటరావుగారు, సమగ్రమైన గ్రంథాన్ని ప్రకటించారు. తెలుగు చంపూకావ్యాల మధ్య 'వచనం' అనే శబ్దాన్ని ఆశ్వాసాంత గద్యాలలోని గద్య అనే శబ్దాన్ని గూర్చి కూలంకషంగా చర్చించారు.

కథావాఙ్మయం, యాత్రాచరిత్ర, శాస్త్రీయగ్రంథాలు, ఏకాంకికలు, లేఖావాఙ్మయం, రేఖాచిత్రాలు, వ్యాసం, పత్రికా వచనరచన, ఆకాశవాణి ప్రసంగ వచనం, విజ్ఞానశాస్త్ర వ్యాసరచన మొదలయిన ఆధునిక ప్రక్రియలను గూర్చి తొలిసారిగా తెలిపిన గ్రంథం వేంకటరావుగారి ఆంధ్రవచన వాఙ్మయం.[1]

పరమ ప్రామాణికమైన వేంకటరావుగారి గ్రంథాన్ని నేటివరకు సిద్ధాంత వ్యాసకర్తలు, ఇతర రచయితలు పరిశీలిత గ్రంథాల జాబితాలో చూపెడుతూనే ఉన్నారు. పైగా విశ్వవిద్యాలయాల్లో వచన వాఙ్మయం సిద్ధాంత వస్తువుగా గ్రహించి డాక్టరేట్ పట్టం పొందినవారున్నారు. అట్టి సిద్ధాంతవ్యాసానికి వేంకటరావుగారే న్యాయనిర్ణేతలుగా వ్యవహరించడం చెప్పుకోదగ్గ విషయం.[2]

నన్నయ పూర్వయుగపు వచనశాసనాలను వారు ఈగ్రంథలో చేర్చారు. వచన శాసనాలని, పద్యశాసనాలని, గద్యపద్యమయ శాసనాలని చరిత్ర కారులు వింగడించారు. నన్నయ పూర్వయుగంలోని వచనలక్షణాలను తెలుసుకోడానికి ఈజేర్పు అనుగుణంగా ఉంటుంది. ఈ ప్రకరణాన్ని వేంకటరావుగారి ముందు వచన వాఙ్మయ గ్రంథాలలో కాని, వెనక వచ్చిన గ్రంధాలలో కాని కనబడదు.

1. తొలిముద్రణ ఆంధ్రగ్రంధమాల, మద్రాసు 1954. మలి ముద్రణ 1977. ప్రకాశకుడు యన్.యస్. సుందరేశ్వరావు.
2. డా॥ ఎం. కులశేఖరరావు 'ఆంధ్రవచన వాఙ్మయం ఉత్పత్తి వికాసం' 1974. వేంకటరావు గారి గ్రంధానికి 20 ఏళ్ల తరవాత పుట్టిన గ్రంధం.

## 5. వీరశైవ వాఙ్మయం

వేంకటరావుగారు నియోగి ఆపస్తంబసూత్ర కౌండిన్యస గోత్రజుడు. చిన్నప్పటి నుండి లింగధారుల ఇంట్లో పెరిగారు. పైగా వారి తండ్రి సుందరం పంతులుగారు పార్థివ లింగపూజా పరాయణులు, శైవసాహిత్యాభిలాషులు, పండితారాధ్యచరిత్ర పరిష్కర్తలు. సర్వేశ్వర, విశ్వేశ్వర శతక రచయితలు. విభూతి రుద్రాక్షధారులు ఇటువంటి వాతావరణంలో పెరిగిన వేంకటరావుగారికి శైవసాహిత్యంపై అభిమానం ఉండటం ఆశ్చర్యం కాదు. వారు చిన్ననాటనే నన్నెచోడుని కుమారసంభవం, పాల్కురికి సోమనాధుని కాలం మొదలైన వ్యాసాలు వ్రాశారు. సహజధారణాశక్తి వల్ల బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు వారి రసనాగ్రంపై నిలిచాయి. వర్ణధర్మ నిర్మూలన, వైదిక మతనిరసన మొదలయిన లక్షణాలతో వెలసిన శివకవుల గ్రంధాలను సనాతన సంప్రదాయ పండితులు ఆర్షసాహిత్యాన్ని మధించినంతగా అవలోడించలేదు. ఇది వేంకటరావుగారి ప్లస్‌పాయింట్.

సూర్యరాయాంధ్ర నిఘంటువు, శబ్దరత్నాకరం దేశీయమై సహజసుందరమైన శివకవుల ప్రయోగాలను శిరసావహించ డానికి కారణం వేంకటరావు గారే. శివ కవుల భాషా సాహిత్యాలపై అనేక వ్యాసాలు వ్రాశారు. బసవపురాణానికి బృహత్పీఠిక వెలయించారు. దేశి కవితా స్రవంతితో తెలుగు సాహిత్యాన్ని పోషించారు. వారిది కేవలం పరిశోధనాదృష్టి కాని మతప్రచారదృష్టి కాదు.

## 6. పీఠికలు: పీఠికాపురం

వేంకటరావుగారు ప్రాచీనాధునిక ముద్రిత గ్రంథాలకు వందల లెక్కలో పీఠికలు వ్రాశారు. నాలుగు ముక్కలలో అభిప్రాయాలు వ్రాయటం ఆయనకు సరిపడదు. సాహిత్యభోక్త కవి మృష్టాన్నపు విస్తళ్ళు.

చతుర సంభాషణా ధురీణులైన గంటి సూర్యనారాయణ శాస్త్రిని - జి.ఎస్. శాస్త్రి, కల్యాణి పత్రిక సంపాదకులు, శృంగార శాస్త్రి, ఖాదిశాస్త్రి అని ఆనాటి వారు పిలిచేవారు. శాస్త్రిగారు ఒకనాడు వేంకటరావుగారి ఇంటికి వచ్చారు. 'ఏం

చేస్తున్నారు?" అని కుశలప్రశ్న వేశారు. "పీఠిక రాస్తున్నా"నని వేంకటరావుగారి సమాధానం. "మీది పీఠికల కొట్టు - కాదు కాదు- మీకాపరమే పీఠికాపురం[1]." అని శాస్త్రిగారు ఛలోక్తి విసిరారు.

"మీ పుస్తకం అందింది. స్థాలీపులాక న్యాయంగా అక్కడక్కడ చదివాను. విశ్వవిద్యాలయాల్లో పఠనీయగ్రంథంగా పెడితే చాలా సంతోషిస్తాను. తీరిక దొరికినప్పుడు సాంతంగా చదివి వ్రాస్తాను."

ఇటువంటి లేఖలు ఆయన వ్రాయరు. గ్రంథం నిశితంగా పరిశీలించి కవిపుట్టుక నుంచి కావ్యాంతం వరకు విస్తారమైన పీఠిక వ్రాస్తారు.

ప్రముఖకవి దాశరథి తన దాశరథి శతకానికి పీఠిక వ్రాయమని కోరితే శతక సాహిత్యాన్ని అంతా తమ పీఠికలో క్రుమ్మరించారు. "నాగ్రంథానికి మీపీఠిక వల్లనే ప్రచారం వచ్చింది" అని దాశరథిగారే లేఖద్వారా తెలియ జేశారు. బోయి భీమన్న దీపసభకి వేంకటరావుగారి పీఠిక అఖండదీపం. పాతపుస్తకాలు పునర్ముద్రణ పొంది వేంకటరావుగారి పీఠికతో బతికి బట్టకట్టు కున్నాయి.

## 7. గ్రంథసంస్కరణలు

వేంకటరావుగారి తండ్రిగారు సుందరం పంతులుగారు అనేకవేల తాళపత్ర గ్రంధాలను సేకరించారు. పండితారాధ్య చరిత్రను పరిష్కరించారు. పైతామహంబైన గ్రంథ పరిష్కరణ వేంకటరావుగారికి వెన్నతో బెట్టిన విద్య. మద్రాసు విశ్వవిద్యాలయంలో చేరిన తరవాత కూడా వారికి తాళపత్ర గ్రంధాలు చేరువలోనే ఉండేవి. విశ్వవిద్యాలయ భవన పుస్తక భండాగారం లోనే ప్రాచ్యలిఖిత పుస్తకాగారం. పాఠభేద నిర్ణయం చేయవలసి వచ్చినపుడు వారికి తాళపత్ర గ్రంధాలే ప్రాథమికాధారాలు. ఆ భాండాగారం ప్రాచీనాముద్రిత గ్రంధాలు ముద్రణ కార్యక్రమం చేపట్టింది. ఆ కార్యానిర్వహణ ఏర్పాటు చేసిన కమిటీలలో తెలుగు

1. వేంకటరావుగారు పిఠాపురంలో సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానంలో కొన్నేళ్లు పనిచేశారు.

కమిటీలో వేటూరి ప్రభాకర శాస్త్రులకు తోడుగా వేంకటరావుగారు కూడా ఉన్నారు. ఖడ్గ లక్షణ శిరోమణి అనే శాస్త్రీయ గ్రంథాన్నే కాకుండా తంజావూరి సరస్వతీ మహల్‌లోని కట్టావరదరాజు ద్విపద రామాయణాన్ని, చెంగళ్వ కాళ కవి రాజగోపాల విలాసాన్ని పరిష్కరించి తమిళనాడు ప్రభుత్వ పక్షాన ప్రకటించారు.

వరదరాజు రామాయణానికి, రాజగోపాల విలాసానికి ఏకైక ప్రతులే శరణ్యాం. తమిళ దేశ మధ్యంలో తెలుగు కాపీ యిస్టులు దొరకడం దుర్లభం. దొరికినా వారి కాపీలు దోషభూయిష్ఠం. వేంకటరావుగారు తమపెద్దకుమారుడు సుందరేశ్వరరావుని వెంటబెట్టుకొని తంజావూరిలోని గ్రంధాలను స్వయంగా పరిశీలించిన పిమ్మట ముద్రణకు ప్రతులను సిద్ధం చేశారు. తాళపత్ర ప్రతులు ఒక్కపట్టున పరిష్కరణకు లొంగవు. కొన్ని ఆకులు విరిగి ఉంటాయి. వ్రాతరోతగా ఉండొచ్చు. శకటరేఖ అర్ధానుస్వారాలు ఉండవు. పాదవిభజనకు గీటు ఉంటుంది. ఋ, ౠ, ఌ , ౡ , లు బదులు రకారలకరాలే కనబడతాయి. లుప్తభాగాలను పూరించడం మేరువెత్తిన భారం అవుతుంది. ఛందఃపరిజ్ఞానం చాలా అవసరం. కవిత చెప్పగల సమర్థులు పద్యాలు కుంటడం ఇట్టే కనుక్కోగలరు. వరదరాజు 'బృహత్ రామాయణం నల్లేరుపై బండి నడకలా సాగినా రాజగోపాల విలాసం కొరకరాని కొయ్యై కూర్చుంది. ఈ గ్రంధాన్ని మొదట డా॥ నేలటూరి వేంకటరమణయ్య గారికి సంస్కరించమని తంజావూరు గ్రంధాలయం వారు ఇవ్వగా "ఇది నావల్ల అయ్యేపని కాదని" తిరగగొట్టారు. అటువంటి గ్రంథాన్ని వేంకటరావుగారు సునాయాసంగా పరిష్కరించారు.

మద్రాసులో ఉన్నప్పుడే మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వ సార పరిష్కరణకు అన్ని హంగులు సమకూర్చుకున్నారు. తరవాత హైదరాబాదులో అది ప్రకటితమైంది.

## 8. నిఘంటు నిర్మాణం

కావ్యరచన వలె నిఘంటు నిర్మాణం సృజనాత్మకమైన పని కాదు. కవి ఏకాకిగా కూర్చుని ధారాశుద్ధితో కావ్యం అల్లగలడు. నిఘంటు నిర్మాణం ఏకైక సాధ్యం కాదు.

కావ్యాలలోని యతిప్రాస స్థగిత ప్రయోగాలు ప్రామాణికం అవుతాయి. ప్రయోగాల పరిష్కర్తలు బుద్ధిపూర్వకంగా మార్చలేరు. నిఘంటు నిర్మాణం కర్మరుడికి ఛందోవ్యాకరణాలు జిహ్వాగ్రం మీద ఉండాలి. కవికి ధారాశుద్ధి ఉంటే ప్రయోగాలు వాటంతటవే దొర్లుతాయి. సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పండితుల వాదోపవాదాలతో వేంకటరావుగారి మెదడు రాటుదేరింది. పండితులు పుస్తకాలు చదివి చెప్పనక్కర లేకుండా అక్కడికక్కడే ప్రయోగాలు గుప్పించేవారు. ఈ అనితరసాధ్య ధారణాశక్తి వల్లనే వారు బహుజనపల్లి వారి శబ్దరత్నాకరానికి 3వేల పదాలను అనుబంధంగా చేర్చారు. ఆ చేర్పడంలో వారొకపద్ధతిని అనుసరించారు. శ.ర.లో లేని పదాలు చేర్చారు; ఉన్న పదాలకు ప్రయోగాలు లేకుంటే వాటిని చూపారు. పదాలను తత్సమ, తద్భవ, దేశ్య, అన్యదేశ్యాలుగా విభజించారు. వేంకటరావుగారి ప్రయోగ నైపుణ్యానికి ఒక ఉదాహరణ.

'కద్రువ నాగమాత[1],' (బాలవ్యా. తత్సమ - 51) అని చిన్నయసూరి సూత్రించాడు. ఇది ఊకారాంత స్త్రీలింగం. కద్రువు అంటే హ్రస్వోకార పుల్లింగం అవుతుంది అర్థం మారుతుంది తన సూత్రం ప్రకారం ఉకారాన్త గోశబ్దాల కంతటా (తత్సమ 48) 'వువర్ణకం' రావాలి. ఈ సమస్య పరిష్కారానికి ప్రామాణికమైన కవిత్రయం వారి ప్రయోగమేమార్గం. వేంకటరావుగారు భారతాన్ని సునిశితంగా పరిశీలించి 'కద్రువ' శబ్దాన్ని, యతిస్థానంలో 'వ' వచ్చే ప్రయోగాన్ని పట్టేశారు

'కద్రు, వయును మున్నీటి చేరువ వనమునందు' (అను 1.181) అనే తిక్కన ప్రయోగాన్ని చూపారు. ఇదే వేంకటరావుగారి నిఘంటు నిర్మాణంలో ఉండే చాతుర్యం. కవిసమ్రాట్. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత విశ్వనాథవారే కితాబు ఇచ్చారంటే ఆశ్చర్యం లేదు.

## 9. భాష, వ్యాకరణం, ఛందస్సు

నిఘంటు నిర్మాణానికి భాష వ్యాకరణం, ఛందస్సు నిశితంగా తెలిసి ఉండాలి. భాష అంటే తత్సమ, తద్భవ, దేశ్య అన్య దేశ్యాలు అన్నీ తెలియాలి

1. బ్రౌన్ Mother of serpents అన్నదానికి తెలుగు.

గ్రామ్యంతో కూడిన ఆంధ్ర భాష తత్సమ, తద్భవాలకు సంస్కృత, ప్రాకృత భాషలు, దేశ్య అన్యదేశ్యాలకు ద్రావిడ, ఔత్తరాహిక, విదేశ భాషలు తెలిసి ఉండాలి. వేంకటరావుగారు - తెలుగు-తమిళం, తెలుగు-సంస్కృతం, తెలుగు-ప్రాకృతం సంబంధాలను తమ వ్యాసాల ద్వారా చర్చించారు. తెలుగు వ్యాకరణాలు ఆంధ్రశబ్ద చింతామణి, తదానునీయ తెలుగు వ్యాకరణాలు ప్రాచీన కావ్యలక్షణాలను భాషాలక్షణాలను సరిగా అవగాహన చేసుకొని రచించినవి కావని వేంకటరావుగారి దృఢాభిప్రాయం. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ వ్రాయలేదని, ఆధునిక మని వారివాదన. వేంకటరావుగారి ప్రాచీన వ్యాకరణాల ద్వారా, తాళపత్ర ప్రతుల ద్వారా నిర్దుష్టమైన ప్రయోగాలను సేకరించి తమవాదాన్ని నిలబెట్టు కున్నారు. ఛందస్సులో వారు రగడల భేదాలయిన కళికోత్కళికలు, ద్విపద ఛందస్సు గానయోగ్యాలని నిరూపించారు. యతిప్రాసలలో ఋ-రు యతిని, ఉ-వు యతిని, ప్రాసలలో వలపల గిలకప్రాసను వారు శాస్త్రీయంగా సమర్థించారు.

## 10. రేడియో ప్రసంగాలు

వేంకటరావుగారు మద్రాసు కేంద్రం నుండి సుమారు 200 ప్రసంగాలు చేశారు. వారి మొదటి ప్రసంగం 'పాట పాడించు సఖీ! ఊర్వశి', కేవలం శుద్ధ పరిశోధక పండితులైన వేంకటరావుగారు ఆధునిక కావ్యాలలో తలమానిక మైన దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'ఊర్వశి' ని గూర్చి శ్రవణపేయంగా, కవిగారు ఊహించని వ్యాఖ్యతో ప్రసంగించారు పిమ్మట, ఆ మర్నాడు దేవులపల్లి వారు మా యింటికి వచ్చి ఆనందోత్సాహాలతో వేంకటరావుగారిని కౌగలించుకొని తమ సంతృప్తిని వెల్లడించి అభినందించారు"[1]

మద్రాసులో వారి చివరి ప్రసంగం (16-10-1964) అంశం "మన కవుల ప్రకృతి దర్శనము - ఋతువులు", వేంకటరావుగారు పాఠశాల కార్యక్రమాలను శిక్షణ పొందిన ఉపాధ్యాయుని వలె ఉపన్యసించారు. కళాశాల విద్యార్థులకు ఎన్నో

---

1. ఈ విషయాన్ని సుందరేశ్వరరావుగారు చెప్పారు.

విషయాలు చెప్పి కనువిప్పు కలిగించారు. సామూహిక కార్యక్రమాలను సమర్థంగా నిర్వహించారు. జనసామాన్యానికి జటిలమైన విషయాలు సుబోధకంగా చెప్పేవారట.

మద్రాసు నగరంలో ఉన్నప్పుడే న్యూఢిల్లీ వెళ్లి 5వ ఆకాశవాణి సాహిత్య సమారోహ కార్యక్రమంలో 'Three decades of Telugu Prose' పై 15 నిముషములు ఆంగ్లభాషలో ప్రసంగించారు (15-4-60) 1966 ఏప్రిల్ 4వ తేదీని కలకత్తా కేంద్రం నుండి "The Dynamic Social Life in India - The Telugu Society of the present Day" అనే అంశం పై ప్రసంగించారు.

ఈ విధంగా ఉత్తర హిందూస్థానంలో తెలుగు పరిశోధకుడు అయిన వేంకటరావుగారు ఆంగ్లేయ భాషలో ప్రసంగించి ఆనాడు చరిత్ర సృష్టించారు.

హైదరాబాదు వచ్చిన తరువాత కూడా సుమారు 50 ప్రసంగాలు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి ప్రసంగించారు.

## ii. ఆంగ్లంలో వ్యాసాలు

అదే విధంగా వెంకటరావుగారు ఆంగ్ల భాషలో 10, 15 వ్యాసాలు వ్రాశారు. వాటి సంపుటీకరణం జరగలేదు. అయినా సందర్భానుసారంగా వాటిని పేర్కొనడం జరిగింది.

## iii. మెకంజీ ఆంగ్లానువాదం

మద్రాసు విశ్వవిద్యాలయం చరిత్ర - పురావస్తు శాఖవారు మెకంజీ సంపుటాలను ఆంగ్లంలోకి పరివర్తింప జేయటానికి మొదట్లో మానవల్లి రామకృష్ణ కవి గారిని నియోగించారు. ఆయన కొంత భాగానికి ఆంగ్లానువాదం చేసి తిరుపతిలో ఉద్యోగం దొరికి వెళ్లిపోయారు. వారు చేసినపని పాతికపాలు మాత్రమే. మిగతా ముక్కాలు మువ్వీసం వేంకటరావుగారు ఆంగ్లానువాదం చేసి పనిపూర్తి చేశారు. ఇందుకు వేంకటరావుగారిని అప్పటి వైస్ ఛాన్సలర్ ఆర్. రామస్వామి మొదలియార్ శ్లాఘిస్తూ ఉత్తరం వ్రాశారు. మద్రాసు విశ్వవిద్యాలయం చరిత్ర విభాగం వారు ఇటీవల వాటిని ముద్రించారు.

నిడుదవోలు వేంకటరావుగారి సూక్తులు, చాటువులు, చతుర సంభాషణలు మిగిలిపోయాయి. వాటిని సేకరించడం జరిగింది. కానీ, ఈ సిద్ధాంత గ్రంథ లక్ష్యం వారి రచనల పరిశీలనకే పరిమితం కావడం వల్ల వాటినీ చేర్చలేదు.

ఆయన రచనల పట్టికను, కొన్ని ప్రశస్తి పత్రాలను అనుబంధంలో పొందుపరచడం జరిగింది.

"తెలుగుభాష వెలుగుతున్నంత వరకు, తెలుగు వాఙ్మయం ప్రవహిస్తున్నంత వరకు, తెలుగులో పరిశోధన పయనిస్తున్నంత వరకు.... నిడుదవోలు వేంకటరావుగారు విద్వత్కాంతులు వెలార్చుతూనే ఉంటారు."

## ౭౦

# ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి ప్రఖ్యాపన ప్రసంగము

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నలుబదియాఱవ పట్టప్రదానోత్సవ సభలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి కళాప్రపూర్ణ బిరుదమిచ్చిన సందర్భమున 29-10-1973 తేదీని, పరిషదధ్యక్షులైన ఆంధ్రప్రదేశ గవర్నరు శ్రీ ఖండూభాయిదేశాయి సమక్షమున సి. జగదీశ్వరరావు చేసిన ప్రఖ్యాపన ప్రసంగము.

అధ్యక్షమహాశయా!

అధునాతన కాలమున ఆంధ్రభాషా సాహిత్యముల కనితరసాధారణముగు కృషి గావించిన వారును జంగమ విజ్ఞాన సర్వస్వ పరిశోధన పరమేశ్వరాద్యనేక బిరుద భ్రాజితులునూనగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిని భవదాజ్ఞానుసారముగ ఈ స్నాతక పరిషన్ముఖమున పరిచయము గావించుచున్నాను.

శ్రీ వేంకటరావుగారు 1904వ సంవత్సరమున విజయనగర మందు విద్వత్కుటుంబమున జన్మించిరి. విజయనగర కళాశాలయందే పట్టభద్రులైరి. కొంతకాలము తరువాత మదరాసు విశ్వవిద్యాలయమున ఎమ్.ఏ. పట్టముతోపాటు బంగారుపతక బహూకృతిని గూడ నందిరి, తొలుదొల్త వారు చేపట్టిన యుద్యోగము ధన విషయమున చిన్నదయ్యు, పరిశోధన విషయమున జిరస్మరణీయమై, ఆంధ్రశైవ వాఙ్మయ విచారణాత్మక బహు విధవ్యాస రచనా వ్యాసంగమునకు కారణమైనది, కవి ప్రయోగములందీ పండిత ప్రకాండులకు గల అద్భుత శక్తికి శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున వీరు కావించిన కృషి చాలవఱకు కారణ మనవచ్చును.

వేంకటరావుగారు ఏకసంధాగ్రాహి, ఆంధ్ర వాఙ్మయమున వీరు చదువని గ్రంథము లేదు, చదివి మఱచిన ప్రయోగ విశేషము లేదు - ఛాయాగ్రహణ యంత్ర సన్నిభమగు వీరి మనఃఫలకముపై ముద్రితమైన సారస్వతాంశములకు క్షతి లేదు-

అసాధారణమగు నీ మేధాసంపత్తిని దిలకించియు సమస్త విద్వల్లోకము, వీరిని జంగమ విజ్ఞాన సర్వస్వ బిరుదమున బహూకరించినది.

శ్రీ వేంకటరావుగా రాంధ్రభాషాయోషకు గావించిన సేవ అపారము. అనితర సాధారణము, ఆంధ్రమున వీరు రచించిన గద్యపద్య గ్రంధము లనేకములు గలవు. అందు తెలుగు కవుల చరిత్ర, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము వచన వాఙ్మయము, ఉదాహరణ వాఙ్మయ చరిత్ర మున్నగు గ్రంధము లీ విమర్శకాగ్రణికి సర్వాంధ్ర జనతాంజేగీయ మానమగు మహాకీర్తి నార్జించినవి. వివిధ సారస్వత పత్రికలయందు వీరు ప్రకటించిన వ్యాసములును, పెక్కు గ్రంధములకు వీరు రచించిన విమర్శనాత్మకములగు పీఠకలును లెక్కకు మిక్కిలిగా నున్నవి. వీరు రచించిన కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము, విజయనగర సంస్థాన సాహిత్య పోషణము అను గ్రంధములకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు లభించినవి. ఆంధ్ర వచన వాఙ్మయములకు తెనుగుభాషా సమితివారి బహుమతి లభించింది.

శ్రీ వేంకటరావుగారు కేవలము విమర్శకులేగాక కవులు గూడ. వీరి కావ్య నిర్మాణ కౌశలమున కుదాహరణముగ మించుపల్లియను కావ్యమును గైకొనవచ్చును. వీరు కావించిన వాఙ్మయసేవ కలరి కొందఱు మనీషి పుంగవులు వీరికి సువర్ణ ఘంటాకంకణమును బహూకరించిరి.

ఏవం విధగుణగణ విశిష్టులును, నిరంతర సాహితీ సేవాపరాయణులును అగు శ్రీ వేంకటరావుగారికి “కళాప్రపూర్ణ” అను డాక్టరు బిరుదమును ప్రసాదింప విశ్వకళాపరిష దధ్యక్షుల నభ్యర్థించుచున్నాను.

'విద్యారత్న', 'కళాప్రపూర్ణ',

# డాక్టరు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి

సర్ త్యాగరాయ కళాశాల, (మద్రాసు) ఆంధ్రవిజ్ఞానసమితి సమర్పించు

# సన్మాన పత్త్రము

మహాశయా!

ఆంధ్రమాతా కంఠాభరణ మణియై, కళలకు నెలవగు 'విజయనగరము'న విద్వాంసుల వంశమున ప్రభవించారు మీరు. 'పూవు పుట్టగానే తావి విరిసే'టట్లు చిఱుతనాటనే మీరు సాహితీ సౌరభమును వెదజల్లినారు.

సాహితీ సముద్రులు మీరు మద్రాసు విశ్వవిద్యాలయమున ఎం.ఏ. పట్టభద్రులై, నిర్నిద్రముగ సాహితీ సంసేవ గావించుటకు అచటనే పరిశోధకులైనారు. మీ పరిశోధనా పథమును అనుసరించి, అసంఖ్యాకులు సాహితీ పరతంత్రులు ఆంధ్రవాణీ వీణాతంత్రులను సారించినారు.

"త్రిపురాంతకోదాహరణము"తో తరుణమైన మీ విమర్శనాత్మక పరిశోధన 'సూర్యరాయాంధ్ర నిఘంటువు' వంటి మహత్తరమూ, బృహత్తరమూ అయిన కూలంకష భాషాయోషా శుశ్రూషతో పరువమొంది. ఉదాహరణ వాఙ్మయము వీరశైవసాహిత్యము, సమగ్రనిఘంటు సర్వస్వము - ఇత్యాది ప్రక్రియలలో తెలుగున వెలుగు చూపినది. చిరకాలము పరిశోధనా చక్షువు విప్పారని ఆంధ్రసాహితీ జగత్తునకు కర్మసాక్షి వలె జాగృతి కలిగించి, చేతన వెలిగించి, రస పిపాసులకు సమరస లోచన మిచ్చినారు మీరు.

ఆంధ్రభాషపై మీ అధికారమూ, ఆదరమూ అపారము, "జంగమ విజ్ఞాన సర్వస్వ" మనుట మీయందే విన్యస్తము. మీ ధారణాశక్తి అసాధారణము, అపరిచిత కవి విరచిత కృతులందు సైతము మారుమూల మడులను, గద్య పద్యములను

కూడ తడుముకొనక అనర్గళధారతో జడివాన కురిపించు మీరు విద్వజ్జన సమాజముచే "ఏకసంధాగ్రాహి'గ ఏకగ్రీవముగ నుతులైనారు.

మీ అశేష భాషాకృషికి సంతోషించి, ఆంధ్ర విశ్వవిద్యాలయము మిమ్ము సమ్మానించి 'కళాప్రపూర్ణ' బిరుదాంకితులను చేయుటచే ఆ సదస్సున మీ యశస్సు విలసిల్లినది. నాడు 'విద్యారత్న'మైన మీరు నేడు 'కళాప్రపూర్ణు'లగుట భారతికి ఆరతి నిచ్చుట యైనది.

మీరు పరిశోధించి, వెలువరించి నించిన వ్యాసములు, పదకోశములు, విమర్శలు, సమీక్షలు వందల సంఖ్యను అందినవి. ప్రాచీన తాళపత్రాగారము నందలి కావ్య సాగరమును తరచి, మణులను వాణికి భూషణములుగ సమర్పణ మిచ్చినారు మీరు. మీరు మధింపని, శోధింపని సాహితీ స్రవంతి లేదు. పూర్వకవుల అపూర్వ కృతులను విమర్శించుట యందే కాక, 'మించువల్లె' తెలుగు పొలుపు' వంటి స్వతంత్ర కృతులను విరచించుటయందును మీ బహుముఖప్రజ్ఞ విజ్ఞుల మన్ననల నందినది.

సాహితీ విశారదు లైన మీరు ఇంకను శారదకు ఉపచారము చేయుట అత్యావశ్యకము, 'కళాప్రపూర్ణు' లైన మిమ్మినాడు మాకళాశాల సమ్మానించుట కళావిధి కొక నూలుపోగు సమర్పించుట వంటిది. ఈశ్వరుడు మీ కాయురారోగ్యై శ్వర్యముల నిచ్చుగాత మని ప్రార్థిస్తున్నాము.

సర్వత్ర విజయో భవతు.

# సమ్మానమునకు ప్రత్యభిభాషణము

చెన్నపురి శ్రీ త్యాగరాయ కళాశాలవారు, తమకు చేసిన సమ్మానమునకు శ్రీ వేంకటరావుగా రీ క్రింది రీతిని ప్రత్యుత్తర ప్రసంగము చేసిరి.

"ఆధునిక యుగమున నాంధ్ర సాహితీ కేంద్రమైన చెన్నపురిలోని సర్ శ్రీత్యాగరాయ కళాశాల ఆంధ్ర విజ్ఞాన సమితివారు ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు నాకు కళాప్రపూర్ణ బిరుదము నిచ్చిన సందర్భము కారణము నీ మహా సభ నేర్పాటు చేసినారు. కాని యీ యేర్పాటునకు కారణము లింకను గలవు- వినండి.

సీ. దివ్యాంధ్ర తేజఃబు దీపింప జేసెడి
మహితమౌ దేశాభిమాన మొకటి
వేదకాలమునుండి విశ్రుతం బగుచున్న
మాన్యమౌ నాంధ్రాభిమాన మొకటి
చిలువలు పలువలై చేవదేరినయట్టి
మానిత సంఘాభిమాన మొకటి
సత్కళాధుర్యమై సహజమాధుర్యప్ర
ధానమౌ భాషాభిమాన మొకటి

గీ. కారణంబులు నుద్బోధకములు గాగ
సంఘటించితి రీ మహాసభను నేడు
చెన్నపురి త్యాగరాయ ప్రసిద్ధ సత్క
ళాలయాంధ్ర సాహిత్య విద్యార్థులార!

## శ్రీ త్యాగరాయచెట్టి

ఈ శుభ దినమున స్మరింప దగిన మహాపురుషు లిరువురు. ప్రథముడు భారత వర్షమున స్వాతంత్ర్య ప్రథమ పథికుడు. గాజుల లక్ష్మీనరుసుచెట్టి - ద్వితీయుడు అద్వితీయుడు త్యాగరాయచెట్టి - ఆయన పేరనే వెలసినదీ కళాశాల-

ఉ. అప్రతిమానుఁడై యరవలాంధ్రులు నాంగ్లులు మెచ్చునట్టికీ
ర్తి ప్రభ నేలె నెవ్వఁడు కిరీటము లేని నృపాలు పోలికన్.
విప్రతిపత్తి లేని జనవిశ్రుతుడై తగు త్యాగరాయశె
ట్టిప్రభు పేర నొప్పు ప్రకటీకృత దివ్యకళాశాలయం బిదే.

మద్రాసునకు మహనీయమగు యశము గడించిన వ్యక్తి త్యాగరాయశెట్టి- ఆయన అధికారుల మన్ననకు ఎంతగా పాత్రుడో అంత స్వాతంత్ర్య ప్రియుడు- ఒక చిన్న యుదాహరణము - 1921లో భారత స్వాతంత్ర్య సమరము ప్రారంభమైనది. కాని ఆంగ్ల పరిపాలనమే యుచ్చదశయై యుండెను ఆనాడు వేల్సు యువరాజు (ఆరవజార్జి) చక్రవర్తి - హిందూదేశమును దర్శించుటకు వచ్చెను, మదరాసులో ఆయన వచ్చినప్పు డప్పటి రాష్ట్ర పాలకుడు (గవర్నరు) - అన్ని యేర్పాట్లు గావించెను. వానిలో నే లోపము గల్గినను, అది రాష్ట్ర పాలకునికి మాట యగుటయే గాక గౌరవభంగము - ఆ సమయమున త్యాగరాయశెట్టి - పురపాలక సంఘాధ్యక్షుడు -(Mayor of Madras Corporation) యువరాజ సందర్శన సమయమున మొదటి పరిచయము చేయదగిన వ్యక్తి మేయరే - దానికి నియమితమైన దుస్తులతో (ఆంగ్ల వేషమున) నాతడు రావలయును. త్యాగరాయశెట్టిగా రట్లు చేయలేదు. సరిగా, తన నియమిత కాలమునకు తన జాతీయమైన దుస్తులతో, మేయరు పట్టముతో వచ్చెను. రాష్ట్రపాలకుడు తనకు మాటవచ్చుట తథ్య మని ఆందోళ పడుచుండెను కాని వేల్సు యువరాజు కరచాలనము చేసి -I am glad you were in your National dress. (మీరు జాతీయమైన దస్తులతో వచ్చుట, నాకు సంతోషమైనది) అని ప్రశంసించినాడు. ఆనాడు అన్ని పత్రికలు ఆయన స్వాతంత్ర్య ప్రియత్వము కొనియాడినవి.

ఆయన పేర, నొక శాఖానగర మున్నది. కళాశాల యున్నది గాని ఆయనకు శాశ్వత చిహ్నము

**శిలా విగ్రహము**

అట్టి శిలా విగ్రహ మీ కళాశాలావరణమున గాని లేక త్యాగరాయ

నగరమున-మధ్యమున గాని స్థాపించుట చెన్నపురీ నివాసుల కర్తవ్యము - వారి జీవిత చరిత్ర మాంగ్లాంధ్ర తమిళ భాషలలో ప్రకటితము కావలెను.

సన్మాన పత్రమున, నేను చేసిన సాహిత్య సేవను గూర్చి మదరాసు విశ్వవిద్యాలయమున నేను చేసిన పనులను గూర్చి వివరముగా దెలుప బడినది - బహుధా ప్రశంసింప బడినవి.

## నా జీవితమున మలుపు

నేను తక్కినవారివలె, ప్రథమమునుండి, కళాశాలలనుండి విశ్వవిద్యాలయమునకు వచ్చినవాడను గాను - నేను పండ్రెండు సంవత్సరములపై కాలము బ్యాంకు గుమస్తాగా నున్నాను - అది పూర్వము ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, అను పేరుతో నుండెను. నే డది స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా - ఆ బ్యాంకు పనినుండి తప్పించి, సాహిత్యరంగమున నన్ను ప్రవేశపెట్టి - నా జీవితమును మలిచిన వారిలో మొదటివారు

## శ్రీ పిఠాపురము మహారాజావారు

నేను సాహిత్య రంగమున ప్రవేశించుట యనగా మదరాసు విశ్వవిద్యాలయమున ప్రవేశించుటయే - ఆ కథ యంతయు విస్తరించుట కిది యవసరము గాదు.

ఈనాడు విశ్వవిద్యాలయములలో నున్నవారికి నాకు నొకటే భేద మున్నది, బ్యాంకు అంకెల మయము, సాహిత్యము అక్షరమయము.

నేను - అంకెలనుండి అక్షరముల లోనికి రాగా - నేటి విశ్వ విద్యాలయమున నున్నవారు - అక్షరములనుండి అంకెలలోనికి వచ్చినారు.

నా మద్రాసు జీవితము దిద్ది తీర్చిన మఱి యిరువురు మహావ్యక్తుల నీ శుభదినమున సంస్మరించుచున్నాను.

## శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు

నేను ఆంధ్ర పత్రికా భారతి సంస్థలతో కడచిన ఏబది రెండేండ్ల నుండి సంబంధమున్నవాడను. వాఙ్మయ ప్రపంచమున భారతితో పాటు నాపేరు శాశ్వతము గావించినవారు వారే - నేటికిని భారతి నా సాహిత్యజ్యోతిని వెలిగించుచునే యున్నది. వారి కుమారులును ప్రస్తుత భారతి సంపాదకులు నైన శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి భగవంతు డాయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాక -

## శ్రీవావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారు

ఆంధ్ర గ్రంథప్రకటన కాదిపీఠ మైన - వావిళ్ళ సంస్థ అధిపతులు, శ్రీ వేంకటేశ్వర శాస్త్రి గారు. నా ప్రాచీన సాహిత్య పరిశ్రమకు, లోకమునకు వెల్లడించినవారు శాస్త్రిగారు - వావిళ్ళ సంస్థతో నాకు గల పరిచయమును గూర్చి పత్రిక ఇట్లు ప్రశంసించినది.

"ప్రాచీనుడగు నన్నెచోడ కవి కుమార సంభవము మొదలుకొని నవీన యుగకర్త గురజాడ అప్పారాయ కవి ముత్యాల సరసముల వఱకు అసంఖ్యాకమైన కావ్యములను వావిళ్ళ వారిచేత ప్రకటింపజేసి యున్నారు."-

వావిళ్ళ సంస్థను పునరుద్ధరించుట మన కర్తవ్యము.

నేను మదరాసు విశ్వవిద్యాలమున, సహోపన్యాసకునిగా, శాఖాధ్యక్షునిగా- **1944** నుండి **1964** వఱకు ఇరువదేండ్లు పనిచేసి ఆ శాఖాచరిత్రలో నూతన నాధ్యాయము "సృష్టించి, పేరు ప్రతిష్ఠలు గడింప జేసినాను. నే నా విశ్వవిద్యాలయమున బహుముఖములుగా చేసిన పరిశ్రమ, ప్రకటించిన గ్రంథములు, తెలుగు విశ్వవిద్యాలయమున నేశాఖాధ్యక్షుడును చేయలేదు. నేను చేసిన పనిని గూర్చి - విశ్వవిద్యాలయ శతవార్షిక సంచిక యందు గలదు. ఇది ఆంధ్రసాహిత్య ప్రపంచమున కంతకు సుపరిచితమైన విషయము.

ఎంతో విశిష్టమైన పరిశ్రమ చేసినను, నాకైదేండ్లింకను పనిచేయుటకు నవకాశ మున్నను - అప్పటి ఉపాధ్యక్షుడైన శ్రీ లక్ష్మణస్వామి మొదలియారుగారు,

నాకరువదియేండ్లు నిండగానే - నన్ను శాఖాధ్యక్ష పదవినుండి విరమింప జేసినారు. అప్పుడు నేను నుద్యోగము చేయుట నా పరిస్థితులను బట్టి అత్యావశ్యక మగుటచేత, హైదరాబాదునకు వెడలి - అచ్చట ఉస్మానియా విశ్వవిద్యాలయమున, నాలుగేండ్లు U G C. Professor గా నుంటిని - అక్కడ నింకను నొకటి రెండు సంవత్సరములు పనిచేయుట కవకాశమున్నను, నా కది లభింపలేదు -

ఇట్టి పరిస్థితులలో, విశ్వవిద్యాలయములలో నేను చేసిన సాహితీ పరిశ్రమను గుర్తించి నాకు -

## కళాప్రపూర్ణ

బిరుదమును నొసంగిన - ఆంధ్ర విశ్వవిద్యాలయము వారికి తదుపాధ్యక్షులైన శ్రీ యల్. బుల్లెయ్యగారికి నేను శాశ్వతముగా గృతజ్ఞుడను -

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు - విశ్వవిద్యాలయము ఆదర్శ విశ్వవిద్యాలయముగా నవతరింప జేయుటకు శ్రీ బుల్లెయ్య గారు చేయుచున్న కృషి ఫలవంతమగు గాక!

**1964**లో నేను మదరాసు వీడిన పదేండ్లకు, తిరిగి మదరాసునకు వచ్చుట కవకాశము కల్పించుటయే గాక, నాకు సన్మానము చేసినందులకు శ్రీ త్యాగరాయ కళాశాల ఆంధ్ర విజ్ఞాన సమితి వారికి, నా మనఃపూర్వక కృతజ్ఞతా సూచక వందన కుసుమ సముచ్చయము నర్పించుచున్నాను. ఈ కళాశాల సర్వతోముఖాభివృద్ధికి మూలస్తంభాయమాను లైన - కళాశాలాధ్యక్షులు - డాక్టరు మదనమోహన రావుగారికి - ఈ మహాసభకై నిరవధిక కృషిచేసి - సన్మాన మహోత్సవము జయప్రదము గావించిన - తెలుగు శాఖాధ్యక్షులు శ్రీ చిలుకూరి నారాయణగారికి నా కృతజ్ఞతలను మఱియొకసారి తెలియజేయు చున్నాను -

## నేను తమిళనాటివాడను

సభాధ్యక్షులైన గౌరవనీయ న్యాయమూర్తులు శ్రీ రామప్రసాదరావుగారు, నేను తమిళనాటి బిడ్డనని ప్రకటించి నందులకు, వారికి నా కృతజ్ఞత ఎట్లు

తెలుపవలెనో తెలియకున్నది. వారు చెప్పినది వాస్తవము - నేను నా సాహిత్య జీవితమంతయూ చెన్నపురినే గడిపినాను - మదరాసు విశ్వవిద్యాలయమువారు, నన్నుద్యోగము నుండి విరమింపజేయ కున్న నేనీ తమిళనాటిలోనే యుండెడివాడను- ఈ నడుమ నేను హైదరాబాదులో నున్నను - నాకు తమిళనాటితో అవినాభావ సంబంధము గలదు. నా పెద్దకుమార్తె మద్రాసు లోనేయున్నది, నా మనుమరాలు సిగరుజీవి

## జయసుధ

నేడు, తమిళ చలన చిత్ర రంగమున ననేక చిత్రములలో నటించి, ప్రవర్ధమాన యగుచు, నాకు కీర్తి తెచ్చుచున్నది. ఇది నాకు గర్వకారణము.

నాకు కళాప్రపూర్ణ బిరుదము వచ్చిన తరువాత - ప్రథమ సన్మాన సభ తమిళ నాటికి రాజధానియైన చెన్నపురిలోనే జరుగుటయు నేను తమిళనాటి వాడనన్న యంశము స్థిరపఱచు చున్నది - ఈ సందర్భమును పురస్కరించుకొని, నాకు తిరిగి - విశ్వవిద్యాలయ తెలుగు శాఖతో నన్ని వ్యవస్థలయందు గల సంబంధమును, పునరుజ్జీవింప జేయుదు రని, నా యనుభవము, వినియోగించు కొనవలసిన దని మదరాసు విశ్వవిద్యాల యోపాధ్యక్షు లైన తిరు యన్.డి. సుందర వడివేలు గారికి విన్నవించుచున్నాను.

## చెన్నపురి తెలుగు సాహిత్య కేంద్రము

ఆంధ్ర సాహిత్యమున, ఆధునిక యుగ ప్రారంభమునుండి నేటివఱకు - మదరాసు తెలుగు సాహిత్య కేంద్రమే - ఈ విషయమును, నేను, పత్రికల మూలమున నీవఱకే వాఙ్మయ చరిత్రకారుల దృష్టికి తెచ్చినాను - నవ్యాంధ్ర సాహిత్య చరిత్ర యనగా, మద్రాసు సాహిత్య చరిత్రయే - ఆంధ్రుల సాహిత్య చరిత్రకు స్థిరత్వము సంఘటింప జేసినది తమిళనాడు కావున చెన్నపురిని తెలుగు సాహిత్య కేంద్రముగా తిరిగి రూపొందించుటకు -

## చెన్నపురి ఆంధ్రమహా జనులు

సర్వ విధముల ప్రయత్నములు చేయవలసినదిగా నభ్యర్థించుచున్నాను - నేను, సర్వదా, సర్వథా, మీకు సహాయము చేయుటకు సంసిద్ధుడనని విన్నవించుచున్నాను -

గీ. *అతులితం బగు ద్రవిడ భారతికి జూడ*
*తమిళమును తెల్గు రెండు నేత్రములు గాన*
*తమిళనాడున తెల్గు కేంద్రంబు మగుడ*
*నలరఁజేయుడు చెన్నపురాంధ్రులార!*

ఇతి శివమ్-

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

## విశిష్ట సభ్యత్వప్ర న సమావేశము

**18-1-1976**

విద్యారత్న, కళాప్రపూర్ణ

**శ్రీ నిడుదవోలు వేంకటరావు గారిని**

**గూర్చి**

**డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి**

**అధ్యక్షతన**

**డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు చేసిన**

**ప్రశంస**

# విద్యారత్న కళాప్రపూర్ణ

# శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు

విశాఖమండలమునకు విభూషణమని చెప్పఁదగిన విజయనగరమున నియోగి విద్వత్కుటుంబము నందు జన్మించి (10-1-1904), విశాఖ పట్టణమందలి సి.బి.యం. ఉన్నత పాఠశాల యందును, అంకితం నరసింగరావు సతీమణి కళాశాల యందును, విజయనగర మహారాజ కళాశాల యందును విద్యాభ్యాసము కావించి పట్టభద్రులై, మదరాసు విశ్వవిద్యాలయమున నాంధ్రభాషా సారస్వతములందు ఎం.ఏ పట్టము గ్రహించి స్వీకృత స్వర్ణపతక బహూకృతులై, బ్యాంకులో నుద్యోగులై, నిఘంటు నిర్మాణ కళాదక్షులై, ఆంధ్రోపన్యాసకులై, విశ్వవిద్యాలయాచార్యులై, పరిశోధన పరమేశ్వరులై, వివిధ విద్యాసారస్వత చరిత్ర స్మారక సంఘసభ్యులై, కవికంఠీరవులై, వ్యాసకర్తృశేఖరులై, ఉపన్యాసక చూడామణులై, వివిధ బిరుద విశిష్ట సమ్మాన విభ్రాజమానులై - అనేకాముద్రిత పూర్వ మహాకవి విరచిత గ్రంధ సంపాదన సామర్థ్య తదుపోద్ఘాతరచనా వైచక్షణ్య ప్రదర్శిత పాండితీ విస్మాపి తాశేషమనీషి మండలులై, పరిశోధన ప్రావీణ్య విమర్శన వైశారద్య వ్యాసరచనా వైదగ్ధ్య విశిష్టతా విస్తారిత విఖ్యాతి వైభవ విమలీకృత సర్వాంధ్ర విషయులై, సంపాదిత సర్వవిషయ సమగ్ర సంవిత్సంపత్సమార్జిత జంగమ విశ్వ విజ్ఞానకోశ సార్థకాభిధా సంశోభితులై, విద్వ ద్విద్యార్థుల మనన్న లందుకొన్న మహనీయ సహృదయభావులు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

శ్రీ వేంకటరావుగారి కుటుంబము కవితావైదుషీ పరిమళ విరాజమానము. ఇంపీరియల్ బ్యాంకు నందలి ఉద్యోగముతో నుపక్రమించిన వారి జీవితము విశ్వవిద్యాల యాచార్య పదవికే వన్నెలుదిద్దుట విస్మయావహముగా నుండును. బ్యాంకును వాఙ్మయమును అర్థసంబంధులేయయ్యు మొదటిది బాహ్యమును రెండవది ఆంతరమును అగుటచే సహజ సరస హృదయులైన వేంకటరావుగారిని సారస్వతమే ఎక్కువగా సమార్జించినది. వారు తొలుత సాహితీ భోజులైన పిఠాపుర మహారాజుగారి అనుగ్రహమునకు పాత్రులై సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణ

కార్యాలయమున పండితులుగా నియమింపబడి, తరువాత వారి కళాశాల యందే ఉపన్యాసకులై, పిమ్మట తమ పరిశోధన పాటవముచే మదరాసు విశ్వవిద్యాలయమున నుపన్యాసకత్వమును, ప్రాధ్యాపక పదవిని, సంపాదించి ఆంధ్రభాషాయోష కపూర్వములైన అలంకారముల నలవరించిరి. ఉద్యోగ విరమణానంతరము వారు విశ్వవిద్యాలయ విరాళసంఘము వారి గౌరవ వేతనము నంది ఉస్మానియా విశ్వవిద్యాలయమున మూఁడేండ్లాచార్యత్వమును నిర్వహించిరి. ఆ సమయముననే వారాంధ్ర మహాభారత సంశోధిత సంపుట విధానమున సహాయులై దాని కెనలేని ఘనత నాపాదించిరి. వయసు ముదిరినను వాఙ్మయ వనిత వారిని విడువక వారి సాహచర్యమున అపూర్వ సంస్కా రాలంకృతము లైన అపత్యముల నందిచ్చుచునే యున్నది.

వింశతివర్ష దేశీయులై నప్పటి నుండియు శ్రీ వేంకటరావుగారు పరిశోధన పరిశ్రమయందే వ్యగ్రులై యుండినను అప్పుడప్పుడు కవితా కామినీ కటాక్ష వీక్షణములకుఁ గూడ గుఱికాక పోలేదు. వారి మించుపల్లి కావ్యము పలువురు విద్వాంసుల ప్రశంస లందుకొనుటయే కాక ద్విత్ర విశ్వ విద్యాలయములలో కళార్థులకు పాఠ్యగ్రంథముగా కూడ నిర్ణయింపఁబడినది. అందలి ప్రథమభాగము ఉత్తరాంధ్రమునందలి ఒక ఆదర్శ గ్రామమునకు సంబంధించిన కథ. తెలుఁగు పొలుపను ద్వితీయ భాగము తెలుఁగు భాషా సారస్వతము తీరు తియ్యములను తెలుపు అచ్చ తెలుఁగుకృతి. ఈ రెండు భాగములందలి పద్యములును ప్రౌఢములై, ధారాశుద్ధి శోభితములై, జాతీయపదప్రచురములై, పరితలకు శ్రీ వేంకటరావుగారు మహాకావ్య రచన కేల కడంగి యుండలే దను కలఁత కలిగించు చుండును. రెండవ భాగ మచ్చ తెలుఁగులో వ్రాయఁబడినను మధుర మంజులమై వారి కాంధ్రభాషపైఁ గల యధికారమును వ్యక్తము చేయుచుండును. వారి ఆంధ్ర నలందాశతకము స్వరూపమున శతకమేయయ్యు ఆంధ్ర వాఙ్మయము నందలి అష్టోత్తర శతమహాకవుల రచనా సౌందర్యమును వర్ణించుచు సహృదయులకు సినీమాలోవలె నాసారస్వత మూర్తుల నందఱిని సాక్షాత్కరింపఁ జేయుచున్నది. ఇవిగాక విద్యాభ్యాసము ముగియఁగనే వారు వేంకటరమణకవి యనుపేర వివిధ పత్రికలలో, బ్రచురించిన హృద్యపద్యము లనేకము లున్నవి.



యందే
యమున
షాయోష
ము వారు
స్మానియా
ముననే
కెనలేని
వక వారి
చ్చుచునే

రిశోధన
కటాక్ష
లువురు
ములలో
భాగము
తెలుగు
ములను
ములును
కు శ్రీ
లిగించు
జులమై
ఆంధ్ర
నందలి
ములకు
చున్నది.
వివిధ



శ్రీ వేంకటరావుగారు చేసిన, చేయించిన పరిశోధనములును, సంపాదించి యుద్గ్రంధములును, సంస్కరించి యుపోద్ఘాతములు రచించిన పూర్వాధుని కావ్యములును, వివిధ పత్రికలలోను, విజ్ఞాన కోశములలోను స్మారక సంచిక లోను వెలయించిన వ్యాసములును అసంఖ్యాకములై నట్టివి. మదరాస విశ్వవిద్యాలయమున నాంధ్రశాఖాధ్యక్షులుగా నుండి ఆంధ్రకవుల జీవితము దక్షిణాంధ్ర సారస్వత చరిత్రము, కొన్నిశాసనములు, ద్రావిడభాషా పదము తులనాత్మక పరిశీలనము మున్నగు పరిశోధన గ్రంధములెన్నో రచించి వారాంధ్రేతర ప్రాంతమం దున్న ఆ విశ్వవిద్యాలయమున కాంధ్రభాషా పరిశోధన విషయమున నొక ఆధికారికత్వము [illegible]హించిరి. విశ్వవిద్యాలయము శతాబ్ద్యుత్సవ సందర్భమున వారు రూపొందించిన ఆంధ్ర ప్రదర్శన మాగతులైన పెద్దల కానందాశ్చర్యములు కలిగించుటే కాక అన్యశాఖల కాదర్శముకూడ కాజాలినది. వారి త్రిపురాంత కోదాహరణము, ఆంధ్రవచన వాఙ్మయము, ఆంధ్ర కర్ణాటకముల పరస్పర ప్రభావము, విజయనగర సంస్థాన సాహిత్య పోషణము మున్నగు గ్రంధములు తెలుగు భాషాసమితి యొక్కయు, ఆం. ప్ర. సా. అకాడమివారి యొక్కయు బహుకృతుల నందుకొన్నవి. ఉదాహరణ వాఙ్మయచరిత్ర వారిపరిశోధన ప్రావీణ్యము పరాకాష్ఠనందిన అపూర్వ గ్రంధము. వారి చిన్నయసూరి జీవితము దురదృష్ట వశమున ప్రస్తుతము పలువురి అపప్రలాపముల కాస్పదమగు చున్నను ఆంధ్రభాష కనన్యసాధ్యము నకలంకము నైన వరివస్య కావించిన ఆ మహా వైయాకరణుని జీవిత విశేషములను వెలువరించు విలువైన గ్రంధము. వారి పోతన జాతీయ గ్రంధనిధివారిచే ప్రచురితమై బహుళ ప్రచారము గాంచినది. ఇవిగాక వీరు భాషా సారస్వతములను గూర్చియు ఛందో వ్యాకరణాదులను గూర్చియు రచించిన మహాగ్రంధము లీ[illegible]దింకను అముద్రిత ములుగానే యుండి పోయినవి. అవి ముద్రితము లగుచో నాంధ్ర సారస్వత మూర్తికిని వేంకటరావుగారి కీర్తికిని మఱింత వన్నె కలిగించు ననుటలో సంశయము లేదు.

తాళపత్ర గ్రంధములను పరిశోధించి ప్రకటించిన సజీవులైన విద్వద్బృందారకులలో శ్రీ వేంకటరావుగారగ్రగణ్యులు. మదరాసు ప్రభుత్వ లిఖిత గ్రంధ

భాండాగారమునకును, తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమునకును గ్రంథముల నెన్నిక చేయు సంఘమున వారు పెక్కు సంవత్సరములు సభ్యులై యుండటయే కాక సంపాదక సంఘమున సైతము ప్రముఖ స్థానము వహించి, ఖడ్గలక్షణ శిరోమణి, వరదరాజ ద్విపద రామాయణము, రాజగోపాల విలాసము మున్నగు నపూర్వ గ్రంథములను సంపాదించి, సారస్వతోపాసకు లందఱును వానిని చదివి సంతోషించు నవకాశము కలిగించిరి. ఇంక వారి యుపోద్ఘాతములచే నలంకృతములై ద్విగుణీకృత ప్రచారమునందిన పూర్వాధునిక గ్రంథముల సంఖ్యేయములు. వానిలో వసుచరిత్ర, ఉత్తర హరివంశ, దీపసభాది కావ్యము లున్నవి; శ్రీ వేంకటేశ్వర శతకాది శతకము లున్నవి; అప్పకవీయ కవి సంశయ విచ్ఛేదాది ఛ్చందో గ్రంథము లున్నవి; ప్రౌఢబాల వ్యాకరణాది వ్యాకరణ గ్రంథము లున్నవి; కఠోపనిష దాది వేదాంత గ్రంధము లున్నవి. ఈ గ్రంథముల వస్తు స్వభావ వైవిధ్యమును బట్టి శ్రీ వేంకటరావుగారి విద్వత్తా విజ్ఞాన వైభవ వైవిధ్యము నూహింపవచ్చును. శబ్ద రత్నాకరమునందు మఱి పదివేల పదములను జేర్చి వారు దానిని సమగ్రమును సర్వ జనోపయోగ కరమును గావించి యుండిరి. వారి యుపోద్ఘాతములు వట్టి పరిచయ వాక్యములు కావు. అవిగుణాగణ పరిశీలనము గ్రంథవస్తు వివేచనము తోడను గూడిన కూలంకష మహా విమర్శలు. అవి గ్రంథముల కలంకరణములును, గ్రంధ కర్తలకు కీర్తి కారణములును, ప్రకాశకుల ప్రచారమున కుపకరణములునై పలువురు విద్యాధికుల ప్రశంసలకు పాత్రములైనవి.

భాషాసారస్వత, భాషాతత్త్వశాస్త్ర, చరిత్ర ఛ్చందో లక్షణ విషయములను గూర్చి భారతి మున్నగు పత్రికలకును, మద్రాసు విశ్వవిద్యాలయ పత్రికకును, విశ్వవిజ్ఞాన కోశములకును, స్మారక సంచికలకును, సకల భారత ప్రాచ్యభాషా సమావేశ పత్రికలకును శ్రీ వేంకటరావుగారు రచించి పంపిన వ్యాసరత్నము లపరిమితములును అమూల్యములు నైనట్టివి. అంత వస్తువైవిధ్యముతోఁ గూడిన, అంత విషయ గాంభీర్య శోభితములైన, అంత విద్వత్సంశయ విచ్ఛేదకములైన, అంత పరిశోధన ప్రావీణ్య ప్రదర్శకములైన, అంత విశద విస్తృతములైన అన్ని యుత్తమ వ్యాసములను వ్రాసిన వారిం కెవ్వరును లేరనుటలో నతిశయోక్తి లేదు.

వా రాంధ్రముననే కాక ఆంగ్లమునఁ గూడ విరచించిన వ్యాసము లనేకములు. ఆంధ్రమున వెలసిన పత్రికలలో వారి వ్యాసము లేని పత్రిక లేదు; వారి వ్యాసముతోఁ గూడి వన్నెకెక్కని పత్రిక లేదు. శ్రీ వేంకటరావుగా రనువాద కళయందు సైత మారితేరినవారు. మెకంజీ వ్రాఁత ప్రతులను వారాంధ్రము నుండి ఆంగ్లమున కనువదించి చరిత్ర పరిశోధకుల కొనర్చిన మే లింతింతనరాదు. తెలుగు భాషా సమితివారు ప్రచురించిన భూగోళ శాస్త్రమునకు సంబంధించిన విజ్ఞానకోశ సంపుటమునకు క్లిష్టములును, సాంకేతిక పద భూయిష్ఠములు నగు వ్యాసముల నెన్నింటినో వా రాంగ్లమునుండి ఆంధ్రమున కనువదించి యిచ్చిరి. రష్యా అమెరికాలకుఁ జెందిన వైదేశిక సంస్థల వారాంధ్రమున కందిచ్చిన అనువాదము లన్నియు శ్రీ వేంకటరావుగారి సూక్ష్మేక్షికాశాణమున నుత్తేజితము లైనట్టివే. ఈ కార్యకలాప మంతయు వారి నిరంతర పరిశ్రమకును, నిశిత బుద్ధి బంధురతకును, నిర్మల సేవా పరాయణతకును నిదర్శనములు.

శ్రీ వేంకటరావుగా రెంతటి విద్వాంసులో అంతటి వాగ్మిశేఖరులు. ఆంధ్రము నందలి రామాయణములు, ఆంధ్ర వచన త్రిదశాబ్ది, ఆంధ్ర వ్యాకరణ గ్రంథ పరిశీలనము, ఆంధ్ర లిపి సంస్కరణము మున్నగు విషయములను గూర్చి ఏర్పఱుపఁబడిన గోష్ఠీ సమావేశములందును, ఆకాశవాణి యందును, [illegible] రాజమహేంద్రవరము మున్నగు నగరములలో జరిగిన సభల యందును వా రొసంగిన మహోపన్యాసములు శ్రోతృ జనానంద సంధాయకములై వారి భాషా పరిజ్ఞాన భాషణ చమత్కారములను సర్వాంధ్ర జన పరిచితముల [illegible] ఆకాశవాణి కేంద్రముల నుండి వివిధ విషయములపై వారొసంగిన భాషణోపన్యాసము లష్టోత్తర శత సంఖ్య నతిక్రమించినవి. కావ్య జగత్తులో [illegible] అనువిషయమును గూర్చి వారు కావించిన భాషణ మాంధ్రము నందలి [illegible] వాఙ్మయమునకు మణిదీపిక వంటిదని ప్రశంసింపఁబడినది. శ్రీ వేంకటరావుగారు పద్యము పఠించు పద్ధతి సంగీత విహీనమయ్యు సర్వజన [illegible] విశదమై, వీనులవిందై వినువారి కెనలేని యానందము కలిగించును. వారి హృదయము వివిధాంధ్ర కావ్యస్థ హృద్య పద్య సముదాయమునకు [illegible]

చెప్పఁదగినది. వారి ధారణాశక్తి నిరుపమానమై, విస్మయ కారణమై విరాజిల్లు చుండును. వా రుపన్యాసములను సాధారణముగా నొక ప్రార్థన పద్యముతో నారంభింతురు ఆ పద్యమే సామాజికుల స్వాంతముల కొక విధమైన ఉన్మీలీకరణమై ఉల్లసిల్లును.

శ్రీ వేంకటరావుగారి ప్రతిభా పరిశోధన పాండిత్యముల కలరి ఆంధ్రదేశము నందలి పలు సంస్థలును, విశ్వవిద్యాలయాది పరిషత్తులును బిరుదము లొసంగియు, సత్కారములు కావించియు వారిని సముచితరీతి గౌరవించినవి. వారు విద్యారత్న బిరుదాంకితులు. ఆంధ్ర సాహిత్య విద్యకు తులలేని వెలుఁ గలవరించిన విలసద్రత్నములై వారాబిరుదమున కన్వర్థత నాసాదించిరి. జ్ఞానపీఠ బహూకృతి గ్రహించిన శ్రీ విశ్వనాథ కవిసమ్రాట్టులు పరిశోధన ప్రాగల్భ్యమునకు మెచ్చి వారికి పరిశోధన పరమేశ్వరు లను బిరుదము నొసంగిరి. దాతృ ప్రతిగ్రహీతల ఔదాత్త్యమును బట్టి ఆ బిరుదమున కొక అసాధారణత్వ మేర్పడినది ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు వారికి కళాప్రపూర్ణ బిరుదము నిచ్చుటలో నచ్చెరువు లేదు. అది షోడశ కళాపూర్ణుఁడైన పూర్ణిమా చంద్రుని కళాప్రపూర్ణుఁ డనుటయే. ఏకశిలా నగరము నందలి వీరశైవ మహాసభవారు పాల్కురికి సోమనాథ కవి జయంతి సందర్భమున వారి భాషణమున కానందించి వారిని సువర్ణహస్త కంకణభూషితుల నొనరించిరి. ప్రపంచ తెలుగు మహాసభల సమయమున నాంధ్రప్రభుత్వము సమ్మానించిన సాహిత్య సాగరులలో వారొక రనుట కంటె నగ్రగణ్యు లనుట యుచితముగా నుండును. ఇటీవల మదరాసు నందలి త్యాగరాయ కళాశాలవారు వారి కొనరించిన సమ్మాన మాడంబరమును బట్టి కాక యాదరమును బట్టి అనర్ఘమైనట్టిది.

శ్రీ వేంకటరావుగారు చులుకిత సకలాంధ్ర సారస్వత సముద్ర రసాంబువు లైన నవ కుంభసంభవులు; అవలోడిత సకల శైవాగమ సంప్రదాయ విజ్ఞానమండితు లైన అపర మల్లికార్జున పండితులు; మధితాఖిల పూర్వ మహాకవి విరచిత లిఖిత గ్రంథ క్షీరసాగరు లైన మానవరూప మంథాన గిరులు; ప్రకాశిత నైకాముద్రిత గ్రంథ పద్మాకరు లైన భూచర భాస్కరులు. విద్యార్థి జనకామ గవులయ్యు విద్వత్పుంగవులు;



ిరణమై విరాజిల్లు
ార్థన పద్యముతో
న ఉన్ముఖీకరణమై

లరి ఆంధ్రదేశము
ము లొసంగియు,
వారు విద్యారత్న
ం గలవరించిన
ర బహూకృతి
మెచ్చి వారికి
దాత్త్యమును
్యాలయము
అది షోడశ
శిలా నగరము
తి సందర్భమున
ంల నొనరించిరి.
ం సమ్మానించిన
యుచితముగా
రించిన
ు.

ద రసాంబువు
విజ్ఞానమండితు
విరచిత లిఖిత
ముద్రిత గ్రంథ
పత్పుంగవులు;



సంతతారాధిత చంద్రశేఖరు లయ్యు సాహితీ రమావరులు; వయోవిజ్ఞాన వృద్ధులయ సుకుమార బుద్ధులు; విమర్శన కళాప్రపూర్ణులయ్యు సర్వ విద్యా రత్నాకరుల శిష్యజన వత్సలులు; భక్తిభావ నిశ్చలులు; పాండితీ ప్రతిభాసనాథులు; లక్షణజ్ఞ విద్యానాథులు. అధ్యక్ష మహాశయా! ఏతాదృశ గుణగణ భూషితు లైన కళాప్రపూ విద్యారత్న శ్రీ నిడువదోలు వేంకటరావుగారికి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడ విశిష్ట సభ్యత్వముతో పాటు తచ్చిహ్నములైన అమూల్యాంబర స్వర్ణపతకములు కూ ప్రసాదించి గౌరవింప వేడుచున్నాను.

# మరపురాని మనీషి శ్రీ నిడుదవోలు వేంకటరావు

- శ్రీ తిరుమల రామచంద్ర

"అంకెల బారులంబడి య
హర్నిశ మిట్టటు గొట్టుకొంచు నే
వంకను బుద్ధికి న్నెడ ర
వంతయు లేకను సాహితీ రసం
బింకగ నున్నవేళ నను
నెంతయు బ్రీతి దెలుంగువారి ది
వ్యాంకమునందు నిల్పిన మ
హా ప్రభు నెన్నెద సూర్యరాడ్విభున్"

అని ఆనందభాష్పాలు కురిపిస్తారు "పరిశోధన పరమేశ్వరులు" శ్రీనిడుదవోలు వేంకటరావుగారు. ఔను! నిడుదవోలువారు బెర్‌నార్డ్‌షావలె బ్యాంకిగుమాస్తాగా జీవితం ప్రారంభించారు. ఆ అంకెల గారడీని ఆకళించుకున్నారు. కాని, ఉక్కు కటకటాల వెనుక ఉక్కు తెరలమధ్య బ్యాంకిలో (ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో) పని వారికి నచ్చలేదు. విసిగిపోయారు. అంకెల లంకెలతో సహజంగా సాహిత్య పిపాసగలవారు విసిగిపోక మరేమవుతారు? ఆ విసుగు వారే అప్పుడు చెప్పిన

"చనియెన్ ద్వాదశ హాయనంబుల పయిన్
షణ్మాసకాలంబు బ్యాం
కునకే దేహపుటస్థి చర్మములు రెం
డున్ ధారగాబోసి జీ
వనమున్ బుచ్చితి సేవజేసితి మనో
వాక్కాయ కర్మంబులన్
వినియోగించితి నాదు ధీపటిమ వ
న్నెందెచ్చు నెద్దానిలోన్!"

అనే పద్యంలో స్పష్టమవుతుంది. అలాటి పరిస్థితిలో తమను సాహిత్య మార్గంలో పెట్టిన పెద్దమనిషిని ప్రశంసించడం సహజం.

నిజానికి నిడుదవోలువారి సాహిత్యజీవితం విద్యార్థి దశనుంచే ప్రారంభమయింది - 1918లోనే వారు పరవస్తు రంగాచార్యుల మీద, 1919లో గాంధీజీ 50వ జన్మదినోత్సవం సందర్భంగా గాంధీజీ మీద పద్యాలు చెప్పడంతోనే. దీనితో తెలుగులో పద్యాలలో సాహిత్యానికి నాందికూడ వీరే పలికారు. ఈ పద్యాలు విజయనగరం నుంచి వెలువడే 'భారతమాత' అనే వారపత్రికలో ప్రచురితమయాయి. నిడుదవోలు వారు సహాయ నిరాకరణోద్యమంలో విద్యార్థిగా వున్నప్పుడే పాల్గొని "విద్యార్థివీరుడు" అనే ఖ్యాతి పొందారు.

"గాంధీజీ 1924లో విజయనగరం వచ్చారు. హిందీలో గాంధీజీతో సంభాషించేవారు ఎవరైనా ఉన్నారా? అని ఎవరో ప్రశ్నించారు. మా నాన్నగారు హిందీ వచ్చినవారు. ఆ సంగతి నాకు తెలీదు. వారు వచ్చి గాంధీజీ భాషణాన్ని తెలుగులోకి అనువదించారు. "చర్ఖాపంచకం" అనే పద్యాలు చెప్పారు. నేను గాంధీజీని కనులారా దర్శించాను" అని నిడుదవోలువారు సంతృప్తితో అన్నారు.

నిడుదవోలువారు 1903లో విజయనగరంలో జన్మించారు. విజయనగరం పండిత ప్రకాండుల పుట్టినిల్లు గనుక చిన్ననాటి నుండే సారస్వత సమీరాలు వారిపై వీచాయి. విద్యార్థిదశ సి.బి.మిషన్ హైస్కూలులోను, ఎ.వి.ఎన్. కళాశాల మహారాజ కళాశాలలోను గడిచింది. 1926లో పట్టభద్రులై ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో గుమాస్తాగా చేరారు. అప్పు సప్పు చేయక గడవని సంసారం. బ్యాంకి ఉద్యోగం నిత్యకృత్యాలకు కూడ నియమబద్ధమైన కాలపరిమితి, తండ్రి శ్రీ సుందరంపంతులు గారి తాళదళ సంపుట ప్రకర కాంతారం"లో నిర్నిద్ర పరిశ్రమ వీటివల్ల వీరిధారణ రాటుదేరి, ఏకసంథలోనే విషయాలు మెదడులోని అరలలో చేరి, అవసరమైనప్పుడు గూళ్ళ నుండి గునగునమంటూ వచ్చే పావురాళ్ళవలే అసలసలనే ఊతపదంతో వెలికి వస్తూంటాయి.

1923, 1924లలో జరిగిన సంఘటనలు విద్వత్కవిలోకానికి నిడుదవోలు

వారిని సన్నిహితం చేశాయి. 1923లో తణుకులో శ్రీ వేలూరి శ్రీ శివరామశాస్త్రి గారి అధ్యక్షతన జరిగిన విద్వత్సభలో "రాణికి పాదముల పట్టు రాణ విధించెన్" అనే సమస్యను ఈయన-

"ప్రాణికి నాయువు పట్టును
వాణికి రసనమ్ము పట్టు, వరకంకణ సు
శ్రేణికి కైపట్టును, పా
రాణికి పాదములుపట్టు రాణ విధించెన్"

అని పూరించారు. 1924లో మద్రాసులో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సు తృతీయ వార్షిక సమావేశంలో 'నన్నెచోడుని కాలము' అనే పరిశోధన వ్యాసాన్ని ఆంగ్లంలో చదివారు. ఈ రెండు సంఘటనలతో నిడుదవోలువారిపై విద్వత్కవుల, పరిశోధకుల దృష్టి పడింది. కాని, ఈయన పండితులను ఆశ్చర్య చకితులను చేసింది 1934లో వీరశైవ శాస్త్ర గ్రంథమైన 'వీరశైవ అష్టావరణ ప్రమాష్టకాభరణము' అనే దానిని, 1935లో 'త్రిపురాంతకోదాహరణము'ను సవిమర్శకంగా ప్రచురించడం. ఈ రెండిటితో నిడుదవోలు వారు కొమ్ములు తిరిగిన అప్పటి పరిశోధకుల సరసన పీట వేసుకొన్నారు. కాని బ్యాంకు బంధాలు ఇంకా వదలలేదు. అప్పటికి అవి తొలగడమూ విచిత్రంగానే జరిగింది.

నిడుదవోలు వారికి విజయనగరం నుంచీ కాకినాడలోని ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖకు తబాదలా అయింది. 1936లో పిఠాపురం రాజా సూర్యారావు బహద్దరుగారు తమ ఆస్థాన విద్వత్కవులైన ఓలేటి వేంకటరామ శాస్త్రిగారి వద్ద నన్నెచోడుని కుమారసంభవం చదువుతున్నారు. దానిలోని వీరశైవాగమ సంప్రదాయాలు తెలుసుకొనడానికి తగిన వీరశైవాగమజ్ఞులు కావలసి వచ్చింది. సుప్రసిద్ధ విమర్శకులు నడకుదుటి వీరరాజుగారు "బ్యాంకులో వేంకట రావు వుండగా ఎందుకు మహారాజా ఆలోచన?" అని రాజాగారికి నివేదించారు. బ్యాంకి గుమాస్తాలలో ఇంతటివా రుంటారా అని ఆశ్చర్యపడ్డారు పిఠాపుర ప్రభువులు. వెంటనే నిడుదవోలు వారిని పిలిపించారు. అప్పటినుండి పరిచయం

పెరిగింది ఇద్దరి మధ్యా. ఇలాటి విద్వాంసుడు బ్యాంకిలో అంకెల సంకెళ్ళలో పడడం సమంజసం కాదనుకున్నారు రాజాగారు. కనుక గుమాస్తాపనికి ఇస్తీఫా ఇప్పించి తమ కళాశాలలో ట్యూటరుగా నియమించారు. ఇది జరిగింది 1939లో. సంవత్సరం పాటు అక్కడ పనిచేసి, రాజాగారి సూర్యరాయాంధ్ర నిఘంటు' కార్యాలయంలో పదసంగ్రాహకులుగా చేరారు నిడుదవోలువారు.

ఈయనకు ఇప్పటికి సరైన పనిదొరికింది. ఈయన ధారణాశక్తికి నిఘంటు ప్రధాన సంపాదకులైన శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు మొదలైనవారు ఆశ్చర్యపడేవారు. కాని నిడుదవోలువారి దృష్టికి పడిన ప్రతిపదానికి ప్రయోగం వెంటనే స్ఫురించవలసిందే. "నేను చదివాను అన్నట్లుకాక ఈయనకు కంటబడ్డ ప్రతి విషయమూ ఒంటబట్టి పోవలసిందే. ఆయా గ్రంథాల ముద్రణాది వివరాలతో సహా ఏ విషయమైన అడిగిందే తడవుగా చెప్పడంలో ఈయనకు ఈయనే సాటి. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుందన్న సామెత ఈయన యెడల సార్థకం. ఒక్క పదం ప్రస్తావించండి, నన్నయ మొదలు నేటిదాక అన్ని గ్రంథాలలోని ఆ పదప్రయోగసరళి నిర్ఘరపాతంగా మనపై దూకవలసిందే. ఝుంఝూమారుతంగా మనమీద వీచవలసిందే. అందుకనే ఎవరో ఈయనను "ప్రయోగమూషిక మార్జాల" అని అన్నారు. ఈయన తెలుగు సాహిత్యంలో చదివి మరచిందిలేదు; ఒడలు మరచి చదవందిలేదు. తెలుగు భాషలో ఏ మూల ఏమున్నదో చూపగల జగదివిటీ నిడుదవోలువారు. కనుక త్వరలో సూర్యరాయాంధ్ర నిఘంటువులో అసమగ్రమైన మూడవసంపుటి సమాప్తి కావడానికి, నాలుగవ సంపుటం సిద్ధం కావడానికి కృషిచేశారు. ఈ పనిచేస్తూ 1941లో మద్రాసు విశ్వవిద్యాలయం ఎం.ఎ.లో సర్వప్రథములై సువర్ణపతకం పొందారు. పిదప ఒక యేడు పి.ఆర్ కాలేజీలో పనిచేసి, 1944లో మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో సహాయోపన్యాసకులుగ చేరి 1949 నుంచి తెలుగు శాఖాధ్యక్షులై 1964లో షష్టివర్షాలు పూర్తి కావడం వల్ల పదవినుంచి విరమించారు. అనంతరం హైదరాబాద్‌కు తరలివచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ ప్రొఫెసర్‌గా నాలుగేళ్ళు పనిచేశారు.

ఈయన ప్రతిభ, పరిశోధన, రచనా వ్యాసంగం 1944 నుండి 1974 వరకు అవిచ్ఛిన్నంగా ముప్పయి సంవత్సరాలపాటు బహుముఖంగా ప్రవహించాయి. విశ్వ విద్యాలయాలలో అధ్యాపక పరిశోధనలు, వావిళ్ళ సంస్థవారితో ప్రాచీన కావ్యాలను పీఠికలతో శాస్త్రీయ సంస్కరణలతో ప్రకటింపజేయడం ఆంధ్ర పత్రిక, భారతి పరిశోధన అన్నల్స్ ఆఫ్ ఓరియంట్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ మొదలయిన పత్రికలలో పరిశోధన వ్యాసాలు వ్రాయడం, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకాలయం, తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయాల ప్రచురణ సంఘ సభ్యులుగా అముద్రిత అపూర్వ గ్రంధాలను బృహత్పీఠికలతో ప్రచురింపజేయడం - ఇలా నాలుగు పాయలై ప్రవహించాయి. ఆయన ప్రజ్ఞాప్రవాహిని. ఈవాహినిలో అనర్ఘరత్నాలు కొట్టుకొని వచ్చి ఆంధ్రావళికి అందాయి. ఈ విధంగా అందినవే తెలుగు కవుల చరిత్ర, ఆంధ్ర వచన వాఙ్మయం, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయం మొదలైన మౌలికరచనలు. త్రిపురాంతకోదాహరణం, ఆంధ్రవచన వాఙ్మయం తెలుగుభాషా సమితి (మద్రాసు) బహుమతిని, కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము, విజయనగర సంస్థానము - సాహిత్య పోషణ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతిని పొందాయి. ప్రాచీన గ్రంథ పరిష్కరణలో మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గార్లకు దీటైన నిడుదవోలు వారు విపుల పీఠికలతో ప్రచురించిన ప్రాచీన ప్రబంధాలు, శాస్త్రగ్రంథాలు కోకొల్లలు. ఖడ్గలక్షణ శిరోమణి, కట్టావరదరాజు రామాయణము మొదలైనవి 56 వుంటాయి. పెక్కు నవీనరచనలకు పీఠికలు వ్రాశారు. ఆంధ్రాంగ్ల భాషలలో శతాధిక వ్యాసాలు, శతాధిక ఆకాశవాణి ప్రసంగాలు, ఇంక సదస్సులలో, గోష్ఠులలో ప్రసంగాలు ఇన్నీ అన్నీ కావు.

అన్నీ ఒక ఎత్తు అగస్త్యుడు ఒక ఎత్తు అన్నట్లుగా ఈయన రచనలన్నీ ఒక ఎత్తు, ఉదాహరణ వాఙ్మయచరిత్ర ఒక ఎత్తు. రెండు శతాబ్దాలుగా మరుగుపడిన ఉదాహరణ వాఙ్మయశాఖను ఈయన పునరుద్ధరించి ఈనాడు విశ్వనాధ సత్యనారాయణ మొదలైన మహాకవులు ఈ శాఖను చేపట్టే విధంగా ఉదాహరణ వాఙ్మయచరిత్ర మూలంగా దీనిని ప్రవర్తింప జేశారు. నాటినుంచి ఈనాటి వరకు 35 గురు కవులు ఈ ప్రక్రియను చేపట్టి ఈయనను "ఉదాహరణ వాఙ్మయోద్ధారక" అని కీర్తించారు.

కృష్ణమాచార్యులవారి సంస్కృత సాహిత్య చరిత్రలో ఆంధ్రదేశ సంస్కృత కవి పండితులను గూర్చిన విషయాలన్నీ వ్రాసి సాహాయ్యం చేశారు. ఇదివరకు సంస్కృత వాఙ్మయచరిత్రకారులకు తెలియని మయూరకృత సూర్యదండకం, శివస్తవం మొదలయినవానిని వెలుగులోకి తెచ్చారు. నన్నయ నుంచి నేటివరకు గల అపూర్వ విషయాలను 35 సంపుటాలలో సేకరించి పెట్టారు. అవన్నీ ముద్రణకు ఎదురు చూస్తున్నాయి. సాహిత్యమే నిత్యకర్మానుష్ఠానంగా జీవితం సాగిస్తున్నాడు గనుకనే "పరిశోధన పరమేశ్వర", "జంగమ విజ్ఞాన సర్వస్వం", "ఏక సంథాగ్రాహి" అనే బిరుదాలు పొందారు. వీటన్నిటికీ మకుటాయమానంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం ఈయనను 1973లో "కళాప్రపూర్ణ" బిరుదంతో సత్కరించడం.

"ప్రథిత వేదము వేంకటరాయశాస్త్రి
పొందగా బుట్టిన కళాప్రపూర్ణ బిరుదు
సార్థకంబయ్యె సాహిత్య జగతి నేడు
నిడుదవోల్వేంకటరాణ్మనీషి వలన"

అని ఆ సమయంలో కవులు కైవారం చేశారు.

ఈ పరిశోధన పరమేశ్వరుని చూపు సజ్జన సాహిత్యం మీదనూ పడింది. అచ్చ తెలుగులో ఆరితేరినవారు గనుక, విద్యార్థి దశనుంచే కైత చెప్పగలవారు గనుక

"నుడులబెడంగును నడకల
యొడికము వడివడితనంబు నుడివోవని కూ
ర్పడరించు చదువు చదరును
గడివోవని తలపు"

గల తెలుగుకబ్బము "మించుపల్లె", "తెలుగుపొలుపు" లను ఆంధ్ర నలందా శతకము, శ్రీ రామగీతామృతము, శ్రీరామలింగేశ్వర శతకము, గాంధీ సాహిత్యము మున్నగు కృతులు చెప్పారు. చాటు పద్యాలు వందలు.

నిడుదవోలు వారికి వైయక్తికంగాను, సాహిత్యదృష్టితోను మంచి అలవాట్లు న్నాయి తాము చూచినవీ, తమకు తోచినవీ చిన్న నోటుబుక్కులో ఎప్పటికప్పుడు గుర్తుపెట్టుకోవడం అలవాటు. అలా గుర్తువేసుకొన్న వాటిలో సూక్తులు చాల వున్నాయి. "ఆంధ్రులకు ఐకమత్యం యతిలోనేగాని, మతిలో లేదు;" "బలి దానం వల్ల అడుగున పడిపోతే పొట్టి శ్రీరాములు బలిదానం వల్ల పొడుగైనాడు", "మన విద్యావిధానం "కా" గుణింతంతో ప్రారంభమై కాన్వకేషనుతో ముగుస్తుంది", మన కిప్పుడు రెండే పనులు - మరపని, మరుపని; దేశభాషలందు తెలుగులెస్స అన్నది ప్రాతమాట, ఇలగలుగు భాషలందెల్ల తెలుగు లెస్స అన్నది నేటిమాట, ఇలాటివి ఎన్నో సూక్తులు.

ఈయన తెల్లవారుజామునే లేస్తారు. దంతధావనాదికాలు ముగించి, మూరెడు పొడుగు కంచుగ్లాసుతో కాఫీసేవించి, గ్రంథ పర్యాలోకనం ప్రారంభిస్తారు. షడ్రసోపేత మైన భోజనం, భోజనానంతరం ముంతమామిడి పప్పో, కిస్మిస్సో, ఖర్జురాలో నమిలి తాంబూలం వేసుకొని కొంచెంసేపు ఉయ్యాలలో ఊగి, కోటూ, ఉత్తరీయం వేసుకొని గొడుగు పట్టుకొని విశ్వవిద్యాలయానికి బయలుదేరే వారు. ఉద్యోగసమయంలో, ప్రస్తుతం భోజనానంతరం కొంత విశ్రాంతి, తర్వాత సారస్వత సేవ, శబ్దార్థ పునరాలోచనం, వ్రాత మొదలైనవి.

ఈయనకు ఐదుగురు కుమార్లు, ఇద్దరు కూతుళ్లు. జ్యేష్ఠకుమారుడు శివసుందరేశ్వరరావు తండ్రికి ధీటైనవాడు 'పుత్రా దిచ్ఛే త్పరాజయం' నానుడిని సార్థకం చేస్తాడు. మనుమరాండ్రలో జయసుధ తమిళ చలనచిత్రరంగంలో తారాస్థాయి నందుకొంది.

"ప్రతి పదానికీ ప్రయోగం చూపి, ప్రామాణికమైన గొప్ప నిఘంటువును అదిన్నీ అనుకూల సాహాయసంపత్తి లభించినప్పుడు ఒకే సంపుటంలో పదిహేను వందలో లేక రెండువేల పుటలలో రచించి, ఆంధ్ర మహాజనులకు అందజేయాలని వుంది అందజేయగలననే విశ్వాసమూ వుంది" అని పదేళ్ళ క్రితం నేను కలుసు కున్నప్పుడు అన్నారు. తర్వాత శబ్దరత్నాకరాన్ని అనుబంధంతో ప్రచురించారు. క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారికోసం. ఇప్పుడు దానిని సంస్కరించి 35 వేల

పదాలతో తమ ప్రతిజ్ఞ మేరకు సిద్ధపరచారు. ఇదిగాక ఆంధ్రవాఙ్మయ చరిత్ర ఆరు సంపుటాలు సిద్ధంగా వున్నాయి. ఆంధ్రాంగ్లాలలో కొమర్రాజువారి జీవిత చరిత్ర మొదలయినవి అచ్చుకు సిద్ధంగా ఉన్నాయి. వాటిని ఆంధ్రావళి అచ్చు వేయించి వాడుకోడం అవసరం

ఈయనకు ఇప్పుడు 72 సంవత్సరాల వయస్సు, సాహిత్యంలోనే తలమునకలుగా జీవితం గడిపిన ఈయనకు ఆధునికయుగంలో గడచిన తరంవారైనా గురుజాడ, గిడుగు, ఆదిభట్ల, చిలకమర్తి, పానుగంటి, మానవల్లి, వేటూరి మొదలైన వారితోనూ, ఆధునికులతోను సన్నిహితత్వం కలిగి, వారి రచనలన్ని పుడిసిటబట్టిన వారుగనుక - మొత్తంమీద రెండుతరాల కవిపండిత లోకానికి సన్నిహితులు గనుక స్వీయచరిత్రను సమగ్రమైన దానిని వ్రాయాలని కోరుతున్నాను. అలాటిది వ్రాస్తే సారస్వత పాంథులకు ఎల్లకాలపు కయిదివ్వెగా వినియోగపడుతుంది.

ఒకమారు వారితో అన్నానుగదా "మీరు బ్యాంకిలోవుంటే, తక్కిన మీ సహోద్యోగుల లాగే ఏ మూడువేల రూపాయలజీతంతో రిటైరయ్యేవారు. ఇప్పుడు ఏమి బాముకున్నట్టు? బ్యాంకిలో వుంటూనే మీరు సాహిత్య సేవ చేసేవారు, మునుపటిలాగే?" అని.

"నా కసలేమీ అసంతృప్తిలేదు బ్యాంకు నౌకరీ వదలివేసినా నని, మీరన్నట్టు నాతో పనిచేసిన ఒకతను ఇరవయ్యైదు వందల జీతంతో రిటైరయ్యాడు. నిజమే ఇప్పటి సంతృప్తి, సారస్వతానికి సేవ ఇంకా చేస్తాననే ధీమా అసలు నాకుండేవా?" అని ఎదురు ప్రశ్నవేశారు ఈయన.

నిడుదవోలు వారిని దర్శించినప్పుడు, తలచుకొన్నప్పుడు నాకు శృంగార గ్రంథ మండలి స్థాపకులు గంటి సూర్యనారాయణశాస్త్రి గారు తరచు అంటున్న మాట - "నీకు తెలియకపోతే నిడుదవోలు వారి నడుగు" అనేది జ్ఞాపకం వచ్చి, ధారణావతార మైన ఈయన ఎడల గౌరవం ఇనుమడిస్తుంది.

# ఉప క్త గ్రం


అప్పకవి, కాకునూరి - అప్పకవీయము, వావిళ్ళ, 1951, మదరాసు.

అప్పనమంత్రి - చారుచర్య, వావిళ్ళ. 1949. మద్రాసు.

అప్పారావు, గురజాడ - గేయాలు, వావిళ్ళ. 1950, మద్రాసు.

అప్పారావు, గురజాడ - చిన్నకథలు, వావిళ్ళ. 1950. మద్రాసు.

అవధాని, దివాకర్ల డా. సం. తదితరులు - అక్షరార్చన - పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సన్మాన సంఘం, 1972, హైదరాబాదు.

కాళకవి, చెంగళ్వ - రాజగోపాల విలాసము. తంజావూరు సరస్వతీ మహల్. 1951, మద్రాసు.

గురుబసవ సద్గురు రహస్య (కన్నడం) మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాల 1951 మదరాసు.

గోపాలకృష్ణయ్య, వడ్లమూడి - ధ్వని, లిపి, పరిణామం, కళాకేళి ప్రచురణలు 1955 తెనాలి.

గోపాలకృష్ణయ్య, వడ్లమూడి - జానుతెనుగు, కళాకృష్ణులు అండ్‌ప్రోజెనీ 1972 హైదరాబాదు.

త్రిపురాంతకుడు, రావిపాటి - త్రిపురాంతకోదాహరణము పరిష్కర్త. నిడుదవోలు వేంకటరావు 1946 మద్రాసు.

దాశరధి డా. - దాశరథీ శతకము 1962 హైదరాబాదు.

నరసప్ప ఖడ్గలక్షణ శిరోమణి, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంధాలయము 1950 మద్రాసు

నన్నయ - ఆంధ్రమహాభారతము, అరణ్యాపర్వము, వావిళ్ల 1959 మద్రాసు.

నన్నెచోడదేవ - కుమార సంభవము - వావిళ్ల 1953 మదరాసు.

పురుషోత్తం బి. - ఎస్తేరు, నాటిక - రేణిగుంట 1972.

పురుషోత్తం బి. - త్ర్యేకోదాహరణము 1973 రేణిగుంట.

పురుషోత్తం బి. - కుమారోదాహరణము 1973 రేణిగుంట.

పెద్దన, చిత్రకవి - లక్షణ సారసంగ్రహము, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ 1937.

పోతన, బమ్మెర - భాగవతము 1948 వావిళ్ల, మద్రాసు.

ప్రభాకరశాస్త్రి వేటూరి - వేటూరి వారిపీఠికలు, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు.

ప్రభాకరశాస్త్రి వేటూరి - ప్రబంధరత్నావళి, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి 1976, హైదరాబాదు.

ప్రభాకరశాస్త్రి వేటూరి - తెలుఁగు మెఱుఁగులు, 1976 హైదరాబాదు.

భట్టుమూర్తి - కావ్యాలంకార సంగ్రహము. వావిళ్ల 1960 మదరాసు.

మల్లన, చదలవాడ - విప్రనారాయణ చరిత్ర, ఆంధ్రసాహిత్య పరిషత్తు 1938 కాకినాడ.

మల్లయ, నంది; సింగయ, ఘంట - ప్రబోధచంద్రోదయము - ఆం. ప్రబో సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

మల్లికార్జున పండితారాధ్యులు - శివతత్త్వ సారము, కృష్ణాపత్రికా కార్యాలయము 1968 హైదరాబాదు.

రఘునాథ భూపాలుడు - వాల్మీకి చరిత్ర, ఆంధ్రవిజ్ఞాన సమితి 1940, విజయనగరం.

రామచంద్ర తిరుమల. తెలుగు వారి కవితా కదంబం, ఆంధ్రప్రదేశ్ పత్రిక, మార్చి 1988, హైదరాబాదు.

రామచంద్ర, తిరుమల - నుడి-నానుడి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, తృతీయ ముద్రణ 1987, హైదరాబాదు.

రామచంద్ర, తిరుమల - మరపురాని మనీషి - యువభారతి - ఫిబ్రవరి 1975, హైదరాబాదు.

రామచంద్ర, తిరుమల - మూడువాఙ్మయ శిఖరాలు, ప్రాకృత అకాడమీ 1987 హైదరాబాదు.

రామలింగకవి, తెనాలి - ఉద్భటారాధ్యచరిత్ర, లోటస్ పబ్లిషర్స్, తెనాలి.

రమాపతిరావు, అక్కిరాజు - వెన్నెలకంటి సుబ్బారావు జీవితము, శ్రీభారతీ ప్రచురణలు, 1976, హైదరాబాదు.

రామారావు, అడిదం - అడిదం సూరకవి జీవితము. వావిళ్ల, 1955, మదరాసు.

రేచన, మల్లియ - కవిజనాశ్రయము, 1951 వావిళ్ళ, మదరాసు.

వరదరాజు, కట్టా - శ్రీరామాయణము, 4 సంపుటములు, తంజావూరు సరస్వతీ మహల్ 1950, 52, 53 తంజావూరు.

వెంకటపతి, గణపవరపు - లీలావతీ దండకము - మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయ బులెటిన్ 1950, మద్రాసు.

వేంకటపతి, వెలిదిండ్ల - శృంగార రాధామాధవము, ఆంధ్ర విజ్ఞాన సమితి, 1940, విజయనగరము.

వేకంకటరావు, నిడుదవోలు

1. తెలుగు కవుల చరిత్ర, ద్వితీయ ముద్రణ 1956.
2. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము, 1978. మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణలు, మద్రాసు.
3. ఆంధ్రవచన వాఙ్మయము, ప్రథమ ముద్రణ; 1954 ఆంధ్ర గ్రంథమాల, మద్రాసు.

   ద్వితీయ ముద్రణ, స్వీయప్రచురణ 1977, హైదరాబాదు.
4. బసవపురాణ వచనము, శ్రీశైల దేవస్థానం, 1981 శ్రీశైలం, కర్నూలు,
5. కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము, స్వీయప్రచురణ 1962, మద్రాసు.
6. భాషాపరిశోధన - ప్రయోగ విశేషములు, స్వీయప్రచురణ 1954, మద్రాసు.

7. చిన్నయసూరి జీవితము - వావిళ్ల 1953, మద్రాసు

8. చిన్నయసూరి జీవితము - హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము, స్వీయ ప్రచురణ 1962, మద్రాసు

9. మించుపల్లె (ఖండకృతి), స్వీయప్రచురణ 1959, మద్రాసు.

10. పోతన - National Book Trust of India, New Delhi 1961.

11. విజయనగర సంస్థానము - ఆంధ్రవాఙ్మయ పోషణ, స్వీయ ప్రచురణ 1965, హైదరాబాదు.

12. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, 1950. స్వీయ ప్రచురణ; మద్రాసు.

ద్వితీయ ముద్రణ, విజయభాస్కర్ పబ్లికేషన్స్, 1968, హైదరాబాదు.

వేంకటకవి, గోపీనాథం - శిశుపాలవధ, 1975 గోపీనాథం వసుంధరాదేవి, కర్నూలు.

శ్రీకామేశకవి, లింగనమఖి - సత్యభామా సాంత్వనము, శృంగారగ్రంథమండలి, బందరు 1952.

శ్రీనాథుడు - శృంగారనైషధము, వేదం వారి వ్యాఖ్య.

పునర్ముద్రణ 19 మద్రాసు.

శ్రీనాథుడు - భీమేశ్వర పురాణము 1962, వావిళ్ల, మద్రాసు

శ్రీరామకవి, దాసు - అభినవ గద్యప్రబంధము, డా. శ్రీరామకవి స్మారక సమితి 1973, హైదరాబాదు.

శ్రీరామమూర్తి పంతులు. గురజాడ - చిత్రరత్నాకరము, 1951 వావిళ్ల, మదరాసు.

సింగన, మడికి - సకలనీతి సమ్మతము, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, 1970 హైదరాబాదు.

సీతారామచార్యులు, బహుజనపల్లి - శబ్దరత్నాకరము, నిడుదవోలు వేంకటరావు గారి సవరణలు - వివరణలతో

1958, Madras School Book and Literature Society, Madras.

సుబ్బారావు, వంగూరి - ఆంధ్ర వాఙ్మయచరిత్రము, సుజనరంజని, 1960, నర్సాపురం. ప.గో. జిల్లా.

సుబ్బారావు, వంగూరి - శతక కవుల చరిత్ర, అనుబంధము, 1961 సుజనరంజని, నర్సాపురం, ప.గో.జిల్లా.

సూర్యప్రకాశకవి, మంత్రిప్రెగడ - సీతారామచరిత్ర, ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ.

సోమన, నాచన - హంసడిభకోపాఖ్యానము, ఉత్తరహరివంశము, చతుర్థాశ్వాసము సటీక, విజయభాస్కర్ పబ్లికేషన్స్, 1972, హైదరాబాదు.

సోమన, పాల్కురికి - బసవపురాణము (సంక్షిప్తము), పరిష్కర్త డా. జి.వి. సుబ్రహ్మణ్యం, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ 1969 హైదరాబాదు.

సోమన, పాల్కురికి - బసవపురాణము, ఆంధ్రగ్రంథమాల, మద్రాసు.

సోమన, పాల్కురికి - పండితారాధ్య చరిత్ర, పరిష్కర్త డా. చిలుకూరి నారాయణరావు, ఆంధ్ర గ్రంథమాల 1939 మద్రాసు.

పత్రికలు:

ఆంధ్రపత్రిక ఉగాది, భారతి, పరిశోధన, Annals of the Oriental Research (University of Madras).



* * *

6. ఆంధ్ర సాహిత్య పరిషత్, సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానం వారి మేధను మెరుగు పెట్టిన రంగాలు.
7. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ వారి పీఠం.
8. అక్కడి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారి అంకస్థితార్ధపేటి.
9. భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వారి విద్వత్ ప్రకాశకాంతులు.
10. ప్రాచీన సాహిత్య ముద్రణాలయం 'వావిళ్ల' వారి పీఠికాపురం.

"దశదిశాభరణాంకు"లు వారు.

త్రిపురాంతకోదాహరణ, మించుపల్లె (ఖండకావ్యం) పాఠ్యగ్రంథాల ద్వారా వారు విద్వద్లోకానికి విద్యార్థిలోకానికి పరిచితులు.

ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, తెలుగు కవుల చరిత, దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం, ఆంధ్ర వాఙ్మయం, పోతన - రచనల మూలంగా వారు సాహిత్యలోకానికి సన్నిహితులు.

ఛందోదర్పణ, అప్పకవీయ, ప్రౌఢవ్యాకరణ, ఛందోరీతుల పీఠికలు, సూర్యరాయాంధ్ర నిఘంటువు, శబ్దరత్నాకర అనుబంధం - ద్వారా వారు పండితులకు ప్రామాణికులు.

× × ×

"తను కావించిన సృష్టి తక్కొరుల చేతంకాదు" అనిపించారు.

× × ×

కవిచరిత్రలు చదివి కవులు పుస్తకాలపేర్లు తెలిసిన విద్యార్థులు, కావ్యపరిష్కర్తల పీఠికలు చదివి కళాశాల, పోటీ పరీక్షలలో నెగ్గి..వారున్నారు.

కవి కృతావతారికలను మాత్రమే చదివిన చారిత్రకు లున్నారు.

రసభావాలంకార ఛందో వ్యాకరణ, కావ్యవస్తు విమర్శకు లున్నారు. కాని, కావ్యాది శ్రీకారంనుండి కావ్యాంత మంగళమహాశ్రీ వరకు అక్షరాక్షరం చదివి